SUWALAAT-WA-JUWABAAT
(TELUGU)



# సందేహాలు సమాధానాలు



నిజామీకుమార



తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్
లక్కడ్‌కోట్, ఛత్తాబజార్
హైదరాబాద్-500 002

# సమర్పణ

బాల్యంలోనే
పలుభాషలపట్ల ఆసక్తిరేపి,
నన్ను
అడుగడుగునా ప్రోత్సహించి,
తన కృషి ఫలవంతమవుతూ ఉండగా
చూడకమునుపే
మమ్ము వీడి,
ఆశలకు, అభిలాషలకు అతీతమయిన
నివేశానికి పయనమయిన నాన్నగారు
**హకీమ్ సయ్యద్ అబ్దుల్ గఫూర్ 'నిజామీ'**
ఆత్మపై
శాంతి, కారుణ్యానుగ్రహాలు
వర్షింప జెయ్యాలని
పరమ ప్రభువును వేడుకుంటూ...

— నిజామీకుమార

# విషయసూచిక

14. ఊహాలోకం

15. దురభిమానం

16. ఆర్థికం

17. చరిత్ర

18. అవీ-ఇవీ

19. మార్పు

20. లోకాభిరామాయణం

21. ఆచార దురాచారాలు

22. భాష, సాహిత్యం

అపార కృపాశీలుడు, అనంత కరుణామయుడయిన అల్లాహ్ పేరుతో

# మనవి

గీటురాయి పాఠకులు కోరుతున్నారు కాబట్టి ఆ పత్రికలో సమాధానాల శీర్షిక నిర్వహించమని ఆదేశించి, యాజమాన్యం వారు తమకు నాపై ఉన్న నమ్మకాన్ని చాటుకున్నప్పుడు, నేనేమిటో నా కెరుకే కాబట్టి, ధైర్యంగా ముందుకు రాలేకపొయ్యాను. కాని వారి ప్రోద్బలం వల్ల ఒప్పుకోక తప్పింది కాదు.

అడిగినవారికి చెప్పడం ఓ నలుదిసెల పోరాటం. దానికి కావలసిన తెలివిడి, ఓరిమి, నేరిమి నాకెక్కడివి? వ్రాతల్లో పటిమ కావాలి, మాటల్లో పొదుపు రావాలి, తలపులు తేటగా వెల్లడి కావాలి. ఇవన్నీ నాకు అలవి కాని పనులుగా తోచాయి. అందువల్ల జంకుతూనే ఒప్పుకున్నాను.

అయితే ఈ శీర్షిక నాకై ఎన్నో అధ్యయనా ద్వారాలు తెరచింది. విస్తృత విజ్ఞాన వీథుల్లో విహరింపజేసింది. నాలో ఎన్నో భావాలకు, ఊహలకు ఆలంబనగా నిలిచింది. నిద్రాణమయి ఉన్న సృజనాత్మకతను నాలో జాగృతం చేసింది. కలానికి బలాన్నిచ్చింది. సమాజ నవ నిర్మాణ కార్యక్రమానికి మార్గం సుగమం చేసింది. దీనికి తోడుగా పండితుల సాంగత్యం, సాధించగలిగిన జీవితానుభవం నన్ను పాఠక మహోదయుల మధ్య నిలకడగా నిలపగలిగాయి. 1981 లో మొదలయిన నా ఈ పయనం అంచెలంచెలుగా నన్ను తీర్చిదిద్దుతూపోయిందంటే అతిశయోక్తి కాదేమో! పాఠకుల ప్రోత్సాహం, ఆదరణ అండగా నిలువకపోతే నేటి నిజామీకుమార నిజానికి ఎప్పుడో జాడలేకుండా మరుగున పడిపొయ్యేవాడే !!

అపారమయిన అభిమానం, ఆదరణ చూపిన పాఠకులే ఈ పుస్తకం కావాలన్నారు. యాజమాన్యం వారు దానికి ఆదరవుగా నిలిచారు. తదనుగుణంగా, మిత్రులు ముహమ్మద్ అజీజుర్రహ్మాన్ (గీటురాయి సంపాదక వర్గ

సహచరులు) ఎంతో సహనంతో, మరెంతో శ్రమపడి 1988 ఆగస్టు నెలవరకు పత్రికా ముఖం చూసిన సమాధానాలను పరిశీలించి, తమ గీటురాయిపై పరికించి, కొన్నింటిని ఎంపికచేశారు. వాటినే ఈ పుస్తక రూపంలో క్రోడీకరించాను.

చివరగా ఒక మాట. ఓ పాఠకునికి సమాధానం చెబుతూ తెలిపినట్లు నా ప్రయత్నమంతా "పాఠకులకు ఏదయినా సమాచారం అందచెయ్యాలన్నదే. పాఠకుల్లో అవగాహనాశక్తిని పెంచాలని, నిర్మాణాత్మక దృష్టిని పెంపొందించాలని, విశ్లేషణా తత్వాన్ని సృష్టించాలని, వారిని ఆలోచింపజెయ్యాలని నాకు చేతనయినంతవరకు కృషిచేస్తున్నాను. అందులో ఎంతవరకు కృతకృత్యుణ్ణయ్యానన్నది కాలమే నిర్ణయిస్తుంది. పాఠకులే తీర్పునిస్తారు. నేను తలకు మించిన భారాన్ని నెత్తిన వేసుకోలేను; ప్రవేశంలేని విషయాల జోలికి పోలేను; పాఠకులకు అనవసరమని భావించిన సమాచారాన్ని పేపరు ముఖాన రుద్దలేను—ఇలా ఎన్నో స్వయంకృత ప్రతిబంధకాలు నాపై ఉన్నాయి."

(23 ఆగస్టు 1985)

ఈ కొలబద్దల స్థాయికయినా ఈ వ్రాతలు నిలుస్తాయా? అంటే నేనేమీ చెప్పలేను. అయినా ఏ కొరతల్లేనివాడు ఆ పరాత్పరుడే. నా కలం గుండా దొర్లిన పొరపాట్లను మన్నించి, క్షమాభిక్షను ప్రసాదించి, మంచి అన్నదేదయినా నావల్ల జనావళికి ఒనగూడితే దాన్ని ఆమోదించి నన్ను తరింప చెయ్యాలని ఆయన్నే వేడుకుంటూ...

హైదరాబాద్
1-12-1988

నిజామీకుమార

# ముందుమాట

ఈ ప్రపంచంలోని అన్ని మతాలూ సత్‌శీలతని, సద్భావాన్ని, సమరస బుద్ధిని, సజ్జన సాంగత్యాన్ని అలవరచుకోమనే ప్రబోధిస్తాయి. పూజనీయులైన బోధకులు ఎప్పుడూ మంచినే చెపుతారు. అయితే, ప్రతి మతమూ ప్రజానీకంలో వేళ్ళు పాతుకునేందుకు వ్యవస్థా రూపం ధరించక తప్పదు. ఆ వ్యవస్థను కాపాడుకునేందుకు ఏర్పరచుకునే సాంప్రదాయాలూ, ఆచారాలూ, విధానాలూ కాలగతితో పాటు మార్పులకూ, చేర్పులకూ లోనుగాక తప్పదు. రాజకీయ శక్తులు మతాన్ని స్వప్రయోజనం వాడుకుంటాయన్నది చరిత్ర చెపుతున్న సత్యం.

ఈ ఆధునిక జీవన విధానంలో మత విశ్వాసం వేరు, రాజకీయ ప్రభావం వేరు. రాజకీయ ప్రభావం, సామాజిక రంగంలోని ఆర్థిక శక్తిని, అవకాశాలని ఆయా దేశాల-కాలగతినిబట్టి నిర్ధారిస్తుంది. అయితే మత విశ్వాసం, మనోబలాన్ని, ఆధ్యాత్మిక శక్తిని చేకూరుస్తూ, ఆత్మ స్వరూపాన్ని సర్వత్రా వున్నదన్న సత్యాన్ని తెలుసుకోమంటుంది ... 'అల్లాహ్‌ని నిర్వచించడం ఎలా?' అన్న ప్రశ్నకు... 'అద్వితీయమయిన శక్తి ఏదయితే వుందో దాన్ని మీరేమని అన్నా ఎన్నెన్ని మంచి పేర్లు పెట్టినా చెల్లుతుంది. దాన్నే దేవుడనీ, అల్లాహ్ అని, యజ్‌దా అని, ఇరైవన్ అని, ఖుదా అని, పరమేశ్వరుడని ఇంకా ఏమేమో అని పిలుస్తున్నారు ప్రపంచ ప్రజలు' - అంటారు రచయిత నిజామీకుమార పదవ పేజీలో. అటువంటి సమాధానాల విషయంలో ఎవరికీ ఆక్షేపణ వుండదు. అట్లాగే మత నియమాలు పాటించడం విషయంలో ఎవరి పద్ధతులు వారివి— అన్న సమతా దృక్పథం చాలా మందికి వుంటుంది. అయితే, స్త్రీల విషయంలో వీరు చెప్పిన కొన్ని అభిప్రాయాలు ఆధునిక స్త్రీ ఆమోదించటం సాధ్యం కాదు.

ముస్లిమ్ పురుషుడు నలుగురు స్త్రీలను ఏక కాలమందు పెళ్ళి చేసుకో వచ్చుననే మాట మనం తరుచు వింటూంటాం. ఆ నలుగురినీ సమాన దృష్టితో, ఒకే స్థాయిలో పోషించగల స్థితిమంతుడై వుండాలన్న నిబంధన కూడా దానిని అంటిపెట్టుకుని వుంది. కట్టుకున్న భార్యనీ, కలిగిన యిద్దరు ముగ్గురు బిడ్డలనీ

పోషించటమే భారంగా వున్న ఈ రోజులలో నలుగురిని పెళ్ళి చేసుకుందామను కునేవాడు పరమ మూర్ఖుడైనా అయివుండాలి, లేదా అది ఆచారం చాటున జరిగే 'ఎక్స్‌ప్లాయిటేషన్' అయినా అయి వుండాలి.

40 పేజీలో - వినుకొండ పాఠకుని ప్రశ్నకు యిచ్చిన జవాబులో ... "స్త్రీ ఎంతగానో ఎదిగి పోయిందని ఎన్ని వక్ర ప్రకటనలు చేసినా వాస్తవ మేమిటంటే స్త్రీ సామాజికంగా సర్వ స్వతంత్రురాలు ఎన్నడూ కాదు. ఆమె పురుషుని అండన ఉండవలసిందే..." అన్నారు. ఇటువంటి పరాధీనత, పరస్పరా శ్రయ లక్షణం స్త్రీ పురుష లిరువురిలో ఒకే విధంగా వుంటుంది. తల్లి, నెచ్చలి లేకుండా పురుషుడు వున్నాడా? స్త్రీ, స్వాతంత్ర్యానికి అర్హురాలు కాదని-ఎప్పుడో ప్రాచీనులు అని వుండవచ్చు. అట్లాగే లలిత కళలకు పుట్టినిల్లు అయిన ఫ్రాన్సులో 1930 దాకా స్త్రీలకు స్వంతంగా బాంక్ అకవుంటు తెరిచే హక్కు గాని, ఆస్తి వ్యవహారాలు స్వయంగా చూసుకునే హక్కుగాని వుండేది కాదు. జార్జి ఎలియట్, జార్జి శాండ్ వంటి ప్రఖ్యాత రచయిత్రులు మగ పేర్లతో తమ పుస్తకాలు అచ్చువేసుకోవలసి వచ్చేది. అయితే నేడు కూడా, ఈ యిరవయ్యో శతాబ్ది ఆఖరి రోజుల్లో కూడా స్త్రీలు అలా వుండాలని-వుంటారనీ అనుకోటం సమంజసం కాదు. డెస్మాండ్ స్టవర్ట్, 'ఎర్లీ ఇస్లామ్'లో (Desmond Stewart in 'Early Islam') 1899 నాటి యామిన్ (Amin) గ్రంథం పేర్కొంటూ స్త్రీలని అణగ దొక్కటమే ఇస్లామ్ ప్రగతికి అవరోధంగా నిలిచిందంటాడు. ఇప్పటికి కూడా చాలా ముస్లిమ్ దేశాలలో ఒక పురుషుని సాక్ష్యం యిరువురి స్త్రీల సాక్ష్యానికి సమానం.

'పురుషునితో సమాన హక్కు' అనే తేనె పూసిన మాటలతో స్త్రీని మభ్య పెట్టి, బజారుకీడ్చి, ఆఫీసుల్లో కార్ఖానాల్లో 'ఉద్యోగం' వెలగబెట్టించవద్దనీ, ఆమె నాలుగు గోడల మధ్యావుండి మమతాను రాగాలతో కుటుంబ జీవితం దిద్దుకోవడం గౌరవ ప్రదమనీ సూచిస్తున్నారు (102 పేజీలో) ఈ నాటి ఆర్థిక పరిస్థితులు విస్మరిస్తూ! మళ్ళీ రణరంగంలో పాల్గొన్న స్త్రీలని గురించీ (99 పేజీలో) చెబు తున్నారు నిజామీకుమార. ఇదెలా సాధ్యం?

78000 పదాలతో, 114 సూరాలు గల ఖురాన్ ముస్లిమ్‌ల పవిత్ర గ్రంథం. హిందువుల వేదోపనిషత్తుల మాదిరి, క్రైస్తవుల బైబిలులాగా,

శిక్కుల గురుగ్రంథ సాహెబ్‌వలె— ఖురాన్ ముస్లిములకు శిరోధార్యం. మతాచార సంబంధమగు సందేహాలను నిజామీకుమార సవివరంగా—చక్కగా సమాధానాలు చెప్పారు. కాని ప్రస్తుత సామాజిక సమస్యలను మత దృక్కోణం నుంచిగాక-సమకాలీన వాస్తవికతనుంచి వీక్షించి వుంటే ఈ సమాధానాలు ఇంకా బాగుండేవనిపిస్తుంది.

'గీటురాయి'లో ఏడు సంవత్సరాలుగా వెలువడుతున్న ఈ 'సందేహాలు సమాధానాలు' ఇరువై రెండు ఖండాలుగా విభజించి, పుస్తక రూపాన తేవటం ప్రశంసనీయమగు ప్రయత్నం. 'నిజామీకుమార'గారికి తెలుగు నుడికారం పైగల అధికారం మెచ్చుకోదగినది. మనో భావాలని లలితమైన—సుతిమెత్తని మాటల్లో మలిచి చెప్పగల నేర్పు వున్న రచయిత ఈయన. వీరి శైలి నదీ సుందరివలె చల్లగా, మెల్లగా అప్పుడప్పుడు గలగలా పారుతూ వుంటుంది. ఈ సంపుటిలో తెలుసుకోదగిన విషయాలు ఎన్నో వున్నాయి.

**మాలతీ చందూర్**

24-12-88

అపార కృపాశీలుడు, అనంత కరుణామయుడయిన అల్లాహ్ పేరుతో

# ధార్మికం

## 1. దైవం

పి. ప్రసాద్ (చాగల్లు)

**దేవుడు ఉన్నాడని ఎలా చెప్పగలరు ?**

* ప్రపంచంలో ఉనికిగల ప్రతి వస్తువూ దాని నిర్మాత లేనిదే తయారు కాలేదన్నది ఎవరూ కాదనలేని యదార్థం. ఏ వస్తువుకయినా, ఏ చర్యకయినా మూలకారక పదార్థమంటూ ఒకటి లేనిదే అది సాధ్యపడదు. ఆ 'మూలం' ఆ 'కారణ హేతువు' దేన్నయినా 'లేమి' అవస్థ నుంచి 'ఉనికి' అవస్థలోకి తెచ్చే శక్తి ఏదయితే ఉందో దాన్నే దైవం అన్నారు. అలాంటి ఓ శక్తి లేనిదే ఈ విశ్వ వ్యవస్థ అంతా కట్టుదిట్టంగా, వేనవేల శతాబ్దాలుగా ఇంత పకడ్బందీగా కొనసాగడం అసాధ్యమని, ఈ విశ్వంలో పరమాణువు మొదలుకుని మహాద్భుతమైన పాలపుంతలవరకు అన్నీ సర్వశక్తిమాన్యమయిన ఓ అస్తిత్వానికి నిదర్శనాలని అనేక సైంటిస్టులు కూడా సాక్ష్యం పలుకుతున్నారు. ఆ అస్థిత్వమే దైవం అని ధార్మిక భాషలో అంటారు.

మరో విషయమేమంటే ఒక పదార్థం గురించి ఇదమిత్థంగా తెలియనప్పుడు సశాస్త్రీయమయిన వైఖరి 'ఏమో దాన్ని గురించి మాకు తెలీదు' అని చెప్పడమే

కాని, అది లేదని బొంకడం కాదు. దైవం విషయంలో దేవుడున్నాడని మనం రూఢీగా చెప్పలేమనే అనుకుందాం. అయితే లేడని మాత్రం ఎలా చెప్పగలం? మానవుని విజ్ఞాన పరిధి బహుస్వల్పం. ఏ విధంగానయితే మనకు తెలియని అనేక విషయాల్లో తెలిసిన నిపుణుల జ్ఞానంపై భరోసాతో వారిని నమ్ముతామో అలాగే దైవం విషయంలో దైవసందేశహరులు చెప్పినదాన్ని నమ్మడం తప్ప గత్యంతరం లేదు. ఈ విషయాన్ని ఇంకా వివరంగా అధ్యయనం చెయ్యడానికి ''ఇస్లాం మరియు అజ్ఞానం'', ''ఇదియే ఇస్లాం'' ఇత్యాది పుస్తకాలు చదవండి.

(11-2-83)

—: o :—

జీనత్ బేగం (కర్నూలు)

**"తక్దీర్" మరియు "తద్బీర్"నకు గల సంబంధమేమి?**

* "తక్దీర్" అంటే "అదృష్టం, విధి" అని భావం. "తద్బీర్" అంటే ఉపాయం కృషి, యత్నం అని అర్థం. మన విధాత, ప్రభువు, పాలకుడు అయిన దైవం మన జీవన సాగుదలకై నిర్ణయించిన "అజ్ఞాత మార్గం" లేక ''అదృష్టం" (తెలియని విషయం) ఏదైతే ఉందో అదే తక్దీర్. ఇందులో రెండు రకాలు. ఒకటి, అగ్నికి కాల్చే గుణం, విషానికి చంపే గుణం, నీటికి పారే గుణంలాంటి ప్రకృతి సిద్ధాంతాలకు సంబంధించింది వీటిని దైవం ముందే నిర్ణయించాడు. కాబట్టి ఇవన్నీ ఆయన నిర్ణయం ప్రకారమే నడచుకుంటాయి. రెండవది మనకు ఏ మాత్రం తెలీనిది. మరుక్షణం ఏమి జరుగనున్నదో, భావిలో మన స్థితిగతులు ఎలా మారనున్నాయో అన్న విషయానికి సంబంధించింది. దీన్నే మనం తరచుగా చర్చించుకుంటూ ఉంటాము—దాని వాస్తవికత మనకు ఏ మాత్రం తెలియకపోవడంచేత. మన బాధ్యత ఏమిటంటే మనకు దైవం నిర్ణయించిన, ధర్మ సమ్మతమయినవిగా తెలిపిన రీతుల్లో మన జీవన మార్గాన్ని నిర్ణయించుకోవడం. ఇది నిత్య జీవితానికి సంబంధించిన అత్యల్ప విషయాలు మొదలుకుని పెద్ద పెద్ద నిర్ణయాల వరకు వర్తిస్తుంది. ఇదే తద్బీర్ లేక ''యత్నం''. ఏదీ గొప్పదికాదు. దైవం తలచుకుంటే ఈ రెండు రకాల తక్దీర్లు కూడా మారవచ్చు. మంటల్లోపడిన వ్యక్తిని ఆయన సురక్షితంగానూ తీయవచ్చు. పారే నీటిని

నిలిపివెయ్యనూవచ్చు. అలాగే తన దాసుడయిన మనిషి మొరాలకించి అతని "విధి వ్రాత"ను కూడా ఆయన మార్చవచ్చు. ఆయన అధికారాలకు అంతే లేదు.

(14-10-83)

—: o :—

ఎస్. నజీర్ హుసైన్ (కర్నూలు)

**షైతాన్ ని పరీక్షించడం?**

* మీరు షైతాన్‌కు సంబంధించిన విషయాలెన్నో అడిగారు. మీకున్న ఏ ఒక్క అనుమానమయినా (అది నిజమైనదయినా లేక అబద్ధమైనదైనా) మీ జీవితంతో దానికి ఎలాంటి సంబంధం ఉందో ఆలోచించారా? షైతాన్ ఏ గంగలో కలిసినా ఏ గోదావరిలో కొట్టుకుపోయినా మీకు ఒరిగేదేమిటి? తెలుసుకోవాలన్న జిజ్ఞాస అంటారా...? అంత జిజ్ఞాస ఉంటే ముందు ప్రాథమిక విషయాలను గురించి తెలుసుకోవాలి. మీకు ఉన్నవన్నీ అపార్థాలే. సరయిన అవగాహన లేకపోవడం వల్ల జనించిన అనుమానాలే. మనిషికి నేడు దైవాదేశాలేమిటో స్పష్టంగా తెలుసు. చెయ్యవలసిందేమిటో, చెయ్యరానిదేమిటో తెలుసు. ఐనా మనిషి దైవం పట్ల అవిధేయత, ధిక్కారాన్ని ప్రదర్శిస్తున్నాడు. ఎందుకు? అతనికి ఆ మేరకు స్వేచ్ఛనిచ్చి దైవం అతని (మనిషి) విచక్షణాజ్ఞానాన్ని పరీక్షిస్తున్నాడన్నమాట. ఇలాంటి స్వేచ్ఛే ఉన్న జిన్నుల జాతికి చెందిన షైతాన్ దైవధిక్కారానికి పాల్పడ్డాడు - దైవంతో పోటీ పడటం కాదు! షైతాన్‌ని దైవం ప్రళయదినాన విచారణకు నిలబడతాడా లేదా అన్న ప్రశ్నకంటే మనల్ని నిలబెడతాడు గనక మనం ఆ సమయాన సమాధానం చెప్పుకునే స్థితిలో ఉన్నామా అన్న ప్రశ్నే ముఖ్యమయింది. షైతాన్ ఆది నుండే నేరస్థుల జాబితా నెక్కినవాడు. అందరు అపరాధులతో పాటే ప్రళయదినాన హాజరవుతాడు అని దివ్యఖుర్‌ఆన్ చెబుతుంది. మనిషికి ఉన్న స్వేచ్ఛ ఎలా పరిమితమయిందో షైతాన్‌కు ఉన్న స్వేచ్ఛకూడా పరిమితమయిందే వాడు అన్నీ చెయ్యలేడు.

మరో విషయం మీరు గుర్తుంచుకోవాలి. దేవుడు వ్యక్తి కాదు శక్తి! ఈ నిఖిల జగత్తు, దీని సకల సరంజామాలతోసహా ఉనికిలోకి రావడానికి, అది నిరంతరంగా, నిరాఘాటంగా దాని కార్యకలాపాలను కొనసాగించుకోడానికి

కారణ భూతమయిన శక్తి!! ఆశక్తి అజరామరం - సకల విశ్వాన్ని ఆవరించి ఇక్కడ జరిగే ఒక్కొక్క 'కదలిక'కు కావలసిన శక్తినిచ్చే మహత్తర శక్తి— దానికి ఆదిలేదు, అంతంలేదు. ఆ నిరాకారశక్తినే దైవం అంటున్నాము. మంచి మంచి పేర్లతో పిలుస్తున్నాము. ఆ శక్తి చేసిన ఎన్ని ఉపకారాలు మన మనుగడలో సతతం కానవస్తున్నాయి.? ఆ శక్తి ఉనికి తాలూకు స్పృహకలగ్గానే దాని ముందు మోకరిల్లాలని, దాని ఎదుట తలవంచాలని మన ఆంతర్యాలను దాని నిర్మలమయిన ప్రేమతో, దానిపట్ల భక్తి భావంతో నింపుకోవాలని అనిపించదూ?!

(16-3-84).

—: ० :—

ఎం.డి. ఉస్మాన్ అలీఖాన్ (నంద్యాల)

**నమాజ్ చదవడము అనవసరము, అల్లాహ్ మనసులో ఉంటే చాలు. అని అంటాడు నా స్నేహితుడు.**

* మనకు దైవం తరఫున ఎలాంటి మార్గదర్శకత్వమూ లభించక, జీవితం అంతా ఇష్టం వచ్చినట్లు నడుచుకునేందుకు స్వేచ్ఛలభించి ఉన్నట్లయితే మీ మిత్రునిమాట సమంజసమే అయ్యేదేమో! కాని ఇప్పుడు పరిస్థితి అలా కాదు. దేవుడు, తన దాసుడయిన మనిషి ప్రపంచంలో ఏ విధంగా జీవించాలి? అన్న విషయంలో ఎంతో శ్రద్ధ తీసుకున్నాడు. మానవుని జీవితంలో, జననం మొదలు మరణం వరకు ప్రతి చిన్నపనినుండి పెద్దపెద్ద కార్యాల వరకు, మనిషి వ్యక్తిగత జీవితం మొదలుకొని ప్రపంచ విషయాల వరకు పూజా పురస్కారాలతోపాటు అంతర్జాతీయ రాజకీయాలవరకు దైవం పంపిన సందేశం మార్గం చూపుతుంది. ఇక ఎవరయినా దేవుడున్నాడని, ఆయన మార్గదర్శకత్వమూ ఉందని నమ్మినట్లయితే ఆ మార్గదర్శకత్వం ప్రకారం జీవించడం అనివార్యం. అలా జీవించదలచినవారు దేవుని మార్గదర్శకత్వం ప్రకారం జీవితం గడిపి చూపిన ఆదర్శమూర్తి ముహమ్మద్ (సఅసం)ని అనుసరించడం కూడా అనివార్యమే. ఆ ఆదర్శంలోని భాగమే 5 వేళలా నమాజ్ చెయ్యడం. దైవాన్నీ దైవ ప్రవక్తనూ విశ్వసించేవారు ఆ నమాజ్‌ను కాదని ఎలా అనగలరు?

(27-4-84)

—: ० :—

మహమ్మద్ అస్లం (ఇల్లందు)

**దేవుడనేది ఎవరో ఏమిటో, దాని ఉనికి ఏమిటో, అది ఎక్కడుంటుందో, ఏం చేస్తుందో ఇంతవరకు ఎవరూ ఖచ్చితంగా చూపించలేక పోయారు. అందువల్ల దేవుడనేది "మిథ్య" అని నా అభిప్రాయం! మనిషికి చరిత్ర ఉంది, ఎక్కడ పుట్టాడో తెలుసు, ఎక్కడ ఉంటున్నాడో తెలుసు. మనిషి చేసిన బోధనలు దేశదేశాల్లో ప్రచారంలో ఉన్నాయి. ఇంత చరిత్ర ఉన్న మనిషే నా దృష్టిలో దేవునికన్నా గొప్పవాడని నా అభిప్రాయం- కామెంట్ ప్లీజ్!...?**

* దైవాన్ని గురించి మీరు అడిగే ఏ ప్రశ్నకయినా సమాధానం చెబుతామని ఎవరయినా అంటే గదా, మీరు "ఇంతవరకూ ఎవరూ ఖచ్చితంగా చూపించలేక పోయారు" అనడానికి! దైవ స్వరూపం పంచేంద్రియాలకు గోచరించనిదే అని అన్ని మతాలవారూ అంటుంటారు. అలాంటప్పుడు మీ ప్రశ్నకు అర్థమే లేదు. అయితే అలా అగుపించని ఆ దైవాన్ని ఎందుకు నమ్మాలి? అని అంటారా, అదొక విస్తృతంగా చర్చించవలసిన సమస్య. సూత్రప్రాయంగా కొన్ని విషయాలు తెలుసుకోండి. మీరెవరో నిజంగా నాకు తెలీదు. నిజంగా మీరు పేర్కొన్న పేరున్న మనిషి ఇల్లందులో ఉన్నాడా లేడా అన్నది కూడా తెలీదు. అందువల్ల మీరసలు లేరని నేను కొట్టి పారెయ్యలేను గదా? మొదటి దశలో "ఉన్నారో లేదో నాకు తెలీదు" అన్న సత్యాన్ని, నా అజ్ఞానాన్ని ఒప్పుకోవాలి. అదే హేతుబద్ధమయిన, సశాస్త్రీయమయిన పద్ధతి. తరువాత ఆరాతీసి ఉన్నారో లేదో తెలుసుకోవచ్చు అన్నది వేరే విషయం. అలాగే దైవం విషయంలోనూ. దేవుని ఉనికి విషయంలో మనిషి, ముందు తన "అజ్ఞానాన్ని, తెలివి లేమి"ని ఒప్పుకోవాలి. ఆ తరువాత ఆరాతీసి అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాలి. అలా కాక, ప్రారంభంలోనే, "నేను చూడలేదు, మరెవరూ వచ్చి నాకు చూప లేదు గనుక వాడసలు లేడు, వాడు మిథ్య" అన్న అభిప్రాయాన్ని ఏకపక్షంగా ఏర్పరచుకుని మాట్లాడటం సహేతుకమూ అనిపించుకోదు, జిజ్ఞాసా అనబడదు. దాన్ని కేవలం మంకుతనం, మొండితనం అని అనవలసివస్తుంది. మానవునికి చరిత్ర ఉందని అంటున్నారు. నిజానికి మీకు ఉన్న జ్ఞానం కేవలం ఃజ్ఞానమే. మీకు "తెలిసింది" మీ సమకాలీన చరిత్ర మాత్రమే. మిగతా దాని

పట్ల మీకు శాస్త్రీయంగా "ఏమీ తెలీదు." అయినా ఎవరో మీలాంటి మానవులు చెప్పిన గాథలన్నీ మీకు తెలియకపోయినా మీరు నమ్ముతారు. అలాంటప్పుడు మీ లాంటి మనిషే మరొకతను, ఎంతో నిజాయితీపరుడు, ఎంతో సచ్చరితుడు మీకు తెలియని దైవం గురించి చెబితే ఎందుకు నమ్మరు? హేతువాదమే మీ విధాన మైతే మీరు దీన్ని నమ్మవలసి ఉంటుంది. దీన్ని వివరంగా చర్చించే సమయం ఇది కాదు. ఈ విషయాలు చర్చించే పుస్తకాలు ఏవయినా చదవండి. TIP వాళ్ళకు వ్రాసి ఇస్లాం మరియు అజ్ఞానం అన్న పుస్తకాన్ని తెప్పించి చదవండి.

(30-11-84)

—: ০ :—

అబ్దుల్ మునాఫ్ (రాజమండ్రి)

**గైరల్లాతో సంబంధము ఉన్న బంధువుల బంధుత్వము త్రెంచు కోవచ్చునా?**

* లోగడ కూడా మీరు ఇలాంటి ప్రశ్న ఒకటి వేసినట్లుగుర్తు. ఎంత సేపటికీ సంబంధాలు త్రెంచుకోవడం గురించే ఆలోచిస్తారేం? "ఎవరయితే నాతో సంబంధాలు త్రెంచుకుంటారో వారితో సంబంధాలు పెంచుకోమని-దైవం నాకు బోధించాడు" అన్నారు దైవప్రవక్త మహనీయ ముహమ్మద్ (స అ సం). అలాంటి వారి సంప్రదాయాన్ని (సున్నత్‌ని) పాటించేవారా ఇలా అడగటం? బంధుత్వం అన్నది త్రెంచుకుంటే తెగేది కాదు. ఒకవేళ తండ్రి గైరల్లాహ్ (దైవేతర శక్తుల)తో సంబంధం కలిగి ఉంటే ఆయన "తండ్రి" కాకపోతాడా? అలాగే మరే బంధువయినా! ముందు మీ అంతర్యంలో తిష్ఠవేసిన గైరల్లాహ్ (దైవేతర శక్తుల) నుండి విముక్తులవండి. మీ మనస్సు దైవేతరుల భయభక్తులతో భయాందోళనలతో, భరోసా నమ్మకాలతో ప్రక్షాళన చేసుకోండి. మీ మస్తిష్కాన్ని దైవేతరుల ఆలోచనా విధానానికి, జీవితపు సమస్యల పరిష్కారానికి అవి చూపే మార్గాలకు దూరంగా ఉంచండి, మీ అంతర్యంలో దైవప్రవక్త అందజేసిన షరీఅత్ తప్ప మీ మనోకాంక్షలకు, మీ 'వంశం' లో వస్తున్న గుడ్డి అనుసరణలకు, మీ చుట్టూ ఉన్న ప్రపంచం ప్రేరేపించే ఆశామోహాలకు చోటివ్వకుండా చూసుకోండి. ఒక్క మాటలో, ముందు మీరు దైవేతరులతో

మీకున్న సంబంధాన్ని త్రెంచుకోండి. ఇతరులు దైవేతర శక్తులకు లొంగుతున్నారనడం కంటే మనం ఎంతవరకు అలా దైవేతర శక్తులకు బానిసలవుతున్నామో చూడండి. అనేక దైవేతర శక్తులతో ప్రగాఢ సంబంధం పెంచుకునే మన మనోమస్తిష్కాలతో సంబంధాలు తెంచుకునే ప్రయత్నం చేసి చూడండి ఏమవుతుందో. ఆ తరువాత ఆలోచించండి– దైవేతరులతో సంబంధమున్న బంధుత్వాలను గురించి. బంధువులు బంధువులే. ఆ సంబంధం తెగదు. దాన్ని సన్మార్గపు కార్యకలాపాలకు వాడుకోవడం సరయిన పద్ధతి. చెడుకార్యాల్లో సహకరించకపోవడం చాలు.

(9-8-85)

—: o :—

ఎం. ఎ. గఫ్ఫార్ (అనంతసాగర్)

**మానవుడు తన ఇష్టం ప్రకారము నడుస్తున్నాడా? లేక దేవుని మహిమతో నడుస్తున్నాడా?**

* లోగడ కూడా ఈ ప్రశ్న లేక ఇలాంటిదే ఓ ప్రశ్న ఈ శీర్షికలో ప్రస్తావనకు వచ్చినట్లు గుర్తు. ప్రపంచంలో జరిగేదంతా ఓ మహత్తర శక్తిమంతమయిన అధికారం అధీనంలోనే నడుస్తోంది. మానవుడూ అంతే. ఆ శక్తిని మించి పొయ్యే బలం ఎవ్వరికీ లేదు. ఆ ప్రభుత్వం, ఆ అధికారం, ఆ శక్తి చేసిన నిర్ణయాలే ఇక్కడ చెలామణి అవుతాయి, మరెవరివీకావు. ఆ ప్రభువు తన సాధికార ప్రతినిధిగా మానవుడ్ని భువిపై పంపాడు-తన సృష్టికి అత్యుత్తమ దృష్టాంతంగా. తన శక్తి సామర్థ్యాలన్నింటి దృష్ట్యా కూడా మనిషి ఆ ప్రభువుకు ప్రతినిధే. అయితే అతని అధికారాలు, శక్తిసామర్థ్యాలు అన్నీ ఓ పరిమితికి లోబడినవే. ఎందుకంటే అతను కేవలం ప్రతినిధి మాత్రమే—స్వామి కాడు. అందువల్ల మనిషికి ఇక్కడ తన చర్యలు, ఆచరణలు, చేష్టల మేరకు—ఏది చేసినా, ఎలా చేసినా, ఎలా వ్యవహరించినా—అధికారం ఉంది, శక్తీ ఉంది. తన చర్యల్ని చివరికంటా ఫలప్రదం చేసేందుకు మాత్రం శక్తిలేదు. చివరి ఫలితం మాత్రం ఆ ప్రభువు తన హస్తగతం చేసుకున్నాడు. తనకు ఇష్టమయితే ఆయన, మనిషి చర్యల్ని ఫలప్రదం చేస్తాడు, లేకపోతే లేదు. చివరికి

ఆ స్వామి నిర్ణయమే మనిషి చర్యలకు తుది రూపమిస్తుంది. ఇది సామాన్య సూత్రమనుకోండి. వివరాలను పరిశీలిస్తే—మనం ప్రకృతి సిద్ధాంతాలని నిత్యజీవితంలో వ్యవహరించే విషయాలు కూడా ఆ ప్రభువు నిర్ణయాలే. అందువల్లనే అప్పుడప్పుడు, ఆ ప్రకృతి సిద్ధాంతాల్లో కూడా ఆ ప్రభువు ఆజ్ఞమేరకు మినహాయింపు గోచరిస్తూంటుంది. వాటినే మనం 'మహిమలు'గా పరిగణిస్తాము (నిజమయిన మహిమలు దృష్టిలో ఉంచుకొని చెబుతున్నాను. బాబాలు చేసే మ్యాజిక్ కాదు). ఈ మినహాయింపులు, మహిమలు మనకు గుణపాఠం కలగడానికి, మన దృష్టి ప్రపంచాన్ని పరిపాలిస్తున్న ఆ అగోచర ప్రచండ శక్తిని గుర్తించడానికి, మన మనోమస్తిష్కాలను దైవంవైపుకు మళ్ళించడానికి చూపుతుంటాడు ఆ స్వామి. మానవులమయిన మనకున్న అధికారాలను, శక్తి సామర్థ్యాలను ఏ విధంగా, ఏ మార్గంలో, ఏది సాధించడానికి వినియోగించామన్న విషయం మేరకు మనం బాధ్యులం. అధికారాలు, శక్తిసామర్థ్యాలు, వనరులూ ప్రసాదించిన స్వామి మనల్ని ఈ విషయంలో ప్రశ్నించడం కూడా సహజమే సమంజసమే. మనల్ని, మన చర్యలను గురించి, వాటి 'దిశ'ను గురించి, మనకు ప్రసాదించబడిన శక్తిసామర్థ్యాలను గురించి మాత్రమే ప్రశ్నించడం జరుగుతుంది. ఇతరత్రా కాదు.

(20-9-85)

—: o :—

ముహమ్మద్ ఇలియాస్ (లక్ష్మీపురం)

**అల్లాహ్ షైతానును ఎందుకు సృష్టించాడు?**

* 'షైతాను' ను దైవం సృష్టించిన కారణం ఒకవేళ మనకు తెలిసినా దానివల్ల ప్రయోజనం ఏమిటో నాకు బోధపడటం లేదు. ఆ మాటకువస్తే ఈ యావత్తు సృష్టి రాజ్యంలో ఏ వస్తువు ఉనికికయినా 'కారణం' తెలుసుకోదలిస్తే ఏ విధంగానూ అంతు తేలదు. ''చేపా, చేపా, ఎందుకు ఎండ లేదు'' అన్న కథ తీరులో నడుస్తుంది ఆ వ్యవహారమంతా. ఈ సృష్టి మొత్తాన్ని ఎంతో శాస్త్రీయ దృక్పథంతో తిలకించే విజ్ఞాన శాస్త్రవేత్తలు సయితం 'ఎందుకు' అన్న దానికి చివరికంటా సమాధానం రాబట్టలేరు. ఏమిటి, ఎలా ఉంది, ఎంత ఉంది,

ఎక్కడ ఉంది అన్న ప్రశ్నల వరకే మనిషి అన్వేషణ పరిమితం. 'ఎందుకు' అన్నది శేష ప్రశ్న! అందువల్లనే దైవప్రవక్త మహనీయ ముహమ్మద్ (సఅసం) సృష్టి విషయంలో, 'ఎందుకు' అన్న ప్రశ్న యొక్క మాయాజాలంలో పడ రాదని హెచ్చరించారు. దివ్య ఖుర్ఆన్ మరియు హదీసుల ద్వారా తెలిసేదేమంటే షైతాన్ జిన్నుల రాసికి చెందిన సృష్టి. జిన్నులు కూడా మానవాళిలా, ఆలోచన, ఆచరణలు స్వేచ్ఛగల సృష్టి. వారిలో కొందరు (మానవుల్లా) తమ ఆలోచనా స్వేచ్ఛను దుర్వినియోగం చేసుకుని దైవధిక్కారానికి పాల్పడ్డారు. వారి నాయకాగ్రేసరుడే ఇబ్లీస్ అనబడే షైతాన్ దుష్టాగ్రగణ్యుడు. దైవం మానవ సృష్టి గావించినప్పుడు, ఈ షైతాన్‌ని దృష్టిలో ఉంచుకునే దైవ దూతలు, "ఈ స్వేచ్ఛా జీవుల్ని ఎందుకు సృష్టిస్తున్నావు, భువిలో రక్తపాతాన్ని రేకెత్తించడానికా" అని ఆశ్చర్యాన్ని వ్యక్తపరిచారు. అందరు దైవతూతలు, జిన్నులు దైవాజ్ఞమేరకు ఆది మానవునికి తల ఒగ్గగా ఇబ్లీస్, అతని అనుచర గణం మటుకు తిరుగుబాటు వైఖరిని అవలంబించారు. ఆ తరువాత దైవాగ్రహానికి లోనయి, మానవ సంతతిని పెడత్రోవన పెడతానని షైతాన్ ప్రతిన బూనాడు. దాన్ని నెరవేర్చ డానికి అనేక రూపాల్లో మానవుణ్ని అపమార్గం పట్టిస్తున్నాడు. అది తెలుసుకో లేని మనిషి తన ఆజన్మ శత్రువయిన షైతాన్ ప్రేరణలకు దాసుడయి నిజ ప్రభువుకు ఎదురు తిరుగుతున్నాడు.

(30-8-85)

—: o :—

ముహమ్మద్ యూసుఫ్, ఆర్మూర్.

**అల్లాహ్‌ను నిర్వచించడం ఎలా?**

* అంటే గణితశాస్త్రం, విజ్ఞాన శాస్త్రాల్లోని సిద్ధాంతాలను వ్యాకరణ సూత్రాలను నిర్వచించే విధంగానా? లేక అర్థం చేసుకోవడానికా? అర్థం చేసుకోడానికయితే నాకు తెలిసిన విధంగా విన్నవించుకోగలను. కోటానుకోట్ల సూర్యులు, నక్షత్రాలు, గ్రహాలు ఉపగ్రహాలు గల ఈ విశ్వాన్ని, ఇందులో మనిషి లనే జీవి నివసించే భూమిని, భూమిపై సకల కళ సంశోభితమయిన జీవన రంగాన్ని సృజించిన శక్తి, ఈ భూనభాంతరాలను కోటానుకోట్ల

సంవత్సరాలుగా నిర్విరామంగా నడుపుతున్న మేధ ఏదో ఎక్కడో ఉందని నేటి మహా గొప్ప వైజ్ఞానిక ప్రతిభా పాటవాలు గడించిన శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. ఈ యదార్థాన్నే దివ్యదృష్టిగల, ఆత్మజ్ఞాన సంపన్నులయిన ఋషులు, ప్రవక్తలు, దైవ సందేశహరులూ నిత్యం ప్రకటిస్తూ వచ్చారు. ఆ అనవసరమైన శక్తి, ఆ అద్వితీయమయిన మేధ ఏదయితే ఉందో దాన్ని మీరేమని అన్నా ఎన్నెన్ని మంచిపేర్లుపెట్టినా చెల్లుతుంది. దాన్నే దేవుడని అల్లాహ్ అని, గాడ్ అని, యజ్దా అని, ఇరైవన్ అని, ఖుదా అని, పరమేశ్వర్ అని, ఇంకా ఏమేమో అని పిలుస్తున్నారు ప్రపంచ ప్రజలు. ఇక ఈ పరమ సత్యాన్ని మీరు ఏ విధంగా నిర్వచించుకుంటారో ఆలోచించుకోండి.

(25-7-86.)

—: ೦ :—

ఎం. జనార్దన (నల్గొండ)

**ఏమండీ, దేవుడున్నాడా? మీరు చూశారా?**

* బాబ్బాబు, కొంచెం నిదానం, అలా నిలదీస్తే ఏమని చెప్పగలను? అంతేసి పెద్ద విషయాలు విడమర్చి చెప్పే శక్తి నాకు లేదు. నేను వట్టి మూర్ఖుణ్ణి, అల్పజ్ఞానిని. మా డాక్టరుగారు నీ మెదడులో ఫలానా రోగముంది భాయ్, ఈ మందు పుచ్చుకో, నయమవుతుందని చెప్పి ఓ వంద రూపాయలు లాగేస్తే గప్ చిప్‌గా ఇచ్చేసి జేబు దుమ్ము దులుపుకుని, మెదళ్ళో ఏ రోగముందో లేదో గాని నా 'రోగం కుదిరింది' అనుకుని "గుడ్డి"గా నమ్మేసే పామరుణ్ణి. రష్యావాళ్ళు, అమెరికా వాళ్ళు ఊర్ధ్వలోకాల్లో (మా ఇందిరా పార్కులో మాదిరిగా) హాయిగా విహరించి వచ్చారని ఈ పేపరోళ్ళు, రేడియో న్యూసోళ్ళు చెబితే అవును కాబోలు నా బోంట్లు వాళ్ళకు ఏమర్థమవుద్ది? బాగా సదుకున్నోళ్ళు చెబుతున్నారంటే. అబద్ధం ఎందుకు చెబుతారులే అనుకుని నమ్మేసే పిచ్చి మారాజును. "అలా కళ్ళప్పగించి చూస్తారేం నాన్నా, నిజానికి మనిషి అన్నవాడు ఏకకణజీవి నుండి పరిణామం చెంది కోతిగా మారినేడున్న స్థాయికి ఎదిగాడు" అని ఎన్నెన్నో క్లాసులు చదివేసిన మా పెద్దపాప, "చూసి వచ్చినట్లే" చెబుతుంటే, "దీనికెన్నెన్ని బుద్ధులు పుట్టుకొచ్చాయి, ఇది నా లాంటి "కోతి" వెధవకు పుట్టిన

పాపేనా అని విస్తుపోయి, 'నిజమేనమ్మా దీనికి నువ్వే సజీవ సాక్ష్యం' అని ఒప్పుకునే మూర్ఖుణ్ణి. అందువల్ల నాయనా, దేవుడున్నాడో...మరేమో మీకు నేను చెప్పలేనయ్యా!

(25-7-86)

—: o :—

రత్నాకర్ (నంద్యాల)

**"ప్రకృతియే దైవము, దైవమే ప్రకృతి" అనే సిద్ధాంతము గల వారికి మీ సమాధానమేమిటి?**

* పోనీలేండి. ఏదో ఒక శక్తి ఈ విశ్వవ్యవస్థకు మూలకారణమని తలపోస్తే అది కొంతవరకు నయమే. ఆ మూల శక్తికే ఎవరయినా 'ప్రకృతి అని పిలుచుకుంటే తప్పులేదు. కాని ఆ 'ప్రకృతి' కేవలం సృష్టించి ఈ విశ్వ వ్యవస్థను గాలికి వదిలేసిందా? విశ్వవ్యవస్థలో మానవునికి విశిష్ట స్థానమున్నది నిజమేనా? మనిషికీ ఈ ప్రకృతికీ ఏదయినా సంబంధం ఉందా? ఈ ప్రశ్న లన్నింటికీ సమాధానాలు లభించే ప్రామాణికమయిన మార్గం ఏది? అన్నింటికీ మూలమయిన 'ప్రకృతి'యే గదా ఇదంతా చెప్పవలసింది? లేక ప్రతి మనిషి తనకు ఇష్టమయిన సమాధానాలను వెదుక్కొని, ఊహించుకుని బ్రతకవచ్చా? ఈ ప్రశ్నల సమాధానం పైనే గదా మానవ మనుగడకు ఓ నిర్దిష్టమయిన మార్గమంటూ ఏర్పడేది! లేక ఆ చిక్కుల్లో పడకుండా పశువుల్లా, ఏ నైతిక, సామాజిక నియమ నిబంధనల్నీ పాటించకుండా బ్రతకడమే సరయిన విధానమా? ఈ ప్రశ్నలకు కూడా ఆ సిద్ధాంతాన్ని ప్రతిపాదించేవారు సమాధా నాలు చెబితే బావుంటుంది !!

(8-1-88.)

—: o :—

# 2. అన్య మతాలు

పి. పరంజ్యోతి (కావేరి)

**బైబిల్ మార్పు చెందిందని, బైబిల్‌లో ముహమ్మద్ ప్రవక్తయొక్క శుభవార్త కలదని సహేతుకంగా నిరూపించగలరా?**

* బైబిలు గురించి మీరు లేవనెత్తిన అంశాలు లోగడ కూడా చర్చించి నట్లు గుర్తు. అయినా ఈ వారం కేవలం ఒక్క అంశాన్ని మాత్రమే చర్చించా లని నిర్ణయమయింది. మీరు లేవనెత్తిన ఇతర అంశం వచ్చే సంచికలో చర్చించ బడుతుంది. యోహాను సువార్త మొదటి అధ్యాయం 19 నుండి 25 వ వచనాల వరకు చదవండి. అక్కడ క్రీస్తు, ఏలియాలే కాక ఇస్రాయీల్ ప్రజలు మరో ప్రవక్త "ఆ ప్రవక్త" కొరకు కూడా నిరీక్షించేవారన్న అంశం రుజువవుతుంది. అలాగే యోహాను సువార్తలోనే 14 వ అధ్యాయంలో 16, 17; 25, 26 వచనాలు 15:26 వచనాలు కూడా చదవండి. అక్కడ ఆదరణకర్త, సత్య స్వరూపియను ఆత్మ, పరిశుద్ధాత్మను పంపడానికి ఏసుక్రీస్తు దైవాన్ని ప్రార్థిస్తానని చెప్పినట్లు తెలుస్తుంది. అలాగే 14:30 వ వచనంలో లోకాధికారి (విశ్వనాయకుడు) వచ్చు చున్నాడు అన్న శుభవార్త ఉంది. ఇంకా 16 వ అధ్యాయంలో 7-15 వ వచ నాల్లోను రాబోయే ప్రవక్తను గురించి స్పష్టమైన సూచనలున్నాయి. ఈ వచనా ల్లోని కొన్ని అస్పష్టమయిన పదాలకు అర్థాలు లభించడం కష్టం. కారణం ఏసుక్రీస్తు కాలంలో అరామైక్ భాషల్లోని ఓ భాషఅయిన సిరియాక్ భాష మాట్లాడే వారు. హెబ్రూ అక్కడ క్రీ. పూ. 250 నాటికే ఉనికి లేకుండా పోయింది. పాలస్తీనా ప్రజలు సిరియాక్‌లోని ఓ ప్రత్యేకమయిన మాండలికాన్ని వాడేవారు. గమనించవలసిన విషయం ఏమిటంటే బైబిలులోని ఈ నాలుగు గ్రంథాలు (మత్తయి, లూకా, మార్కు, యోహాను సువార్తలు) గ్రీకు మాట్లాడే క్రైస్తవ ప్రముఖులచే వ్రాయబడినవి. వారు క్రీస్తుశకం 70 వ సంవత్సరం తరువాతివారే కాని అంతకు పూర్వంవారు కారు. వారికి ఏసుక్రీస్తు బోధనలు గ్రంథాల

రూపంలో కాదు కేవలం నోటి ఉల్లేఖనాల రూపంలోనే అందాయి. సిరియాక్ మాట్లాడేవారు అందజేసిన ఉల్లేఖనాలను అప్పటివారు తమకు తెలిసిన గ్రీకు భాషలోకి అనువదించి గ్రంథస్థం చేశారు. అయితే మరో విషయం ఏమిటంటే అప్పటి అసలు గ్రీకు ప్రతి అయినా సురక్షితంగా లేదు. ముద్రణా సౌకర్యాలు కనుగొన్న తరువాత అప్పుడు అనేక చోట్లనుంచి సేకరించిన అనేక ప్రతుల్లో ఏ ఒక్కటీ తొలినాటిదికాదు. పైగా అన్నీ నాల్గవ శతాబ్దం తరువాత వ్రాయబడినవే. ఆ మధ్య 3 శతాబ్దాల్లో ఎన్నెన్ని మార్పులు చేర్పులకు లోనయ్యాయో చెప్పడం కష్టం. క్రైస్తవులు తమ గ్రంథాల్లో తమకు ఇష్టమయిన విధంగా మార్పులు చేర్పులు చెయ్యడం ధర్మసమ్మతమని భావించేవారు. వివరాలకోసం చూడండి. ఎన్సైక్లోపీడియా బ్రిటానికా - బిబ్లికల్ లిటరేచర్ ఇందులో వ్యాసకర్త 'కర్తలేని' మౌలికగ్రంథం అన్నది లేదన్న విషయం రూఢీ అయిందని అంటు న్నాడు.

(23-3-84)

—:o:—

మహమ్మద్ అజ్మతుల్లా (భద్రాచలం)

**ఆదమ్ అలైహిస్సలాం ప్రవక్త మొదలుకొని చివరి ప్రవక్త ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లం వరకు మధ్యకాలములో చాలా ప్రవక్తలు ఉన్నారు. కాని వెంకటేశ్వర్లు, రాముడు అన్నవారెవరు?**

* దివ్య ఖుర్ఆన్ సూత్రప్రాయంగా సకల మానవాళి కొరకే అవత రింపజేయబడింది. అయితే అది ప్రారంభంలో ఎవరినయితే సంబోధించిందో వారి వాతావరణం, వారి చరిత్ర వారి భౌగోళిక విషయాలను ప్రస్తావించి వారిని జాగృతం చేసింది. ఇదే సహజమయిన విధానం కూడా. అసలు సందేశం విశ్వజనీనమైనా దానికి దృష్టాంతాలు, నిదర్శనాలు సంబోధిత ప్రజల అవగాహ నకు, జ్ఞాన పరిధికి చేరువ అయినవే కాగలగాలి. అప్పుడే ఆ సందేశం ప్రజల అంతర్యాల్లో చోటుచేసుకుని వారి ఆచరణకు, మూలం కాగలుగుతుంది. అందువల్ల ఖుర్ఆన్ యొక్క తొలి శ్రోతలకు అపరిచితులయిన దైవ ప్రవక్తలు, దైవ గ్రంథాలను గురించి ఖుర్ఆన్‌లో కానరాదు. కాని సూత్రప్రాయంగా ఓ విషయం

బోధించడం జరిగింది. ప్రతి జాతిలోను వారి వారి భాషల్లో బోధించే దైవ గ్రంథాలు, దైవ ప్రవక్తలు అవతరించారు. మానవ సమాజాన్ని దైవ మార్గ దర్శకత్వం లేకుండా మార్గ విహీనంగా ఎన్నడూ వదలివెయ్యడం జరగలేదు. ఇది మీ ప్రశ్నలో అంతర్లీనమయి ఉన్న ఓ అంశానికి సమాధానం. ఇక శ్రీరాముడు, శ్రీకృష్ణుడు ఇత్యాది మహాపురుషులు ఎవరు? వీరు దైవ ప్రవక్తలా కారా? అన్న దానికి ఇలాంటి మహాపురుషుల జీవితాలను అధ్యయనంచేసి వాటిని దైవదౌత్యపు ప్రమాణాలరీత్యా పరిశీలించి వారు ప్రవక్తలో కారో-రూఢీగా కాక పోయినా ఊహా మాత్రంగానైనా చెప్ప వీలవుతుంది. కాని దురదృష్టమేమంటే ఈ మహాపురుషుల జీవితగాధలను వారి అనుయాయులు చాలా కలుషితం చేసి వేశారు. ఎన్నో మార్పులు చేర్పులు చేశారు. వారి సందేశాల్లో ఎన్నో ప్రక్షిప్తాలు చేశారు. చారిత్రకంగా ఆధారాల్లేకుండా చేసివేశారు. ఆ అనుయాయుల్లోని గొప్పగొప్ప పండితులు, ఋషులు, మహామునులే ఆయా మహాపురుషుల జీవితపు యదార్థాల విషయంలో విభేదించారు, తగాదాలు పడ్డారు, ఘర్షణలు జరిగాయి. అందువల్ల ఆయా మహాపురుషులను గురించి మేము ఇదమిత్థంగా ఏమీ చెప్పలేని స్థితిలో ఉన్నాము. అయినా ఇప్పుడు వారిని గురించి ఓ నిర్ణయానికి రావలసిన అవసరం కూడా లేదు. ప్రపంచ చరిత్రలో, ఏ దేశంలోనయినాసరే ఇలాంటి గొప్పవారు అగుపిస్తే వారిని గొప్పవారుగా గౌరవించడం, వారి బోధనల్లోని మంచిని గుర్తించడం మన నైతిక విధి. వారి జీవితాల్లో దైవప్రబోధనలకు విరుద్ధమైన అంశాలు గోచరించినప్పుడల్లా అవి వారి అనుయాయులు చేసిన ఘన కార్యాలని భావించి వదిలివెయ్యాలి. అయినా నేడు దేవుని అంతిమ గ్రంథం, అంతిమ సందేశహరుడు, ఆదర్శ పురుషుడు ప్రవక్త మహనీయులు (సఅసం) అందజేసిన బోధనలు ఉండగా ఆచరణ కొరకు గత ప్రవక్తలవైపు చూడనవసరం లేదు. మహనీయ ముహమ్మద్ (సఅసం) ఒకసారి అన్నారు. "నేను ప్రభవించిన తరువాత ప్రవక్త మూసా (అస్సలాం) వచ్చినా నా షరీఅత్‌నే పాటించవలసి వుంటుంది'' అని.

(23-11-84)

—: o :—

ఖైరూన్ (విజయవాడ)

**పార్సీలు ఎవరిని దైవంగా భావిస్తారు?**

* పార్సీలు లేక జోరాష్ట్రియన్స్ ఈరాన్‌కు చెందినవారు. ఆర్యులూ అక్కడివారే అన్నదీ నేడు తెలియనివారు లేరు. చివరికి పార్సీ సంస్కృత భాషల్లో గల అనేక పదాలు, ఈ ఉభయ భాషల మూల భాష కూడా ఒకటే అని చాటుతున్నాయి. అలాగే జోరాష్ట్రియన్ మతం లేక పార్సీల మతం కూడా మౌలికంగా ఆర్యుల మతమని చెప్పవచ్చు. కనీసం రెంటికీ దగ్గరి సంబంధం ఉందని అయినా చెప్పవచ్చు. నేడు పార్సీలు కొంత మంది భారత దేశంలో ఉన్నారు. చాలా తక్కువ సంఖ్యలో ఈరాన్‌లో ఉంటున్నారు. వీరి మూల గ్రంథమయిన "అవెస్తా"కు "వేదా" లతో దగ్గరి సంబంధం ఉంది. బహు దైవారాధనను రెండూ ప్రతిపాదిస్తాయి. అనేక దైవాల పేర్లు కూడా ఒకే మాదిరిగా అగుపిస్తాయి. వేదాలలోని 'మిత్ర' అవెస్తాలోని 'మిద్ర', 'అగ్ని పూజా'' (హైందవంలోని హోమం), హోమంలో 'సోమ' ద్రవం అర్పించడం (పార్సీల హోమ ద్రవం) — ఇవి కొన్ని సమానార్థకాలు. అయితే అవెస్తా లోనూ వేదాల్లోనూ కనిపించే వైరుధ్యం ఏమిటంటే 'దేవతలు' అక్కడ (దైవ) దయ్యాలు గాను 'అసురులు' (అహోరులు) 'దేవతలుగాను పరిగణించబడ సాగారు. 'హ' 'స'గా మారడం మనకు తెలిసిందే. 'సింధూ' నదిని వారు 'హిందూ'గా ఉచ్చరించి మన దేశాన్ని హిందూ దేశం (సింధూ నది ఒడ్డున ఉన్న దేశం) అనడం కూడా తెలిసిందే. ఈ పోలికల కారణంగా తెలిసేదేమంటే ఆర్యులు-ఆంత్రోపాలజిస్టులు వీరిని ఇండో ఆర్యన్స్ అనంటారు-జోరాష్ట్రియన్‌లు ఒకే మూలం నుంచి వచ్చినవారు. పార్సీల విశ్వాసాలకు సంబంధించిన వివ రాలు తెలుసుకోవడానికి నేడు జోరాష్టర్ (జరాతుష్ట్రుడు) వ్రాసినవిగా చెప్పబడే మంత్రాలు లేక "గాథ"లు, అవెస్తాలోని అంతర్భాగంగా అగుపిస్తాయి. మంచి చెడు లేక సత్యాసత్యాలు, ధర్మాధర్మాల నిరంతర పోరాటం అన్నది పార్సీల నమ్మకం. రెండు (మంచి - చెడు) శక్తులూ అనాదిగా ఉంటూ వస్తున్నవిగా చెబుతారు. రెండూ సమానమయినప్పుడు "యజ్దాఁ" (మంచికి దేవత) "అహ్రిమన్" (చెడుకు దేవత) ఎక్కణ్ణుంచి వచ్చారు అన్నదానికి బదులు లేదు. ఒకే దైవ భావం అనంటారు. అనేక దేవతలు కూడా ఉన్నాయి. అగ్నిని ఉపా

సించడానికి కారణం, అవి సృష్టికి మూలమవడం అనంటారు. అందువల్ల విశ్వాసాల ఈ గంద్రగోళంలో ఖచ్చితంగా ఫలానా నమ్మకం, ఫలానా ఉపాసనా రీతికి ఆధారం అని చెప్పడానికి వీల్లేదు. పార్సీ మత భావాల్లోను, నమ్మకాల్లోనూ అనేక సంస్కరణలు జరుగుతూ వచ్చాయి. నేడు దేవుని ఏకత్వాన్ని ప్రబోధించడం వారిలో అధికమయింది.

(15-1-88)

—: ০ :—

కె. పిచ్చయ్య (ఎన్. జగన్నాథపురం)

**చచ్చిన దానిని మీరు తినకూడదు. ఇతరులకు దానిని దానముగా ఇవ్వవచ్చును లేదా అన్యునికి దానిని అమ్మవచ్చును (బైబిల్) ద్వితీయోపదేశ కాండం 15వ అధ్యాయం. 21 వచనంలో ఉంది. ఇదెక్కడి న్యాయమండీ మీకు నచ్చనిది మీ సోదరుని కెలా నచ్చుతుంది? చచ్చిన దాన్ని తింటే మీ ఆరోగ్యం చెడిపోతుంది మరి ఇతరులకు ఇవ్వవచ్చా, అతని ఆరోగ్యం చెడిపోదా?**

* మీరన్నట్టు అది 15వ అధ్యాయంలో కాదు 14లో ఉంది. అందులో— ''చచ్చిన దానిని మీరు తినకూడదు''—అన్నదొక్కటే దైవ వచనం లాను, మిగతా అంతా వ్యాఖ్యాతల, యూదు ధర్మవేత్తల కల్పనలాగు అగుపడుతోంది. బైబిల్ లో దైవ సూక్తం, మానవ వచనంతో మిళితమయిపోయిన విషయం జగద్విదితమే. అందులో ఏది దైవ సూక్తమో ఏది వ్యాఖ్యానమో తేల్చి చెప్పడానికి దైవిక గ్రంథాల పరిజ్ఞానం కొంత అవసరం. ఆ జ్ఞాన కాంతిలో చూస్తే కొంతవరకు ఆ వ్యత్యాసం ద్యోతకమవుతుంది. మీరు లేవనెత్తిన ప్రశ్న సహజమయింది, సున్నితమయింది, సమంజసమయింది. బైబిల్ వచనాల్లోని ఆ వైరుధ్యం ఆ నాటి పండితులు తమ పోషకుల సంతోషానికి గాను కల్పించినదే. అసలు విషయం ఏమిటంటే ధర్మసమ్మతం కాని వస్తువు ఇతరులకు సమ్మత మయితే దైవాదేశం ప్రకారం ''ఆక్షేపణీయం'' కాదు. ఉదాహరణకు, పంది నిషిద్ధం. అయితే ఇతరులు దాన్ని తింటే ముస్లిములు ఆక్షేపించరాదు. అలా అని పందుల్ని దానం చెయ్యడమయినా, అమ్మడమయినా ధర్మ సమ్మతం కాజాలదు. ఆక్షేపణీయం

కాదు అన్నదాన్ని దానం చెయ్యడానికి అనుమతిగా, అమ్ముకోవడానికి పర్మిట్‌గా రూపకల్పన చెయ్యడం పండితుల చాతుర్యం. ఆ విధంగా తమకు పనికిరాని దాని ద్వారా ఓ ప్రయోజనాన్ని సృష్టించుకున్నారు వారు.

(15-4-88)

—: ౦ :—

కె. పిచ్చయ్య (ఎన్. జగన్నాథపురం)

**జనములు గొప్ప పర్వతముల మీద నేమి-పచ్చని చెట్ల క్రింద నేమి ఎక్కడైతె తమ దేవతలను పూజించెదరో ఆ స్థలములన్నింటిని మీరు బొత్తిగా పాడుచేయవలెను. వారి బలిపీఠములను పడద్రోసి వారి విగ్రహములను పగులగొట్టి వారి దేవతా స్తంభములను అగ్నితో కాల్చి, వారి దేవతల ప్రతిమలను కూలద్రోసి వాటి పేరు కూడా అచట లేకుండా నశింప చేయవలెను. ద్వితియోప దేశకాండం 12-వ అధ్యాయం. 2-3-వచనం. దీనిపై మీ అభిప్రాయం.**

* నేడు యూదు మతం అనబడేది మౌలికంగా ఇస్లాం ధర్మమే గనుక అందులోనూ ఏకేశ్వరోపాసననే బోధించడం జరిగింది. బహుదైవారాధనను ఖండించడమూ జరిగింది. మీరుదాహరించిన ప్రసంగం, హజ్రత్ మూసా తన అనుయాయులయిన బనీ ఇస్రాయీల్‌ని తీసుకుని పశ్చిమాసియా ప్రాంతాలకు వచ్చి, వారి దైవ ధిక్కార వైఖరివల్ల నలభయి సంవత్సరాలు అనేక కష్టాలనుభవించి చివరికి దైవానుగ్రహం వల్ల పాలస్తీనా ప్రాంతంలోకి ప్రవేశించడానికి జోర్డాను నదిని దాటించక పూర్వం చేసినది. అందులో ఓ ఇస్లామీయ రాజ్యంలో ఇస్లాం సమగ్ర జీవన వ్యవస్థను - పూజా పురస్కారాలు, ఆచార వ్యవహారాలు మొదలుకుని కుటుంబ జీవితం, సామాజిక, ఆర్థిక కార్యకలాపాలు, రాజకీయాలకు-, యుద్ధం సంధికీ సంబంధించిన నియమాలు, శిక్షాస్మృతిని - స్థాపించడానికి కావలసిన ఆదేశాలున్నాయి. బహుదైవారాధకులు యుద్ధంలో పూర్తిగా నిర్మూలన అయిన తరువాత పూజించేవారే లేనటువంటి, ఆ బహుదైవారాధనా చిహ్నాలనన్నింటినీ రూపుమాపాలని బనీ ఇస్రాయీల్‌ని ఆదేశించడం జరిగింది. మీరు ఆ కాండం సాంతం చదివితే, అందులో బనీ ఇస్రాయీల్ హజ్రత్ మూసా (అస్సలామ్) తరువాత ఎన్నెన్ని కీడుల్లో కూరుకుపోతుందో, వాటినుండి ఎలా తప్పించుకోవాలో కూడా భవిష్యద్వాణిగా చెప్పడం జరిగింది. అందులో చెప్పిన విషయాలు పూర్తిగా నిజమయ్యాయనడానికి బనీ ఇస్రాయీల్ చరిత్రే సాక్ష్యం.

(22-4-88)

—: ౦ :—

# 3. మత భావన

షేక్ అబ్దుల్ కరీం (విజయవాడ)

**ఒక మతాధిపతి రాజకీయాలలో ప్రవేశించుట ఇస్లాంలో నిషిద్ధమా? వ్యాపారానికి మతముతో, మతానికి రాజకీయాలతో సంబంధం లేదంటారా?**

* "మతాధిపతి" అన్న పదమే ఇస్లాంకు బహుదూరమయినది. ఇస్లాంలో మతాధిపత్యం (Priesthood) ఎవరికీ లేదు. ఈ సందర్భంలో దివ్య ఖుర్ఆన్ పలికే సూత్రం-మీలో అత్యధికంగా భయభక్తులు కలవాడే దైవం దృష్టిలో గౌరవనీయుడు. ఈ సూత్రానికనుగుణంగా మతాధిపత్యం, రూపురేఖల్లేకుండా పోతుంది. పోతే, రాజకీయాలు, వ్యాపారం మతం ఇత్యాది విషయాలు. వాస్తవానికి ఇస్లాం ఓ సంపూర్ణమయిన సమగ్ర జీవన వ్యవస్థ. అందులో ఆరాధనలు, ఆధ్యాత్మిక సాధనలు, నైతిక నడవడి మొదలుకుని కుటుంబం, సమాజం, ఆర్థిక వ్యవహారాలు, రాజకీయ విషయాలు అన్నీ చేరిఉన్నాయి. ఒక ఉత్తమ ధర్మావలంబీకుడే విశ్వసనీయుడైన వ్యాపారి, కార్యదక్షతగల రాజకీయవేత్త లేక మరే రంగానికి చెందిన వ్యక్తిగాని కాగలడన్నది దాని బోధనల సారం. అందువల్ల ధర్మపరాయణతకు, వ్యాపారానికి, రాజకీయాలకు పరస్పరం సంబంధం లేదన్నది నిరాధారం. అసలు జీవితమే ఓ సమగ్రమయిన వ్యవస్థ. అందులో విభాగాలు పంచి మనిషిని వ్యక్తిగతంగా ఒక రూపంలోను, సాముహికంగా మరో రూపంలోను, చూడటమే నిర్హేతుకం. అందువల్ల పైన పేర్కొన్న జీవన రంగాలన్నీ వేర్వేరనడం, మతం వాటిలో కాలు దూర్చడం తప్పనడం కూడా నిర్హేతుకమే.

(9-9-83)

—:o:—

## షేక్ సలీం (ఏలూరు)

**ఈ అహ్మదీయులు ఎవరు ?**

* ఈ శతాబ్దం ప్రారంభంలో పంజాబ్‌లోని కాదియాన్ అనే పట్టణంలో గులాం అహ్మద్ అనే వ్యక్తి తాను దైవ ప్రవక్తనని ప్రకటించాడు. ముస్లిములలో చీలిక తేవడానికి, 18 వందల ఏళ్ళ నుండి ఎలాంటి మార్పు చేర్పులు లేకుండా వస్తున్న ముస్లిముల విశ్వాసాల్లో అనుమానాలను రేకెత్తించడానికి వైర శక్తుల ద్వారా నిలపబడిన వ్యక్తి అతను. దివ్య ఖుర్‌ఆన్ మరియు హదీసుల ప్రకారం మహనీయ ముహమ్మద్ (సఅసం) దేవుని చివరి ప్రవక్త. ఆయన తరువాత ప్రవక్త ప్రభవించే ప్రసక్తే లేదు. ఒక ఉన్మత్తుడు లేచి నేను ప్రవక్తనని అంటే ప్రజలు ఎలా నమ్ముతారు? అయినా విశ్వాస బలహీనత గలవారు, విషయలోలత్వానికి గురయినవారు అతన్ని అనుసరించారు. వారిని కాదియానీలని, అహ్మదీలని అంటారు. వారు ఇస్లామీయ విశ్వాసాంగాల్లో ముఖ్యమయిన దైవదౌత్యం పట్ల విశ్వాసాన్ని మార్చి వేసినందువల్ల వారు ముస్లిములు కారని ప్రపంచ ముస్లిములు, ఉలమా, అంతర్జాతీయ సంస్థలు ముక్త కంఠంతో ఘోషించాయి. వారు, తాము నిజమైన ముస్లిములమేనని, దివ్య ఖుర్‌ఆన్‌ని దైవ గ్రంథంగా విశ్వసిస్తామని, ముహమ్మద్‌ను దైవ ప్రవక్తగా నమ్ముతామని అంటారు. అది చూచి అనేక మంది నమ్మేస్తారు. వారి వలలో పడి తమ ధర్మానికి దూరమవుతారు. ఇహపరలోకాల్లో అపార నష్టాలకు పరాజయం, పరాభవాలకు గురవుతారు. ఈ మధ్యనే మన రాష్ట్రంలోనూ తమకు తెలిసిన సకల ఉపాయాల నుపయోగించి ప్రజల విశ్వాసాలను భ్రష్టం చేస్తున్నారని వార్తలు వచ్చాయి. ముస్లిములు మెలకువతో వ్యవహరించవలసి ఉంటుంది.

(8-6-84)

—: o :—

ముహమ్మద్ జానిమియా (గోదావరిఖని)

**మనిషి ఒకరిని యాచించకూడదని మహా ప్రవక్త (సఅసం) గారు తెలిపినట్లు ఎన్నో హదీసు గ్రంథాల ద్వారా తెలుస్తుంది కదా! మరి ఈ ఫకీరువాళ్ళు అడుక్కుతినడమే ఒక వృత్తిగా తీసుకున్నారు?**

* "క్రింది చెయ్యికంటే పై చెయ్యి ఉత్తమమయింది". అంటే పుచ్చుకునే వానికంటే ఇచ్చేవానిదే ఘనత అని మహాప్రవక్త సూక్తుల్లో ఒకటి. "పృచ్ఛకునికి" (అడిగేవానికి) వట్టి చేతులతో పంపకండి అని అటు దాతలకు బోధన. అయితే కొందరు యాచించడమే వృత్తిగా పెట్టుకోవడం దైవప్రవక్త ఆదేశాలకు, బోధనలకు పూర్తిగా విరుద్ధమయిన విషయం. కాయకష్టం ద్వారా జీవనభృతి ఆర్జించేవానికి దైవసందేశహరులు (సఅసం) స్వర్గప్రాప్తి గురించి హామీ నిచ్చారు. ఇస్లాంలో యాచకవృత్తి అన్నది నిషిద్ధం. మనిషి తనకు లేనప్పుడు, ఒకానొక అవస్థలో తాను ఏ పనీ చేసుకుని బ్రతకలేని సందర్భం కలిగితే, ఆత్మాభిమానం చంపుకుని అడగటం తప్ప గత్యంతరంలేదని అనిపిస్తే అడగవచ్చు. అలాంటి వ్యక్తికి ఇవ్వడం కూడా గొప్ప పుణ్యకార్యమే. ఫకీరుల ఓ తెగ ఏర్పడి యాచక "వృత్తి"ని చేబట్టి అదే జీవనాధారంగా బ్రతకడం క్షమించరాని నేరం. అలాంటివారిని సామాజిక ఒత్తిడి తెచ్చి ఏవయినా పనుల్లో నిమగ్నులు చెయ్యడం ఉన్నత సత్కార్యం. వారికి అసలు విషయం బోధపరచి అందరి సహాయంతో ఏదయినా బ్రతుకుతెరువు కల్పించగలిగితే అది సమాజానికే మహోపకారమవుతుంది. ఒకసారి ఓ వ్యక్తి వచ్చి దైవప్రవక్త (సఅసం) వద్ద ఏదో యాచించాడు. ఆయన అతని వద్ద ఉన్న ఒకే ఒక "ఆస్తి" అతని కంబళిని బజారులో అమ్మించి దానిద్వారా ఓ గొడ్డలి కొనిపెట్టారు. అది తీసుకు వెళ్ళి కట్టెలు కొట్టుకురమ్మని, అవి అమ్ముకుని ఉపాధి సంపాయించుకోమని బోధించారు. ఆ వ్యక్తి అలాచేసి యాచకవృత్తి నుండి బయటపడ్డాడు. గౌరవప్రదంగా జీవితం సాగదీశాడు. ఈ పద్ధతినే మనం కూడా అవలంబించాలి. ప్రజల్లో ఆత్మగౌరవం, ఆత్మాభిమానం లాంటి ఉన్నతమయిన విలువల్ని పెంపొందింపజెయ్యాలి. ఇక "ఫకీరు" తెగ ఎలా వచ్చిందంటారా? చెప్పుకుంటే ప్రతి దానికి నీ సమాధానం ఇలాగే ఉంటుందేమని విస్తుపోతారు మన ప్రజలు. కాని ఇది వాస్తవం. మనదేశంలో సన్యాసుల్ని, బైరాగుల్ని, దాసరుల్ని చూసి

ముస్లింలు కూడా ఇలాంటి ఓ తెగ తమ వద్ద ఉండాలన్న తీర్పుకు వచ్చారు. ఇస్లాం, ఈరాన్ భారతదేశాల సంపర్కం పొందినప్పుడు బౌద్ధభిక్షువుల ప్రభావం వల్ల ఉనికిలోకి వచ్చిన సూఫీ మహనీయులతోపాటు ఇలాంటి లక్షణాలు కూడా ధార్మికమయినవిగానే క్రమంగా సమాజంలో గుర్తింపు పొందాయి. ముందు నుంచి ప్రజలు వీటికి అలవాటుపడ్డవారే గనక ఈ ప్రాంతాల్లో ఈ ఫకీరులు వృద్ధివికాసాలు పొందారు.

(31-8-84)

—: o :—

షేక్ జహీర్ అహ్మద్ (వినుకొండ)

**కొంత మంది రోజుకు 5 సార్లు నమాజ్ చేస్తూ అక్రమ వ్యాపారాలు, హరామ్ పనులు చేస్తున్నారు. మరి వారి నమాజ్ దైవ సమక్షంలో అంగీకరించబడుతుందా ?**

* మహా ప్రవక్త (సఅసం) తెలిపారు : హరామ్ (అధర్మ సంపాదన) ఆహారం తిని, హరాం దుస్తులు ధరించి చేసేవారి ఆరాధనలు స్వీకరించబడవు అని. ఆరాధనలు చేస్తూ మనుషులు అధర్మ కార్యక్రమాలకు పాల్పడడానికి కారణం వారి సంకుచిత మత భావనే అన్నది వేరే చెప్పనక్కరలేదు. దేవుడు తన దాసుల ఆరాధనలనందుకుని వారు కోరే గొంతెమ్మ కోరికల్ని పూర్తి చేసే వాడు అన్న దౌర్భాగ్యపు నమ్మకమున్నప్పుడు, కాపీకొట్టి పరీక్ష వ్రాసి పాసు చేయించాలని స్వాములవారిని మొక్కుకునే మూర్ఖ సంస్కృతి మధ్య నలుగుతున్నప్పుడు, లంచమిచ్చి ఉద్యోగం సంపాయించి అన్ని ఘట్టాలూ "సవ్యంగా సాగనిచ్చినందుకు" తలనీలాలు సమర్పించుకునే మూఢ విశ్వాసంతో కొట్టుమిట్టాడుతున్నప్పుడు, దౌర్జన్యంతో కొల్లగొట్టిన ఆస్తుల్ని దక్కించుకునేందుకు కోర్టులమధ్య తిరుగుతూ "మీరే రక్ష" అని అయ్యవార్ల ద్వారా మంత్రతంత్రాల పకడ్బందీ చేయించుకునే అసహ్యపు సమాజం నడుమ జీవిస్తున్నప్పుడు, "మతం" మనిషిచేసే అధర్మ కార్యకలాపాలన్నిటికీ యోగ్యతాపత్రం ప్రసాదిస్తున్న మద నష్టపు కాలంలో జీవిస్తూ ఇస్లాంను అలాంటి మతంగాకాక, ఒక ధర్మంగా, జీవన

వ్యవస్థగా, జీవన విధానంగా, పాటించవలసిన ముస్లిములు మీరన్నట్టు కాక మరెలా బ్రతుకువెళ్ళదీస్తారు?

(12-10-84)

—: ο :—

ఎం. డి. ఉస్మాన్ (రేపల్లె)

**ధర్మానుసరణ వేరు, రాజకీయాలు వేరు అని కొందరు వాదిస్తుంటారు. దీనిపై మీ అభిప్రాయం?**

* జీవితంలో అడుగడుగునా ఎన్నో విభాగాలే ఎదురవుతాయి. ప్రొద్దున లేచినప్పటినుంచి పరిశీలించడం మొదలెడితే సాయంత్రం వరకు కనీసం ఓ డజను విభాగాల్లో మనిషి కాలిడతాడు. వ్యక్తిగత రంగం, కుటుంబ రంగం గృహస్త రంగం, బజారు—వాణిజ్యరంగం, సామాజిక రంగం, సేవారంగం, సంపాదనారంగం, వ్యవసాయరంగం, న్యాయరంగం, పరిపాలనారంగం, రాజకీయరంగం ఇత్యాదివి. వీటిని ఇంకా క్షుణ్ణంగా పరిశీలిస్తే ఎన్నో ఉప విభాగాలు కూడా గోచరిస్తాయి. వీటన్నింటిపై మరో రంగం సర్వవ్యాపకంగా అంతర్లీనంగా ఉంటుంది. అదే నైతికరంగం. మనిషి జీవితం సాఫీగా, శాంతంగా క్రమబద్ధంగా నడవాలంటే అతను ఈ విభిన్న రంగాల్లో, విభాగాల్లో ఒకే విధమయిన నీతిని, నైతిక ప్రమాణాలను అవలంబించాలి. అలా కాక అతను విభిన్న రంగాల్లో విభిన్న నీతుల్ని, నైతిక ప్రమాణాలను అవలంబిస్తే జీవితంలో శాంతి, సమగ్రత, సామరస్యం కుదరకపోవడం అలా ఉంచి అది చుక్కాని లేని నావగా, గమ్యం తెలీని ప్రయాణంలా కొనసాగుతుంది. వ్యక్తిగత విషయాల్లో ఒక విధానాన్ని అనుసరించి తన సాంసారిక జీవితంలో దానికి భిన్నమయిన విధానాన్ని అవలంబిస్తే అతని జీవితం ఏ విధంగా రూపొందుతుందో వూహించుకోండి. అలాగే అతను తన కుటుంబ విషయాల్లో పాటించే నీతిని సామాజిక వ్యవహారాల్లో మార్చివేస్తే అతను సమాజంలో తలెత్తుకు తిరగగలడా? అలాగే ప్రతి రంగంలోనూ వూహించుకోండి. దీన్నిబట్టి తేలేదేమంటే మనిషి జీవితానికి దిశను, గమ్యాన్నీ ప్రసాదించే ఓ నైతిక వ్యవస్థ అవసరం. అది అన్ని రంగాల్లోనూ మార్గదర్శకత్వం వహించగలగాలి. మనిషి ఆధ్యాత్మిక జీవితం మొదలుకుని రాజకీయ రంగాలు అన్నీ ఆ మార్గదర్శకత్వానికి

లోనయ్యే సాగాలి. ఈ విషయాన్నే—ఆధ్యాత్మిక, రాజకీయ తదితర రంగాలు వేరయినా అవన్నీ ఒకే మార్గదర్శకత్వం—దైవ మార్గదర్శకత్వం—ద్వారా వెలుగును పొందాలి—అని అంటారు. ధార్మిక జీవితం ఓ నియమం ప్రకారం మున్నూ రాజకీయం ఇంకా ఇతరత్రా ప్రాపంచిక జీవితం వేరే నియమాల ఆధారంగానూ జరగరాదని అంటారు. ఇలా వేర్వేరు నీతుల్ని మనిషి తన జీవితంలో ప్రవేశ పెట్టడం మూలానే అనేక చిక్కులు ఎదురవుతున్నాయని, సామూహిక రంగంలోనూ ఈ దృక్పథమే అసంఖ్యాక సమస్యలకు భూమిక ప్రసాదించిందని పలువురు ప్రముఖులు అభిప్రాయపడుతున్నారు. ఈ సత్యాన్నే ఇస్లాం ఎలుగెత్తి చాటుతుంది. జీవితం అవిభాజ్యమయిన ఏకాంకం. దానికి సమగ్రమయిన ఓ విధానం ఉంటేనే అది సజావుగా సాగుతుంది. ఆ మార్గం లేక ఆ జీవన వ్యవస్థయే ఇస్లాం.

(20-9-85)

—: o :—

**ముహమ్మద్ గులాం దస్తగీర్ (హనుమకొండ)**

**ధ్యానము (Meditation) గూర్చి ఇస్లాం ఏమంటుంది ?**

* మనిషిని క్రియాజీవితం నుండి దూరం చేసే ఎలాంటి ప్రక్రియనయినా ఇస్లాం త్రోసిపుచ్చుతుంది. దైవ ధ్యానంలో ఏకాగ్రతను సాధించడానికి అర్ధరాత్రి గడచిన తరువాత, రాత్రి చివరి జాముల్లో గ్రంథ పఠనాన్ని, దైవారాధన (తహజ్జుద్ నమాజ్) ను ఇస్లాం ప్రతిపాదిస్తుంది. ఆ ప్రశాంత వాతావరణంలో ఎవరికీ కనబడకుండా కేవలం తన స్వామి సాన్నిధ్యమే తనకు శరణ్యం అని చేసే ఆరాధన అతనిలో, దైవ చింతనను, దైవసామీప్య భావనను ఇతోధికంగా పెంపొందిస్తుంది. మనిషి మత భావన ప్రవాహంలో పడి కొట్టుకుపోయి ఏ ఆధ్యాత్మిక సముద్రంలోనో లీనమవడం అన్నది ఇస్లాం దృక్పథం కాదు. మనిషి ఈ ప్రపంచంలోని సకల భాగ్యాలను సరయిన హద్దుల్లో అనుభవిస్తూ దైవ సామీప్య భావనలో జీవించడమే పరమార్థం అంటుంది ఇస్లాం. అందుకు ఎలాంటి కృత్రిమ ప్రక్రియల ద్వారానయినా ఏకాగ్రతను, దైవసామీప్య భావనను సాధించడాన్ని అంతగా ప్రోత్సహించదు. ఇస్లామీయ పరిధికి ఎలాంటి భంగం వాటిల్ల

కుండా ఎన్ని విద్యలు నేర్చినా, ఎన్ని సాధనలు చేసినా, ప్రయోగాలు చేసే, అనుభవాలు గడించే ఆ స్వాతంత్ర్యం మనిషికి ఉండాలని కూడా అభిలషిస్తుంది ఇస్లాం

(8-3-85)

—: o :—

పి. ఖాదర్ బాషా (దౌలతాబాద్)

**నా స్నేహితుడు హిందువు. ప్రతివారము అతడు పూజచేసి ప్రసాదాన్ని యివ్వబోతాడు, నేను తిరస్కరించలేక, తినలేక ఏమియు అనలేక పోతున్నాను.**

* పూజలు, పురస్కారాలు చేసేవారంటే వారు నిజంగానే తమ మతావలంబనలో నిష్ఠగలవారని బోధపడుతుంది. అలాంటివారు ఇతర మతాల వారి బోధనల్ని సిద్ధాంతాలను గౌరవిస్తారు. మీరు స్పష్టంగా చెప్పవచ్చు—ఇస్లాం విగ్రహారాదనను, అల్లాహ్ తప్ప ఇతర దేవతలకు సమర్పించే నైవేద్యాలను సమ్మతించదని, మీరు అలాంటి తినుబండారాలనయినా మరే వస్తువునయినా ధార్మికంగా స్వీకరించలేనని, అలాకాక పండగలకు ఇతర శుభకార్యాలకు సాధారణంగా పెట్టే భోజనాలయినా మరే నిషిద్ధంకాని (హలాల్) పదార్థాలనైనా స్వీకరించడానికి జంకనని కూడా మీరు స్పష్టం చెయ్యాలి. మీ పరిస్థితిని మీ మిత్రులు సహృదయంతో అర్థం చేసుకుని తదనుగుణంగా ఆచరించగలరని ఆశిస్తున్నాం. ముస్లింలు ఇక్కడున్నారేకాని, తమ విశ్వాసాలేమిటో, తమ సిద్ధాంతాలేమిటో; తమ ఆచార వ్యవహారాలేమిటో తోటి సోదరులకు తెలియజెప్పడంలో ఘోరంగ విఫలులయ్యారు. అలాగే తోటి సోదరులను గురించి అర్థం చేసుకోవడంలో కూడా ముందుకు రాలేదు. ఈ అఖాతం పూడనంత కాలం ఇలాంటి సమస్యలు తప్పవు మరి.

(18-10-85)

—: o :—

కరీముల్లాబేగ్ (కోవూరివారిపాలెం)

**మానవుడు అపవిత్రుడు కనుక మన ప్రార్థన అల్లాహ్ మన్నిస్తాడో లేడో దేవుని మనిషి అయిన "వలి"ని ప్రార్థిస్తే ఆయన ప్రార్థన దేవుడు మన్నిస్తాడు అని అంటున్నారు.**

* మానవుడు అపవిత్రుడు అన్నదే అసలు తప్పుడు భావన. మానవుడు పాప పంకిలంలో నుండి పుట్టాడు అన్నది పాశ్చాత్య క్రైస్తవ భావన. అందువల్లనే ఆ మతంలో ప్రతిసృష్టి క్రియ (లైంగిక చర్య) పాపభూయిష్టమయింది. కాని ఆ మతంలో నుండి పుట్టుకువచ్చిన పాశ్చాత్య సంస్కృతి ఆ పాపపు రొంపులోనే కొట్టుమిట్టాడుతోంది. ఇంతకు ఇస్లాం ప్రకారం మానవుడు దేవుని అత్యుత్తమ సృష్టి. భువిపై దేవుని ప్రతినిధి ఈ మానవుడు. ఇలాంటి మానవుని ప్రార్థన వినకపోతాడా దేవుడు. కాదు—నేను మీ బృహద్ధమనికన్నా మీతో సన్నిహితంగా ఉన్నాను అంటున్నాడాయన. పిలువండి బదులిస్తాను అని వివరిస్తున్నాడు. తన ప్రతినిధిని వినకపోతే మరెవరిని వింటాడు? మీరుదాహరించినటువంటి తప్పుడు మత భావనల కారణంగానే నేటి హేతువాది మతానికి అతీతుడయి జీవించాలని కోరుకుంటున్నాడు. నిజానికి దైవ ధర్మమయిన ఇస్లాంకు మించిన హేతువాదం మరెక్కడా లేదని చెప్పవచ్చు. దివ్య ఖుర్‌ఆన్ పలుపర్యాయాలు తన పఠితలకు పిలుపునిచ్చింది. మీరు తర్కించరా? ఆలోచించరా? చింతన చెయ్యరా? అని. జగత్తులో అత్యంత అల్ప జీవి అయిన మనిషి నిర్మాణం మొదలుకొని విశ్వమహారచనలోని ఆంతర్యాలను కనుగొనడంలో మీ బుద్ధీ వివేకాలను, వివేచనా శక్తిని వినియోగించండి అని కోరుతుంది దివ్య ఖుర్‌ఆన్. అందువల్ల దివ్య ఖుర్‌ఆన్ అధ్యయనాన్ని, ధార్మిక గ్రంథపఠనాన్ని నిత్యం దిన చర్యగా చేసుకోవాలి. అప్పుడే ఎవరయినా మార్గభ్రష్టుడు మిమ్మల్ని మార్గం తప్పించేందుకు ప్రయత్నిస్తే అతని కృషినంతా వమ్ము చెయ్యగలుగుతారు.

(25-10-85)

—: o :—

మహమ్మద్ యూసుఫ్ జాన్ (తుని)

**హిందూ సోదరులు అంటారు "ప్రపంచములో మొట్ట మొదట హిందూ మతం పుట్టింది. తదుపరి బౌద్ధమతం, తదుపరి క్రైస్తవమతం చిట్టచివరకు ఇస్లాం మతం" అని. ఇది ఎంతవరకు వాస్తవమో?**

* ప్రపంచంలో మనిషి కాలిడిన నాటినుండి కూడా దైవంవద్ద గుర్తింపు పొందిన ధర్మం ఒక్కటే. అదే, దైవానికి స్వయం సమర్పణ, దైవ విధేయత, దైవ మార్గదర్శకత్వానికి సంబంధించిన ధర్మం. మానవ సమాజం అంటూ ఉన్న చోటల్లా దేవుని ఈ ధర్మాన్ని ప్రబోధించడానికి ఆయన సందేశహరులు వచ్చారు. ఈ ధర్మాన్ని వారు ప్రబోధించడమే కాదు, దైవ మార్గదర్శకత్వాన్ని తెలిపే ఆయన ఆదేశాలను, సూచనలను అందజేసి మరీ వెళ్ళారు. అన్ని కాలాల్లోనూ, అన్ని దేశాల్లోనూ ఈ దైవ సందేశహరులు లేక దైవప్రవక్తలు ఆవిర్భవించారు. వారు అందజేసిన ఆ ఒకే ధర్మాన్ని ఆయా భాషల్లో, ఆయా దేశాల్లో ఏమని పిలిచినా అసలు మౌలిక ధర్మం మటుకు సదా ఒక్కటే – అదే దైవ విధేయతా మార్గం – లేక ఇస్లాం. అందువల్ల అత్యంత సనాతన ధర్మం, ఏకైక ధర్మం ఇస్లాం ఒక్కటే. దానికి మార్పులు చేర్పులు చేసి మానవులు ఏవేవో పేర్లు పెట్టుకున్నారు. అసలు ధర్మం మాత్రం ఒకటే. అందువల్ల ఏది ముందు, ఏది వెనక అనే ప్రశ్న తలెత్తదు. అయితే ఏ ప్రవక్త ఎప్పుడు వచ్చారు అన్న అంశం మటుకు కాలానుగుణంగా తేల్చి చెప్పవచ్చు. కొందరు ప్రవక్తలు దైవ గ్రంథంలో పేర్కొనబడ్డారు, కాని అత్యధిక సంఖ్యలో ఇంకా మనకు తెలీనివారే ఉన్నారు. ఏ ప్రవక్త ఎప్పుడు వచ్చినా, బోధించిన ధర్మం ఒక్కటే గనుక పెద్ద వ్యత్యాసం ఏర్పడదు. కాని చివరి ప్రవక్తగా ముహమ్మద్ (సఅసం)ను అంగీకరిస్తే ఆయన తెచ్చిన సందేశాన్ని దైవ మార్గదర్శకత్వానికి అంతిమ రూపంగా మనం భావిస్తే ఇక దాన్ని స్వీకరించి, నమ్మి, దాని ప్రకారమే ఆచరించడం తప్ప గత్యంతరం ఉండదు.

(4-9-87)

—:०:—

## ఎం. డి. అఫ్జల్ ఖాన్ (కాశీర్‌పేట)

**మతాలు ప్రజలకి ఏ విధంగా మంచిని లేక చెడును కలుగచేస్తాయి? మతకల్లోలాలకి ముఖ్య కారణం ఏమిటి? మతాలు ప్రజలకి ఉదోప్పదించేది ఏమిటి?**

* ముందు, మీ ప్రశ్నలోని మధ్యనున్న అంశాన్ని చూడండి. 'మత కల్లోలం' అన్న సమాసంలో 'మతం' అన్న పదం ప్రయోగించడం అర్థ రహితం. 'కల్లోలం' అనే చెడుగును మతానికి అంటగట్టడానికి గాను 'మతం' అంటే గిట్టనివారు దుర్బుద్ధితో చేసిన సమాసమిది. అయితే మనదేశంలో విభిన్న మత వర్గాల, కుల వర్గాల మధ్య జరిగే కలహాలకు ఇది స్థిరపడిపోయిన మాట కాబట్టి మీరున్నూ నేనున్నూ వాడటం తప్పడం లేదు - అందరికీ అర్థం కావడానికి. ఇక వీటికి కారణమంటారా? ఒకటి కాదు ఎన్నో ఉన్నాయి. ప్రతి రాజకీయ పార్టీ, ప్రతి ఆలోచనాపరుడు, ప్రతి బుద్ధిజీవి తనకు తోచిన రీతిలో వాటిని విశ్లేషించి చెబుతూ ఉంటాడు. నా ప్రకారం, విద్వేష ప్రచారం, అపోహలు, అపార్థాల ప్రచారం, వదంతుల వ్యాప్తి, గత చరిత్రకు వక్ర భాష్యాలు - ఇవన్నీ ఒకటయి కలతల్ని, కలహాన్ని, కల్లోలాలను సృష్టిస్తాయి. ఈ చెడులను వ్యాపింపచేసే వారు - వారేవర్గానికి చెందినవారయినాసరే - వారే ప్రజా ద్రోహులు ఇంకా దేశ ద్రోహులున్నూ. ఏ మతమూ ఈ విద్వేషాన్ని, వైషమ్యాన్ని, దుష్ప్రచారాన్ని ప్రోత్సహించదు. ఒకవేళ ఏ మతమయినా వీటికి ఊతం ఇచ్చినట్లయితే అది కలుగజేసే చెడు విదితమవుతూనే ఉంది. అయితే ఆ తరువాత అది మతంగా మనజాలదు. మతం అన్నది మనిషిని మానవునిగా మలిచే సాధనం, మనిషిలో మంచిని పెంచి చెడును నిర్మూలించే ఆయుధం, మనుషుల్లో ప్రేమను సృజించి ద్వేషాన్ని అంత మొందించే అద్భుత శక్తి. ఇవన్నీ మంచి ప్రేరకాలు కావా? మతం మంచిని తప్ప మరి దేన్నీ పంచిపెట్టదు. దానివల్ల చెడు కలగటమన్న ప్రశ్నే తలెత్తదు.

(27-5-88)

—: ౦ :—

దాదాఖాన్ (పెదకూరపాడు)

**భౌతికవాదం అంటే ఏమిటి? ఆధ్యాత్మికవాదం అంటే ఏమిటి? రెండింటికి తేడా ఏమిటి?**

* భౌతికవాదం అంటే ఉన్నదంతా ఈ ప్రపంచమే అని, దీన్ని సృష్టించిన అగోచర శక్తి ఏదీలేదని, అది ఉన్నా మానవ జీవితంతో దానికి ఏ విధమయిన సంబంధం లేదని అందువల్ల మనిషి తనకు ఇష్టమయిన రీతిలో సంచరించ వచ్చని, నాగరిక జీవితం గడపడానికి నీతి నియమాలు, న్యాయాన్యాయాలు, ధర్మాధర్మాలు మనిషి స్వయంగా నిర్ణయించుకో వచ్చని, ఏ మానవాతీత శక్తికి, ఏ దైవానికి భయపడవలసిన అవసరంలేదని, మనిషి తన కార్యకలాపాల కైగాను ఏ ఆధ్యాత్మిక మార్గదర్శకత్వానికీ, ఏ అతీతశక్తికీ లొంగి నడచుకోవలసిన పని లేదని చాటిచెప్పే సిద్ధాంతం. దీనికి పూర్తిగా భిన్నమయిన రీతిలో ఏ ప్రాపంచిక వ్యవహారంతో సంబంధం లేకుండా, శరీరమంటేనే ఓ బందీఖానాలా భావించి దాన్నుండి విమోచనం పొందడమే మానవ జీవిత పరమార్థమని, మనిషి భవబంధాలకు ఎంత దూరంగా ఉంటే అంతే ఉన్నతమయిన ఆధ్యాత్మిక సోపానాలు అధిరోహించగలడని బోధించే విధానం ఆధ్యాత్మిక వాదన. ఇవి రెండూ రెండు అతివాదాలు. ఇస్లాం ఈ రెంటికీ మధ్యన మధ్యేమార్గాన్ని అవలం బించాలంటుంది. ప్రాపంచిక కార్యకలాపాలన్నీ నైతిక, ఆధ్యాత్మిక సిద్ధాంతాల పరిధుల్లో కొనసాగినప్పుడే జీవిత పరమార్థం సిద్ధిస్తుందని, దానంతటికీ దైవ మార్గదర్శకత్వం అవసరమని, ఆ మార్గదర్శకత్వమే దైవ ధర్మమని అంటుంది ఇస్లాం. భౌతిక, ఆధ్యాత్మిక వాదాల మేలుకలయికే ఇస్లాం! తద్వారానే మనిషికి ప్రపంచంలో శాంతి సామరస్యాలు, పరలోకంలో సాఫల్యం ప్రాప్త మవుతాయి!!

(3-6-1988)

—: o :—

# 4. ఆరాధన

ఎం. ఎం. కమల్‌బాష (గుంటూరు)

**లోక వ్యవహారములను గూర్చి మస్జిద్‌లలో సంభాషణ చేయరా దంటారు. కొందరు ఆకలిగొన్నామని, చార్జీలకు డబ్బులు లేవని మస్జిదుల్లో అడగవచ్చునా?**

* మస్జిదుల్లో ఏ విధమయిన శబ్దం చెయ్యడమయినా, క్రయ విక్రయాలు చెయ్యడమయినా, దాని గురించి మాట్లాడటమైనా తగదు. ముస్లిం సమాజానికి సంబంధించిన విషయాల చర్చలు, పెళ్ళిళ్ళు, కుటుంబతగాదాల తీర్పులు, ప్రయోజనకరమయిన సామాజిక కార్యకలాపాలు మస్జిదుల్లో జరపవచ్చు. మహా ప్రవక్త (సఅసం) కాలంలో అలా జరిగేదని హదీసులద్వారా ద్యోతకమవు తోంది. ఇస్లాం కేవలం ఆధ్యాత్మిక విషయాలనే బోధించదు, సామాజిక వ్యవ హారాలను, సామూహిక సమస్యలను సయితం చర్చిస్తుంది అన్న విషయం గుర్తుంచుకోవాలి. ముస్లిం సమాజంలోని వ్యక్తులు రోజుకు ఐదుసార్లు కలుసుకునే చోటు మస్జిదు. అక్కడ ముస్లిములు తమ సామాజిక సమస్యల్ని చర్చించు కోవడం సహజం, సమంజసం కూడాను. బాటసారులు తమకు అర్థాంతరంగా ఏదయినా అవసరం కలిగితే అక్కడ చెప్పుకోవడంలో తప్పులేదు. అయితే వృత్తిగా భిక్షాటన చేసేవారినుండి మాత్రం సమాజాన్ని రక్షించాలి. ఆ అడగటం లోనూ సౌమ్యత, వినమ్రత ఉండాలి. బిగ్గరగా అరవరాదు. ఒకరిద్దరు కలసిన వారితో తమ అవసరాన్ని చెప్పుకుని దాన్ని పూర్తిచేసుకునేందుకు ప్రయత్నించ వచ్చు.

(16-3-84)

—: ౦ :—

సయ్యద్ బాజీద్ (ఒమ్మంగి)

**ఖుర్బానీ ఇచ్చే మేకపోతుకు ఒక వీర్యము వున్నది అది ఖుర్బానీ చేయవచ్చునా?**

* ఖుర్బానీ ఇచ్చే పశువు ఎలాంటి అంగ వైకల్యం ఉన్నదీ కారాదు. సాధారణంగా ఏ అంగవైకల్యం కారణంగా ఆ పశువు ధర తగ్గిపోతుందో అలాంటిది ఉండరాదు. చూడటానికి వికారంగా అగుపించే అంగవైకల్యం కూడా ఉండరాదు. మీరు ప్రస్తావించిన అంగవైకల్యం వల్ల అది లోపభూయిష్టమయిన పశువుగానే పరిగణించబడుతుంది. ఆ లోపం పుట్టుకతో వచ్చి దాన్ని ఖుర్బానీ చేసే వ్యక్తి బీదవాడయి ఉన్నట్లయితే దాన్నే ఖుర్బానీ ఇవ్వవచ్చు. మరో పశువును కొనగల స్తోమత గల వ్యక్తి అయితే మరో దాన్ని కొని ఇవ్వడం ఉత్తమం. అయినప్పటికీ ఒకటి గుర్తుంచుకోవాలి. ఖుర్బానీలో ముఖ్యమైన విషయం పశువు దాని రూపు రేఖలు, మాంసం కాదు. మనిషి దైవమార్గంలో తనకు ప్రియమైన దాన్ని, దేన్నయినాసరే, ధారపోయడానికి సిద్ధంగా ఉన్నాడా? అన్న విషయం మాత్రమే. దీన్ని దృష్టిలో ఉంచుకుని గమనించండి లోప భూయిష్టమైంది, అంగవికారమైంది, అంగ వైకల్యంగలది ఖుర్బానీ చెయ్యడానికి తగిన పశువు కాగలదా? ఒక్క ఖుర్బానీయే కాదు దైవ మార్గంలో ఇవ్వబడే ధనధాన్యాదులు, వస్త్రాలు, వస్తువాహనాలు, మరే పదార్థమయినా సరే అది ఎలాంటి లోపం లేనిదే అయి ఉండటం మంచి పుణ్య ఫలాన్ని ప్రసాదించగలదు.

(19-10-84)

—: o :—

ఎం.ఎ. ఖదీర్ (ఇల్లందు)

Nail Polish **ఉంటే నమాజు చేయవచ్చా?**

* Nail Polish గోళ్ళపై ఓ గట్టి పొరగా ఏర్పడుతుంది. వుజూ చేసుకున్న తరువాత నెయిల్ పాలిష్ వేసుకుంటే నమాజ్ అవడంలో ఎలాంటి అవాంతర ముండదని నేను భావిస్తాను. అయితే మరోసారి వుజూ చెయ్యావలసినప్పుడు ఆ నెయిల్ పాలిష్‌ని శుభ్రంగా తుడిచి మరీ వుజూ చెయ్యావలసి ఉంటుంది.

పోతే నెయిల్‌పాలిష్, లిప్‌స్టిక్‌లలో ఉపయోగించే పదార్థాలల్లో పంది క్రొవ్వు కూడా ఒకటని ప్రతీతి. అది నిజమో కాదో తేలకపోయినా అదేమంత అత్యవసర వస్తువని దాన్ని వినియోగించడానికి? దానికి బదులుగా గోరింటాకు హాయిగా వాడుకోవచ్చు. వుజూ చెయ్యడంలోనూ ఎలాంటి అవాంతరం లేదు. ఎందుకంటే దాని రంగు గోటిలో భాగమయిపోతుంది. సహజమయిన అలంకరణోపకరణాలను వదలుకుంటే ఎన్నో బాధలు!

(28-12-84)

—: o :—

యం. డి. ముష్తాఖ్ (మండపేట)

**పవిత్ర ఖురాన్ ప్రశాంతంగా మెల్లిగా చదవాలికదా మరి రమజాన్‌లో మన హాఫిజులు తమిళనాడు ఎక్స్‌ప్రెస్‌లా పోతున్నారు...**

* పుణ్యం అన్నది పదాల్లోనే ఉందని భావించే ప్రజలున్నంతవరకు ఇలా జరుగుతూనే ఉంటుంది. "వ రత్తిలిల్ ఖుర్‌ఆన తర్‌తీలా" (ఖుర్‌ఆన్ పారాయణం చెయ్యండి. పదపదానికీ ఆగుతూ!) అని దివ్య ఖుర్‌ఆన్ స్వయంగా ఎంత గట్టిగా చాటిచెప్పినా పఠించే వారు మీరన్నట్టు ఒక్క పదమూ అర్థమవకుండా, కేవలం ఎలాగో ఖుర్‌ఆన్ పఠనాన్ని పూర్తి చెయ్యాలన్న భావంతో పూర్తిచేస్తే ఎలా ఉంటుంది మరి? చదివే వారికీ వేగిరపాటే, వినేవారికీ తొందరపాటే. ఎలాగయినా పఠనాన్ని పూర్తిచేసి నిద్రపోవాలని ఇరువురి బాధ. ఇదీ సంగతి. కాని ఇది ప్రయోజనకారి కాజాలదు. పఠనం సరిగ్గా జరగాలి. అంత సమయం లేదనుకుంటే కొంతభాగమే పఠించాలి. అంతేకాని, ఏదో అసలే అర్థం కాని భాషలో, శబ్దాలు కూడా సరిగ్గా వినరాకుండా కునికిపాట్ల మధ్య వినే ఖుర్‌ఆన్ ఏ విధంగానూ ఫలప్రదం కాదు.

(19-7-85)

—: o :—

ముహమ్మద్ తాజుద్దీన్ ఆరిఫ్ (హైదరాబాద్)

**సైరన్ ఇచ్చిన తరువాత కూడా 15 నిముషాల వరకు సైరి చేయవచ్చు అని కొందరు మరియు ఒక్క నిముషము ఆలస్యము అయినా రోజా మక్రూ అవుతుంది అని కొందరు అంటున్నారు.**

* ఇస్లామీయ ఆరాధనా వేళలన్నింటినీ ప్రకృతి సంకేతాల ఆధారంగా నిర్ణయించడం జరిగింది. ప్రాతః కాలానికి పూర్వం ఫజ్ర్, సూర్యుడు నడినెత్తి నుండి పశ్చిమ దిశకు మరలిన తరువాత జుహ్ర్, సూర్యుడు పశ్చిమ దిశకు ఒరిగి సగం ప్రయాణం ముగించుకునే వేళకు అస్ర్, సూర్యాస్తమయానికి వెంటనే మగ్రిబ్, ఆ తరువాత బాగా చీకటిపడ్డాక ఉషోదయానికి పూర్వం వరకు ఇషాన నమాజ్ వేళలు నిర్ణయమయ్యాయి. అలాగే ఉషోదయానికి పూర్వం తెల్లారుజామున చీకటి రేఖలు వెలుగు రేఖలు సంధించుకునే వేళ వరకు సహ్రీ (ఉషోదయపు భోజనం) చెయ్యాలన్నది, అలాగే సూర్యాస్తమయానికి వ్రతాన్ని విరమించాలన్నది రోజా వ్రతం విషయంలోని నియమం. ఇస్లామిక్ కేలండర్ కూడా చంద్రోదయంతోటే ప్రారంభమవుతుంది. అది అందరి అందుబాటులో ఉండే విషయం. పల్లెల్లోనయితే చంద్రుని రూపం చూసే చెప్పేస్తారు చంద్రోదయం జరిగి అది ఎన్నో రోజో! అందువల్ల ఈ నియమాల ప్రకారం మనకు లభించిన ఆధునిక వసతుల్ని, సౌకర్యాలను మేళవించుకుని ప్రయోజనం పొందడమే విజ్ఞత అనిపించుకుంటుంది. 'సైరన్' అన్నది ప్రకృతికి సంబంధించిన చిహ్నం కాదు. సైరన్, ఎవరు ఎక్కడ, ఎప్పుడు ఇస్తున్నారన్న విషయంపై ఇతర విషయాలన్నీ ఆధారపడి వున్నాయి. అందువల్ల ప్రకృతి సంకేతాల కనుగుణంగా టైమ్‌ను చూసుకుని తదనుగుణంగా సైరన్ గట్రా పెట్టుకోవడం ఉత్తమం. అంతేకాని సైరన్‌ని ప్రామాణికంగా తీసుకోవడం బండిని వెనక్కి నడపడమే అవుతుంది!

(2-8-1985)

—: o :—

ఎస్. పర్వీన్ తాజ్ (మదనపల్లి)

**స్త్రీలకు ఎంత వయస్సు వున్నప్పటి నుంచి నమాజు ఫర్జో తెల్పండి.**

* ఆడపిల్ల రజస్వలయినప్పటి నుండి నమాజ్ ఫర్జ్ (విధి) అవుతుంది. అయితే 7 వ ఏట నుండే నమాజ్ కొరకు తర్ఫీదు నివ్వడం మంచిది. 10 వ సంవత్సరం నుండి నమాజ్ కొరకు లేవకపోతే కాస్త గట్టిగా మందలించి మరీ చెప్పడం ఉత్తమం. అయితే ప్రాజ్ఞత వచ్చిన తరువాత ఇక ఎలాంటి తాత్సారం

చెయ్యకుండా నమాజ్‌ని పాటించడం తప్పనిసరి. దీన్నిబట్టి మీకు బోధపడి ఉంటుంది— వయసుతో నిమిత్తం లేకుండా ప్రాజ్ఞత పొందడమే ప్రామాణికం అని. మీరు చెప్పిన సందర్భంలో, నమాజ్ చెయ్యడం ఎప్పుడు ప్రారంభ మయిందో దానికి రజస్వలయిన కాలానికి తేడాను గమనించి ఆ మధ్య కాలానికి 'కజా' నమాజ్ చేసుకోవడం మంచిది. ప్రతి ఫర్జ్ నమాజ్‌కు ముందు ఆ పూట ఫర్జ నమాజ్‌ను 'కజా'గా కూడా చేర్చి ఎన్ని సంవత్సరాలు మధ్యలో పొయ్యాయో అన్ని సంవత్సరాలు చేస్తే నమాజ్ పూర్తయ్యే అవకాశముంటుంది. జరిగిన జాప్యానికి క్షమార్పణలు చేసుకుంటూ వేడుకుంటే ఆ ప్రభువు దయా మయుడు, క్షమాగుణం కలవాడు మన్నిస్తాడు.

(4-10-85)

—: o :—

టి. రామాచారి (నల్లకుంట)

**ప్రార్థనకు పవిత్రత ఉండాలంటారు కదా! మరి నమాజ్ చేసే టప్పుడు చాలా వరకు స్నానం చేయకుండానే చేస్తారు. అట్లా చేయవచ్చా? ఇస్లాం దీన్ని సమర్థిస్తుందా? ఎందువల్ల?**

* ప్రార్థన సమయంలో పరిశుద్ధంగా ఉండాలన్నదే ఇస్లామీయ దృక్పథం కూడా. అయితే ఆ 'పరిశుద్ధత'కు ప్రమాణాలేవి? అన్నదే అసలు సమస్య. కేవలం నాలుగు చెంబులు నీళ్ళు పోసుకోవడం పరిశుద్ధత కిందికి వస్తుందా? నీట మునిగి తేలినా అది పరిశుద్ధత అనిపించుకుంటుందా? మరేదైనా కొలబద్ద ఉందా? ఇస్లాం చెప్పేదేమంటే ప్రథమంగా అపరిశుభ్రమయిన వాటికి దూరంగా ఉండి వాటి నుండి ప్రక్షాళన పొందాలి. ఉదాహరణకు మల మూత్రాల నుండి పరిశుద్ధత పొందడం ముఖ్యం. దీన్ని ప్రార్థనల సమయం లోనేకాదు 24 గంటలూ పాటించాలని అంటుంది ఇస్లాం. రెండవది కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లోనూ మనిషి అపరిశుద్ధుడవుతాడు. దాన్నుండి ప్రక్షాళనకై స్నానాన్ని ప్రతిపాదిస్తుంది. ఉదాహరణకు, స్త్రీలు రుతుకాలంలోను, భార్యాభర్తలు కల వడం వల్లను అపరిశుద్ధులవుతారు. మూడవది, ప్రతి ప్రార్థన సమయంలోనూ

'వుజూ' (సామాన్యంగా ఆచ్ఛాదన లేకుండా ఉండే శరీర భాగాల ప్రక్షాళన) స్థితిలో ఉండాలని ఆదేశం ఇస్తుంది. నాల్గవది, ఇవిగాక మనిషికి తోచినప్పుడల్లా, వీలు కలిగినప్పుడల్లా స్నానంచేసి పరిశుభ్రంగా, పరిశుద్ధంగా ఉండాలని ప్రేరేపిస్తుంది ఇస్లాం. ప్రవక్త మహానీయులు (సఅసం) పరిశుభ్రతను 'సగం' విశ్వాసంగా పేర్కొన్నారు. అంటే పైన చెప్పిన నాలుగు రకాలుగా పరిశుద్ధంగా ఉండే వ్యక్తి తన విశ్వాసంతో సగభాగాన్ని నెరవేర్చుకున్నాడన్నమాట.

(28-8-87

—: o :—

# 5. కుటుంబం

డి.టి.ఆర్. స్వామి (హైదరాబాద్)

**పురుషుడు నలుగురు భార్యలయినా చేసుకోవచ్చు ఇస్లాంలో. మరి స్త్రీకి ఒక భర్తనే చేసుకొనే అంక్ష ఎందుకు?**

* ముందు ఒక విషయాన్ని అర్థం చేసుకోండి. ఇస్లాంలో పురుషునికి బహుభార్యాత్వాన్ని అవలంబించే అనుమతి కొన్ని షరతులకు లోబడి ఉంది.

1. అతనికి ఒక భార్యకు మించి చేసుకునే ప్రబల అవసరం ఉండాలి.

2. అతను వారి మధ్య ''న్యాయం'' చేయగల, అంటే వారి అవసరాలను సమంగా తీర్చగల స్తోమత కలిగి ఉండాలి.

3. అతను వారిని అన్ని విధాలా తృప్తిపరచగల సామర్థ్యం గలవాడయి ఉండాలి.

ఇప్పుడు మీ ప్రశ్నలోని రెండో అంశాన్ని చూద్దాం. దీన్ని వివరంగా చర్చించాలంటే ఒక పుస్తకమే అవసరమవుతుంది. క్లుప్తంగా కొన్ని అంశాలను ఇక్కడ పేర్కొంటాను.

1. స్త్రీ పురుషుల మనస్తత్వాన్ని బట్టి భార్యాభర్తల్లో ఎవ్వరూ తమ ఉమ్మడి జీవితంలో ఇతరులు పాలుపంచుకోడాన్ని సహించరు. అయితే స్త్రీలో ఉన్న సహన గుణం మూలాన ఆమె తనకు అన్యాయం జరగనంత వరకు, తన హక్కులు తనకు దక్కినంతవరకు తన భర్త ఇతర స్త్రీని ధర్మబద్ధంగా భార్యగా స్వీకరించినా దాన్ని నిండు హృదయంతో సహించగలదు. ఇలాంటి దృష్టాంతాలు మనకు ప్రపంచమంతటా నేటికీ కానవస్తాయి. కాని పురుషుడు మాత్రం అతని మనస్తత్వం రీత్యా ఒక్క క్షణకాలం కూడా తన భార్యతో మరో పురుషుని తోడు ఊహించనైనాలేడు. అతని భావోద్రేకాలు, ఆ ఊహతోనే జ్వాలా ముఖిలా విజృంభిస్తాయి.

2. స్త్రీ ప్రతి నెల కొన్నిరోజులు, గర్భధారణ కాలంలో కొన్ని నెలలు లైంగిక విషయంలో అనర్హురాలయిపోతుంది. ఆ కాలంలో తన భర్తవాంఛ పరిపూర్తికొరకు జారగృహాల వైపుకు పోవడం కన్నా సమాజంలో గుర్తింపు పొందిన తోటి స్త్రీతో గడపడమే ఒక స్త్రీకి సహజంగా స్వీకార యోగ్యమవుతుంది. కాని పురుషుని విషయంలో అసలు సాధారణంగా అలాంటి పరిస్థితి ఏర్పడదు. ఎప్పుడైనా ఏదైనా వ్యాధివల్ల లేక మరేదైనా కారణంవల్ల కొంత కాలం అతడు లైంగికంగా అనర్హుడయిపోయినా స్త్రీ తనకు సహజమైన సహనగుణంతో దాన్ని భరించగలదు. అంతగా ఆ కాలం సుదీర్ఘమయి ఆ అవసరం భరింపరానిదయిపోతే స్త్రీ విడాకులు పొంది మరో పెళ్ళి చేసుకోడానికి అవకాశం ఉండనే ఉంది.

3. పెళ్ళి అన్నది మౌలికంగా ఓ సామాజిక అవసరం. సమాజానికి కుటుంబ వ్యవస్థ పునాదిరాయివంటిది. కుటుంబం అంటే తల్లి తండ్రి, బిడ్డలు. ఒక పురుషునికి నలుగురు భార్యలుంటే వారికి పుట్టే పిల్లలకు తల్లి ఎవరో తండ్రి ఎవరో ఖచ్చితంగా నిర్ధారించవచ్చు. ఆస్తిపాస్తుల పంపకంలోను, సామాజిక వ్యవహారాల్లోనూ అన్నీ సక్రమంగా జరిగిపోతాయి. కాని ఒక స్త్రీకి ఇద్దరే భర్తలున్నా వారికి పుట్టే సంతానానికి తండ్రి ఎవరో నిర్ధారించడం ఏ మాత్రం సాధ్యపడదు. పునాదిరాయే కదిలినప్పుడు ఇక కట్టడం ఎలా నిలబడగలుగుతుంది? సామాజిక వ్యవస్థే ఛిన్నాభిన్నమయిపోతుంది.

పై వాదనలకు సశాస్త్రీయమయిన ఆధారాలు, ప్రమాణాలూ ఉన్నాయి- వాటన్నింటినీ ఈ శీర్షికలో చర్చించడం సాధ్యపడదు. ఈ కొన్ని సూచనలు మీకు తృప్తిని కలిగిస్తాయని ఆశిస్తున్నాను.

(25-3-83)

—: o :—

ముహమ్మద్ అక్రమ్ (ఎల్లందు)

**మహ్మద్ షబ్బీర్ అనే అతను ఇస్మాయిల్ అనే వ్యక్తికి తన యావదాస్తిని హిబా చేశాడనుకోండి. అయితే అతను రాసే డాక్యుమెంటులో "నేను చనిపోయిన తరువాత నా ఆస్తి మొత్తాన్ని ఇస్మాయిల్ గారికి హిబా చేస్తున్నాను. మరియు నేను చనిపోయిన తర్వాత నా భార్య పాలన పోషణకూడా వారికి అప్పజెప్తున్నాను" అని రాయవచ్చునా?**

* హిబా అంటే కానుకగా ఇచ్చివెయ్యడం అన్నమాట. హిబా అయినా మరెలాంటి వీలునామా అయినా షరీఅత్‌కు విరుద్ధమయిన పనుల్లో చెయ్యడానికి వీల్లేదు. ఇస్లామీయ న్యాయవ్యవస్థ ఉంటే, మీరు ఉదాహరించినటువంటి కేసుల్లో ఆ వ్యక్తి సంకల్పం ఎలాంటిదో ఇతర పరిస్థితుల ద్వారా గ్రహించి నిర్ణయం చేస్తారు. మృతుడు తన ఆస్తిలో మూడవవంతు మాత్రమే "వీలునామా" వ్రాసి ఇవ్వగలడు. మిగతా ఆస్తి అంతా లెక్క ప్రకారం వారసులకు పంచవలసిందే. "హిబా" అయితే అతడు చేసిన మరుక్షణమే అమల్లోకి వస్తుంది. మీరు ఉదాహరించిన కేసులో తన వారసులు కొందరికి ఆస్తి చెల్లకుండా చెయ్యడానికి అలా చేస్తే అది చెల్లదు. ఇస్లామీయ న్యాయవ్యవస్థ లేదు గనుక నేటి కోర్టుల్లో దాన్ని అతను చెలాయించుకోగలడేమో! మృతుని ఇతర వారసుల (భార్య కూడా)కు ఆస్తిలో ఎలాంటి భాగం లభించక పోవడం అన్నది షరీఅత్ అభీష్టానికి విరుద్ధం. మీరు చెప్పిన కేసు 'వీలునామా' బాపతులా కనిపిస్తోంది. అందువల్ల షరీఅత్ ప్రకారం మొత్తం ఆస్తికొరకు వీలునామా వ్రాసేహక్కు మృతునికి లేదు. గనక అది చెల్లదు. అతని వీలునామాను గౌరవించాలి గనుక అంతగా అయితే మూడవ వంతును వీలునామా ప్రకారం అందజేసి మిగతా ఆస్తిని వారసుల్లో పంచవలసిందే. మృతుని వారసులు అందరూ కలసి ఆ ప్రాంతాల్లోని ధర్మజ్ఞుల సమక్షంలో ఓ నిర్ణయానికి రావడం ఉత్తమం. కోర్టులకు వెళ్ళడం సమంజసం కాదు.

(29-4-83)

—: o :—

సి. హెచ్. సత్యనారాయణ (నంద్యాల)

**మార్చి నెలలో (1984) ఒక మిత్రుడు, అన్నాచెల్లెలు చిన్నతనంలో విడిపోయి, తెలియక పెళ్ళి చేసుకుని పిల్లలు కన్న తరువాత, అసలు విషయం తెలిసి వెంటనే విడిపోవాలని వ్రాసారు...**

* తెలియక పెళ్ళి చేసుకున్నారు. తెలిసిన తరువాత అధర్మమయిన ఆ సంబంధాన్ని కొనసాగించకుండా నిలిపివెయ్యడం సజ్జనుల పని. లేకపోతే ఆ అధర్మపు పాప పంకిలంలో కూరుకు పోతామంటే ఎవరేమని చెప్పగలరు? విడి

పోయిన తరువాత ఆ స్త్రీ మరో పెళ్ళి చేసుకుని బ్రతకవచ్చు. ఆ పురుషుడు కూడా మరో స్త్రీని పెళ్ళి చేసుకుని సంసారం చెయ్యవచ్చు. ఆ స్త్రీని మరెవరూ పెళ్ళి చేసుకోరంటే నేటి మన సమాజంలోని అవకతవక విలువలే కారణం. విడాకులు పుచ్చుకున్న స్త్రీని, వితంతువును మనిషిగానే చూడకపోవడం స్త్రీలపట్ల వారిస్థానం పట్ల సరయిన అవగాహన, గౌరవం లేకపోవడమే. ఆ అవగాహన కలిగేలా అవిరళ కృషిచేస్తూ సమాజంలో చైతన్యం తీసుకురావాలి. ఆ మంచి మార్పు వచ్చేవరకు ఉన్న చెడు వ్యవస్థను మనసులోనే చీదరించుకుంటూ బాధపడటం తప్ప మీరూ నేనూ చెయ్యగలిగిందేమీ లేదు. ఇంతకు కృషి మాత్రం అనివార్యం మరవకండి.

(13-7-84)

—: o :—

మోహిసిన్ పాషా (ఇల్లందు)

**భార్యకు విడాకులిచ్చి మా స్నేహితుడు వేరే అమ్మాయిని ఉంచుకొని కాపురం చేస్తున్నాడు. కాని ఇంకా నిఖా చేసుకోలేదు. షరీయత్ ప్రకారం ఎన్ని రోజుల వరకు నిఖా లేకుండా ఉండగలరు?**

* భార్యకు విడాకులిచ్చినా, ఇవ్వక పోయినా మరో అమ్మాయిని "ఉంచు" కోవడమన్నది పచ్చి వ్యభిచారం. ఇలా స్త్రీలను "ఉంచు" కోవడమన్నది నిషిద్ధం (హరామ్). ఇది ఒక్క క్షణం కాలంపాటు కూడా కొనసాగరాదు. ఇలా గడిపిన ఒక్కొక్క క్షణం హరామ్‌తో, వ్యభిచారంతో నిండుకున్నదే. తక్షణం నికాహ్ చేసుకోవాలి. జరిగిన తప్పుకు మన్నింపుకై దైవాన్ని వేడుకోవాలి. ఇలాంటి సందర్భాలు ఏర్పడతాయనే ఇస్లాం బహుభార్యాత్వాన్ని సమర్థిస్తుంది. మరో పెళ్ళిచేసుకోదలచిన మీ స్నేహితుడు భార్యకు విడాకులివ్వకుండానే ఆ అమ్మాయితో నికాహ్ చేసుకుని ఉండవచ్చు. అయితే ఇద్దరి మధ్య న్యాయంగా, సమానంగా ప్రవర్తించగలగాలి. ముఖ్యంగా, ఆర్థిక విషయాల్లో దీనికి మొదటి భార్య కూడా సమ్మతించడం చాలా కష్టం. ఆమెకు కూడా ఇప్పుడు ఏర్పడిన పరిస్థితిని గురించి ముందే అవగాహన కలిగి ఉంటే దీనికంటే ఆ మునుపటి పరిస్థితే నయమని భావించి ఉండేది. కేవలం ధర్మజ్ఞానం లేకపోవడం

వల్ల ఆ వ్యక్తి ఇప్పుడు ఇద్దరు స్త్రీలకు అన్యాయం చేసిన వాడవుతున్నాడు. ఇది ఘోరమయిన పాపం.

(14-12-84)

—: o :—

## పెద్ది రమేష్ (ఇల్లందు)

**గీటురాయిలో మీరు ఒక ప్రశ్నకు సమాధానమిస్తూ వదినను మరిది పెళ్ళిచేసుకోవచ్చు అన్నారు. కానీ తెలుగు వారి సాంప్రదాయం ప్రకారం వదిన తల్లితో సమానం కదా.**

* తల్లితో సమానమన్న విషయం ఏమోగాని ఇదే సంప్రదాయంలో వదినా మరదుల మధ్య జరిగే మోటు సరసాలు ఎంతో అసహ్యంగా ఉంటాయి. ఇవన్నీ 'అన్న' బ్రతికున్నప్పటి విషయాలు. అన్న ప్రాణంకాస్తా పంచభూతాల్లో కలసి పోతే అటు వదినను చట్టబద్ధంగా చేసుకోలేక ఇటు వదలుకోలేక అన్న సంతానం పోషణ నెపంతో అక్రమ సంబంధాలు పెట్టుకున్న వ్యవహారాలెన్నో! మన్నించండి, ఇదంతా అనవసర ప్రస్తావనగా ఉందేమో! మీరు పేర్కొనడంవల్ల ఇదంతా చెప్పవలసి వచ్చింది. ఇక మీ ప్రశ్నకు సమాధానం: అన్నకు భార్యగా ఉన్నంతవరకే ఒక స్త్రీ వదినగా ఎంచబడుతుంది. ఆ సంబంధం తెగిపోతే ఆమె చట్టరీత్యా ఓ మామూలు స్త్రీయే కదా! అలాంటప్పుడు అన్న చనిపోగా ఆ స్త్రీని పెళ్ళాడటంలో ఎలాంటి తప్పు లేదు. పైగా అన్న వదిలి వెళ్ళిన ఓ సమస్యకు పరిష్కారం చూపించినట్లు కూడా అవుతుంది.

(11-1-85)

—: o :—

## హాఫిజ్ ముష్తాఖ్ అహ్మద్, షేక్ అబ్దుల్ ఖయ్యూమ్ (కువైట్)

**భార్యకు మహెర్ చెల్లించకుండా కలిస్తే అది జినా క్రిందికి వస్తుందా?**

* మహర్‌ని రెండు విధాలుగా చెల్లించవచ్చు. ఒకటి, నికాహ్ జరిగే సమయంలో చెల్లించడం. రెండు, తరువాత ఎప్పుడయినా చెల్లించే ఒప్పందం చేసుకోవడం. ఈ రెండు విధానాలూ సరయినవే. అయితే ఎగొట్టే సంకల్పమున్నా

లేక మహర్ ప్రస్తావనే లేకపోయినా అలాంటి నికాహ్ గురించి మీరు చెప్పిన మాట వర్తిస్తుంది. ఇక బానిసల విషయం. అంటే డబ్బుపెట్టి "కొన్న"మనుషులు అన్నమాట. ఇస్లాంకు పూర్వం, ఇస్లాం తరువాత నేటికి కూడా యూరపు జాతుల్లో ఇలాంటి చర్య జరుగుతూ వస్తోంది. అయితే ఇస్లాం ఒక చెడును సంస్కరించేటప్పుడు మానవ నైజానికి తగిన విధంగా ఒక క్రమంలో దాన్ని రూపుమాపే ప్రయత్నం చేస్తుంది. అలాగే ఈ బానిసల విషయంలోనూ. వాళ్ళ ఖర్చులకై చెల్లించే ధనమే ఆ మహరుగా భావించవచ్చు. కాగా ఇస్లాం ఆవిర్భావం తరువాత అరేబియాలో బానిసత్వం పూర్తిగా సమసిపోయింది. పోతే యుద్ధంలో చేజిక్కిన ఖైదీల విషయం, అలా లభించిన స్త్రీలు యుద్ధ ఖైదీల మార్పిడిలో తమ స్వదేశానికి చేరిపోతే ఏ సమస్యా ఉండదు. కాని అలా జరక్కపోతే వాళ్ళ సమస్యను పరిష్కరించడానికే వారిని స్వాధీనంలో ఉన్నవారుగా భావించడం జరుగుతుంది. అలాంటి యుద్ధ ఖైదీలకు ఈ విధంగా ఓ ఆశ్రయం కల్పించడమే అసలు ఉద్దేశ్యం. దాన్ని వారి ఎడల మహర్‌గా భావించవచ్చు. మహర్ నిర్ణయించినది దైవమే, కొన్ని సందర్భాల్లో దాన్ని సడలించినదీ దైవమే. కనుక ఫలానా సందర్భంలో మహర్ లేదే అన్న సంశయానికి లోనయ్యే ప్రశ్నే లేదు. అయితే వారి ఎడల ఉత్తమ రీతిన ప్రవర్తించే వారి కొరకు, అంటే వారిని ఆ బాధ నుండి విముక్తం చేయించి సక్రమంగా పెళ్ళిచేసుకునే వారి కొరకు ఎన్నో పుణ్యఫలాలు లభించే వాగ్దానం చెయ్యడం జరిగింది.

(10-5-85)

—: o :—

జహీర్ అహ్మద్ (వినుకొండ)

**భర్త ఆస్తిలో భాగము ఉండగా భార్యకు మహర్ ఎందుకు ఇవ్వాలి. ఇది ప్రవక్త (సఅసం)కు ముందున్న ఆచారమా లేక ప్రవక్త (సఅసం) ప్రారంభించారా?**

* నేటి ఆధునికులు స్త్రీ ఎంతగానో ఎదిగిపోయిందని ఎన్ని వక్ర ప్రకటనలు చేసినా వాస్తవమేమంటే. స్త్రీ సామాజికంగా సర్వస్వతంత్రురాలు ఎన్నడూ కాదు. ఆమె పురుషుని అండన ఉండవలసిందే. నేడు స్త్రీ స్వేచ్ఛ నినాదాలు ఎన్ని వినోదాలను, మరెన్నో తగాదాలను సృష్టిస్తున్నా, స్త్రీ గగన విహారం చేసినా, ఆమె

పురుషుని కటాక్షానికై నిరీక్షించవలసిందే అని నేడు మాడర్నిస్టులుగా చెలామణి అవుతున్న వారు కూడా ఢంకా బజాయించి, కోర్టులకెక్కి మరీ వక్కాణిస్తున్నారు. షాహ్‌బాను బేగం మరియు ముహమ్మద్ అహ్మద్ ఖాన్ కేసులో చూచారుగా-ఈ ఆధునికోత్తముల తీరు: "ఛీ, నువ్వు వద్దు, ఫో" అన్న పురుషుడు ఆ స్త్రీకి జరుగుబాటు కోసం భరణం చెల్లించాలని స్త్రీ జాతికే అవమానకరమయిన తీర్పు చెయ్యడమే కాక దాన్ని స్త్రీ హక్కుగా సమర్థిస్తున్నారు కూడా. స్త్రీ స్వేచ్ఛను వేనోళ్ళా కోరుకునే వారేనా, 'ఆమె ఇంకా ఒకరి పంచనపడి ఉండవలసిందే' అని పరోక్షంగా ప్రబోధిస్తున్నది? ఇస్లాం ఇలాంటి అవకతవకలకు అతివాదాలకు పోదు. పెళ్ళి చేసుకున్నవారు లక్షణంగా ఉండాలని, ఒకవేళ వారి మధ్య ఎలాంటి పరిష్కారంకాని సమస్య ఏర్పడినా, వారు ఒకవేళ వేరు పడిపోయినా వారి జీవితాలు సాఫీగా సాగాలని కోరుతుంది. ఆ ప్రకారమే స్త్రీకి తన తండ్రి నుండి, భర్త నుండి కూడా ఆర్థిక తోడ్పాటు అందేలా ఏర్పాటు చేస్తుంది. తండ్రి చనిపోయిన తరువాత, భర్త చనిపోయిన తరువాతే కదా వారసత్వపు హక్కు లభించేది. ఒక వ్యక్తి ఆమెను భార్యగా స్వీకరించినందుకు అతను ఆమెకు ఇచ్చే కానుక వంటిది మహర్. అది స్త్రీ ధనం. దాన్ని దివ్యఖుర్‌ఆన్‌లో ఆ విధంగానే పేర్కొనడం జరిగింది. అది ఒకవేళ ముందున్న ఆచారమయినా దైవం ఆదేశించినందుకు అది షరీఅత్ అంతర్భాగమయింది. మహా ప్రవక్త (సఅసం) దేన్నీ తానుగా ప్రారంభించలేదు. ఆయన ప్రవక్త గనక తన వ్యక్తిగత అభిరుచుల విషయాల్లో సయితం దైవాదేశానుగుణంగానే నడుచుకున్నారు.

(28-6-85)

—: o :—

**శేఖర్, రజాక్, షేక్ సరేమల్, జుగ్‌రాజ్ (విజయవాడ)**

**ఇస్లాం మతమునందు వివాహమాడుటకు బంధువులలో ఎవరెవరిని హలాల్ చేసినారు. సందేహ నివృత్తి చేయగలరు.**

* మీ సందేహ నివృత్తి కాస్తంత వివరణ కోరుతోంది. అది ఈ కాలమ్‌లో సాధ్యపడదు. ఐనా క్లుప్తంగా చెప్పడానికి ప్రయత్నిస్తాను. 'హలాల్' (ధర్మ

బద్ధం) అయినవారి పట్టికకన్నా 'హరామ్' (నిషిద్ధం) అయిన వారి పట్టిక సులువుగా చెప్పవచ్చు. మిగతావారంతా హలాల్ అని తెలుసుకోవచ్చు. పురుషునికి హరామ్ అయిన బంధుత్వాలు 7 రకాలు :

1. తల్లి, కూతురు, సోదరి, అత్త (తండ్రి సోదరి), పిన్ని (తల్లి సోదరి), సోదరి కూతురు, సోదరుని కూతురు 2. బిడ్డనిచ్చిన అత్త (భార్య తల్లి), సొంత కోడళ్ళు (సొంత కొడుకుల భార్యలు). 3. భార్య ఉండగా ఆమె సోదరి, ఆమె అత్త (తండ్రి సోదరి), ఆమె పిన్ని (తల్లిసోదరి) 4. నలుగురు భార్యలుండగా ఐదవ స్త్రీ. 5. పరమతానికి చెందిన స్త్రీ లేక పురుషుడు 6. ఇతరులకు భార్యలుగా ఉన్న వారు. విడాకులు పొందిన వితంతువు అయినా నిర్ణీత కాల పరిమితి (ఇద్దత్) పూర్తి కానిదే ఏ స్త్రీ పెళ్ళి చేసుకోరాదు. 7. పాలిచ్చిన తల్లి యొక్క కూతురు లేక కొడుకు. ఇవన్నీ హరామ్‌గా నిర్ణయించబడిన బంధుత్వాలు. వీటి వివరణలోకి వెళ్ళినట్లయితే ఇంకా కొన్ని విషయాలు తెలుస్తాయి. కాని ఈ శీర్షిక దాన్ని భరించజాలదు. ఉర్దూలో ఎన్నో గ్రంథాలున్నాయి ఇలాంటి మత ధర్మాలు సూచించేందుకు. మీమిత్రులెవరయినా ఉర్దూ తెలిసిన వారుంటే "ఇస్లామీ ఫికహ్" అన్న గ్రంథంలో రెండో భాగం అధ్యయనం చేసి చెప్పమనండి.

(13-9-85)

—: o :—

ఖాజా సాబెరుద్దీన్ (సికింద్రాబాద్)

**ఒక భర్త తన భార్యను, 6 గురు పిల్లలను వదిలి ఒక స్త్రీని రెండవ వివాహం చేసుకొని 20॥ సం కావస్తున్నది. ఇంటి భారమంతా పెద్ద కొడుకుపై పడింది. అయితే ఇట్టి భర్తతో భార్యకు ఇంకేమైనా సంబంధ ముందా లేదా, ఇట్టి తండ్రితో పిల్లలు ఎలా ప్రవర్తించాలి ?**

* నేడు కొందరు ముస్లింలు ఈ విధంగా అధర్మంగా, అన్యాయంగా ప్రవర్తించడం మూలానే ఇస్లామీయ షరీఅత్ పూర్తిగా మరుగున పడిపోయింది. నేడు ముస్లింలను చూచి ఇతరులు నవ్వుతున్నారు. ఆ వ్యక్తి ఎలాంటి పరిస్థితుల్లో తన భార్యను పిల్లల్ని వదలి వెళ్ళాడో మీరు తెలుపకపోయినా, ఒక భర్తగా, ఒక తండ్రిగా అతను తన విధ్యుక్తధర్మాన్ని, బాధ్యతను విస్మరించి ఘోరమైన

తప్పు చేశాడు. సమాజంలో అన్నిటా కానవస్తున్న బాధ్యతారాహిత్యధోరణి, అజ్ఞానం. అవజ్ఞత ఇలాంటి ప్రవర్తనకు మూలమని చెప్పవచ్చు. కాని ముస్లింలు దైవధర్మాన్ని అనుసరించే వారుగా బాధ్యతాయుతంగా ప్రవర్తించ వలసి ఉంటుంది. అయితే ఒకరు చేసిన తప్పిదాన్ని మరో తప్పుచేసి కప్పి పుచ్చనూలేము, సరిచెయ్యనూజాలము. భార్య తరపున వారు, భర్త తరపునవారు కొందరు బంధువులు కలిసి, ఇప్పుడయినాసరే, ఆ విభేదాలేమిటో వాటిని పూడ్చే పని చేపట్టవచ్చు. ఇద్దరినీ దగ్గర చెయ్యవచ్చు. ఎంతసేపటికీ పంతాలు పట్టింపులూ అంటూ సాగితే ఏ పనీ పూర్తిగా, సవ్యంగా నెరవేరదు. అంతగా ఆ భర్త ఆ మహిళకు ఇష్టం లేకపోతే ఎప్పుడో 'ఖులా' పొందవలసింది. కావాలనుకుంటే తనకు ఇష్టంకాని భర్తనుండి విముక్తి పొందడానికి, తనకున్న హక్కును ఆమె వినియోగించుకుని హాయిగా ఉండవచ్చు. పోతే సంతానానికి తండ్రి-తండ్రియే, వారు అతని వారసులే. దాన్ని ఎవరూ కాదనలేరు. సంతానం కూడా తండ్రి చేసిన పొరపాటును పంతంగా పట్టుకు వ్రేలాడటం అంతగా భావ్యం కాదు. తండ్రిపట్ల ఉండవలసిన గౌరవ మర్యాదల్లో, ఆయనకు చెయ్యవలసిన సేవలో, ఆయనపట్ల తమపైఉన్న బాధ్యతా నిర్వహణలో ఎలాంటి లోటు రానివ్వకూడదు. ఆయనతో కలసి ఉండటానికే ప్రయత్నించాలి. ఏవో మనస్పర్థలవల్ల విడిపోయిన తల్లి దండ్రులు సంతానంద్వారా కలసిపోయిన ఉదంతాలు, సినిమాల్లో, నవలల్లోనే కాదు నిజజీవితంలోనూ ఎన్నోఉన్నాయి. ఒకరు తమ కర్తవ్యాన్ని విస్మరిస్తే మరొకరు తమ విధిపట్ల అశ్రద్ధ చూపాలనిలేదు. ఎవరో ఒకరు కాస్త ముందుకువస్తే దూరాలు చేరువవుతాయి.

(15-11-85)

—— :o: ——

జమీలా బేగం (మండపేట)

**స్త్రీలకు ఋతుస్రావ సమయములో వివాహములివ్వడం "షరీఅత్" (ధర్మ) విరుద్ధం. అది చెల్లదు కాని ఈ ఋతుస్రావ సమయములో నిఖా : చేసుకో వచ్చునా? అది ధర్మసమ్మత మవుతుందా?**

* అలా విడాకులివ్వడం ధర్మవిరుద్ధం అనీ లేక చెల్లదని ఎవరన్నారు? ఇది సరికాదు. విడాకులూ చెల్లుతాయి. నికాహ్‌కూడా చెల్లుతుంది. వలీమాకూడా చేసుకోవచ్చు. అయితే ఆ సమయంలో విడాకులివ్వడం అభిలషనీయం కాదు; సరయిన పద్ధతికాదు; సమంజసమూకాదు. స్త్రీ పరిశుద్ధంగా ఉన్నప్పుడే విడాకులివ్వడం మంచిది. షరీఅత్‌లో అభిలషనీయం. ఇలా నియమం పెట్టడంలోని అనేక మర్మ హేతువుల్లో ఒకటేమంటే మనిషి ఒకవేళ అలాంటి స్థితిలో ఆగ్రహావేశానికి గురయి ఉన్నా స్త్రీ పరిశుద్ధురాలయ్యే వరకు అతని ఆ ఆగ్రహం తగ్గిపోవచ్చు. అతను మనసు మార్చుకుని ఆమెతో సహజీవనం సాగించడానికై సమ్మతించవచ్చు అన్నది. ఇలా జరిగిన అనేక ఉదంతాలున్నాయి. అలాగే నికాహ్ కూడా పరిశుద్ధావస్థలో చెయ్యడం మంచిది.

(11-4-86)

—: o :—

యం. డి. రూహుల్లా (పాడేరు)

**నిక్కాహ్‌లో, వకీలుగా ఎవరిని నియమించవలెను? పెండ్లి కుమార్తె మేనమామ గారిని నియమించాలని పెద్దలు అంటారు. పెండ్లికుమార్తె తండ్రి వకీలుగా యుండవచ్చునా?**

* చూడండి ఇస్లామీయ షరీఅత్ ప్రకారం నికాహ్ జరగటానికి, వధూవరులు ప్రాజ్ఞత గల స్త్రీ పురుషులయితే, ఇద్దరు పురుషులు లేక ఒక పురుషుడు మరియు ఇద్దరు స్త్రీలు సాక్ష్యంగా ఉంటే నికాహ్ జరిగిపోతుంది. వధూవరుల్లో ఒకరు పరస్పరం నికాహ్ ఒప్పందంలో చేరినట్లుగా ప్రకటించడం దాన్ని ఎదుటి వ్యక్తి స్వీకరించినట్లు పలకడం (దీన్నే 'ఈజాబ్' 'కుబూల్' అనంటారు). వారుభయులే కాక ఆ సాక్షులుకూడా వినాలి. అలా జరిగితే వివాహం అయిపోయింది. ఎంతో సింపుల్! 'వలి' అంటే అమ్మాయి లేక అబ్బాయి తండ్రి. స్వయంగా అమ్మాయి లేక అబ్బాయి తరపున ఈజాబ్ కుబూల్ చెయ్యవచ్చు. తండ్రులుకాని పక్షంలో ఈ పని ఎవరయినా చెయ్యవచ్చు. వారినే 'వకీల్'గా వ్యవహరిస్తారు. ఆ వ్యక్తి వధూవరుల తరపున లేక వారి వలీ తరపున నియుక్తుడయిన వాడేకావాలి. దీన్నిబట్టి వధువు తండ్రి అయినా, వరుని తండ్రి.

అయినా వకీలు కావచ్చు. అయితే ఆయన్ని వకీలు అనరు వలి అనంటారు. మన సమాజంలో ప్రాజ్ఞులయిన వధూవరులు నేరుగా కూర్చొని ఈజాబ్ కుబూల్ చేసుకునే పద్ధతి బహుకాలంగా లేదు. కాబట్టి వలి లేక వకీల్ ద్వారా వధువు అంగీకారం తీసుకుని వరుని స్వీకారం గ్రహించే పద్ధతి స్థిరపడి పోయింది. ఇందులోనూ తప్పులేదు. ఈ సంప్రదాయానికి భిన్నంగా పైన పేర్కొన్నరీతిలో వధూవరులు నేరుగా ఈజాబ్ కుబూల్ ఇద్దరు సాక్షుల సమక్షంలో చేసుకుంటే అందులో దోషంలేదు.

(12-9-86)

—: ० :—

రత్నాకర్ (నంద్యాల)

**పురుషుడు నలుగురు స్త్రీలను వివాహమాడవచ్చు. కాని స్త్రీ ఒక్క పురుషుణ్నే చేసుకోవాలి. పురుషులకు ఒక రూలు స్త్రీలకు ఒక రూలా?**

* మీ ప్రశ్న వినగానే ఓ జోకు గుర్తుకువచ్చింది. మీలా ఓ పెద్ద మనిషి ఓ పండితునికి ఇదే ప్రశ్న ఎంతో సీరియస్‌గా అడిగాడు. విద్వాంసుడు ఆ మనిషి కళ్ళల్లో తీక్షణంగాచూస్తూ "మీరు నిజంగానే ఇది భావ్యమని భావిస్తున్నారా?" అని అడిగాడు. అతనేమో చాలా ఉద్వేగంతో "అవును ఇది స్త్రీల హక్కు. వాళ్ళకు అది లభించ వలసిందే!" అని బల్ల గుద్ది మరీ చెప్పాడు. అప్పుడా పండితుడు, "అయితే తమరు, తమ భార్యామణి అంగీకరిస్తే ఆమెను నాకు కట్టబెట్టండి" అని అడిగేశాడు. ఇంకేముంది ఆ పెద్దమనిషి చిందులు త్రొక్కసాగాడు. అతను తన ఆగ్రహాన్ని పూర్తిగా వెళ్ళగ్రక్కిన తరువాత పండితుడు అతనితో "బాబు, మీ భార్య నాకు ఏమాత్రం అక్కరలేదు గాని, నేను చెప్పదలచుకుంది మీరు ప్రాక్టికల్‌గా చేసిచూపెట్టారు. అంటే ఈ కారణంగానే దేవుడు అలాంటి హక్కును పురుషుల వరకే పరిమితం చేశాడు. ఇదొక్కటే కాక ఇంకా అనేక కారణాలున్నాయి. ఇలాంటి ఏర్పాటు అనేక సాంఘిక చిక్కుల్నికూడా తీసుకు వస్తుంది" అని నచ్చజెప్పారు. అరే, జోకులోపడి అసలు విషయాన్ని మరచిపోలేదు కదా మనం?

(27-11-87)

—: ० :—

యం. వెంకటేశ్వర్లు (గోదావరి ఖని)

**ఇస్లాం పద్ధతి ప్రకారం చిన్నమ్మవాళ్ళ అమ్మాయిని, పెద్దమ్మ వాళ్ళ అబ్బాయితో పెళ్ళి చేస్తారు. మరియు చిన్నయ్య అంటే (తండ్రి తమ్ముడు) అమ్మాయితో గూడ పెళ్ళి చేయవచ్చు.**

* వరుసలు సామాజికంగా కల్పించుకున్నవే. రక్తం పంచుకుని పుట్టిన అక్కా చెల్లెండ్లు అన్నదమ్ములు తప్ప మిగతా వరుసలన్నీ ఆయా సమాజాల కనుగుణంగా ఏర్పడినవే. పిన్ని కూతురే చెల్లి ఎందుకు కావాలి? అదే అమ్మ సోదరుని కూతురు కూడా ఎందుకు చెల్లి కారాదు? బాబాయి కొడుకే తమ్ము డెందుకు కావాలి? అదే నాన్న సోదరి అయిన అత్త యొక్క కొడుకూ కూతురు కూడా సోదర సోదరీలు ఎందుకు కారాదు? ఇస్లాం వాళ్ళందరినీ పెళ్ళికి అర్హు లయిన వారుగానే నిర్ణయిస్తుంది. మామకూతురు, అత్తకూతురు, పిన్ని కూతురు, చిన్నాయన కూతురు అందరూ సమానమే. కాస్త నిశితంగా ఆలోచించండి.

(11-12-87)

—: o :—

# 6. ధర్మానుసరణ

జి. ఏ. గఫార్ (నంద్యాల)

**ముస్లింలు మగవారుగాని, స్త్రీలుగాని లేక భార్యాభర్తలు తప్పనిసరిగా ముర్షద్ దగ్గరకుపోయి మురీద్ (బయత్) కావలయునా? ముర్షద్ ఎటువంటి గుణగణాలు కలిగి ఉండాలి?**

*ముర్షిద్ అంటే బోధకుడు అని అర్థం. ధర్మాన్ని బోధించేవాడని ఇక్కడ భావం. ధర్మం తెలియనివారు ధర్మం గురించి తెలిసినవారి దగ్గరకు పోవడం తప్పనిసరియే కదా. వారిని నేడు మౌలవీలని అనండి, ముదర్రిస్‌లని అనండి లేక ముర్షిద్‌లని అనండి అంతా ఒక్కటే. వారి దగ్గరికి పోవడం, ధర్మం గురించి తెలుసుకోవడం అవసరమే. వారు ఎలాంటివారై ఉండాలన్నది పై వివరణ వల్ల బాగా ప్రస్ఫుటమవుతూనే ఉంది. దివ్య ఖుర్‌ఆన్, హదీసులు, మహా ప్రవక్త సంప్రదాయం, సహచరుల విధానం అన్నీ తెలిసినవారయి ఉండాలి. స్వయంగా ధార్మిక బోధనల ప్రకారం ఆచరించేవారయి ఉండాలి. నిష్ఠాగరిష్ఠ జీవితం గడిపేవారయి ఉండాలి. పోతే "బయత్" అన్న పదానికి భావం "ఒప్పందం" అని. ధార్మిక జ్ఞానం కోసం ధర్మజ్ఞుని వద్దకు వెళ్ళినప్పుడు, తాము ధర్మజ్ఞానం సంపాదించి ఆ విధంగానే ఆచరిస్తామని చేసే వాగ్దానం లేక ఒప్పందాన్ని బయత్ అంటారు. మహా ప్రవక్త (సఅసం) వద్ద ఇస్లాం స్వీకరించడానికి వచ్చినవారు తాము చెడులనుండి దూరంగా ఉంటామని, మంచి పనుల్ని ఆచరిస్తామని ఒప్పందం లేక బయత్ చేసేవారన్నది యదార్థం. అయినా మనిషి కలిమా పఠించి దాన్ని స్వీకరించిన నాడే తన దైవంతో ఒప్పందం చేసుకున్నాడన్న మాట!

నేడు ముర్షిద్‌లు ఒక వ్యవస్థగా రూపొంది వారి ఉనికే ఓ వివాదగ్రస్తమయిన విషయంగా పరిణమించింది. దానికి కారణం ఆ "వ్యవస్థ"లో కొందరు

స్వార్థపరులు చేరి దాన్ని కలుషితం చెయ్యడమే. అందువల్లనే మీరు కూడా నేడు వారు "ఎటువంటి గుణగణాలు కలిగి ఉండాలి?" అని ప్రశ్నిస్తున్నారు. ఈ విషయాన్ని ప్రస్తావించడం మాకు యిష్టం లేదు. కాని వస్తున్న ప్రశ్నల పరంపరను తట్టుకోలేక ఈ చేదుసత్యాన్ని పలకవలసి వచ్చింది.

(12-8-84)

—: o :—

నేమతుల్లా (వనపర్తి)

**ఒక స్త్రీకి నెత్తురు అవసరమున్నది. మగవాని నెత్తురు ఎక్కించవచ్చునా?**

* ఖుర్‌అన్‌లో నెత్తురు హరామ్‌గా నిర్దేశించబడిందంటె అది తినడం వరకే. ఔషధంగా వాడటం గురించి కాదు. స్త్రీకయినా పురుషునికయినా రక్తం ఎక్కించేది, ఆ రోగికి రక్తం కొరత వల్ల ప్రాణాపాయం ఏర్పడే తీవ్రమయిన ప్రమాదముంటేనే. అప్పుడు రక్తం ఓ ఔషధంలా మారుతుంది. ఏ విధంగా నయితే విటమిన్లు కొరవడితే వాటిని వాడే అవసరం కలుగుతుందో, లేదా కొన్ని రకాల వ్యాధుల్లో అతి ప్రమాదకరమయిన విషపదార్థాలను తగు మోతాదులో వాడడం తప్పనిసరి అవుతుందో అదే విధంగా రక్తపు లోటు ఏర్పడితే రక్తం ఎక్కించడమూ అవసరమవుతుంది. సూత్రప్రాయంగా, ప్రాణాపాయం ఏర్పడితే హరాం కూడా ఆ ప్రమాదావస్థను తప్పించే మేరకు హలాల్‌గా చేసుకోవచ్చు అని తెలుసుకోండి. రక్తం ఎక్కించడాన్ని ధర్మవేత్తలందరూ సమ్మతించారు. స్త్రీకి పర పురుషుని రక్తమంటారా? అది 'మందు'గా మారినప్పుడు స్త్రీదని, పురుషునిదని, తనవాడిదని, పరాయి వాడిదని ఉండదు. అంతా ఒక్కటే. అంతగా మనసొప్పకపోతే, గ్రూపు కలసినట్లయితే "తమ వారి" రక్తమే ఎక్కించుకోవచ్చు.

కాని ఒకటి మాత్రం మనం మరువరాదు. వ్యాధిగ్రస్తుల ఈ అవసరాన్ని ఆసరగా చేసుకుని కొందరు దీన్ని వ్యాపారంగా జరుపుతున్నారు. లోగడ నేను అమెరికాలో జరిగే అవయవాల వ్యాపారం గురించి ఓ సమాధానం సందర్భంలో చెప్పినట్లు గుర్తు. అలాగే వాణిజ్యపరమైన రక్తనిధులు (Blood Banks)

మన దేశంలోనూ వెలిసే ప్రమాదాన్ని త్రోసి పుచ్చలేము. ఈ ధోరణి పరిణమించి చివరికి అమెరికాలోని అవయవాల వ్యాపారంగా మారవచ్చు. నీతి, నియమంలేని, ధర్మవిహీనతకు లోనయిన సమాజం అనివార్యంగా ఎదుర్కొనే పరిస్థితి ఇది. ఇలా జరగకుండా చూడటం మన విధి.

(9-12-1983)

—: o :—

ఎం. ఎ. అఫ్జల్ (చాగల్లు)

**మనిషి ప్రాణం దైవం సొత్తు కదా! ఆయన సొత్తు ఆయన తీసుకుంటూ వుంటే అసమాన పరిపూర్ణ మయిన విశ్వాసికి కూడ ఎందుకు బాధ?**

* మీరు మహాప్రవక్త (సఅసం)ను దృష్టిలో ఉంచుకుని అంటున్నారు బహుశా! ఆయన తన తనయుడు హజ్రత్ ఇబ్రాహీం పరమపదించినప్పుడు చిందించిన రెండు బొట్లు కన్నీటిని ప్రస్తావిస్తున్నారనుకుంటా. ఈ సంఘటన ద్వారా తెలిసేదేమంటే మహా ప్రవక్త (సఅసం) కేవలం మనిషి మాత్రమే. ఆయన ఏ విధంగానూ దైవాంశ సంభూతుడు కారు, మానవ మాత్రుడు అనడానికి ఇది మరో నిదర్శనం. మీ మిత్రుడొకడు దూరప్రయాణానికి వెడుతూ మీ వద్ద తన కొడుకును వదిలాడనుకోండి- తిరిగి వచ్చి తీసుకునేందుకు. మీరు అతన్ని ప్రేమావాత్సల్యాలతో రెండేళ్ళు పోషించిన తరువాత మీ మిత్రుడు వచ్చి తన కొడుకును తీసుకువెడతానంటే మీ గుండె పాషాణం కాకపోతే- మీ నయనాలు కూడా అశ్రుపూరితాలవుతాయి. ఎందుకు? మనిషికి తన తోటివారితో, చివరికి తాను పెంచే పశువుతో సయితం మమతానురాగాలు ఏర్పడి, పెరుగుతాయి. అలా పెంచుకున్న అనుబంధాలే మీలోనూ ఆర్ద్రత సృష్టిస్తాయి. ఆ అబ్బాయి మీ మిత్రుడి కొడుకని, మీ మిత్రుడు వచ్చి అతన్ని తీసుకువెళ్ళడం తథ్యమని, మీ వద్ద అతను చిరకాలం ఉండజాలడని మీకు తెలిసినా మీ గుండె బరువెక్కడం మానదు. అరబీలో మానవునికి "ఇన్సాన్" అనంటారు. దాని ధాతువు "ఉన్స్". అంటే ప్రేమ, అనురాగాను బంధం. ప్రేమానురాగాల నిలయం ఈ "ఇన్సాన్!".

(16-12-1983)

—: o :—

అబ్దుల్ మునాఫ్ (రాజమండ్రి)

**నేను ఒక వ్యక్తికి ఎప్పుడూ సలాంచేస్తూ ఉంటాను ఆ వ్యక్తి ఎప్పుడూ నాకు సలాం చేయడు. అటువంటి వ్యక్తితో నేను ఎలా మెలగాలి?**

* మీరు మీ వైఖరిని మార్చుకోకండి. మీరు అతని ప్రసన్నతను, సంతోషాన్ని, ఏదయినా ప్రతిఫలాన్ని కాంక్షించి అతనికి సలాం చెయ్యడం లేదు. ముస్లిమయిన ప్రతి వ్యక్తి తాను చేసే ప్రతి కార్యాన్నీ దైవ ప్రసన్నతను, ఆయన సంతోషాన్ని, ఆయన ఇచ్చే ప్రతిఫలాన్ని కాంక్షించే చేస్తాడు—అలానే చెయ్యాలి. అలాంటప్పుడు మీరు అతనికి నిత్యం సలాం చేస్తూ కోల్పోయేదేమీ లేదు. మీ వాటా సత్కార్య సంపదలో, మీ సత్కార్యాల బ్యాంకు బ్యాలెన్సును మీరు నిత్యం పెంచుకుంటూ పోతున్నారన్నమాట! అతను మాత్రం ఆ నిధిని కోల్పోతున్నాడు!! ఒకవేళ అతను మీ పట్ల ఏదయినా చిన్న చూపు కారణంగా అలా వ్యవహరిస్తే నేడు కాకపోతే మరెన్నటికైనా మీలోని ఔన్నత్యాన్ని గ్రహించగల్గుతాడు. లేదా మీ పట్ల ఏమయినా వైరభావంతో అలా నడుచుకుంటూ ఉంటే ఆ వైరం కొంత కాలానికి మైత్రిగా మారే అవకాశమూ లేకపోలేదు. అందువల్ల సత్కార్య మాచరించడంలో వెనుకాడవలసిన అవసరం లేదు. మంచి పని చేస్తూ ముందుకు సాగండి. దాని ప్రతిఫలం అదే కొని దెస్తుంది — ఇక్కడ కాకపోయినా, అక్కడయినా అది లభిస్తుంది, ఇంతకు చిత్తశుద్ధి హృదయ నైర్మల్యం ఎంతైనా అవసరం.

(23-12-83)

—: o :—

జహీర్ అహ్మద్ (వినుకొండ)

**"వలి అల్లాహ్" అనబడే వారికి కొన్ని మహిమలు ఉంటాయంటారు. ఇది ఎంతవరకు నిజం?**

* 'వలియల్లాహ్' అంటే దేవుని మిత్రులు అన్నమాట! దేవుని మిత్రులు ఎవరయి ఉంటారు? ఆయన ఆజ్ఞల్ని పాలించేవారు. ఆయన సందేశ హరుని అడుగు జాడల్లో నడుచుకునేవారు. అంటే నిజమయిన ముస్లిములు, మోమినులు

అన్నమాట. నిజమయిన మోమినులు ఎలా ఉంటారో; వారి రేయింబవళ్ళు ఎలా గడుస్తాయో వారి ప్రవర్తన, నడవడి ఎలా ఉంటాయో దివ్య ఖుర్‌ఆన్‌లో ఒక్క చోట కాదు పలుచోట్ల వివరంగా ఉంది. దైవ ప్రవక్త (సఅసం) జీవితంలోను, ఆయన ప్రియ సహచరుల జీవితాల్లోనూ ఆచరణాత్మకంగా మనకు అగుపిస్తుంది. ఒక్క మాటలో చెప్పాలంటే దైవప్రవక్త సహచరులకు మించిన 'వలియల్లాహ్' ఎవరూ ఉండరనవచ్చు. వారు ఎన్ని మహిమలు చేశారో ఎన్ని మహత్యాలు చేశారో వారి జీవిత వివరాలు చదివితే తెలుస్తుంది. ఓ గొప్ప ధర్మ పరాయణుడయిన హజ్రత్‌జీ వద్దకు ఒక వ్యక్తి మహిమలు చూద్దామని వచ్చాడు. ఆయన ఖాన్‌ఖాహ్ (ఆశ్రమంలో) దాదాపు రెండేళ్ళు గడిపాడు. అతనికి ఒక్క మహిమ కూడా కనిపించలేదు. అతడు నిరాశతో వెళ్ళడానికి సిద్ధమయి హజ్రత్‌జీ వద్ద సెలవు తీసుకుందామని వెళ్ళాడు. ఆయన 'నాయనా, నీ మనోరథం యీడేరిందా?' అనడిగారు; అతడు నిర్మోహమాటంగా 'అయ్యా, నాకు నిరాశే గతయింది' అన్నాడు. ఆయన వివరాలడిగి తెలుసుకున్న తరువాత ఈ రెండేళ్ళల్లో ఇక్కడ ఏ పనయినా షరీఅత్‌కు భిన్నంగా జరగడం చూశావా?' అని ప్రశ్నించారు. అతడు లేదని సమాధానం ఇచ్చాడు. మళ్ళీ 'ఇక్కడ దైవ ప్రవక్త సంప్రదాయం ఏదయినా వదలడం గమనించావా?' అని ప్రశ్నించారు. అతడు తిరిగి లేదనే సమాధాన మిచ్చాడు. అప్పుడు ఆయన సున్నత్‌ని పాటించడం "సున్నత్‌కు భిన్నమయిన దాన్ని వదలుకోవడంకన్నా గొప్ప మహిమ మరేం కాగలదు బాబు!" అని బోధించారు.

(18-1-85)

—: o :—

ఒక సోదరుడు (రేపల్లె)

**నేను దగ్గినప్పుడు మూత్రపు బొట్టు పడుతుంది. ఎన్ని సార్లు నేను స్నానం చేసేట్లు? హస్త ప్రయోగం చేసుకోవడం నేరమా? నిద్రలో వీర్య స్ఖలనం అయితే ఉదయం నమాజుకు నడుం వరకు కడుక్కొని వెళ్ళవచ్చునా?**

* మీ సుదీర్ఘ లేఖ చదివాను. అల్లాహ్ మిమ్మల్ని సన్మార్గాన నడపాలని మనసారా కోరుకుంటున్నాను. మీరు హస్తప్రయోగం చెయ్యడం వెంటనే మాను

కోండి. అది ధార్మికంగా నిషిద్ధం అవడమే కాక మానసికంగా ఓ దౌర్బల్యం. కడకు అది శారీరకంగా కూడా బలహీనతకు కారణభూతమవుతుంది. మీరు హస్త ప్రయోగం మానుకుని సులువుగా జీర్ణమయ్యే ఆహారం భుజించి పరిశుద్ధమయిన శరీరంతో పరిశుద్ధమయిన మనస్సుతో నిద్రపోయ్యారంటే స్వప్న స్ఖలనాలు కూడా తగ్గిపోతాయి. మూత్రం చుక్కలు చుక్కలుగా రావడం కూడా తగ్గుతుంది. అందువల్ల ముందు చెయ్యవలసిన పని, ఆ పనిని మానుకోవడం. ఇక స్ఖలనం జరిగినప్పుడు "నడుం వరకు కడుక్కోని" మూత్రం చుక్కలుగా రాలితే, "స్నానం చెయ్యడం"— ఏమిటి తిరకాసు? స్ఖలనం జరిగినప్పుడు తప్పనిసరిగా స్నానం (గుస్ల్) చెయ్యవలసిందే కడుక్కోవడం వగైరా చెల్లదు. అయితే దగ్గినప్పుడు మూత్రం రాలడానికి హూమియో వైద్యుని వద్ద చికిత్స పొందండి. అంతవరకు ఒకే వుజూతో ఒక పూట నమాజులు చేసుకోవచ్చు. వుజూ చేసేటప్పుడల్లా ముందుభాగాన బట్టలపై (మూత్రపు చుక్కలు పడేచోట) తడిచ్రేళ్ళతో నీళ్ళు చల్లుకోవడం మరచిపోకండి. ఇంతకు చికిత్సకై తొందరచెయ్యండి. మీకు దైవం ఆయురారోగ్యాలు ప్రసాదించాలని ప్రార్థిస్తూ —

(28-2-86)

—: o :—

సయ్యద్ షర్రాజ్ (యర్రగొండ పాలెం)

**ముస్లిం మత గ్రంథమయిన "ఖురాన్"ను పోస్టుద్వారా పంపవచ్చా.**

* పంపవచ్చు. దాని ఆదరణ, గౌరవం అంటూ ఏవయినా ఉంటే అవన్నీ షరీఅత్ ఎవరికి వర్తిస్తుందో వారికి విధిగా వర్తిస్తాయి. మిగతా వారికి అది ఇష్టాయిష్టాల విషయం. రెండవ విషయం ఏమిటంటే, షరీఅత్ ఆదేశాల్లో అధిక ప్రాముఖ్యం ఉన్న ఆదేశాన్ని నెరవేర్చడానికి మరో ఆదేశం ప్రాధాన్యత కాస్త తగ్గినా దాన్ని భరించవలసి ఉంటుంది. ఉదాహరణకు మీరు చెప్పిన విషయాన్నే తీసుకోండి. ఖుర్‌ఆన్‌ని పఠించడం, అర్థం చేసుకోవడం ఎంతో ముఖ్యమైన విషయం. అది విధి. అలాగే ఖుర్‌ఆన్ ప్రతిని ఆదరించడం దాని గౌరవ మర్యాదల్ని పాటించడం కూడా అవసరమే. ఖుర్‌ఆన్‌ని అర్థం చేసుకునే విధిని నిర్వర్తించడం కోసం ఖుర్‌అన్ ప్రతుల్ని పోస్టు ద్వారానో ట్రాన్స్‌పోర్టు

ద్వారానో ఓ స్థలం నుండి మరో స్థలానికి చేర వెయ్యడం అవసరం. అలా చేర వెయ్యడంలో మార్గం మధ్యలో దానిపట్ల కాస్త అగౌరవంగా ఎవరయినా తెలిసో తెలియకో వ్యవహరించడం సాధ్యమే. కాని "అర్థం చేసుకోవడం" అన్న విధి నిర్వర్తన కోసం ఈ చిన్న పొరపాటును భరించడం సబబుగానే అనిపిస్తుంది. అలా అని ఖుర్ఆన్‌ని తెలిసీ అగౌరవ పరుస్తూ ఉంటే చూస్తూ ఉండడం కూడా తగదు. సమయం సందర్భాన్ని దృష్టిలో ఉంచుకుని మరీ వ్యవహరించాలి.

(14-3-86)

—: o :—

అబ్దుల్ మునాఫ్ (రాజమండ్రి)

**మహా ప్రవక్త పేదరికానికి ఎందుకు అంకితమైపోయారు?**

* మహనీయ ముహమ్మద్ (సఅసం) బాల్యం నిరుపేదల ఇండ్లల్లో గడిచింది. హలీమా సఅదియా కుటుంబంలో ఆయన పోషణ జరిగింది. ఉన్నత గుణగణాలతో, ఉత్తమ సంప్రదాయాలతో అలరారే ఆ కుటుంబాన్ని, వారి చుట్టుప్రక్కల ప్రజలు అనుభవించే దారిద్ర్యాన్ని, ఈతి బాధల్ని ఆయన స్వయాన చూచారు. ఆ తరువాత సొంత తాత హయాంలో నయినా, బాబాయి అబూతాలిబ్ కాలంలో నయినా వ్యాపార కుటుంబం కావటాన, ఆకలి దప్పుల బాధలు ఆయనకు కలగకపోయినా బాల్యంలోని ఆ అనుభవాలు ఆయన్ని వెన్నంటి ఉండేవి. పైగా ఆయన అనాథగానే పెరిగారు. అనాథత్వంలోని వ్యథ ఆయన బాగా ఎరుగుదురు. ఈ మానసిక కారణాల వల్లనే పెళ్ళయిన తరువాత సిరిసంపదలు, ఆయన పాదాలొత్తే బానిసలైనా, ఆయన నిత్యం అనాథలకు, వితంతువులకు, నిరుపేదలకు మనసారా సహాయ సహకారాలు అందజేసేవారు. ఈ విషయాన్ని ఆయన సతీమణి హజ్రత్ ఖదీజా (రజీఅన్) కూడా సాక్ష్యంగా పలికారు. తొలి వహీ అవతరించిన తరువాత ఆవిడగారు హజ్రత్ ముహమ్మద్ (సఅసం)కు ఓదార్పు మాటలు చెబుతూ పలికిన వాటిల్లో ఇది స్పష్టంగా గోచరిస్తుంది. ఆ తరువాత ఇస్లాంను స్వీకరించిన బానిసలు, వారి బీదరికం, వారి యజమానుల చేతుల్లో వారు పడినపాట్లు, వారికి ఎదురయిన కడగండ్లు మహా ప్రవక్త (సఅసం) మనస్సును బాగా చలింపజేశాయి. మానసికంగా ఈ తర్ఫీదు

ఆ తరువాత ఇస్లాం తెచ్చిన సందేశంలోని ముఖ్యాంశం: పీడిత జన సముద్ధరణ— ఆయన్ని పూర్తిగా నిరుపేదగా బ్రతకాలన్న భావానికే అంకితం చేశాయి. ప్రపంచంలోని బాధితులకు, పీడితులకు, దళితులకు చేసే సహాయం పరలోక సాఫల్యానికి సోపానం అన్న మౌలిక ప్రబోధం వల్ల కేవలం ఆయనే కాదు. ఆయన సమీప సహచరులు కూడా నిత్యం తమ జీవితం పరసేవాపరాయణం కావాలనే ఆకాంక్షించారు. అందుచేతనే ధనికులయిన ఆయన సహచరులు కనీసపు సదుపాయాలూ సౌకర్యాలయినా సరిగ్గా అమరేలా చూడాలని అనేకమార్లు ప్రయత్నించినా ఆయన దానికి ఒప్పుకోలేదు. కేవలం కష్టకాలంలోనే కాదు ఇస్లామీయ రాజ్యం బాగా విస్తరించి రాజ్య ధనాగారంలో అంతులేని ఐశ్వర్యాలు వచ్చి పడుతున్న కాలంలోనూ ఆయన పాత రీతిలోనే జీవితం గడిపారు. వచ్చిన ధనరాసుల్ని బీదల కష్టాలను తీర్చడానికి, ముఖ్యంగా బానిసలుగా జీవితం గడుపుతున్న దళితుల్ని, వారి యజమానుల బారినుండి విడుదల చేయించడానికి వినియోగించారు. ఇలాంటి పరిస్థితుల్లో ఆయన బీదరికాన్ని కాక ఐశ్వర్యాన్ని ఎలా కోరుకుంటారు?

(6-6-86)

—: o :—

వేణు (ములుగు)

**కొంతమంది హిందువులు తినే ముర్దార్‌ని ముస్లింలు ఎందుకు తినకూడదు? వారు హలాల్ ఎందుకు తింటారు?**

* ముస్లింలు తమ జీవితం మొత్తం మాదిరిగానే తినే త్రాగే విషయాల్లోనూ దైవాజ్ఞాబద్ధులయి జీవించడం ముఖ్యం. లేకపోతేవారు ముస్లిములుగా ఉండటమే కష్టం. హైందవ సోదరులను గురించి నేనేమీ చెప్పలేను. కాని ముస్లిములు 'జిబహ్' చెయ్యకుండా చనిపోయినవాటినీ, దైవ ప్రవక్త (సఅసం) సంప్రదాయం ప్రకారం 'జిబహ్' చెయ్యనివాటినీ భుజించరాదన్నది దైవాజ్ఞ. 'జిబహ్' చేసే ప్రక్రియలో రెండు అంశాలున్నాయి. ఒకటి క్రియాత్మకమయింది; మరొకటి ఆధ్యాత్మికమయింది. మనిషి దైవాన్ని, దైవ ధర్మాన్ని, దైవ మార్గదర్శకత్వాన్ని, దైవ సందేశహరుల్ని నమ్మేవాడయితే ఆ విశ్వాసాలను మనసా

వాచా కర్మణా అనుసరిస్తాడు. అలాంటి వ్యక్తి దైవంపైగల ఆ విశ్వాసాన్ని ఆధారం చేసుకుని దైవనామస్మరణ చేస్తూ జంతువులను జిబహ్ చేస్తాడు. ఇది ఆధ్యాత్మికమయిన లేదా మానసికమయిన అంశం. ఇకపోతే క్రియాత్మక విషయం: జంతువును కంఠం వద్ద కేవలం రక్తనాళాలను మాత్రం, — వెన్నెముక, అందులో ఉన్న నరాల సముదాయాన్ని కోయకుండా — తెగ్గొట్టటమే జిబహ్ అనబడుతుంది. ఈ ప్రక్రియలో రక్తమంతా దేహం అన్ని భాగాలనుండి ఈ రక్తనాళాల ద్వారా బయటికి ప్రసరిస్తుంది. జంతుమాంసం ఆరోగ్యానికి హాని కలిగించకుండా ఉండేందుకు ఇది ఎంతో ఉపకరిస్తుందని వైద్య నిపుణుల అభిప్రాయం కూడా వుంది. అందువల్ల ముర్దార్ తినడం నష్టదాయకం. ఇవే హలాల్ (జిబహ్) చెయ్యడంలో ఉన్న ఆధ్యాత్మిక, నైతిక, ఆరోగ్యపరమయిన మర్మ హేతువులు. ఇలాంటివి ఇంకా ఎన్నో ఉండవచ్చు. మనిషి దైవాదేశాలను పాటించడం మూలంగా ప్రయోజనమే కలుగుతుంది కాని నష్టం కాదు.

(1-8-86)

—: o :—

యండి. మహమూద్, టైలర్ (చిన్నచింతకుంట)

**కుటుంబ నియంత్రణపై మీ అభిప్రాయం ఏమిటి? నాకు తెలిసినంతవరకు పెద్దకుటుంబమున్నవాళ్ళు చాలా ఇబ్బందుల్లోనే వున్నారు.**

* "కుటుంబ నియంత్రణ" అన్న ప్రయోగంలోనే ఉంది, అది ఒక వ్యవస్థద్వారా, అధికార వ్యవస్థద్వారా అమలుజరిపే కార్యక్రమమని. పెద్ద కుటుంబాలవాళ్ళు ఇబ్బందుల్లో ఉండటం నిజమే కావచ్చు. కాని అది ఆ కుటుంబానికి సంబంధించిన సమస్య. ప్రభుత్వం బాధ్యత ఏమిటంటే తన పరిపాలనా పరిధిలో ఉన్నవారికి కావలసిన సదుపాయాలు సమకూర్చడం. అంతేకాని భీతి గొలిపి, ఆశ రేపి ప్రజల్ని నిర్బంధించడంకాదు. ఈ కారణాలవల్ల ఇస్లామీయ షరీఅత్ వేత్తలు ప్రభుత్వపరంగా ఉద్యమరీతిలో కుటుంబ నియంత్రణ జరపడాన్ని ససేమిరా ఒప్పుకోవడంలేదు. అయితే, వ్యక్తిగతంగా ఎవరయినా గర్భ నిరోధక పద్ధతులు అవలంబించవచ్చా? అన్న ప్రశ్నకు సంబంధించినంతవరకు షరీఅత్ వేత్తల్లో భేదాభిప్రాయముంది. కొందరు వైద్య సలహామేరకు తప్ప

ఎట్టి పరిస్థితుల్లోనూ గర్భనిరోధక పద్ధతుల్ని అవలంబించడాన్ని ఒప్పుకోరు. కొందరు వ్యక్తిగతంగా, వేరే కారణాలవల్ల కూడా అలా చెయ్యవచ్చు అంటారు. ఇలా అనేవారిలోనూ భేదాభిప్రాయముంది. అంటే వీరు ఏ పద్ధతిని వినియోగించాలి? అన్న విషయంలో విభేదిస్తారు. అనేకమంది షరీఅత్ వేత్తలు వేసక్టమీ (Vasactomy), ట్యూబక్టమీ (Tubactomy) లను నిషేధిస్తారు. కండోమ్ (condome) పద్ధతిని సమర్థిస్తారు. కొందరేమో వాటితోసహా ఏ పద్ధతి అయినా అవలంబించవచ్చు అనంటారు. క్లుప్తంగా చెప్పాలంటే షరీఅత్ వేత్తలందరి దృష్టిలోనూ ప్రభుత్వస్థాయిలో నిర్బంధించడం నిషిద్ధం. వైద్యసలహామేరకు గర్భనిరోధక పద్ధతులు (ఏవయినాసరే) అవలంబించడం ధర్మబద్ధం. ఇతర కారణాలవల్ల గర్భ నిరోధన జరపడంలోను, దానికి అవలంబించే పద్ధతుల్లోనూ ధర్మవేత్తల మధ్య భేదాభిప్రాయముంది.

(9-1-87)

—: o :—

ముహమ్మద్ హాజి (బొబ్బిలి)

**చనిపోయినవారి బంధువులు సమాధిలో తలభాగమున సమీపమున అహద్ నామ పుస్తకమును తెరచి వుంచి యధాప్రకారం సమాధి పూడ్చివేశారు. దీన్ని నేను ఖండించాను ఖబరస్తాన్ నుండి తిరిగివచ్చాక నాకు పుస్తకము హవాలా యిచ్చి ఆ విధముగా చేయవచ్చును అని పదుగురిలో ఒప్పించగలిగారు...**

* ప్రింటయిన ప్రతి వస్తువు నిర్ధారితం, ప్రామాణికం అంటే ఎలా? మీరు పంపిన పామ్‌ఫ్లెట్‌లో ఉటంకించివున్న హదీసులు ఏ హదీసు గ్రంథం నుండి గ్రహించారో ఆ రిఫెరెన్సు అందులో లేదు. అది లేనిదే దేన్నీ ఒప్పుకోవడానికి వీల్లేదు. పైగా అలా చేసినట్లు సహాబాల ద్వారాగాని, ఆ తరువాత వారి ద్వారాగాని ఎలాంటి సమాచారం మనకు అందలేదు. అందులో చెప్పిన విషయాలన్నీ ఇస్లామ్ మౌలిక నమ్మకాలకు విరుద్ధమయినవి. అందువల్ల దాన్ని పూర్తిగా నిరాకరించవచ్చు. ఇస్లాం చెప్పేదేమంటే మనిషికి పరలోకంలో ఉపయోగపడేవి అతని విశ్వాసాలు, ఆచరణలేకాని మరేదీ కాదు. సరయిన ఆచరణ లేనివారికి

మహనీయ ముహమ్మద్ కూడా పరలోకాన సిఫారసు చేయలేరని రూఢిగా మనకు తెలుసు. అలాంటప్పుడు, అహద్ నామాలు, పీర్ సాహెబ్‌గారి షత్రాలు ఎలా ఉపకరిస్తాయి. ఇవన్నీ మూఢ నమ్మకాలు ఖుర్‌ఆన్ మరియు హదీసుల ద్వారా ఆధారం దొరకని నమ్మకాలు. మరో విషయం ఏమిటంటే ఇలాంటి సందర్భాలలో ఆ క్షణాన సంస్కరించాలని భావించడం అప్పుడే, సంస్కరణా పటిమను చూపడం భావ్యం కాదు. అది సమయం కాదు. విజ్ఞత చెప్పేదేమంటే మనిషి శాంతంగా ఆలోచించడానికి, స్వీకరించడానికి సిద్ధంగా ఉన్న తరుణంలో ఇలాంటి విషయాలు బోధించడానికి కృషి చెయ్యాలి. లేకపోతే తప్పు పనులు చేసేవారు మొండిగా వ్యవహరించే ప్రమాదముంది.

(13-3-87)

—: o :—

దైవ బంధువు, (బాపట్ల)

**ఖుర్‌ఆన్ ఒక ఆయతు చదివితే 100 నఫిల్ రకాతులకంటే పుణ్యము. ఒక అక్షరము చదివితె 10 పుణ్యములు అన్నారు అలాగే, ఒక హదీసు చదివితే యింత పుణ్యము అని ఏమన్నా చెప్పియున్నారా?**

* మీ పేరు ఏది ప్రకటించమంటే అదే ప్రకటిస్తారు పత్రికల వాళ్ళు. కాని వాళ్ళ రికార్డుకై మీ పూర్తి చిరునామా స్పష్టంగా వ్రాయడం అవసరమే. ఇక మీ ప్రశ్న. "చదివి" పుణ్యఫలాలు సంపాదించుకునే ధర్మంకాదు ఇస్లాం. మతం యొక్క మూఢభావనను ప్రజల్లో వ్యాప్తంచేసిన పాశ్చాత్యుల పుణ్యమా అని ముస్లిములు తమ ధర్మం యొక్క క్రియాశీల నైజానికి పూర్తిగా దూరమయి పొయ్యారు. చదివితే పుణ్యం లభిస్తుందంటే అది వట్టి పుణ్యానికి లభించదు. పూర్వం, చదవడమంటే అర్థంచేసుకుని చదవడమే. ఇప్పుడు వచ్చింది ఈ అర్థం చేసుకోకుండా చదవడమన్నది. అది దైవ గ్రంథమని నమ్ముతూ, అది మన జీవన మార్గాన్ని సుగమం చెయ్యడానికి అవతరించిన మార్గదర్శకత్వం అన్నభావనతో అర్థంచేసుకుంటూ "చదివితే" పుణ్యమూ లభిస్తుంది జీవితంలో అది కోరే మార్పు వస్తుంది. అలాకాక కేవలం పారాయణం చేసుకున్నట్లయితే స్వచ్ఛమయిన నీటి సెలయేరు పారుతుండగా, దప్పికగొన్నవాడు దాని ఒడ్డున

కూర్చుని "దాహం, దాహం" అని అరవడంతో సమానం! రెండడుగులు ముందుకువేసి తనివితీరా దాహం తీర్చుకోవడమే కావలసింది. దివ్య ఖుర్‌ఆన్ హదీసులు మనలో ఏ మార్పును కాంక్షిస్తున్నాయో దానికై మనం సిద్ధమయితే సకల పుణ్యాలూ ప్రాప్తమవుతాయి. పారాయణ పుణ్యంతో సరిపెట్టుకునే దురదృష్టవంతులు ఎందుకవ్వాలి ముస్లిములు?

(20-4-87)

—: o :—

షేక్ షబ్బీర్ (తాడికొండ)

**ఫిఖా అంటే ఏమిటి? నలుగురు యిమామ్‌లు (హనఫి, షాఫి, హంబలి, మాలికి) సూచించిన రీతులలో భిన్నత్వము ఎందుకు వచ్చింది? మనము తప్పక వీరిని అనుసరించవలసిందేనా? అనుసరించినచో ముస్లిం సమాజంలో భిన్నాభిప్రాయములు వచ్చుచున్నవి కదా?**

* ఫికహ్ అంటే ఇస్లామీయ పరిభాషలో ధర్మావగాహనలో వివేచనను విచక్షణను వినియోగించి చేసిన నిర్ణయాలని అర్థం. ఈ స్థూలమయిన నిర్వచనం ద్వారానే తెలుస్తోంది కదా, బుద్ధీ వివేకాలు మనషులందరివీ సమానం కావు కాబట్టి ఇందులో వ్యత్యాసం ఉండటం సహజమని. మహాప్రవక్త (సఅసం) కాలంలోనూ ఆ తరువాత చాలా కాలం వరకు ప్రవక్త సహచరుల వల్ల దైవ ప్రవక్త సంప్రదాయాలు, వాటి వెలుగులో విభిన్న సమస్యల పరిష్కారాలు సర్వసామాన్యంగా ప్రచారంలో ఉండేవి. ఆ తరువాతివారికి పరంపరాగతంగా వచ్చే కొన్ని నియమాలు తప్ప మిగతా విషయాల్లో హదీసులన్నీ వెదకి ఓ ప్రత్యేక సమస్యకు సమాధానం తెలుసుకోవడం దుస్సాధ్యమయింది. అప్పుడు హదీసు గ్రంథాలు సయితం సంకలన రూపంలో (ఇప్పటి మాదిరిగా) లేవు. ఆ సమయంలో ఈ మహానుభావులు దివ్య ఖుర్‌ఆన్, హదీసుల ఆధారంగా ప్రవక్త మహనీయుల (సఅసం) సున్నత్‌ని తమ అవగాహనా స్థాయి ప్రకారం నిర్ధారించడానికి కృషి చేశారు. అందువల్లనే ఆయా వ్యక్తులు ప్రవక్త సంప్రదాయాన్ని అర్థం చేసుకున్న తీరును బట్టి వాటిలో విభేదాలున్నాయి. నేడు హదీసులన్నీ కనీసం 6 గొప్ప

గ్రంథాల్లో వేలకొద్ది సంఖ్యలో సంకలనమయి ఉన్నాయి. మీరు వాటిని క్షుణ్ణంగా అర్థం చేసుకుని వాటి ద్వారా మీ మార్గాన్ని నిర్ణయించుకోగలిగితే మీరు ఎవరినీ అనుసరించనవసరం లేదు. కాని ప్రతి వ్యక్తికి ఇది సాధ్యం కాదు కాబట్టి వారు, ప్రపంచం మొత్తాన గొప్ప ధర్మవేత్తలుగా ఖ్యాతి నొందిన వారిని అనుసరిస్తారు. స్వయంగా మీరూ, నేనూ ప్రవక్త మహనీయుల (సఅసం) సంప్రదాయాన్ని అర్థం చేసుకుని అనుసరించినా, మన అనుసరణలో ఎంతో కొంత తేడా ఉండక పోనదు. ఆ వ్యత్యాసం ధర్మపరిధిలో పెద్దగా చెప్పుకోదగింది కాకపోవడం వల్లనే ఆ వ్యత్యాసానికి తావు ఏర్పడింది. అందుచేత ఈ వ్యత్యాసం వల్ల ఎలాంటి తప్పు వాటిల్లదు. ఏఏ విషయాలయితే మౌలికమైనవో, ప్రాథమికమైనవో వాటిలో ఎవరికీ భేదాభిప్రాయం లేదు. 14 వందల ఏళ్ళ నుండి ముస్లింలు ఈ విధానాలను అనుసరిస్తూ వచ్చారు. వీటి కారణంగా ముస్లిం సమాజంలో ఏ విపత్తూ వచ్చి పడలేదు. ఎందుకు? నిజమయిన ధర్మం ఏమిటో, స్వల్పమయిన విషయాల స్థానమేదో అందరూ గ్రహించి తదనుగుణంగా మసలుకునేవారు. నేడు కూడా ముస్లిములు సరయిన అవగాహనతో మసలుకుంటే ఎలాంటి విభేదాలూ తలెత్తవు.

(24-7-1987)

—: o :—

జి. సత్యనారాయణ (న్యూ పాల్వంచ)

**గణేష్ ఉత్సవములలో ప్రముఖ ముస్లిం వ్యాపారవేత్తలు పాల్గొనాలంటే వారు మజీదు నుండి అనుమతి పొందాలా?**

* ఇస్లాంలో మస్జిద్ వ్యవస్థ మీరనుకున్నట్లుగా 'చర్చి' వ్యవస్థ లాంటిది కాదు. మస్జిద్ కేవలం సామూహిక దైవారాధన, ఇతర ఇస్లామీయ సామాజిక వ్యవహారాల కొరకు మాత్రమే ఉపయోగపడుతుంది. ఇకపోతే మీ అసలు ప్రశ్న సామరస్యం, సదవగాహనల కొరకు హిందువులయినా ముస్లిములయినా తమ మతపరమయిన విశ్వాసాల విషయంలోనూ, ఆచార వ్యవహారాల్లోనూ ఎలాంటి ఇచ్చి పుచ్చుకోవడాలకు, రాజీకి రావలసిన పనిలేదు. అందరూ తమ తమ పరిధుల్లో ఉంటూనే కలసి మెలసి ఉండవచ్చు. పూజా పురస్కారాల్లో పాల్గొం టేనే స్నేహమంటే ఎలా? అనేక సామాజిక వ్యవహారాలున్నాయి, అన్ని వర్గాలూ

పరస్పరం వాటిలో పాలుపంచుకోవచ్చు. సుఖ దుఃఖాల్లో భాగం పంచుకుని అన్యోన్య ప్రేమానురాగాలను పెంచుకోవచ్చు. ముస్లిములు విగ్రహారాధన చెయ్యరు. అది వారి మత విశ్వాసానికి సంబంధించిన విషయం. అందులో పాల్గొనడానికయినా, దానికి ద్రోహదపడడానికయినా ఏ వ్యక్తీ ఇష్టపడడు. అందువల్ల ఇలాంటి సున్నితమయిన విషయాల్లో స్నేహాన్ని, సుహృద్భావాన్ని తీసుకువచ్చి మనిషిని ఇబ్బందిలో పెట్టడం భావ్యం కాదు.

(4-12-87)

# 7. అర్థాలు, అపార్థాలు

మణి (కర్నూల్)

**అవివాహిత వ్యభిచరిస్తే ఇస్లాం మరణ దండన విధిస్తుంది. పతితలకు పశ్చా త్తాపంచెంది పరివర్తన చెందే అవకాశమే లేదా?**

* మీరు పొరబడ్డారు. అవివాహితలకు నూరు కొరడా దెబ్బలే శిక్ష. వివాహిత స్త్రీ పురుషులకు మాత్రం బయలు ప్రదేశంలో రాళ్ళు రువ్వి చంపడం శిక్ష. ఈ శిక్షను అమలు పరచడానికి ఇస్లామీయ రాజకీయ వ్యవస్థ నెలకొనడం చాలా అవసరం. అది లేకుండా ఇస్లామీయ శిక్షాస్మృతిని అమలు పరచడం సాధ్య పడదు. ఇస్లాం కేవలం ఓ శిక్షాస్మృతిని తయారు చెయ్యలేదు. అదొక పరిపూర్ణ జీవనవ్యవస్థ. అది నిర్మించగోరే సామాజిక వ్యవస్థలో స్త్రీ పురుషులు విచ్చల విడిగా కలవడం, విశృంఖలంగా వ్యవహరించడం మాత్రం ఉండవు. కుటుంబ వ్యవస్థలో పెళ్ళి యీడు వచ్చిన యువతీ యువకులకు ఇస్లామీయ శిక్షణ ఇచ్చి వీలైనంత త్వరగా పెళ్ళిచేసివేస్తారు. స్కూళ్ళల్లో, కాలేజిల్లో, ఆఫీసుల్లో,బస్సుల్లో స్త్రీ పురుషులు భుజానికి భుజం రాసుకుంటూ తిరగడానికి వీల్లేదు. కొన్ని బంధు త్వాలకు తప్ప ఇతర స్త్రీ పురుషులు విచ్చలవిడిగా కలుసుకోడానికి అవకాశం ఉండదు. ఆ తరువాత సమాజంలో పవిత్రతను, పరిశుద్ధతను ప్రచారం చేసే, మంచిని పెంచే, చెడును చెరిపే భారం ప్రభుత్వంపై ఉంచి దానికి తోడ్పడే భారం ప్రజల పైనా ఉంచింది. ఎక్కడయినా చెడును చూస్తే దాన్ని అక్కడి కక్కడే మట్టు పెట్టాలని బోధించింది. ఒక చెడును వీధి కెక్కించి దాన్ని నలు గురూ విని, చూచి ఇంకాస్త పెంచేలా చెయ్యడాన్ని నిరుత్సాహపరిచింది. ఇదంతా ఎందుకు చెప్పవలసివచ్చిందంటే ఇస్లాం కేవలం వ్యభిచారాన్నే మహా అపరాధంగా ఎంచలేదు. సమాజంలో ఈ విధంగా వాటి ద్వారాలు, మార్గాలు సయితం మూసి వేసింది.

ఇలాంటి శుభప్రదమయిన వాతావరణంలోనూ ఎవరయినా 'మానసిక దౌర్బల్యమో, పైశాచిక ప్రవృత్తి'కో లోనయి ఏదైనా చెడు కార్యం చేస్తే దాన్ని చూచి నేరారోపణ చేసిన వారు నలుగురు సాక్షులను తేవలసి ఉంటుంది. తప్పుడు నేరారోపణకు 80 కొరడా దెబ్బల శిక్ష, తప్పుడు సాక్ష్యానికి శిక్షతోపాటు అలా ఇచ్చిన వ్యక్తి మరే సాక్ష్యాన్నయినా ఇవ్వడానికి జీవితాంతం అనర్హతను పొందుతాడు! అబద్ధపు సాక్ష్యం అంత గొప్పనేరం. ఇన్ని పకడ్బందీలుండగా ఏ స్త్రీ అయినా, పురుషుడయినా వ్యభిచారానికి పాల్పడితే నైతికతకు, పవిత్ర జీవితానికి ప్రాధాన్యతనిచ్చే సమాజం ఏంచేస్తుంది? చీల్చి చెండాడాలని అభిలషిస్తుంది! అందునా వివాహం ద్వారా తమ లైంగిక వాంఛ పరిపూర్తికొరకు రాచమార్గం ఉండగా ఇలా అపమార్గం తొక్కేవారికి మరణశిక్ష, అవివాహితులకు 100 కొరడా దెబ్బల శిక్ష సహేతుకంకాదా? ఇస్లామీయ వ్యవస్థనే ఎవరయినా సరయింది కాదని వాదించవచ్చు. కాని అది కోరే పవిత్ర సామాజిక వ్యవస్థలో ఇంతకంటే మంచి మార్గం మరొకటి కాజాలదని మాత్రం ఎవరైనా చెప్పగలరు.

పోతే పశ్చాత్తాపం విషయం. ఒకవేళ ఒక వ్యక్తి తప్పుచేసి, పట్టుబడి, చట్టరీత్యా శిక్ష పొందినా అదే అతని పశ్చాత్తాపం. ప్రాపంచిక శిక్ష పరలోక మోక్షానికి తొలిమెట్టు అని చెప్పవచ్చు. ఆ పాపానికి ఆ వ్యక్తికి ఇక పరలోకపు శిక్ష ఇన్షా అల్లాహ్ ఉండదు. పట్టుబడని వ్యక్తి తాను చేసింది 'అపరాధం' అని తెలుసుకున్న క్షణంలోనే పశ్చాత్తాపం చెంది ఇక మీదట చెయ్యరాదని దృఢ సంకల్పం చేసుకుని దైవాన్ని క్షమాభిక్ష కొరకు వేడుకుంటే అతడు లేక ఆమె క్షమించబడతారని దివ్య ఖుర్ఆన్ చెబుతోంది.

(24-6-83)

—: o :—

డాక్టర్ ఎ. రియాజుద్దీన్ (గుత్తి)

**దివ్య ఖుర్ఆన్‌లో వివిధ సూరాల కూర్పు అవి దిగిన క్రమములో కాక, విషయక్రమంలోను కాక, ప్రస్తుతమున్న క్రమములో నుండుటలో గల ఆంతర్యమేమిటి?**

* ఈ కూర్పు మహనీయ ముహమ్మద్(సఅసం)దైవాదేశాల కనుగుణంగా చేశారు. సూరాల అవతరణ ఓ ప్రత్యేక వాతావరణంలో, ప్రత్యేక పరిస్థితిలో అప్పటి అవసరాలకు అనుగుణంగా జరిగింది. ఐతే ఉద్యమం పూర్తయిన తరువాత ఆ వాతావరణమూ ఉండదు. ఆ పరిస్థితులూ ఉండవు. ఆ అవసరాలు అంతకన్నా ఉండవు. అలాంటప్పుడు అవతరణా క్రమంలో కూర్పు చెయ్యడంలో అర్థమే లేదు. పోతే విషయ క్రమం, దివ్య ఖుర్ఆన్‌లో వివిధ శాస్త్రాలకు, మానవ జీవితానికి సంబంధించిన విభిన్న రంగాలకు మనిషి ప్రపంచంలో ఎదుర్కొనే అనేక ప్రశ్నలకు సమాధానాలున్న మాట వాస్తవమే. కాని ఇది ఏవయిన శాస్త్రీయ గ్రంథం కాదు. ఇది సందేశాత్మక గ్రంథం. ఈ సందేశానికి సంబంధించిన మౌలిక అంశాలు సకల శాస్త్రీయ విషయాల ప్రస్తావనలతో పాటు సమంగా కొనసాగటం అవసరం. అందువల్ల మౌలిక విశ్వాసాలను ఆధ్యాత్మిక, కుటుంబ, సాంఘిక, ఆర్థిక, రాజకీయ ఇత్యాది విషయాల మధ్య మధ్యన అనునిత్యం గుర్తుచేసే రీతిలో విశ్వప్రభువు, సర్వోపరిజ్ఞాని అయిన అల్లాహ్ దివ్య ఖుర్ఆన్‌ని కూర్పుచేసే ఆదేశాలిచ్చాడు. అదే విధంగా కూర్పు జరిగింది.

(5-8-83)

—:o:—

కె. వీరబ్రహ్మం, (శ్రీశైలంకాలని ఈస్ట్)

**మహమ్మదన్స్, ముస్లిమ్స్, ఇస్లామీస్‌కు గల తారతమ్యం తెలుపగలరు.**

* ఇస్లాంను అనుసరించేవానిని ముస్లిం అనే అంటారు. అయితే ముస్లిములు రాజకీయంగా పతనావస్థలో ఉన్నప్పుడు (సహజంగానే సాంస్కృతికంగా కూడా దెబ్బతిన్నారు) పాశ్చాత్య రచయితలు ''క్రీస్తు'' అనుయాయులైనవారిని "క్రిస్టియన్స్" అన్న విధంగానే 'ముహమ్మద్' అనుయాయులన్న భావంలో ముస్లిములను 'ముహమ్మడన్స్' అని అన్నారు. ''ఇస్లామీస్'' అన్న పదం నేనెక్కడా చదవలేదు. ఇస్లాంతో సంబంధం గలవారన్న భావంలో ఎవరైనా ప్రయోగించి ఉంటారు. ఇంతకు అసలు ఇస్లాంను అవలంబించే వారిని ముస్లిములని అనడమే సరయిన పద్ధతి. అదే దివ్య ఖుర్ ఆన్‌లో వారికివ్వబడిన పేరు.

(16-9-83)

—:o:—

సయ్యద్ వలిభాషా (కువైట్)

**అల్లాహ్ ఖుర్ఆన్‌లో ఖింజీర్ (పంది) యొక్క మాంసము ఎందువలన నిషిద్ధము చేసినాడు?**

* మనిషి తినే ఆహారం యొక్క ప్రభావం మనిషిపై రెండు విధాలుగా పడుతుంది. ఒకటి శారీరకంగా మరొకటి నైతికంగా. శారీరకంగా పడే ప్రభావాన్నయితే విజ్ఞానశాస్త్రజ్ఞుడు చెప్పగలడు కాని నైతికప్రభావాన్ని ఏ సైంటిస్టూ చూపలేడు. పంది సహజంగా లజ్జా విహీనమయిన జంతువు, ఎంతో అశుద్ధంగా రోతగా ఉంటుంది. పందిని తినే జాతుల్ని చూడండి వారిలో లజ్జావిహీనత, నీతి బాహ్యత ఏ విధంగా వారి సంస్కృతిలో జీర్ణించుకుపోయిందో. పందిని తినని జాతులు కూడా నీతిబాహ్యమయిన పనులకు పాల్పడవచ్చు. కాని లజ్జావిహీనత వారి సంస్కృతిలో అంతర్భాగంగా మాత్రం స్థానం పొందజాలదు!! వారు కేవలం అంధానుకరణకు లోనయి అలా వ్యవహరిస్తుండవచ్చు. కాని వారి సమాజంలో తన పెళ్ళాంను ఇతరులకు అప్పజెప్పి ఇతరుని పెళ్ళాం నడుంపై చేతులు బిగించి డాన్సు చెయ్యడం మాత్రం గొప్ప సంఘ మర్యాదగా పరిగణించటం ఎన్నటికీ జరగదు. పందిని తినేవారిలోని "ఈ ఉన్నత నాగరికత" తిననివారిలో ఎన్నటికీ జొరబడజాలదు.

(16-12-1983)

—: o :—

యం. ఏ. ప్రసాద్ (మఖల్)

**అరబ్ దేశాలలో నీరు దొరకక అక్కడి ప్రజలు జుమ్మకి జుమ్మ స్నానము చేస్తారు నీటికి నిలయమయిన మనదేశ ప్రజలు జుమ్మకి జుమ్మా అని ఆచారము ఎందుకు పాటిస్తారు?**

* ఇదీ వసతి లేకనే ఏమో! ఆంధ్ర ప్రాంతాల్లోనూ, తమిళనాడు ప్రాంతాల్లోనూ, కేరళలోనూ ప్రతిదినం "ఆచారం"గానే స్నానంచేస్తారు ముస్లిములు—జుమ్మకు జుమ్మ (శుక్రవారానికి శుక్రవారం) కాదు!! జుమ్మా (శుక్రవారం) రోజున చేసే స్నానం సున్నత్ (అంటే మహాప్రవక్త సంప్రదాయం) మాత్రమే. కాని స్త్రీ పురుషులు కలిసినప్పుడు, స్వప్న

స్ఖలనం జరిగినప్పుడు, మహిళలు ఋతుస్రావం జరిగిన తరువాత, బాలింత స్రావం ఆగిన తరువాత కూడా స్నానం చెయ్యడం తప్పనిసరి. ఇవన్నీ జుమ్మకు జుమ్మరావు. ఏరోజయినా జరగవచ్చు.

(2-3-84)

—: o :—

అబ్దుల్ మునాఫ్ (రాజమండ్రి)

**అన్యాయంగా, అక్రమముగా వచ్చిన డబ్బుకి "అల్లాహ్‌కే ఫజల్‌సే ఆయా" అని అంటారు. మరి మీరేమి అంటారు?**

* దేవుడు ప్రపంచంలో అన్ని మార్గాలూ మనిషికై తెరిచే ఉంచాడు. అక్రమంగా నయినా సక్రమంగా నయినా ఆర్జించుకోవచ్చు. అక్రమ సముపార్జన చేసి దాన్ని దైవకృపగా భావించి, ఆత్మవంచనకు, పరవంచనకు లోనవుతున్న వారిని మేము ఏమీ అనలేము. అక్రమ సంపాదనతో తిన్న ఒక్క మెతుకు శరీరంలోకి వెళ్ళినా, ఒక్క పోగు దేహంపైవున్నా ఆరాధనలన్నీ బూడిదపాలైన పన్నీరవుతాయన్నది మహాప్రవక్త బోధన. దాన్ని విస్మరించి ఎవరయినా ఇతరుల్ని మోసపుచ్చినా "అంతా ఆ కరుణామయుని కృప" అంటూ అధర్మంగా సంపాదిస్తూ నేడు సకల సుఖభోగాలు ఆస్వాదించినా రేపు తీర్పుదినాన ఆ సంపాదనకు, వంచనకు అన్నిటికీ లెక్కకట్టి మరీ శిక్ష అనుభవించవలసి ఉంటుందని తెలుసుకుంటే మంచిది.

(2-3-84)

—: o :—

ముమ్‌తాజ్ బేగం (నెల్లూరు)

**క్రింద నేలపై, చాపపై 'దస్తర్' పరచుకొని భోజనం చేయడం తప్ప రోజూ పండుకునే మంచంపై కూర్చొని భోజనం చేయడం వలన, కుర్చి బల్లలపై కూర్చొని భోజనం చేయడంవలన, ఇంటిలోని సంపద తరిగిపోతుందని ఈ మధ్య మా ఇంటికి వచ్చిన పెద్దావిడ సెలవిచ్చారు. అసలు 'పద్ధతి' ఏదండి?**

* అన్నీ బూటకాలు, అయితే మంచం పై కూర్చుని తినడం వల్ల మెతుకులు ఏవయినా దానిపైబడి చీమల్లాంటివి చేరే అవకాశముంది. అది తప్ప మరే ఆక్షేపణీయమయిన విషయమూ నాకు గోచరించలేదు. కుర్చీ, బల్లపై కూడా భోజనం చెయ్యవచ్చు. సంపద తరిగిపొయ్యేది వీటివల్ల కాదు, తినేది ధర్మ సమ్మతమయిన (హలాల్) వస్తువేనా? ధర్మబద్ధంగా తయారయిన భోజనమేనా? హలాల్ సంపాదన ద్వారా పొందిన భోజనమేనా? ఒకరి హక్కును కాజేసి, ఒకరిని దోచుకుని, నిషిద్ధమయిన మార్గాల ద్వారా పొందిన భోజనం కాదు కదా? అన్న అంశాలపైనే మనిషి సౌభాగ్యమూ, దౌర్భాగ్యమూ ఆధారపడి ఉంటాయి.

(9-3-84)

—: o :—

షేక్ నజీర్ బాషా (కలువాయి)

**ఖత్నా చేయించుకోకపోయినా ఒక కల్మా చదివితే చాలునా?**

* ముస్లిమేతర సోదరుల్లో మాదిరిగానే ముస్లిముల్లో కూడా ఈ దురభిప్రాయం ప్రాకిపోవడం శోచనీయం: "ముస్లిం అవడానికి గుర్తు ఖత్నా లేక సున్నతి చేయించుకోవడం" అన్నది. నేడు సున్నతి యొక్క వైద్య పరమయిన లాభాలను చూచి ముస్లిములు కానివారు అనేకమంది ఖత్నా చేయించుకుంటున్నారు. అంతమాత్రాన వారంతా ముస్లిము లయ్యారని అర్థం కాదు. అసలు విషయం "విశ్వాసం". ఇస్లాం ఏఏ విషయాలపట్ల విశ్వాసం కలిగి ఉండాలని కోరుతుందో వాటిని విశ్వసించడం. ఆ తరువాత "ఆచరణ". అలా విశ్వసించిన వారు, ఇస్లాం తమలో ఏఏ మార్పులు కోరుతుందో వాటినన్నింటినీ తమ జీవితాల్లో జీవింపజేసుకోవడం. ఇందులో ఖత్నా పాత్ర బహు స్వల్పమయింది, అప్రధానమయింది. ఒక వ్యక్తి విశ్వాసాల నన్నింటినీ కలిగి ఉండి ఆచరణ రీత్యాకూడా సరయిన మార్గాన ఉన్నట్లయితే అతడు ఒకవేళ ఏ కారణం వల్లనయినా సున్నతి చేయించుకోకపోయినా అతని ఇస్లామ్‌లో ఎలాంటి లోపం రాదు. అతను మస్జిద్‌కు వెళ్ళడమే కాదు, జిబహ్ చేసినా, హజ్ చేసినా జకాత్ ఇచ్చినా, అన్నీ చెల్లుతాయి, అతను దైవమార్గాన కృషిచేస్తూ షహీద్ (అమరగతుడు) అయితే ఇతర అనువంశిక ముస్లిములనేకులకంటే ఎంతో గొప్పవాడు! ఈ సందర్భంలో మరో

విషయం కూడా చెప్పడం అవసరమని భావిస్తున్నాను. ఒకవేళ ఏ ముస్లిమేతర సోదరుడయినా పరిశుద్ధంగా ఉండి మస్జిద్‌లోకి వచ్చి ప్రార్థనలో పాల్గొన్నా లేక దాన్ని పరిశీలించినా అతనికి అడ్డగించే అధికారం ఎవరికీ లేదు. ఈ విషయంలో "ఈమాన్ వాస్తవికత" అన్న పుస్తకం చదవండి.

(16-11-84)

—: o :—

గౌస్‌సాహిబ్ (కర్నూల్)

**జెజియాపన్ను అనగానేమి? ఇస్లాం ధర్మమునననుసరించి దానిని ఎవరు, ఎప్పుడు ఎక్కడ, ఎట్లు విధించవచ్చును? ఔరంగ జేబు, "జి జి యా" అను జుట్టు పన్ను విధించి హిందువులను తరచుగా వేధించెనని ప్రతీతి?**

* 'జిజ్‌యా' అనేది ఒక రకమయిన రక్షణ నిధి (Defence fund) 'ఇస్లామీయ రాజ్యం'లో ఎప్పుడయినా యుద్ధాలు జరిగితే అవి కేవలం సైద్ధాంతిక ప్రాతిపదికంపైనే జరుగుతాయి. తమకు విశ్వాసంలేని సిద్ధాంతాలకొరకు ఇస్లామీయ రాజ్యంలో నివసించే ముస్లిమేతరులు పోరాడవలసిందే అన్న నిర్బంధం లేదు. ముస్లిమేతరులకు ఈ విషయంలో స్వేచ్ఛనివ్వడం జరిగింది. ఐతే వాళ్ళ ధన ప్రాణాల రక్షణా భారం ప్రభుత్వం వహిస్తుంది గనక రక్షణ పద్దులో వాళ్ళ నుండి కూడా పన్ను వసూలు చెయ్యటం జరుగుతుంది, అదే జిజ్‌యా. మీరుదాహరించిన ఉచ్చారణలు దీని తప్పుడు రూపాంతరాలే. ఔరంగజేబు జిజ్‌యా వసూలు చేసినట్లు అది ఎంతో కాలం సాగలేదన్నట్లు చారిత్రక మూలగ్రంథాలు చెబుతున్నాయి. దాన్ని జుట్టుపన్ను బొట్టు పన్ను అని ఇతరమతాల వారిలో ద్వేషం జనింపజేసే పరిభాషను ఉపయోగించడం, విభజించి పాలించిన మన పాత ఏలికల విధానం. దాన్ని ఖండించవలసిందే.

(22-2-85)

—: o :—

ఎం. డి. మహమూద్ (చిన్న చింతకుంట)

**రక్తం ఎందుకు నిషిద్ధం చేయబడింది ?**

* ఒక విషయం మాత్రం సూత్ర ప్రాయంగా అర్థంచేసుకోండి. దైవం హలాల్, హరామ్ నిర్ణయించింది వైద్య దృక్కోణంతో కాదు. నైతిక దృక్కోణమే దానికి మూలం. అయితే నైతికపరంగా సంబంధించిన వివరణ అన్నది మనిషిని ఎన్నడు తృప్తిపరచజాలదు. ఎందుకంటే నైతికతను కొలిచే ఎలాంటి ప్రమాణాలూ మనవద్ద లేవు, నైతిక నియమాలను మనం దైవ నిర్ణయం ప్రకారం నమ్మడం తప్ప గత్యంతరం లేదు. దైవ నిర్ణయాలకు భౌతిక లాభ నష్టాలే హేతువు అని అనుకుంటే దైవం మనిషికై పొటాషియం సయనయిడ్‌ని నిషేధించి ఉండవలసింది. మనకు తెలుసు అలా జరగలేదు. భౌతిక లాభ నష్టాలను సంబంధించిన అత్యధిక విషయాలను దేవుడు మనిషిచేసే పరిశీలన, పరిశోధన, అన్వేషణలకే వదిలివేశాడు. నైతికంగా హానికరమయిన వాటిని మనిషి తన కృషి ద్వారా తెలుసుకోవడం కష్టం కనుక వాటిని మాత్రం దేవుడు మనిషికి తెలిపే ఏర్పాటు చేశాడు. ఈ ప్రాథమిక విషయం తెలుసుకున్న తర్వాత దైవం, దైవ గ్రంథం, దైవ ప్రవక్తల పట్ల విశ్వాసం గల వ్యక్తికి దైవం నిర్ణయించిన హలాల్ హరాం (ధర్మాధర్మాల) ను గురించి వాటి మర్మ హేతువు ఎలాగైనా తెలుసుకోవాలి అన్న ఆతృత ఎక్కువగా ఉండదు. ఇక రక్తం, పంది మాంసం, మృత జంతువు మాంసం వల్ల మానవనైతిక నడవడిలో చెడులు పొడసూపుతాయన్న యదార్థం మనం తెలుసుకుని; వాటికి దూరంగా మసలుకోవడమే సరయిన వైఖరి.

(13-4-84)

—: o :—

మహమూద్ (చిన్న చింతకుంట)

**ప్రతి శతాబ్దానికి ఒక ముజద్దిద్ అవసరము అని ఏ హదీసులో వున్నది? 14 వ శతాబ్ది యొక్క ముజద్దిద్ ఎవరో కాస్త వివరించండి ?**

* ముజద్దిద్ అంటే పునరుజ్జీవింపజేసే వ్యక్తి అని అర్థం. హదీసులోని పదాలకు భావమిది : "ప్రతి శతాబ్దపు తలపై దేవుడు ముస్లిమ్ సమాజం నుండి

కొందరిని లేవనెత్తుతాడు. వారు ముస్లిముల ధర్మాన్ని పునరుజ్జీవింప జేస్తారు.'' ఈ హదీసు హజ్రత్ అబూ హురైరా ఉల్లేఖించగా ''సునన్ అబూ దావూద్''లో పేర్కొనబడి ఉంది. హదీసులోని పునరుజ్జీవింపజెయ్యడం అన్నదానికి విచిత్రమయిన అర్థాలు ఆపాదించారు. తలపై అంటే అరబీ నానుడి ప్రకారం ఆ శతాబ్దంలోని సాహిత్యం, కళలు, శాస్త్రీయ, సాంకేతిక ప్రగతులు అన్నింటిపై, అని భావం, ఇంకా పునరుజ్జీవింపజెయ్యడం అంటే అది ఒక వ్యక్తి చేసే కార్యమే కానవసరం లేదు. కొందరు వ్యక్తులు, లేక వేర్వేరు వ్యక్తులు వేర్వేరు ప్రదేశాల్లో చేసే కార్యమూ కావచ్చు. మొత్తానికి అర్థం, ప్రతి శతాబ్దంలోనూ, ఆ శతాబ్దపు సకల శాస్త్రాలపై ప్రభావ వంతమయిన ముద్రవేసి ఇస్లాం కనుగుణంగా వాటిని మలచి ఇస్లామీయ కాంతి ద్వారా ఇస్లామేతర అజ్ఞానపు అంధకారాలను దూరం చేసేవారు పుడుతారు అని. ఇస్లామీయ చరిత్రను అధ్యయనం చేస్తే ఇది ఎంతో నిజమైన విషయమని బోధపడుతుంది. ఇక 14 వ శతాబ్ది ''ముజద్దిద్ లేక ముజద్దిద్‌లు" ఎవరని అడిగితే అది అంత త్వరలో తేలే విషయం కాదు. ఇప్పుడిప్పుడే మనం 15 వ శతాబ్దంలో అడుగు పెట్టాము. గత శతాబ్ది చరిత్రని క్షుణ్ణంగా అధ్యయనం చేసి అందులో ఎక్కడెక్కడ ఏ ఏ ఉద్యమాలు వెలిసాయి, ఎవరెవరు పునరుజ్జీవనోద్యమాన్ని, సమకాలీన శాస్త్రాలు కళలపై ప్రభావవంతమయిన ముద్ర వేసేదిగా తీర్చిదిద్దారు అని చూడవలసి ఉంటుంది. అది గొప్ప పరిశోధనాత్మకమయిన అధ్యయనం. ఈ విషయంలో వివరాలు తెలుసుకోవాలంటే మౌలానా మౌదూదీ రచించిన 'A Short History of Revivalist Movement' అన్న పుస్తకాన్ని ఇంగ్లీషులోగాని, ఉర్దూలోగాని చదవగలరు.

(6-7-84)

—: o :—

జహీర్ అహ్మద్, వినుకొండ

**ఖయామత్ వచ్చేముందు ప్రపంచం మొత్తం కల్లోలమయి నీతి బాహ్యాలు అధికమయి అధ్వాన్నంగా తయారవుతుందని అంటారు. మరి ప్రపంచం అంతా సదాచార సంపన్నమైపోతే ఖియామత్ రాదా?**

*నేను అవుననో కాదనో సమాధానం ఇస్తాననుకోండి, దానివల్ల మీకు కలిగే లాభమేమిటి ? సమయం, శక్తి, సామర్థ్యాలు దేవుడిచ్చిన వరాలు. వాటిలో ఒక్కొక్క దానిగురించి రేపు అడగటం జరుగుతుంది. వీటిని ఈ విధంగా వృథాగా అర్థంలేని "జ్ఞాన జిజ్ఞాస"లో వ్యయం చేస్తే అప్పుడు ఏమని సమాధానం ఇస్తారు? మహా ప్రవక్త (సఅసం) ఎప్పుడూ "ఇల్మున్నాఫిఅ" ప్రయోజనకరమయిన జ్ఞానాన్ని ప్రసాదించమని దైవాన్ని ప్రార్థిస్తూ ఉండేవారు. పాశ్చాత్యనాగరికత నేర్పిన కొన్ని వ్యసనాల్లో తనకు సంబంధంలేని "జ్ఞానాన్ని" ఆర్జించడానికి చేసే వృథా కృషి కూడా ఒకటి. కియామత్ ఎప్పుడు వస్తుందో దైవానికే తెలుసు. అయితే మీ పాత్ర, మీ పొరుగు వారి పాత్ర అందులో ఎలా ఉండాలని మీరు కోరుకుంటున్నారు ? మీరుదాహరించిన కీడుల్లో ఉత్సాహంగా పాల్గొని కియామత్‌ని చేరువ చెయ్యదలిచారా ? లేక ప్రపంచమంతా భయభక్తులతో అలరారినా కియామత్ మటుకు తప్పకవస్తుందని తెలిస్తే మంచి పనులు చెయ్యడం మానుకోవాలని అనుకుంటున్నారా ? బాబూ, జహీర్ అహ్మద్ గారు, మీ ప్రశ్నకు జవాబు లభిస్తే మీరు లేక మరెవరయినాసరే చెయ్యదలచిన ఘన కార్యమేమిటో సెలవిస్తే అందరికీ ప్రయోజనకరంగా ఉంటుంది. ప్రపంచంలో ఎందరో ప్రవక్తలు వచ్చారు, ఎందరో మహానుభావులు ప్రజల్ని సంస్కరించడానికి తమ జీవితాలనే ధారపోశారు. నేటికీ ఈ లోకం మంచి చెడుల్ల కలయికలతోనే విరాజిల్లుతోంది. కియామత్ వరకూ ఇంతే—ఊహా లోకపు విహారం మానుకుని, భూమిపై కాలిడి, క్రియాత్మక జీవితంలో జీవించండి !

(1-3-85)

—: o :—

ముహమ్మద్ ఆరిఫుద్దీన్ (బెల్లంపల్లి)

**"జుమా ఖుత్బా"లో ఇమామ్ "అసా" (కర్ర)ను చేతిలో పట్టుకొని జుమాప్రసంగం చేస్తున్నారు. మరికొందరు అది లేకుండానే జుమా ప్రసంగం చేస్తున్నారు.**

* ఏ జాతిలోనయినా పతనావస్థ సమీపిస్తే అది ఇలాంటి విషయాల్లోనే అధికంగా కాలయాపన చేస్తుంది. 23 ఏండ్లలో ఒక మూఢజాతి నుండి అత్యున్నత

నాగరిక జాతిగా పరిణతి చెందిన సహాబా ఒక ఉదుటన ప్రపంచమంతా చుట్టు ముట్టగలిగారంటే, వారు ఈ "అసా"ను పట్టుకునో "తలపాగా"ను కట్టుకునో ఉన్నారని మీరు భావిస్తున్నారా? అరేబియాలో విజృంభించి స్పెయిను మొదలు చైనా వరకు, మొరాకోనుంచి ఇండోనేషియా వరకు ధర్మ సందేశాన్ని సర్వసామాన్యం చెయ్యగలిగారంటే, ఈ మొత్తం భూభాగాన్ని ఇస్లామీయ సిద్ధాంతాల పాలనకింద తెచ్చారంటే అదంతా ఎలా జరిగిందో ఊహించండి. ఆ తరువాత, 6 వందల ఏళ్ళు యూరోపును పరిపాలించిన ఇస్లాంను తమ జీవన వ్యవస్థగాకాక, తమ జీవిత సమస్యల పరిష్కారంగాకాక ఇలాంటి చచ్చు సమస్యల పరిష్కారంగా మార్చడంవల్లనే ఆ ప్రాభవం అంతా సమసిపోయి నేడు ఇస్లాంకే పరాభవంగా మనం మిగిలాము. దయచేసి ఇలాంటి అర్థంలేని ప్రశ్నలతో మీ బుర్రల్ని పాడుచేసుకోకండి. ఇద్దరు ఇమాములు రెండు రకాలుగా వ్యవహరిస్తున్నారంటే అలా వీలుంది కాబట్టే అని తెలుసుకోండి. అంతగా ఐతే వారినే తమ నడవడికి ఆధారం అడిగి తృప్తిని పొందండి. అంతేగాని ఉన్నత ప్రమాణాలతో జ్ఞాన సముపార్జనలో వినియోగించవలసిన మీ మేధను దుర్వినియోగపరచి రేపు మీ ప్రభువుకు జవాబు చెప్పుకోలేని పరిస్థితికి లోనవకండి.

(8-3-85)

—: o :—

టి. ఎస్. బాష (ప్రొద్దుటూరు)

**23-5-84 ఆంధ్రప్రభ 7 వ పేజీలో కొరాన్ చికిత్స! అన్న శీర్షికతో 'ముస్లింలకు పవిత్రమయిన ఖుర్ఆన్ ఔషధంగా పని చేస్తుందంటే నమ్మలేము. కాని ఖురాన్ రేడియో ఫ్రీక్వెన్సి ఆక్యుపంచర్‌ల చికిత్స ఒక రోగికి క్యాన్సర్ నివారించవచ్చని డా॥ ఆస్కార్ ఆమన్ తమ వైద్య పరిశోధనా పత్రంలో పేర్కొన్నారు' అని ఉంది.**

* దివ్య ఖుర్ఆన్ సకల శుభాల మహాసాగరం. అందులో నుంచి ఎవరు ఎంత గ్రహించగలిగితే అది అంతగానే తన శుభాల నిస్తుందనడంలో సందేహం లేదు. అయితే, పైన పేర్కొన్న వార్తలోని నిజానిజాలు మాకు తెలియవు. ఒక సంగతి మాత్రం మరువరాదు. ఇలాంటి అల్పమయిన ప్రయోజనాలను ప్రసా

దించడానికి దివ్య ఖుర్ఆన్ అవతరించలేదు. ఈ చికిత్సలూ గట్రా మనిషి తన మేధను ఉపయోగించి ఎన్నయినా కనుగొనగలడు. కనుగొంటూనే ఉన్నాడు కూడా. కాని మనిషి ఈ లోకంలో జీవితం గడిపే నిజమయిన విధానం ఏది? ఏ మార్గాన పయనిస్తే జీవితపు శకటం తన పరమార్థాన్ని చేరుకుంటుంది? మనిషి ఇహపరాల సుఖం, శ్రేయం ఎందులో ఇమిడి ఉన్నాయి? అన్నవే అసలు ముఖ్యమయిన ప్రశ్నలు. ఈ ప్రశ్నలకు సరయిన సమాధానాలు సమకూర్చి మానవ మనుగడకు రుజు మార్గం చూపేదే దివ్య ఖుర్ఆన్ యొక్క అసలు పని. దాని ద్వారా ఆ దైవ మార్గదర్శకత్వం గ్రహించడమే మానవులుగా మన కర్తవ్యం. దాన్ని విస్మరించి ఆ మహాసాగరం నుండి రెండు బొట్లు మాత్రమే పొందగోరితే అది మన సంకుచిత ఆంతర్యానికే తార్కాణం కాని మరేమీకాదు. దివ్య ఖుర్ఆన్ మనిషి యొక్క నైతిక, మానసిక, ఆధ్యాత్మిక రోగాలకు మహాగొప్ప నివారిణి. దాని ద్వారా శారీరక రోగాల నివారణ పొందిన తార్కాణాలు కూడా దైవ ప్రవక్త కాలంనాటినుండే కానవస్తున్నాయి. నేటికీ అవి కన్పించినా అందులో ఆశ్చర్యం లేదు

(27-7-84)

—: o :—

రాపెల్లి పాండురంగం (చీర్లవంచ)

**మనిషి తన ప్రయోజనానికి ప్రక్కవాడిని తప్ప ఏ జంతువునయినా హింసించొచ్చు. కాని బ్రతికితే నష్టమూ లేని, చస్తే లాభమూ లేని తొండను చంపడంలో ఉద్దేశం ఏమిటి? ఇది అల్లరి పిల్లలు సరదాకు చేశారనుకుందామంటే పెద్దలు సైతం వద్దని వారించలేదు.**

* లోగడ ఈ విధమయిన ఓ సందేహానికి సమాధానమివ్వడం జరిగింది. మాకు తెలిసినంతవరకు ప్రజల్లో ఉన్న కట్టుకథలకు ధార్మికమయిన ఆధారం ఏదీ లభించలేదు. అయితే తొండల్లో ఉన్న కొన్ని రకాలు చాలా విషపూరితమయినవి. అలాంటి వాటిని చంపడానికి అనుమతి ఉన్నమాట వాస్తవమే— తేలును, పామును ఇతర విషకీటకాలను చంపేవిధంగా. కాని తొండ కానరాగానే కర్రపుచ్చుకుని దానివెంట పడేందుకు ఏ కారణమూ లేదు. ఆలా చంపే పెద్ద

మనుషుల్ని ధార్మిక ఆధారం చూపమనండి. వారు చెప్పే కథలకూ ఏపయినా ఆధారముందేమో అడగండి. ఆధారం లేకుండా ధర్మం పేరిట ఏ పనయినా చెయ్యడం అపరాధం కాదా అని నిలదీయండి. అప్పుడు ఇలాంటి అర్థంలేని పనులు కాస్తయినా తగ్గుతాయి. అయితే విషపూరితమయినవని రుజువయిన కీట కాల విషయంలో మటుకు ఎలాంటి ఉదారబుద్ధి చూపడమయినా నేరమే!

(13-9-1985)

—: ం :—

## ఎస్. కె. ఆజం మొహియుద్దీన్ (ఎల్లందు)

**ఫోటోలు దిగుటయు మరియు చిన్న పిల్లలకూ ఫోటోలు దించటములో తప్పు ఏమిటి?**

* ఫోటోలు, లేక చిత్రాలు స్వతహాగా నిషిద్ధం కావు. మహనీయ ముహమ్మద్ (సఅసం) ప్రాణుల చిత్రపటాలను వ్రేలాడదీయటం, పరచడం, చిత్రించడం, గీయడం నిషేధించారు. మనోహరమయిన ప్రకృతి దృశ్యాలు, అందమయిన డిజయినులు, రమ్యమయిన కల్పనలు చిత్రించడంలో ఏ విధమయిన తప్పులేదు. ప్రాణుల చిత్రపటాలున్నచోట కారుణ్యదూతలు రారని సెలవిచ్చారు. చిత్రపటాలు గీసినవారిని ప్రళయ దినాన వాటిలో ప్రాణం పోసినంత వరకు వదలడం జరగదని ప్రవచించారు. అయితే షరీఅత్ వేత్తలు, దైవ ప్రవక్త ఆదేశాల్లోని హేతువును, మర్మార్థాన్ని అర్థం చేసుకున్నవారు నేటి నాగరిక అవసరాలకనుగుణంగా కొన్ని సందర్భాల్లో ఫోటోలను తీయటాన్ని ఈ నిషేధాజ్ఞల నుండి మినహాయించారు. ఉదాహరణకు హాల్ టికట్లు కొరకు, ఐడెంటిటీ కార్డుల కొరకు, పాస్ పోర్టుల కొరకు ఇంకా ఇలాంటివే వివిధ అవసరాలన్నింటికీ ఫోటోలు తీయడంలో వాటిని వినియోగించటంలో తప్పు లేదని షరీఅత్ ఆదేశం. అలాగే వ్యక్తుల ఫోటోలతో పాటు సంఘటనలకు సంబంధించిన ఫోటోలు, ముఖ్యమయిన సన్నివేశాలను వ్యక్తపరచే ఫోటోలను తీయటంలో కూడా తప్పులేదని షరీఅత్ వేత్తల అభిప్రాయం. నేడు విగ్రహారాధన లాంటి అప విశ్వాసాలకు తావు లేదు కదా, ఫోటోలను నిషేధించే అవసరం కానరావటం లేదనటం సమంజసం కాదు. నేడు కూడా ఫోటోల్లో వచ్చిన చిత్రాలను మనుషులు

పూజిస్తున్నారు. లోగడ కూడా ఈ పుటల్లోనే వ్రాసినట్టు గుర్తు. గాంధీగారి చిత్ర పటాన్ని, నెహ్రూగారి ఫోటోలను, రామకృష్ణపరమహంస, వివేకానంద వంటి యోగుల చిత్రాలను, అణ్ణాదురై లాంటి నాయకులు చివరికి ఇప్పుడిప్పుడే తమిళ నాడు రాష్ట్ర ముఖ్యమంత్రి ఎం.జి. రామచంద్రన్, మన రాష్ట్ర ముఖ్యమంత్రి ఎన్టీ. రామారావు ఫోటోలను ఫ్రేములు కట్టించి, పూల మాలలు వేసి హారతి పట్టి, కుంకుమ పెట్టి పూజించడం నేనే స్వయంగా చూచాను. ఇక పిల్లల ఫోటో లంటారు, 'బాలకృష్ణ'ని పూజించడం మనకు తెలియని విషయమేమీ కాదు. అందువల్ల ఏవిధంగానైనా ఫోటోలు తీయించి భద్రపరచుకోవడమన్నది ప్రమాద భూయిష్టమయినచనడంలో సందేహం లేదు. ఆలా అని చిత్రపటాలకు అనుమతిస్తే స్త్రీల, నగ్న స్త్రీల అశ్లీలమయిన ఫోటోలు ప్రకటించి మనుషుల్లో హేయమయిన భావాలను రేకెత్తించి మానవుల్ని పశువులకన్నా హీనంగా దిగజార్చే సంస్కృతి నేమంటారు? అందువల్ల ప్రాణుల, ముఖ్యంగా మానవుల చిత్రపటాలు సూత్ర ప్రాయంగా నిషిద్ధం కావలసిందే. ప్రత్యేక అవసరాలకు, ప్రత్యేక సందర్భాలకు ఈ నిషిద్ధాజ్ఞల్లో మినహాయింపు ఉండటం కూడా నేటి నాగరిక జీవితం యొక్క ముఖ్య అవసరమే అనక తప్పదు.

(17-8-1984)

—: ౦ :—

షేక్. బందగీ సాహెబ్ (పురుషోత్తమ పట్నం)

**మస్జిద్‌లో తెలుగు భాషలో ధార్మికవిషయములు మైకులో చెప్పుట తప్పా?**

* ఏమాత్రం తప్పుకాదు. చాలా మంది తెలియక ఇలాంటి అడ్డంకులు సృష్టి స్తున్నారు. దైవ ప్రవక్తలు కూడా తమ జాతి ప్రజలు మాట్లాడే భాషల్లోనే వారిని సంబోధించారు. భాషతో ధర్మానికి సంబంధంలేదు. దివ్య ఖుర్ఆన్ మూలగ్రంథం అరబీలో ఉండటం మూలాన మనం దానికి ప్రత్యేకతనిస్తాము. కాని ప్రసంగాలు, బోధనలు, ఉపదేశాలు, హితబోధలు అన్నీ ఆయా ప్రజల భాషల్లోనే జరగాలి, జరుగుతున్నాయి కూడా. ఉదాహరణకు ఉర్దూ అర్థం చేసు కునే ఉత్తర భారతీయులకు ఉర్దూలో అవన్నీ జరిగినట్లే దక్షిణ రాష్ట్రాల్లో ఉర్దూ పదం ఒకటీ అర్థంకాదు. అక్కడ మళయాళం, తమిళం, కన్నడ, తెలుగు భాష ల్లోనే జరుగతున్నాయి బోధనలన్నీ. అంతే కాని, ఏదో తెలీని భాషలో అన్య

మనస్కంగా, పరిపరివిధాల పోయ్యే హృదయాన్ని అదుపులో పెట్టుకోవడం చేత కాక ఉపన్యాసాలు చెయ్యడం, వినడం ఎక్కడా జరగడం లేదు. సంకుచిత భాష, వర్గ, జాతి పరిధుల నుండి ఎంత త్వరగా బయటపడితే అంత మంచిది.

(11-10-85)

—: o :—

ఎస్. ఎమ్. బాష (మద్రాసు)

**"మీ కడుపుల్ని జంతువుల సమాధులుగా చెయ్యకండి. (లా తజ్ అలూ బుతూ నకుమ్ మకాబిరుల్ హైవాన్)" అని హజ్రత్ అలి చెప్పినట్లు 'ది హిందు' దిన పత్రిక (30-11-85) లో ఓ ఉత్తరంలో పేర్కొనడం జరిగింది. కామెంట్ ప్లీజ్.**

* మీ లేఖలో ఏ రిఫరెన్సు లేదు కాబట్టి హజ్రత్ అలి (రజిఅన్) ఏమన్నారో సరిగ్గా చెప్పడం కష్టం. అయినా అందులో చెప్పిన విషయం మాంసాహారానికి వ్యతిరేకంగా చెప్పింది మాత్రం కాదు. ఎందుకంటే ఆయన స్వయాన మాంసాహారులు. కేవలం తింటూ త్రాగుతూ తాము భోజన ప్రియులమని గర్వంగా చెప్పుకుంటూ ఉండటాన్ని ఆయన సంకేత ప్రాయంగా పేర్కొన్నారు. భోగ లాలసులైన మనుషులు ఆధ్యాత్మిక ఔన్నత్యాలను చేరుకోవడం దుర్లభం అన్నది అందరూ ఒప్పుకుంటారు. దైవప్రవక్త (సఅసం) కడుపునిండా భుజించకూడదనే నిత్యం బోధించారు. స్వయంగా ఆయన తరచుగా ఉపవాసాలే ఉన్నా, తిన్నప్పుడు కూడా సగం కడుపే భుజించేవారు. అరబ్బుల ముఖ్య ఆహారం మాంసమే గనుక హజ్రత్ అలి (రజి అన్) ఆ విధంగా చెప్పి ఉంటారు. అంటే నిత్యం తినడం త్రాగడం, రుచులు అనుభవించడంలోనే లీనమయి జీవించకండి, ఆధ్యాత్మిక చింతన, దైవధ్యానం దైవ సంస్మరణకై జీవితంలో ఓ భాగాన్ని కేటాయించండి అని ప్రబోధానికి భావం. చివరన మరోమాట, అహింసా పరమో ధర్మః అని బోధించిన బోధిసత్వుడు (బుద్ధుడు) మాంసాహారి; తన రాక్షసత్వంతో, క్రూరత్వంతో ప్రపంచాన్ని గడగడ లాడించిన హిట్లర్ శాఖాహారి !

(7-2-86)

—: o :—

సి. జానీ, ఎస్. షేక్‌షావలి (నంద్యాల)

**ఇస్లాం నియమము ప్రకారం కేవలము 4 స్త్రీలను మాత్రమే వివాహము ఆడవలెనని వున్నది మరి మన ప్రవక్త నలుగురును మించి వివాహ మాడి నారు కదా ఆ నియమము వారికి వర్తించదా?**

* దివ్య ఖుర్‌ఆన్‌ని కనీసం అనువాదం సహాయంతో సయినా మీరు పఠించి ఉంటే ఈ ప్రశ్న అడిగే వారు కారు. ముస్లిముల కొరకు నలుగురు భార్యల అనుమతి ఇచ్చిన దైవమే దైవ ప్రవక్త కొరకు ఆ ఆంక్షను సడలించాడు. దానికి ఎన్నో కారణాలున్నాయి.

(1) ఆయన దైవ ప్రవక్త కావటాన అనేక అరబ్బు తెగలతో, ఇతర జాతుల వారితో సంబంధాలు పెంపొందించుకోవడం వారిలో దైవ ధర్మ ప్రచారానికి కావలసిన మానవ శక్తిని ఏర్పరచుకోవడం అవసరం. ధర్మం బోధించే అనేక విషయాలు స్త్రీలకు నేర్పాలంటే స్త్రీలే అవసరమవుతారు. అసలే మానవ బలం లేని ఆ కాలంలో స్త్రీలకు సంబంధించిన ప్రత్యేక విషయాల బోధనలకు గాను మహాప్రవక్త సతీమణులు తప్ప వేరే వారు అంతగా అర్హులు కాజాలరు.

(2) వివిధ వయోపరిమితులు గల స్త్రీలతో ఆయా మనస్తత్వాలను అనుసరించి మాట్లడగలిగేవారు కూడా అవసరమే, దైవ ప్రవక్త సతీమణుల్లో ఆ వైవిధ్యం ఉండింది. వారిలో అత్యధిక శాతం వితంతువులు లేక మారు పెళ్ళి వారే. పండు ముసలివారు మొదలుకుని యువతులు వారిలో ఉన్నారు.

(3) మహత్తర తర్ఫీదు, ధర్మజ్ఞానం సముపార్జించి ధార్మికంగా సుశిక్షితులయిన ఆ మహిళా మణులు ఆయన తరువాత కూడా చాలాకాలం వరకు తమ శిక్షణానుభవాలను ఇతరులకు అందజేయగలిగేలా ఉండాలి. ఆ విధంగా ఆ మహిళా రత్నాలు చేసిన సేవ అపారమయింది. వారే లేకపోతే ధార్మిక జ్ఞానం సగం (స్త్రీలకు సంబంధించినది) అసంపూర్ణంగా ఉండేది.

(4) కొన్ని అజ్ఞాన కాలపు ఆచారాలను రూపుమాపడం కూడా అవసరమే. పెంపుడు కొడుకు సొంత కొడుకు కాజాలడన్నది ఇస్లామీయ చట్టం.

దాన్ని క్రియా రూపంలో చూపెట్టడం అవసరం. ఎందుకంటే అరబ్బుల్లో అజ్ఞాన కాలంలో పెంపుడు సంతానాన్ని సొంత సంతానంగా పరిగణించే అలవాటుండింది. అందువల్ల మహాప్రవక్త ఒక పెళ్ళి ఆ ఆచారాన్ని రూపుమాపడానికి కూడా చేసుకున్నారు. పెంపుడు కొడుకు జైద్ (రజిఅన్) విడాకులిచ్చిన జైనబ్ (రజిఅన్) ని ఆయన ఆ విధంగానే చేసుకున్నారు. దాన్ని దివ్య ఖుర్‌ఆన్‌లో ప్రస్తావించటం జరిగింది. చివరన రెండు విషయాలు మరువరాదని మనవి చేసుకుంటున్నాను. ఒకటి దైవ ప్రవక్త 25 ఏళ్ళ వయసులో 40 ఏళ్ళ వితంతు వనితను పెళ్ళి చేసుకున్నారు. ఆమె చనిపోయిన నాలుగేళ్ళ వరకు. అంటే పాతికేళ్ళు ఆమెతో గడిపి 56 ఏళ్ళ వయసు వరకు, ఆయన రెండో పెళ్ళి చేసుకోలేదు. ఆ తరువాత చేసుకున్న వివాహాలు పై కారణాలవల్ల చేసుకోవలసి వచ్చింది.

(14-2-86)

—— :o: ——

యం. డి. రఫీ (మండపేట)

**"రాజ్యాంగంలోని 44 వ అధికరణ ఏమి కోరుతోంది"**

* "భారతదేశ రాజ్య క్షేత్రమునందంతటను పౌరులకు ఏకరూపమయిన సివిలు స్మృతిని చేకూర్చుటకు రాజ్యము ప్రయత్నించవలెను" ఇవి ఆ అధికరణ లోని మాటలు. రాజ్యాంగంలోని నాల్గవ భాగంలో ఉన్న ఆదేశిక సూత్రాలలో ఇదీ ఒకటి. దీని భావమేమిటంటే దేశంలో ప్రజలందరికీ ఏ విధంగా క్రిమినల్ చట్టాలు (శిక్షాస్మృతి) ఒకే విధంగా వర్తించేలా ఉన్నాయో సివిల్ చట్టాలు అంటే వివాహాలు, విడాకులు, వారసత్వం, భూమికి సంబంధించిన వివాదాలు వగైరా వగైరా లాంటివన్నీ కూడా ప్రజలందరికీ ఒకే విధంగా వర్తించేలా చెయ్యాలని రాజ్యాంగం సూచిస్తోంది. ఇది రాజ్యాంగంలో ఎందుకు చోటు చేసుకోవలసి వచ్చింది? భారత దేశానికి బ్రిటిష్ వారు ఏలుబడి సాగించడానికి రాక పూర్వం ఇక్కడి చట్టాలు మరో విధంగా ఉండేవి. వారు వచ్చాక రోమను (బ్రిటిషు వారు అనుసరించేవి) చట్టాలు ప్రవేశపెట్టారు. అయితే ఇక్కడ నివసించే విభిన్న మతపరమయిన, సంస్కృతీపరమైన వర్గాల వారిగ్గాను, వారి వారి

వ్యక్తిగత వ్యవహారాలు, వారి మతానికి సంబంధించిన చట్టాల ప్రకారం జరగాలని నిర్ణయం గైకొన్నారు. అందువల్ల సివిల్ చట్టాలను, క్రిమినల్ చట్టాలను వేర్వేరుగా నిర్మించారు. విభిన్న మత వర్గాలు తమకంటూ ఏవైన మతపరమయిన చట్టాలుంటే వాటి ప్రకారం తమ సివిల్ వ్యాజ్యాల తీర్పులు చేయించుకునేలా చట్టాలు చేశారు. వాటిని "పర్సనల్ లాస్" (వ్యక్తిగత చట్టాలు) అన్నారు. వివాహాది విషయాల్లో వారసత్వపు విషయాల్లో తమ పర్సనల్ లాను అనుసరించడానికి మతవర్గాలకు దయతో స్వేచ్ఛను కల్పించారు మహా ప్రభువులు! భారతావని స్వేచ్ఛా స్వాతంత్ర్యాల గాలి పీలుస్తూ తనకంటూ ఓ రాజ్యాంగాన్ని నిర్మించుకుంటున్నప్పుడు రాచరికపు ఏలినవారు తమ 'బానిస' ప్రజలకు సివిల్ చట్టాల్లో ఇచ్చిన ఆ మాత్రపు స్వేచ్ఛ సయితం, భారత పుణ్యభూమి ఏలికలు తమ స్వతంత్ర పౌరులకు అవసరంలేదని అనుకున్నారు కాబోలు--రాజ్యాంగంలో 44వ అధికరణ చేర్చి అలా నుడివారు. బానిసత్వపు చీకట్ల నుండి స్వేచ్ఛా స్వాతంత్ర్యాల వెలుగుల్లోకి అప్పుడే అడుగిడిన ప్రజలు అంత హడావిడిలోనూ కొర్రో మొర్రో, ఇదేమన్యాయంబాబూ, అని తమ కొత్త ప్రభువులను వేడుకున్నారు. అప్పటి దాతలు — "ప్రయత్నించాలనే కదా ఉంది, అదీకాక మీరు పర్సనల్ లా ప్రకారమే తమ వివాదాలు తీర్చుకోదలిస్తే మాకేమీ అభ్యంతరం ఉండదు; ఆ మేరకు మీకు మినహాయింపును, బ్రిటిష నిరంకుశ ప్రభువులకన్నా అత్యధిక ఉదార బుద్ధితో అనుగ్రహిస్తాము" అని అభయవాక్కులు పలికారు. ఇంకా స్వాతంత్ర్య దేశపు సొంత ప్రభువుల హృదయాల్లోని లోతుపాతుల్ని సరిగ్గా గ్రహించలేని 'పర్సనల్ లా' కలిగి ఉన్న మైనారిటీలు 'అవును కాబోలు' అనుకుని తృప్తిపడ్డారు. ఇప్పుడేమో ఏలినవారు, ఏలికలు కాగలిగే మెజారిటీ ప్రభువులు, ఈ దేశానికి అసలు వారసులమని విర్రవీగే జాత్యహంకారపు దొరలు అందరూ కలసి రాజ్యాంగ దాతల హామీలు, అభయ వాక్కులూ అన్నీ తుడిచిపడేస్తున్నారు. 44వ అధికరణను ఏదో దివి నుండి దిగివచ్చిన దైవాదేశంగా చిత్రిస్తూ దాన్ని అమలుపరిస్తే తప్ప నిద్రపోమని మొరాయిస్తున్నారు. ముస్లిములేమో అలాంటి అందరికీ వర్తించే సివిల్ చట్టాలు చేసినా వాటి నుండి మైనారిటీలకు మినహాయింపు ఇవ్వాలని అలా వీలుపడకపోతే అన్యాయపరమైన ఆ అధికరణను తుడిచి వేసి రాజ్యాంగ ప్రక్షాళన చెయ్యాలని కోరుతున్నారు.

(16-5-86).

—: o :—

## సి. జె. జాన్ భక్తరాజ్ (చిన్న చింతకుంట)

**ఒక సందేహము నాకు గందరగోళము చేసినది అది ముస్లిం స్త్రీల యొక్క విడాకుల చట్టము.**

* భారతదేశంలో అనేక మతపరమయిన సాంస్కృతికమయిన వర్గాలున్నాయి. వారికి వారి వారి సంస్కృతి అన్నా, వేష భాషలన్నా మత ధర్మాలన్నా సహజంగానే అభిమానం ఉంటుంది. వాటిని కాపాడుకోవాలన్న వారి వాంఛ కూడా అసమంజసమయినదేమీ కాదు. ఈ కోరికలకు అభిలాషలకు మన రాజ్యాంగంలో స్థానం కల్పించడం జరిగింది. కొన్ని వర్గాలకు వారి వారి పర్సనల్ లాస్ (వ్యక్తిగత చట్టాలు) ఉన్నాయి. అవి వారి మతంతోనూ, సంస్కృతితోనూ ముడివడి ఉన్నవే. ముస్లిం పర్సనల్‌లా కూడా అలాంటి ఓ చట్టం. ఇస్లాం పరిపూర్ణ జీవన వ్యవస్థ కనుక అందులో, మనిషి పుట్టినప్పటి నుండి గిట్టేవరకు, అతని వ్యక్తిగత, ఆధ్యాత్మిక, నైతిక, కుటుంబ, సామాజిక, ఆర్థిక రాజకీయ - అన్ని రంగాలకు సంబంధించిన సమస్యలన్నింటికీ సమాధానం, 'మార్గం' చూపడం జరిగింది. 'ఆ మార్గం'లో ఒక భాగమే వివాహం, విడాకులు కూడా. జీవితం అన్న తరువాత ఎన్నో ఒడిదుడుకులు వస్తాయి. ఎన్నెన్నో కారణాలవల్ల వ్యక్తి తన జీవితంలో భాగస్వామి అయిన భార్యను, (స్త్రీ అయితే) భర్తను వదులుకోవాలన్న నిర్ణయానికి వచ్చే ఆస్కారముంది. ఆ వదులుకోవడమన్నది ఇష్టారాజ్యంగా జరగరాదని దాన్ని క్రమబద్ధం చేసింది ఇస్లామీయ షరీఅత్. దాన్నే విడాకులు అంటారు. పురుషుడు ఇచ్చే విడాకులకు 'తలాక్' అని, స్త్రీపొందే విడాకులకు 'ఖులా' అని షరీఅత్ పరిభాషలో అంటారు. అయితే మీ 'గందరగోళానికి' కారణమయిన అంశం ఏదో సరిగ్గా బోధపడలేదు. మీరు ఈ పర్సనల్‌లా అని కేవలం ముస్లిములకే ఉందని భావిస్తే అది పొరపాటు. హిందువులు, ముస్లిములు, సిక్కులు, క్రైస్తవులు, పార్సీలు, ఇంకా ఇతర తెగల వాళ్ళు తమ తమ పర్సనల్‌లాను వినియోగించుకునే తమ సమస్యల్ని పరిష్కరించుకుంటారు. ముస్లిములు తమ ధార్మిక విషయాల్లోకాస్త స్థిరంగా ఉంటారు కాబట్టి వారు అందరి దృష్టిని సునాయాసంగా ఆకర్షిస్తారు. అంతే.

(30-5-1986)

—: o :—

యేసుక్రీస్తు సువార్తసేవకుడు (కర్నూలు)

**మహమ్మద్ ప్రవక్త గారి యొక్క వంశావళి, ఖురాన్‌లో ప్రారంభమైన సురాల ద్వారా తెల్పగోరినాను. ఈయన ఇస్లామ్‌ను స్థాపించినవారు గనుక, వీరి॥ శకము॥ ఇంగ్లీషు నెలలో ఏ తేదీనుండి ప్రారంభమైందో తెలియపర్చ గోరినాను.**

* దైవ గ్రంథాలు ప్రవక్తల వంశావళిని వంశవృక్షాన్ని సూచించ డానికి అవతరించవు. దైవ గ్రంథాల్లో అవున్నాయంటే ఆ గ్రంథాలు ప్రక్షి ప్తాల పాలయ్యా యన్నది యదార్థం. అయితే దైవప్రవక్తల చరిత్ర మటుకు వాటిలో ఉంటుంది. దివ్య ఖుర్‌ఆన్‌లో మహనీయ ముహమ్మద్ (సఅసం) వంశావళియో వంశ వృక్షమో లేదు. అది మానవాళికి సకల జీవన రంగాల్లో దైవ మార్గదర్శకత్వం చూపడానికి అవతరించింది. మనిషి యొక్క ఆధ్యాత్మిక అవసరాలకు, పూజా పురస్కారాలకు మటుకే కాకుండా దైనందిన జీవితానికి, వ్యక్తిగత, కుటుంబవిషయాలకు, వ్యాపార వాణిజ్య వ్యవహారాలకు, సామాజిక రాజకీయ సమస్యలకు మార్గం చూపుతుంది అది. ఖుర్‌ఆన్ ద్వారా తెలిసే దేమంటే మహా ప్రవక్త (సఅసం), ఇబ్రాహీం (అలైహిస్సలాం) జ్యేష్ఠ పుత్రుడు ఇస్మాయీల్ (అస్సలాం) వంశంలో జన్మించారన్నది. అయితే హదీసుల ద్వారా పూర్తి వంశవృక్షం తెలుస్తుంది. ఆనాటి ఆచారం ప్రకారం అరబ్బులు వంశా వళిని కంఠస్తం చేసుకునేవారు. ప్రతి కుటుంబంలోనూ ఆ కుటుంబం, ఆ తెగ వంశావళి, దాని శాఖోపశాఖలు అన్నీ తెలిసినవారుంటారు. అలాంటిదే హదీసుల్లో ఉల్లేఖించడం జరిగింది. అరబ్బులు నెంల్ని చంద్రమానం(Lunar months) ప్రకారం లెక్కించుకునేవారు. అందువల్ల క్యాలండర్లు సరిగ్గా లేని ఆ కాలాన్ని లెక్కవేయడం కాస్త కష్టమే. అయినా చరిత్రకారులు క్రీ.శ. 571 ఏప్రిల్ 23ను ప్రవక్త మహనీయుల జన్మ తేదీగా నిర్ణయించారు. దాన్ని, ఆముల్ ఫీల్, రబీఉల్ అవ్వల్ 12 తో సమానంగా పరిగణిస్తారు. కాని ఇస్లామీయ క్యాలండర్ ప్రవక్త జన్మ తేదీ నుండి ప్రారంభం కాదు. ఆయన మదీనాకు హిజ్రత్ (వలస) పోయిన తేదీనుండి ప్రారంభమవుతుంది. అది క్రీ.శ. 622 సెప్టెంబరు 22న జరుగుతుంది. ఈ సందర్భంలో మరో విషయాన్ని విన్న వించుకోదలిచాను. మీరు మహనీయ ముహమ్మద్ (సఅసం)ను ఇస్లాం వ్యవ

స్థాపకులుగా వ్రాశారు. ఇది సరయిన భావన కాదు. ఇస్లామీయ దృక్పథం రీత్యా దైవ ప్రవక్తలందరూ దైవ సందేశాన్ని అందజేశారు. దాన్ని ఆయా కాలాల్లో, ఆయా భాషల్లో ఏమని నామకరణం చేసినా భావం రీత్యా అవి ఇస్లామే. ఇస్లాం అంటే దాసుడు దైవాభీష్టానికి స్వయం సమర్పణ చేసుకోవడం అన్నమాట. ఇస్లాం అంటే శాంతి అని కూడా అర్థం. ఇస్లాం దైవ ప్రవక్తలందరూ తెచ్చిన ధర్మమే కనుక దానికి వ్యవస్థాపకులు ఏ ఒక్కరూ కాదు. మహా ప్రవక్త ముహమ్మద్ అంతకన్నా కాదు. అయితే చివరి సారిగా ఇస్లాం ధర్మాన్ని దాని సకల రూపాల్లోనూ సంపూర్ణంగా సంస్థాపించి పరిపూర్ణ ఆదర్శాన్ని నిలిపినవారు ఆయనే. ఇప్పుడు ఎవరు ఇస్లాంను అవలంబించదలచినా ఆయన్ని అనుసరించడం తప్ప గత్యంతరం లేదు.

(15-8-86)

—: o :—

ఎ. బి. దాసు (మహబూబ్‌నగర్)

**బాబరి మస్జిద్‌లో మందిరపు గుర్తులులేవని, అట్టివి నమాజ్‌కై జాయజ్ కావని, ఉలేమాలు చెప్పుచున్నందున, మందిరం గుర్తులు గల్గియున్న మసీదుల సర్వే దేశమంతటా చేయించి, ఆ గుర్తులు గల్గిన మొత్తం మసీదులను ఆయా మతాల వారికి అప్పగించుటకై అంగీకారం తెలియపరిచినచో ఆ ఒక్కటి వదలిపెట్టజాలరా హిందువులు?**

* ఉపఖండం స్వాతంత్ర్యానికి పూర్వంనుండే కొన్ని మస్జిదులు భారత్‌లో ముస్లిమేతర సోదరుల ఇండ్లుగా, పశువు కొట్టాలుగా మారసాగాయి. పాకిస్తాన్ ఆవిర్భావం కాలంలోనయితే వేలాది మస్జిదులు అలా మారిపోవడమో, తాళాలు పడటమో జరిగింది. నేను స్వయంగా అలా మారిన అసంఖ్యాకమయిన మస్జిదుల్ని కళ్ళారా చూచాను. ఆ మస్జిదుల్ని తిరిగి గ్రహించి వాటి పునరావాసానికి కొందరు కృషి చెయ్యకపోలేదు. కాని ఫలితం శూన్యం. ప్రభుత్వం పట్టించుకోక పోవడం వల్లగాని, ఆ ప్రాంతాల్లో ముస్లిములు అధికంగా లేకపోవడంవల్లగాని అలాజరిగింది. బాబరి మస్జిద్ విషయం పూర్తిగా వేరయినది. అక్కడ వరకు ఎలాంటి తగాదా లేదు. ముస్లిములు హాయిగా నమాజ్ చేసుకుంటూనే

ఉన్నారు. అకస్మాత్తుగా వివాదం ఏర్పడింది. కోర్టుకెక్కారు ఉభయవర్గాల ప్రజలు. మన సివిల్ వ్యాజ్యాల తీరు తెలిసిందేగా. మస్జిద్‌కు తాళమయితే పడింది కాని కేసు నానుతూ మోపెడవసాగింది. అయితే అకస్మాత్తుగా జరిగిందేమిటోగాని సంవత్సరం క్రితం, ఒక తాళం తెరిపించి హిందువులకు అప్పగించారు ఫైజాబాద్ డిస్ట్రిక్టు మెజిస్ట్రేటుగారు. ఎన్నో మస్జిదులు పరుల హస్తగతమవగా లేనిది ఈ ఒక్క మస్జిద్ విషయంలో ముస్లిములకు ఇంత పట్టింపు దేనికి? అన్న ప్రశ్న తలెత్తుతుంది. అవన్నీ అక్రమంగా పరులపాలైతే దీన్ని 'సక్రమంగా' చట్టం పేరుమీదుగా ఇతరులకు 'అప్పగించింది' న్యాయ పీఠం. దీని పర్యవసానాలు, పరిణామాలు బహుదూరాలవరకు చేరగలవన్నది ముస్లిముల ఆందోళన, పోతే మందిరాల గుర్తులుగల మస్జిద్ విషయానికి వస్తే కొన్ని ముఖ్యాంశాలు క్లుప్తంగా తెలుసుకోవడం అవసరం: (1) ముస్లింలు, 'దురాక్రమణ' చేసిన స్థలంలో మస్జిద్‌గాని, మస్జిద్‌లోని ఏ భాగంగాని నిర్మించడం ధర్మ సమ్మతం కాదు. అలాంటి మస్జిద్, మస్జిదే అనబడదు ; ఇక అక్కడ నమాజ్‌చేస్తే నెరవేరుతుందా? అలాంటప్పుడు తమ ఆరాధనల్ని బూడిదపాలు చేసుకోడానికి అన్యాయార్జితమయినచోట మస్జిద్ కట్టుకుంటారా ముస్లిములు? (2) కొన్ని ప్రాంతాల్లో ముస్లిమేతరులు మూకుమ్మడిగా ఇస్లాం స్వీకరించినప్పుడు వారి మందిరాలను వారే స్వయంగా పడగొట్టుకున్నారు. ఆ స్థలం కట్టడం, సామగ్రి వారికే చెందింది కాబట్టి వారు అలాంటిచోట ఆ సామగ్రితో మస్జిదులు నిర్మించుకున్నారు. అప్పట్లో అది సమంజసంగానే గోచరించింది. పొరుగు ఊళ్ళల్లో హిందువులు సయితం దాన్ని ఆక్షేపించలేదు. ఫలితంగా అలాంటి మస్జిదుల్లో శతాబ్దాల తరబడి నమాజులు జరుగుతూ ఉన్నాయి. నేడు ఎవరయినా ఆక్షేపిస్తే దానికి అర్థమేదయినా ఉందా? (3) సరే, శతాబ్దాల తరువాత నేటికయినా, ఎవరయినా సరే, ఒక మస్జిద్ అన్యాయంగా అక్రమంగా ఆక్రమించుకున్న నేలపై, అలాంటి నిర్మాణ సామగ్రితోనే నిర్మించారని ఆధారాలతోసహా నిరూపిస్తే ఆమస్జిద్‌ని వారికి అప్పగించడంలో ముస్లిములకు ఎలాంటి అభ్యంతరం ఉండదని నా అభిప్రాయం. బాబరీ మస్జిద్ విషయంలోనూ అదేమాటను చెప్పగలను. కాని బూటకపు కథల్లో ప్రజల్ని మోసపుచ్చడం, ప్రజల్లో మతపరమయిన కలకలం రేకెత్తించడం మాత్రం సహించరానిది.

(22-5-87)

—: o :—

యం. డి. అబ్దుల్‌లతీఫ్, ఆఖిల్ (విజయవాడ)

**ది. 19-8-87 ఆంధ్రప్రభ దినపత్రిక 4 వ పేజీలో "మత సంక్షోభంలో ముస్లిం ప్రపంచం'' అనే శీర్షికలో ఈ విధంగా ప్రచురించినారు. "మతం రాజకీయాలు కలగాపులగంగా కలసిపోవడంవల్లనే ఇస్లాంలో గందరగోళ పరిస్థితి ఉత్పన్న మౌతుంది ఇది ముస్లింలుకాని వారికి జడుపుపుట్టిస్తూవుంటుంది ఈ పరిస్థితి కొత్తగా పుట్టినది (ఏర్పడినది) కాదు. ఇస్లాం స్థాపకుడు ముహమ్మద్‌తోనే మొదలైంది. చేతిలో కత్తి ధరించి ఆయన మత ప్రచారం చేశారు".**

* పాశ్చాత్యులు తానా అంటే, తందానా అనే గుణం మన దేశప్రజలది. నిజానిజాలు పరిశోధించడం, స్వయంగా తెలుసుకుని మాట్లాడటం మనకు చేతకాదు. వినికిడి వార్తలు, చెప్పుడు మాటలు విని చెడిపోయే గుణం మన వారిది. అందువల్ల ఎవరికీ ఏమీ అని ప్రయోజనం లేదు. ముస్లిం దేశాల్లో ఉన్న గందరగోళానికి కారణం, మతం-రాజకీయాలు కలగలపు కావడం అయితే ఇతర దేశాల్లో, ఖుద్దుగా మన దేశంలోనూ గతంలో దేశాన్ని ఛిన్నాభిన్నంచేసి 'పరపీడన'కు గురిచేసిన విషయం ఏమిటి? నేడుకూడా పైకి బాగా ఉబికివచ్చిన విభేదాలు, వైషమ్యాలు, విచ్ఛిన్నకర ధోరణులకు కారణం ఏమిటి? రాజకీయాల్లో సహజంగా వచ్చే ఎగుడు దిగుళ్ళకు తమకు నచ్చని లేక నచ్చిన దానితో దేనితో నయినా ముడి వెయ్యడం ఎంతవరకు వివేకం అనిపించు కుంటుంది? చేతిలో కత్తి ధరించకుండా రాజ్యమేలిం దెవరు? అంతేకాదు రాజకీయాల జోలికి పోకుండా కేవలం మత విషయాల్లో రక్తపాతాలు జరిపిన ఉదంతాలు ప్రపంచ చరిత్రలో లేవా? స్వయంగా మన నాటి వీరశైవులు జరిపిన హింసాకాండ ఇంతా అంతా కాదని సాహితీ కారులు, చరిత్ర వేత్తలు చెబుతూ ఉంటారే? చెప్పవచ్చిందేమంటే రాజకీయాల్లో సంక్షోభమయినా మత విషయాల్లో పోరాటాలయినా ప్రపంచ చరిత్రలో సర్వసాధారణ మయినవే. అందువల్ల నీతిమంతమయిన రాజకీయాలు, మౌఢ్యానికి, మూర్ఖత్వానికి చదిచేరని మత సిద్ధాంతాలు ప్రతిపాదిస్తుంది - మానవుని ఆది ధర్మం, నిజ ధర్మం, సహజ ధర్మం, ఇస్లాం - రెంటినీ సమన్వయంచేసి మరీ బ్రతక మంటుంది మనిషిని.

(9-10-87)

—: o :—

# సామాజికం

## 8. ముస్లిం సమాజం

ఎం. వెంకటరెడ్డి (తణుకు)

**ఇస్లాంలో సూఫీ, సున్నీ, షియా, తెగలు ఎందుకు వచ్చాయి? సిద్ధాంతపరమయిన భేదములు క్లుప్తంగా చెప్పండి.**

* మీరు పేర్కొన్నవి తెగలు ఏమాత్రం కావు. వీటి మధ్య సిద్ధాంతపరమయిన విభేదాలు అంతకన్నా లేవు. వీటన్నింటికీ మూల సిద్ధాంతం ఒక్కటే. సూఫీఇజం అన్నది. మనిషియొక్క క్రియలకు, ఆచరణలకు, షరీఅత్ అనుసరణలకు ఆధ్యాత్మికతను ప్రసాదిస్తుంది. మనిషి బాహ్యంలో చేసే పనులకు అంతర్గతంగా ప్రేరణ, ఉద్దీపననిస్తుంది. ఇది వేరే సెక్ట్ లేక తెగ ఎంతమాత్రం కాదు. దీన్ని వివరంగా అర్థం చేసుకోదలిస్తే "ఇహ్యయే ఇస్లాం" చదవడం ఉత్తమం. షియా సున్నీలన్న ముస్లిములు సైద్ధాంతికంగా ఒక్కటే ఐనా ఆచరణాత్మకంగా వీరిలో కొన్ని విభేదాలు—షరీఅత్ అనుసరణలో—గోచరిస్తాయి. కాలానుగుణ్యంగా, మనిషి అవసరాల ననుసరించి మార్గం చూపగల స్తోమత ఇస్లామీయ షరీఅత్‌లో ఉంది. షరీఅత్‌లోని మౌలికమయిన ఆదేశాల నుండి తమ అవసరాలకు తగురీతిలో అన్వయించుకోవడమన్నది ఇస్లామీయ చరిత్రలో నిరంతరంగా కొనసాగుతున్న ప్రక్రియ. అది మొత్తానికి దివ్య ఖుర్ఆన్ మరియు మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) ప్రబోధనల వెలుగులో జరుగుతూ వచ్చింది. అలాంటి ఓ దశలో కొన్ని చారిత్రక ప్రభావాలతో కొన్ని చారిత్రక అన్వయింపులతో ఏర్పడినదే షియా, సున్నీ వ్యత్యాసం. అయితే ధార్మిక జ్ఞానం ఉభయ వర్గాల్లోనూ సన్నగిల్లడం మూలాన అది ఎంతో పెద్ద అఖాతంగా

రూపొందింది. అయితే నేడు ముస్లిం జగమంతా చైతన్యవంతమవుతున్న తరుణంలో షియా-సున్నీ వర్గాలు కూడా జాగ్రుతమవుతున్నాయి. కాలగమనంలో ఎప్పుడో ఒకానొక దశలో జరిగిన పొరపాటువల్ల ఎంత ఘోరమయిన నష్టం వాటిల్లిందో గ్రహించి తమ తమ అనుయాయ వర్గాలకు అసలు సత్యాన్ని బహిర్గతం చేసి అందరినీ ఏకం చెయ్యడానికి కృషి చేస్తున్నాయి.

(2-9-1983)

—: ○ :—

బి.ఎస్.ఎం.కె. అహ్మద్ (విశాఖపట్నం)

**అహ్లె హదీసులు, హనఫీల మధ్య వ్యత్యాసం...**

* మీరు ఒక్క కార్డుపై వ్రాసిన గాధ ఎవరయినా చదవాలనే వ్రాశారా? ఉత్తరమయినా, ప్రశ్న అయినా మరే విషయమయినా వ్రాసేటప్పుడు ఎదుటి వ్యక్తి చదువుకోవాలన్న ఉద్దేశ్యంతో వ్రాయాలి. మీరు వ్రాయడమే ఎంతో అలక్ష్యంగా వ్రాస్తే చదివేవాడి కేంపట్టింది అతడు శ్రద్ధ తీసుకుని, బాధపడి, అర్థం చేసుకుని మరీ చదవడానికి? ఎవరయినా గుర్తుంచుకోవలసిన విషయం ఏమిటంటే: ఎదుటి వ్యక్తి సులువుగా చదువుకుని అర్థం చేసుకునేలా స్పష్టంగా వ్రాయాలి. మీరు అహ్లె హదీసు మరియు హనఫీల మధ్య ఉన్న ధర్మ సంబంధమయిన తారతమ్యాలను గురించి భేదాభిప్రాయాలను గురించి వ్రాశారు. ఇవి నేడు వచ్చినవి కావు. వందలాది సంవత్సరాల నుండి వస్తున్నాయి. కాని విజ్ఞులు, ధర్మం పట్ల సరయిన అవగాహన గలవారు, ధర్మాన్ని అనుసరించ దలచిన వారు ఇలాంటి విభేదాల జోలికి పోరు. ఎందుకంటే అవి చాలా స్వల్పమయిన,అల్పమయిన విషయాలపట్లఉన్న విభేదాలు. ఇది ఎంతో నాజూకు సమయం. ముస్లిములు సరయిన ధర్మావగాహన కలిగి, దివ్య ఖుర్ఆన్, ప్రవక్త సంప్రదాయాలను అర్థం చేసుకుని పాటించవలసిన సమయం. విభేదాలను అఖాతాలుగా పెంచి ముస్లిం సమాజాన్ని ఛిన్నాభిన్నం చెయ్యడం మహాగొప్ప నేరం. ప్రపంచంలోనూ ఇది క్షమార్హం కాదు-పరలోకంలోనూ దీనికి ఎంతో పెద్ద శిక్షపడేప్రమాదముంది. ఆమేరకు హెచ్చరికలు ఖుర్ఆన్ మరియు హదీసుల్లో ఉన్నాయి. అందువల్ల

విభేదాల జోలికి పోకుండా అందరూ సమైక్యంగా ధర్మసంస్థాపనా మార్గంలో కృషి చెయ్యవలసిన తరుణమిది; మరువకండి.

(17-8-84)

— ० —

జాఫర్ బేగ్ (శృంగవరపుకోట)

**వక్ఫ్ నిష్ప్రయోజకత్వం పూర్తిగా వివరించగలరు.**

* వక్ఫ్ వ్యవస్థ నిష్ప్రయోజకం అని ఎవరన్నారు? నిజానికి ముస్లిముల్లో ఐక్యత ఉండి, వారు ఓ సాంస్కృతిక వర్గంగా గట్టిపడి, సంఘటితంగా రూపొంది ఉంటే వారే తమ వక్ఫ్ ఆస్థులన్నింటినీ భద్రపరచుకుని ఉండేవారు. వాటి ద్వారా తామూ లాభమొంది ఇతరులకూ లాభం చేకూర్చగలిగేవారు. వారిలోని అంతఃకలహాలు పొడుగాను, నేడు ప్రభుత్వం వక్ఫ్ ఆస్తుల రక్షణ భారం తీసుకున్నా దాన్ని సవ్యంగా వినియోగించుకోలేకపోతున్నారు. ప్రభుత్వం కూడా తనకు తోచిన విధంగానే వక్ఫ్ ఆస్తుల నియంత్రణ చేస్తోంది. అది ఎంతవరకు సక్రమంగా నడుస్తోంది అన్నది చర్చనీయాంశమే. అయితే ముస్లిములు కోరేదే మంటే ఆయా వక్ఫ్ బోర్డులు ప్రభుత్వం నియమించిన సభ్యులతో కాక ముస్లిములు ఎన్నుకునే సభ్యులతో లేదా కనీసం ముస్లింల విశ్వాసం చూరగొన్న సభ్యులతో నిర్మించాలని. ప్రభుత్వ అజమాయిషీ ఉన్నా అసలు నిర్వహణ ముస్లిముల ప్రాతినిధ్యం వహించే వారి చేతుల్లో ఉండాలని. ఇదొక ధార్మిక వ్యవస్థ, ధర్మజ్ఞానం ఉన్నవారు, నీతి మంతులు, నిష్ఠా పరాయణులు, దైవం పట్ల భయభక్తులు కలవారి రక్షణలో వక్ఫ్ ఆస్తులుండాలని మాత్రమే.

(8-2-85)

—: ० :—

షేక్ చాన్ బాషా (నెటాల్‌పాలెం)

**తబ్లీగీ జమాఅత్- ఇస్లామీ జమాఅత్‌ల ముఖ్యఉద్దేశ్యము లేమిటి?**

* అయ్యా పాఠకరేణ్యా! ఇలాంటి ప్రశ్నను రెండు నెల్ల క్రితమే కదయ్యా పరామర్శించాము. తబ్లీగీ జమాఅత్, ముస్లిం సమాజంలోని క్రియా

హ్యతను దూరంచేసి సరయిన ఆచరణకై దాన్ని జాగృతం చెయ్యడం ధ్యేయంగా పనిచేస్తోంది. అందులోనూ ముఖ్యంగా నమాజ్, రోజాలాంటి ఆరాధనా నియమాలను నేర్పడం దాని ప్రముఖ లక్ష్యం. ఈ లక్ష్యంవల్లనే తెలుస్తోంది, దాని ధార్మిక భావన ఏమిటో. అది, ఆరాధనల్ని, వ్యక్తిగత మతపరమయిన నియమ నిబంధనల్ని పాటించడాన్నే ధర్మం లేక దీన్ అని భావిస్తుంది. జీవితపు ఇతర వ్యవహారాల్లో ముఖ్యంగా సామూహిక వ్యవహారాల్లో ముస్లిముల సంస్కరణ, సంగఠన దానిలో ఉన్నట్టు కానరావడం లేదు. అయితే జమాఅతె ఇస్లామీ, దీనికి భిన్నంగా నమాజ్ రోజాలనే కాక మనిషియొక్క వ్యక్తిగత, కుటుంబ, సామాజిక ఇతర సామూహిక విషయాలన్నింటినీ ధర్మం పరిధిలో పరిష్కరించాలని అభిలషిస్తూంది. ఈ అభిలాష కేవలం ఏదో అవసరం వల్లనో, దాని వాంఛ మేరకో ఉద్భవించిందికాదు. ఇది స్వయంగా ధర్మం బోధించిన కార్యాచరణ విధానం. ఖుర్ఆన్ హదీసుల వెలుగులోనే ఈ బాటను జమాఅత్ ఎన్నుకుంది. ఖుర్ఆన్ మరియు మహాప్రవక్త (సఅసం) సంప్రదాయాలకనుగుణంగానే అది జమాఅత్ వ్యవస్థను నెలకొలిపింది. ఆ మార్గదర్శకత్వంలోనే ముందుకు సాగుతోంది.

(15-2-85)

—: o :—

అబ్దుల్ మునాఫ్ (రాజమండ్రి)

**నేటి ముస్లింలు ధార్మిక జీవితము నుండి అసలు సంబంధము లేకుండా పోతున్నారు.**

* ముస్లింలు పూర్తిగా ధర్మం నుండి దూరంగా ఉన్నారనడం కూడా అన్యాయమే. వారు చాలామటుకు ధార్మిక విధుల్ని పాటించకుండా పోతున్నారు, లేక పాటించినా అందులో ఎంతో అలక్ష్యం కనబరుస్తున్నారు. ఈ విషయం మాత్రం నిజమే. వారు తమ నిజమయిన కర్తవ్యం ఏమిటో మరచిపోయారన్న విషయం కూడా యదార్థమే. తాము సత్యానికి సాక్షులుగా నిలిచే దైవ ప్రతినిధులన్న యదార్థం వారు గుర్తుచుకుంటే పరిస్థితుల స్వరూపం పూర్తిగా మారిపోతుందనడంలో సందేహం లేదు. అయిదున్నర కోట్లకు మించని

జనాభాగల ఫ్రాన్స్ దేశంలో 90 శాతం ప్రజలు రోమన్ కాథలిక్కులుగా బప్తిస్మం పొందినవారే. అయితే వారిలో ఏ 7 శాతం ప్రజలో గాని మతావలంబీకులు కారు. భౌతిక వాదానికి పట్టుకొమ్మగా నిలిచిన ఫ్రాన్స్‌లో ఇదంత ఆశ్చర్యకరమయిన విషయం కాదు. కాని అక్కడ భౌతికవాదం కొరకు, హేతువాదం కొరకు పోరాడిన మార్క్సిస్టుల్లో అగ్రగణ్యుడయిన 'రోజర్ గరాండి' (జననం: 1913) 1940లో ఓ చిన్న సంఘటన మూలంగా ఇస్లాం పరిచయం పొంది 1969లో ఇస్లాం స్వీకరించాడు. ఆయన కమ్యూనిస్టు ఫిలాసఫీ గురించి, ఫ్రాన్స్‌లో కమ్యూనిస్టు ఉద్యమం గురించి దాదాపు 40 పుస్తకాలు వ్రాశాడు. కమ్యూనిజంలో సైద్ధాంతిక లోటుపాట్లు వివరించడం మూలాన పార్టీ అతన్ని వదలుకోలేక వదలుకుంది. ఇప్పుడు అతను జెనీవాలోని ఇస్లామిక్ సెంటర్‌లో ఇస్లామీయ ఉద్యమ కార్యకర్త. కొత్తపేరు 'రెజా గరాడి'. ఇలాంటి సంఘటనలు భౌతికవాదంలో పడి కొట్టుమిట్టాడుతున్న పాశ్చాత్య దేశాల్లో అసంఖ్యాకం. వీటిని చూచిఅయినా ముస్లింలు కళ్ళుతెరుస్తే అదే పదివేలు.

(1-3-85)

—: o :—

అబ్దుల్ జబ్బార్ (తలకొండపల్లి)

**నేటి సమాజంలో ముస్లిం విద్యార్థులు విద్యా రంగంలో ముందంజ వేయలేక పోవటానికి కారణం?**

* మీ ప్రశ్నకు సమాధానం కావాలంటే కాస్త లోతుగా విశ్లేషించవలసి ఉంటుంది. అయితే చివరికి తేలేది మటుకు ఒకటే, అదే: సరయిన మార్గదర్శకత్వం, నాయకత్వం లేకపోవడం. ఎందుకు ఇలా సంభవించింది? 1947 కు ముందు అన్ని రంగాల్లోనూ అందరితో సమానంగా పురోగమించిన ముస్లిములు ఆ తరువాత ఒక్కసారిగా వెనకబడ్డారు, దేనికి? అన్న అంశాలు ఆలోచించాలి. దేశ విభజన తరువాత, ముస్లిములు తమ కొరకు ఒక ప్రత్యేక దేశాన్ని ఏర్పరచుకున్నారు కాబట్టి వారంతా అక్కడికయినా వెళ్ళిపోవాలి లేదా ఈ దేశంలో రెండో తరగతి పౌరులుగా నయినా జీవించాలి అన్న ప్రచారం ఉధృతంగా జరిగింది. అప్పట్లో ముస్లిముల్లోని చదువుకున్నవారు, ప్రభుత్వ ఉద్యోగాల్లో

ఉన్నవారు అత్యధికంగా పాకిస్తాన్‌కు వలసపొయ్యారు— ఇక్కడి వారి గతి ఏమయినా తమకేమని! పైన పేర్కొన్న ప్రచారం మూలాన మిగిలిన వారు ఈ ప్రచారానికి ప్రభావితులయి 'నిజమే కాబోలు' అన్న న్యూనతా భావంతో కుంచించుకు పోసాగారు. సరయిన నాయకత్వమూ లేకపోయింది. నాయకత్వం లేని ఈ ప్రజల్ని తొల్దొలి కమ్యూనిస్టులు ఆకర్షించి మీ బాధల్ని మేమే తీర్చ గలమని అరచేతి వైకుంఠం చూపారు. ఈ ప్రజలు అత్యధికంగా బీదవారు, కర్షకులు, కార్మికులు కావడం చేత దాన్ని నమ్ముకున్నారు. కమ్యూనిస్టులుకూడా 'వీళ్ళు ఎక్కువగా చదువుకుంటే మా పట్టు నుండి తప్పుకుంటార'న్నట్టు తమ అవసరాల మేరకే విద్యాగంధాన్ని పూయడానికి కృషిచేశారు. అప్పుడయినా, ఆ తరువాతయిన కాస్తో కూస్తో చదువుకున్న వారు కమ్యూనిస్టుల ఊబినుండి బయటపడ్డారన్నది వేరే విషయం. వారయినా తోటి సోదరులకు మార్గం చూపడా నికి ముందుకు వచ్చారా అంటే అదీ జరగలేదు. దేశంలో కొందరు సజ్జనులు, ముస్లిముల ఈ పరిస్థితిని అర్థంచేసుకున్న వారు,దేశ విభజనకు పూర్వ మే ఇలాంటి పరిస్థితులు రాగలవని ఊహించినవారు, ముస్లిముల కొరకు, ఇంకా నిజం చెప్పా లంటే, దేశ ప్రజలందరి కొరకు సరయిన మార్గదర్శకత్వం కాగల ఉద్యమాన్ని ప్రారంభించారు. అది ఒనరుల కొరత, సరయిన అంగబలం కొరతల కారణంగా నలభయి ఏళ్ళయినా సరిగా పురోగమించలేకపోయింది. అంతమాత్రాన 1947 లేక ఆ తొలిరోజుల పరిస్థితే ఇంకా నేటికీ విస్తరించి ఉందని చెప్పడం నిజాన్ని మరుగుపరచడమే అవుతుంది. ఇప్పుడు ముస్లిముల నవతరం ముందుకువచ్చింది. దేశ విభజన నాటి చేదు అనుభవాలకు దూరంగా కొత్త ఆశతో, ఆసక్తితో కళ్ళు తెరిచింది. పురోగమిస్తోంది. ఒకటి మాత్రం ముస్లిం యువకులు ఏ మాత్రం మరువరాదు. వారి ప్రాపంచిక ప్రగతి, వారిలో ఐక్యత, వారి మధ్య సరయిన నాయకత్వం కేవలం వారి ధార్మిక ప్రాతిపదికలపైనే సాధ్యమవుతాయి. పూర్వం కూడా వారు ధర్మాన్ని వదిలితే ఇహపరాలను రెంటినీ వదులుకున్నారు. ఇప్పు డయినా ధర్మాన్ని అనుసరించే ఇహపరాల సాఫల్యాలను సాధించుకుంటారు. ఇది ముమ్మాటికి నిజం.

(22-3-85)

—: o :—

ఎం.డి. ఇనాయత్ హుసైన్ (కావలి)

**అసలు ముసల్మానులలో తబ్లిక్ జమాత్, జమాతె ఇస్లామ్, అహ్లే సున్నత్ జమాత్ అసలు ఈ జమాత్‌ల ప్రత్యేకతలు ఏమిటి? సమాజానికి (ముస్లిమ్) వాటివల్ల ఏమిటి లాభము?**

* జమాఅత్ అంటే సంస్థ లేక (Organization) అని అర్థం. ఈ సంస్థలు కొన్ని ముఖ్యమయిన ఆశయాలసిద్ధికై ఏర్పడ్డాయి. వాటిని వివరంగా అర్థం చేసుకోవాలంటే ఆయా సంస్థలను, వాటి లిటరేచర్‌ని క్షుణ్ణంగా అధ్యయనం చెయ్యాలి. అవి నిర్ణయించుకున్న లక్ష్యాలను సాధించడానికి అవి చేస్తున్న కృషి ఏమిటో తెలుసుకోవాలి. ఇంతకు, ముస్లిములు విడివిడిగా, వ్యక్తిగత రూపంలో ఉండడానికి వీల్లేదు. వారు సంఘటితంగా ఉండడమే వారి విద్యుక్త ధర్మం. వారికి సంఘటిత జీవితం గడిపే తర్ఫీదే జీవితం మొత్తాన ఇవ్వడం జరుగుతుంది. నమాజ్ మొదలుకుని హజ్ వరకు వారి ఆరాధనలు—పూర్తిగా ఆధ్యాత్మిక విషయాలు—కూడా సామూహిక జీవితాన్నే ప్రబోధిస్తాయి. అందువల్లనే దైవప్రవక్త (సఅసం), ముస్లిములు ప్రయాణంలో ఉన్నా సరే, ముగ్గురే ఉన్నాసరే, తమలో ఒకరిని తమ నాయకునిగా ఎన్నుకుని సంఘటిత జీవితం గడపాలని ప్రబోధించారు. దీనివల్ల తెలిసేదేమంటే దైవం ముస్లిములపై మోపిన భారాన్ని నిర్వహించడానికి వారు సామూహికంగా కృషి చెయ్యడం అనివార్యం. ఆ కృషి సంఘటితంగా ప్రణాళికాబద్ధంగా చెయ్యడం కూడా అవసరమే. దీనికి ఓ సంస్థ, దానికి ఓ లక్ష్యం, ఓ కార్యక్రమం అంటూ ఉండటం కూడా తప్పనిసరి. ఉన్న సంస్థల్లో మన దృష్టికి, ఏదయితే దైవ ధర్మానికి, దాని సందేశానికి, దాని సంస్థాపనకు అత్యంత సమీపంలో అగుపిస్తుందో దానితో సహకరించడం, అందులో చేరిపోవడం ఉత్తమం.

(6-9-1985)

—: o :—

అబ్దుల్ రజాక్, గులాం ఫక్రుద్దీన్ (కంఠంరాజు కొండూరు)

**మేము జమాత్‌ను వదిలి వేరుగా (ఒంటరిగా) నమాజ్ నలుపవచ్చునా?**

* పరిస్థితులు ఎంతగా విషమించినా జమాఅత్‌ను వదలడం సబబుకాదు. అంతగా అయితే వేరేగా జమాఅత్ చేసుకోవడం మంచిది. మీరు చెప్పిన పరిస్థితుల్లో అసలు చెయ్యవలసిన పని ఏమిటంటే గ్రామ ప్రజలకు ధార్మిక పరిజ్ఞానాన్ని అందజెయ్యాలి. ముఖ్యంగా యువకుల్ని, మంకుతనం లేని పెద్దల్ని కూడదీసి వారిలో నిజమయిన ధర్మభావనను కలిగించాలి. వారిద్వారా గ్రామ ప్రజల్లో ధార్మిక చైతన్యాన్ని సృష్టించి మార్పుకోసం కృషిచేయాలి. అంతేకాని, కేవలం వేరుగా ఉండిపోవడంతో సమస్య తీరదు. మనం ఉంటున్న ఈ మిశ్రమ సమాజంలో ఎన్నో చెడులు చుట్టుప్రక్కల నుండి మనలోకి దారి చేసుకున్నాయి. వాటిని వివేకంతో దూరం చేసుకోవాలి కాని తొందరపడి అసలు వ్యవస్థనే నరకి వెయ్యకూడదు. మార్పు, అదీ నైతిక మార్గాన వచ్చే మార్పు సహనాన్ని, స్థయిర్యాన్ని, వివేచనను, సక్రమమయిన కార్యాచరణను, సుసంఘటితమయిన కృషినీ కోరుతోంది. ఈ బాట పూబాటకాదు, రాచబాట అంతకన్నా కాదు. కంటకప్రాయమయిన నేలపై, కాలిడే సందుకూడా కష్టంగాదొరికే వ్యవస్థలో ఎంతో మెలకువతో మెలగవలసి వుంటుంది. దైవం మీకు తోడు కాగలగాలని కోరుకుంటున్నాను. ఇస్లామీయ సాహిత్యాన్ని మీతో ఏకీభవించే వారిలో విరివిగా విస్తరింపచేయండి.

(8-11-85)

—: o :—

హెచ్. ఎండి. షజాఉద్దీన్ (మహబూబ్‌నగర్)

**ఖాన్ అని, సయ్యద్‌లని, షేక్‌లని ఖురేషిలు. అన్సారిలు, పఠాన్‌లని మొదలగునవి పేర్ల ముందర గాని వెనుక గాని యుంటవి కదా: ఇవి తెగల పేర్లా లేక కుటుంబం పేర్లా?**

* 'సయ్యిద్' అన్నది హజ్రత్ అలీ, ఫాతిమాల సంతానం తాము ప్రవక్త మనుమలని తెలుపడానికి వాడుకున్న పదం. ఇది రెండు రకాలుగా అవసరం. మహా ప్రవక్త ఇంటివారికి జకాత్ ఇవ్వడం కాని, వారు తీసుకోవడం

కాని జరగరాదు. అది వారికి నిషిద్ధం. అందువల్ల ఎవరు మహాప్రవక్త వంశస్థులో తెలుపడానికి వారి పేరుతోపాటు ఏదో ఒక గుర్తు ఉండటం అవసరం. రెండో అవసరం ఏమిటంటే పై కారణం వల్ల వారిలో అగత్యపరులకు జకాత్ ఇవ్వలేకపోతే మరేదయినా కానుక రూపేణ ఇవ్వవచ్చు. దక్షిణ భారతంలో వారిని సయ్యిద్ అని అంటే ఉత్తర భారతంలో 'మలిక్' అన్నది వారి పేరుతో చేరి ఉంటుంది. పోతే ఇదే సయ్యిద్ పదం అరేబియాలో, తెలుగులో శ్రీ, ఇంగ్లీషులో మిస్టర్, ఉర్దూలో జనాబ్ అన్న భావంలో వాడతారు. ఇక ఖాన్ అన్న పదం మధ్యాసియా దేశాల్లో ఉండే కొందరు సైనిక వృత్తిపరులకు ఆ బిరుదుండేది. ఆ తరువాత మనల్ని ఏలిన తెల్లదొరలు తాము మెచ్చిన వారికి రావ్ అనీ, రావు బహాదుర్ అని, రాయ్ అని, రాయ్‌బహాదుర్ అని, బిరుదులిచ్చినట్లే కొందరికి 'ఖాన్' అని, 'ఖాన్ బహాదుర్' అనీ బిరుదులు ప్రదానం చేశారు. అలా బిరుదాంకితులయిన ఖాన్ సాహెబ్‌లు కూడా చాలామంది ఉన్నారు. మిగతావన్ని అప్పుడప్పుడు మనదేశవాసులైన ముస్లిములు తమ 'వంశం' గుర్తుండాలన్నట్టు పెట్టుకున్న కొన్ని కాల్పనిక వంశ సూచకాలు. అంతే తప్ప వీటికి ఎలాంటి ప్రాధాన్యత లేదు. ఇప్పుడు, ముఖ్యంగా దక్షిణాదిన కితాబు పొందిన ఖాన్ సాహెబులు, సయ్యదు సాహెబ్ అని పేరు పెట్టుకొని సయ్యిదు కుటుంబంలో చేరిన వారు, ఖురైషీ అనీ, అన్సారి అని, సిద్దీకీ అని ఏదో పెట్టుకుని ఆయా వంశాలతో తమ సంబంధం తెలుపుకునేవారు చాలా మంది ఉన్నారు. కులం, వంశం, గోత్రం అని ప్రాకులాడే మన సామాజిక వ్యవస్థలో ముస్లిములు దానికి ప్రభావితులయి తమ Identityని ఏదో ఓ రూపంలో స్థిరపరచుకోవాలని తాపత్రయపడి ఇలా ఉపనామాన్ని ఏర్పరచుకోవడం వింతేమీకాదు. అయితే ఈ వ్యవస్థకు, దీని బంధనాలకు అతీతంగా ఎదగడం ఎంతో అవసరం.

(22-11-85)

—: o :—

నాగభైరవ జ్యోతీంద్రనాథ్‌శర్మ (తెనాలి)

**హైందవ వ్యవస్థకన్నా ఇస్లాంలో వర్ణ వ్యవస్థలు తక్కువేకదా! మరి అలాంటప్పుడు 'అల్లాహ్' ప్రబోధించిన శాంతి సహనాలను గాలికొదిలేసి ఇస్లాంలోని మిత్రులు పరస్పరం కలహించుకోవడంలో అర్థమేమిటి?**

* వర్ణ వ్యవస్థ ఇస్లాంలో లేని మాట నిజమే. అయితే మీరు చెప్పే ఆ "ఇస్లాంలోని మిత్రులు" ఎవరో బోధపడటంలేదు. ప్రపంచంలోని వివిధ ముస్లిందేశాల కలహాలే మీ దృష్టిలో ఉన్నట్లయితే అవి కేవలం రాజకీయమయినవని, ఇస్లాంను పాటించక పోవడంవల్ల ఏర్పడినవని, ప్రపంచంలోని రెండు అగ్ర రాజ్యాల మిలి భగత్‌వల్ల రగుల్కున్నవని మనవి చేసుకుంటున్నాను. ఇస్లాం ఎవరి సొత్తుకాదు. ముస్లింల సొత్తు అంతకన్నాకాదు. జార్జ్‌బెర్నార్డ్‌షా చెప్పినట్లు తమవద్ద ఇస్లాంలాంటి కల్పవృక్షం కలిగిఉన్న ముస్లిం అనుచర సమాజంకన్నా ప్రపంచంలో అదృష్టవంతులెవరూలేరు. అదే సమయాన, అలాంటి ఉత్తమ జీవన వ్యవస్థ ఉన్నా దాన్ని ఉపేక్షించి, పాటించకుండా అనేక హీనమయిన మార్గాల్లో పయనించే ముస్లిములకన్నా దురదృష్టవంతులూలేరు. ఇది ఆధునిక ముస్లిం సమాజం యొక్క ట్రేజడి. తమ ధర్మాన్ని వదిలేసిన ముస్లింలకు ఎన్ని సంపదలున్నా ప్రపంచంలో పరాభవం, పరాధీనం, పరాధారాలకు లోనయి జీవించవలసివస్తోంది—ఎంత దయనీయ పరిస్థితి!

(20-12-85)

—: ○ :—

షేక్ రసూల్ (తిరువూరు)

**ఇస్లాంలో వ్యభిచరించడం చాలా పెద్దతప్పు........**

* నేడు నెలకొన్న వాతావరణంలో ఆడా మగా బరితెగించి కలిసి తిరగడం, సినిమాల్లో శృంగారాన్ని కళగా చూపెట్టడం, నవలలు, సాహిత్యం వాటిని ప్రోత్సహించడం అంతాకలసి మీరు ప్రస్తావించిన పరిస్థితికి దోహదపడు తున్నాయి. కాని ఇస్లాంను పాటించాలంటే, దాని ఆదేశాలు దైవాదేశాలు అని నమ్మడం అవసరంకదా. వాటిని వ్యతిరేకిస్తే ప్రపంచంలో చూచేవారు, శిక్షించే వారు లేకపోయినా పరలోకంలో శాశ్వత శిక్ష తప్పదని విశ్వసించడంకూడా అవసరమేకదా. అలాంటప్పుడు ఒకవ్యక్తి ఇస్లాంలో ఉంటూ ఇస్లాంకు వ్యతిరేక మయిన పనుల్లో ఎలా నిమగ్నుడవుతాడు. అదీ 14 సంవత్సరాల కుర్రవాడు అలాంటి ఆలోచనలకు గురవుతున్నాడంటే ఇస్లామీయ తర్ఫీదు లోపించడం మూలానే అన్నది సుస్పష్టం. ఇస్లామీయ తర్ఫీదు కేంద్రాలకు ఇలాంటి వారిని

పంపడం అత్యంతావశ్యకం. సాంగత్యం సజ్జనులదయితే సద్వర్తన అలవడు తుంది, మంచి ఆలోచనలు వస్తాయి, మంచి ఆచరణా అబ్బుతుంది.

(9-5-86)

—:o:—

ముహమ్మద్ హాజి (బొబ్బిలి)

**జమాఅతె ఇస్లామీ వివాదగ్రస్తమయిన పొలిటికల్ వింగ్ అని అపోహ ప్రజల్లో వుంది—దాన్ని నివృత్తి చేయడానికి గీటురాయి పాత్ర ఏమయినా ఉందా?**

* జమాఅతె ఇస్లామీ హింద్ ఎలాంటి సంస్థ? అన్న విషయాన్ని తెలుసు కోవడానికి దాని లిటరేచర్ ఆధారపూర్వకమయిన సమాధానం, దాని కార్యకర్తలు ప్రత్యక్ష నిదర్శనాలు. గీటురాయి చేస్తున్నదేదో మీరూ చూస్తూనే ఉన్నారు. ఇస్లాంను, ఇస్లామీయ ఉద్యమాన్ని ఉన్నది ఉన్నట్లుగా పరిచయం చెయ్యడానికి గీటురాయి చేస్తున్న సేవ గుప్తంగా ఏమీలేదు. అంతా బట్టబయలుగానే ఉంది. పోతే, వివాదగ్రస్తమయిన సంస్థ అన్న విషయానికి వస్తే నేడు 'మనిషి' అన్న రెండుకాళ్ళ జీవికూడా వివాదగ్రస్తమయిన విషయంగా రూపొందాడు. ఆంత్రో పాలజిస్టు (మానవ శాస్త్రవేత్తలు) మనిషి ఉనికి, అతని మానసిక స్థితి, అతని సామాజిక స్పృహ అన్నింటి దృష్ట్యా మనిషి విభిన్న స్వరూపుడు అని అంటారు. అలాంటి వివాదగ్రస్తమైన జీవి ఏర్పరిచే ఏ సంస్థ అయినా, ఏ పార్టీ అయినా సర్వసమ్మతంగా, సకల జనామోదంగా విరాజిల్లజాలదు. మీరు జమాఅత్‌ను పొలిటికల్ పార్టీ అన్నారు. అది సామాన్య పరిభాషలో ఎన్నడూ పొలిటికల్ పార్టీకాదు. అలా అని అది సామాన్య అర్థంలో మతపరమయిన సంస్థ అంత కన్నాకాదు. ఇస్లాం ఎంత సమగ్రమయిందో జమాఅత్ కార్యకలాపాల పరిధి కూడా అంతే విస్తృతమయింది. దాని సందేశం జీవన వ్యవస్థను పూర్తిగా తీర్చిదిద్దే సందేశం. అందులో మత విషయాలూ ఉన్నాయి, కుటుంబ సమస్యలూ ఉన్నాయి, సామాజిక ఆర్థిక వ్యవహారాలూ ఉన్నాయి, రాజకీయ కార్యకలా పాలూ ఉన్నాయి. అదొక ధార్మిక వ్యవస్థ.

(7-11-86)

—:o:—

ఎం. ఆనంద్ (చీరాల)

**మీరుకు ప్రజలదే రాజ్యం, అధిక సంఖ్యాకులదే భోజ్యం, మన భారతా వనిలో స్వచ్ఛమయిన ప్రజాస్వామ్య పరిపాలన వస్తుందంటారా?**

* అందుకే చాలా మంది రాజకీయవేత్తలు చైతన్యవంతులు కాని ప్రజల్లో ప్రజాస్వామ్యం నిలువ జాలదు అని, ఇలాంటిచోట్ల నియంతృత్వమే సరి అని అంటారు. 'ప్రజల రాజ్యం' అన్న భావన ప్రజలకు అర్థమయి, వారు దాన్ని సక్రమంగా వినియోగించుకోగలిగితే, తమకు లభించిన ఓటు హక్కును విచక్షణా జ్ఞానంతో ప్రయోగించగలిగితే మీరు ఇలాంటి ప్రశ్న లేవనెత్తే అవసరమే వచ్చేది కాదు. మీరు హజ్రత్ ఉమర్ పరిపాలనను మీ లేఖలో ఉదాహరించారు. నిజమే కాని, ఆ పరిపాలన వెనక ఎంత కృషి—ప్రజల్ని చైతన్యవంతులుచేసే సచేతన కృషి—ఉందో మీరు మరచిపొయ్యారు. ఇస్లామీయ వ్యవస్థలో అందుకే "జ్ఞానానికి" అత్యధిక ప్రాధాన్యత ఉంది. పాలితుల్ని జాగృతం చేసే వ్యవస్థ, వారిలో చైతన్యాన్ని రేకెత్తించే వ్యవస్థ ఏదయినా ఉంటే అది ఇస్లామీయ వ్యవస్థ అనడంలో సందేహంలేదు. కాని విచారకరమయిన విషయం ఏమిటంటే ముస్లిమ్ దేశాలు—ఎలాంటి మినాయింపు లేకుండా అన్నీ—ఈ విషయంలో కావలసిన చొరవ చూపలేకపోతున్నాయి. అదే జరిగివుంటే నేడు ప్రపంచం ఆరోగ్యవంతమయిన ప్రజాస్వామ్యం, దైవ మార్గదర్శకత్వపు ప్రాతినిధ్య పరిపాలన అంటే ఏమిటో కళ్ళారా చూడగలిగి ఉండేది. ప్చ్, జార్జిబెర్నార్డ్‌షా అన్నట్టు ఇస్లామ్ పుస్తకాల అలంకరణగా మాత్రం మిగిలిపోయింది. ముస్లిములు నేటికయినా సరే లేచి తమ వంతు పాత్ర నిర్వహిస్తే ప్రపంచం స్వర్గతుల్యమవుతుందనడంలో సందేహంలేదు.

(12-12-86)

—: o ;—

ఎన్. దేవకుమార్ (దిల్‌సుక్ నగర్)

**అరబీ భాష యొక్క అవసరత కేవలం సలాత్‌లో మాత్రమేనా? అనుదిన వ్యవహారాల్లో, సంభాషణల్లో అరబీని మాధ్యమంగా చేసుకోవలసిన అవసరం ముస్లిములమీద లేదా? దానిని విశ్వజనీన భాషగా వృద్ధి చెందించటానికి మీ సూచనలేమిటి?**

* ఏకాలంలో నయితే ముస్లిములు ఉత్థాన దశలో ఉన్నారో, ఎప్పుడయితే వారు రాజ్యాధి కారంతో, నాగరికతా ఆధిక్యతతో, సంస్కృతీ ప్రాభవంతో అత్యధిక భూభాగాన రాజ్యమేలారో ఆ కాలంలో అరబీ భాష, నేటి ఆంగ్ల భాషలా ప్రపంచ భాషగా, శాస్త్రీయ భాషగా, శాస్త్రాల భాషగా అలరారింది. ఏ శాస్త్రం అధ్యయనం చెయ్యాలన్నా అరబీ చదవనిదే సాధ్యపడేదికాదు. శాస్త్రీయగ్రంథాలు అనేక భాషల్లోకి అరబీ నుండి అనువాదమయ్యేవి. స్పెయిన్ మొదలుకుని చైనా వరకు ప్రపంచంలో సర్వత్రా అందరూ అర్థం చేసుకునే భాషగా విరాజిల్లింది అరబీ. కాని రాజ్యాధికారంతోపాటు ధార్మిక, సాంస్కృతిక ప్రాధాన్యత కోల్పోయిన ముస్లిములు భావ దాస్యం, భాషాదాస్యంలో పడిపోయ్యారు. చివరికి కమాల్ అతాతుర్క్ చేత, అరబీని, జనావళిలో నుండి చివరిసారిగా తరిమి వెయ్యడం జరిగింది. అది గత గాథ. గతం గతః. చమురు నిక్షేపాలు బయటపడిన తరువాత ప్రపంచంలో అరబీ తిరిగి ప్రాముఖ్యం సంతరించుకో సాగింది. అయితే ఈసారి సాంస్కృతిక, నాగరిక, శాస్త్రీయ ప్రాధాన్యతలు లేవు. కేవలం వాణిజ్యమే మూలకారణం. అనేక విధాలుగా దిగజారిపోయిన ముస్లిములు అరబీ భాష విషయంలో పూర్తిగా పడిపొయ్యారు. చివరికి ఖుర్ఆన్ పారాయణం చెయ్యడానికి (చదివి అర్థం చేసుకోవడం కాదు) కూడా వారికి తీరిక లేదు. కేవలం తాము జీవికకై చదువుకున్న భాషలో 'లిప్యంతరీకరణ' (Translitration) చేసిన ఖుర్ఆన్ ప్రతులు కావాలని అడుగుతుంటారు. ఆ భాషల్లో అరబీలోని ఉచ్చారణలన్నీ సరిగ్గా రావని తెలిసినా అదే కావాలంటారు. ధర్మం కోసం, దేవుని సందేశాన్ని తెలుసుకోవడం కోసం తమ జీవితంలో కొంతకాలం, తమ సంపాదనలో కొంత ధనం వెచ్చించడానికి సిద్ధంగా లేరు. వారు సిద్ధమయితే మార్గాలూ సుగమమవుతాయి, వారి సంకల్పం, సంసిద్ధతలే అవసరం.

(29-7-88)

—: o :—

# 9. వనితావని

ఖాజా సాబెరుద్దీన్ (సఫాత్, కువైట్)

**న్యాయంగా తల్లిదే తప్పు అయినా తల్లివైపు మొగ్గవచ్చునా?**

* తల్లి మీకంటే, మీ భార్యకంటే వయసులో ఎంతో పెద్దది. ఆమెకు అసలు విషయాన్ని ఆమె కోపంగా లేనప్పుడు, ఒంటరిగా ఉన్నప్పుడు అర్థమయ్యేలా చెప్పడానికి ప్రయత్నించాలి. భార్యకు తల్లి స్థానాన్ని, ఆమె పెద్దరికాన్నీ బోధపరచడానికి ప్రయత్నించాలి. తల్లివల్ల ఏదయినా తప్పు జరిగినా దాన్ని సర్దుకుపోయేలా ఆమెను మలచాలి. దానివల్ల ఆమె పారలౌకిక ప్రయోజనం పొందడమే కాక ఇంట్లోనూ ప్రశాంత వాతావరణాన్ని సృజించుకోగలదని బోధపరచాలి. నిజానికి ఇంటి గొడవలు ఏవో చిన్న చిన్న అపార్థాలవల్ల ప్రారంభమవుతాయి. "అత్తా కోడళ్ళ" మధ్య ఎవరు గొప్ప? ఎవరి ఆధిపత్యం చెల్లాలి? అన్న సమస్య సహజంగా ఏర్పడుతుంది. నిన్నటివరకు తన ఆధిపత్యమే చెలామణీ అయిన ఇంట్లో నేడు ఓ అమ్మాయి వచ్చి పెద్దరికం చెలాయించడం సహించకపోవడం చేత అత్త తరపునను-తన భర్త సంపాయిస్తుండగా ఈ ముసలమ్మగారి పెత్తనం ఏమిటి అన్న భావంతో కోడలు తరపునను ఈ అపోహల పరంపర అంచలంచెలుగా పేరుకుపోతుంది. పరలోకసాఫల్యా భావన, మనకు ఆదర్శప్రాయులయిన సహాబియాత్ (మహా ప్రవక్త యొక్క మహిళా సహచరగణం) యొక్క జీవిత వివరాలు ముందుండకపోవడం వల్ల ఇలాంటి సమస్యలు ఉత్పన్నమవుతాయి. ఒకటి మాత్రం గుర్తుంచుకోండి, కలహాలు రగుల్కొన్న తరువాత ఎవరికో ఒకరికి నచ్చజెప్పడానికి ప్రయత్నించరాదు. అప్పట్లో ఇద్దరికీ నచ్చజెప్పి ఆ తర్వాత వేర్వేరుగా ఇద్దరికి నచ్చజెప్పడానికి ప్రయత్నించాలి. అంతా కోడలిపైననే అధికంగా ఆధారపడి ఉంటుంది. కోడలు ఎంత సహనం నిగ్రహం పాటించగలిగితే అంత మంచిది.

(11-11-1983)

—: o :—

యస్. ఏ. కరీమ్ (విజయవాడ)

**మానభంగమే నేరమయితే స్త్రీ స్వేచ్ఛగా లొంగడం నేరం కాదంటారా?**

* అది ఆ యా సమాజాల పరిణతిపై ఆధారపడి ఉంటుంది. అనేక రకాలుగా అనేక మెట్లపై కెక్కిన అనేక సమాజాలు నైతికత రీత్యా అనుదినం అడుగంటి పోతున్నాయి. మనిషి సాధించిన ప్రగతి వికాసాలన్నీ — 'అన్నీ' అని ఇట్టే అనడంలేదు కావాలనే అంటున్నాను—మానవుని భౌతిక కాయానికి వీలైనన్ని సుఖ భోగాల నందించడానికి, మనిషి మనోవాంఛలు, కాంక్షలు 'అన్నిం'టినీ తీర్చడానికి మాత్రమే ఉపయోగ పడుతున్నాయి. 'నైతికత' అన్నది ఆధ్యాత్మికమయిన విషయం. ఆధ్యాత్మికతను గుర్తించని వ్యక్తి 'నీతి' అని ఎన్ని నీతులు వల్లించినా అవన్నీ కోరికలు అనే పెనుభూతానికి ఆహుతి కాక మానవు. ఆధ్యాత్మిక జగత్తు పరిణామ ప్రగతులతో వాటికి ఎలాంటి సంబంధం లేదు; కాబట్టి అవన్నీ అసంపూర్ణంగానే ఉంటాయి. పాశ్చాత్య నాగరికతా సంస్కృతులు పప్పులో కాలేసింది ఇక్కడే. దైవాన్ని కాదని, వారు ఎన్ని నైతిక సూత్రాలు నిర్మించుకున్నా ఎన్ని చట్టాలు చేసుకున్నా అవన్నీ వాస్తవంగా నైతిక అవసరాలనూ తీర్చలేక పోతున్నాయి, చట్టపరమయిన లోపాలనూ పూడ్చలేక పోతున్నాయి. ఉదాహరణకు వ్యభిచారాన్నే తీసుకోండి. చట్టబద్ధ మయిన లైంగిక సంబంధం తప్ప మరే విధమయిన లైంగిక సంబంధమయినా అనాగరికం, అమానుషం, హానికరం, నీతి బాహ్యమైందని మనిషి అంతర్యం దాన్ని ఏవగించుకుంటుందని, ధార్మిక మయిన అన్ని శాస్త్రాలు, నియమాలే కాదు 'మానవుని నాగరిక చరిత్ర' కూడా చాటి చెబుతుంది. అయితే పాశ్చాత్య నాగరికత ఆ వ్యభిచారాన్ని విశ్లేషించి అనేక రూపాలుగా విభజన చేసింది (ఇది విశ్లేషణాయుగం అని మరువకండి). వివాహిత వనిత పర పురుషునితో వ్యభిచరించడాన్ని Adultery అనంటారు. అవివాహితులైన వారు వ్యభిచరిస్తే దాన్ని Fornication అనంటారు. బలవంతంగా ఒక స్త్రీని పురుషుడు చెరచి నట్లయితే దాన్ని Rape (మానభంగం) అనంటారు. ఇంతకు ఒక పురుషుణ్ణి స్త్రీ "చెరచి" (Rape చేసి) నట్లయితే దాన్ని ఏమనాలో ఏ శిక్షను విధించాలో పాశ్చాత్యనాగరికులు చెప్పకుండా మౌనమే శరణ్యమన్నారు! ఇస్లాం దృష్ట్యా ఇవన్నీ వ్యభిచారానికి సంబంధించినవే, ఇవన్నీ నేరాలే. అన్నింటికి వేర్వేరు శిక్ష

లున్నాయి. ఇవన్నీ చట్ట విరుద్ధమయిన లైంగిక సంబంధాలు కాబట్టి వీటిని నేరాలుగా పరిగణించాలనే మానవుని అంతరాత్మ కూడా ఘోషిస్తుంది.

(3-2-84)

—: ० :—

## డి. దామోదర్‌రావు (మేడ్‌పల్లి తూర్పు)

**ముస్లిం స్త్రీ రాజకీయ నాయకురాలిగా లేక మంత్రిగా చలామణి అవుట ఇస్లాం మతంలో ఉన్నట్లు హదీసు సూచన ఇవ్వగలరు?**

* లోగడ ఇలాంటి ప్రశ్నకే సమాధానం ఇచ్చినట్లు గుర్తు. మీరు హజీసు అని వ్రాశారు. "హదీసు" అన్నది మీ అభిప్రాయం కాబోలు. ఇస్లామీయ చరిత్రలో అవసర మయినప్పుడు రాజకీయ, విద్యా, వ్యాపారరంగా లన్నింటి లోనూ ముస్లిం మహిళలు పాల్గొన్న ఆధారాలు అనేక మున్నాయి. ఒక సందర్భంలో హజ్రత్ ఆయిషా హదీసులు బోధించే విద్యాపీఠాన్ని ఆక్రమించడమే కాక రణరంగంలో దిగి, సైన్యాన్ని కూడబెట్టి, రాజకీయ, సైనిక నాయకత్వం వహించారన్నది చారిత్రిక సత్యం. హజ్రత్ రాబియా బస్రి తన షరీఅత్ పరిజ్ఞానానికి, బోధనకు పేరొందిన విషయం కూడా అందరికీ తెలిసిందే. ముస్లిముల మాతృమూర్తులయిన మహాప్రవక్త (సఅసం) సతీమణులు స్త్రీలనక పురుషులనక అందరికీ షరీఅత్ పరిధిలోనే షరీఅత్‌ను బోధించడానికి కృషి చేశారన్నది కూడా చారిత్రక సత్యాలే. మహనీయ ముహమ్మద్ (స) కాలంలో స్త్రీల ప్రాతినిధ్యం వహిస్తూ అనేక మంది మహిళా నాయకురాళ్ళు వచ్చి తమ సమస్యల్ని మహాప్రవక్తకు విన్నవించుకునే వారు. ఇవన్నీ చూస్తే, మహిళలు తమ పరిధిలో ఉంటూ అన్ని రంగాల్లోనూ కృషి చెయ్యడానికి వీలుందని తెలుస్తోంది. నేడు కూడా ఇస్లామీయ రాజ్యంలో మహిళలకు సరయిన ప్రాతినిధ్యం లభించడానికి అవకాశ ముంది అయితే వారికి వారి కార్యపరిధులు, అవధులు ఉంటాయి.

(17-2-84)

—:०:—

హెచ్. ఎం. పి. షుజావుద్దీన్ (మహబూబ్‌నగర్)

**"విధవ" పూలు పెట్టుకో కూడదు. తెల్లబట్టలు మాత్రమే కట్టాలి. గాజులు తొడుక్కో కూడదు అని చెబుతారు. ఇస్లాంలో కూడా విధవ ఇలా ఉండాలి అనే నియమము ఏదయినా వుందా?**

* అలంకరణ అన్నది ఎప్పుడూ ఇతరులకు చూపడానికే జరుగుతుంది. "కాదు, ఇది కేవలం తమ తృప్తికోసమే చేసుకుంటారు." అని చెప్పేది కేవలం ఆత్మవంచన మాత్రమే. "తనకు నచ్చిన విధంగా ఇతరులకు అగుపించేందుకు చేసే కృషి"యే అలంకరణ. ఇది కనీసపు నిర్వచనం. ఒక్కోసారి ఇతరులకు నచ్చే విధంగాను, మరికొన్నిసార్లు 'నలుగురికీ' నచ్చే విధంగానూ, ఇంకా కొన్ని పర్యాయాలు 'అందరికీ' నచ్చే విధంగానూ జరుగుతుంది ఈ అలంకరణ! కాని సహజంగా స్త్రీ తన అలంకరణను తన భర్త కోసమే చేసుకుంటుంది — అధిక శాతం. భర్త పోయాక ఇక అలంకరణ దేనికి? అన్న మనస్తత్వం సహజంగా పుడుతుంది. అయితే ఏ సమాజాల్లోనయితే వితంతువుకు పునర్వివాహం చెయ్యడం నిషిద్ధమో అక్కడ వితంతువు తాను ఇష్టపడక పోయినా సమాజపు ఒత్తిడికి తట్టుకోలేక ఆ 'విధవ వేషం' వేసుకునే గడుపుతుంది. ఇప్పుడిప్పుడే ఆ విషయంలో తిరుగుబాటు ధోరణులు అలాంటి సమాజాల్లోనూ అగుపిస్తున్నాయి. అయితే ఇస్లాం తొలినుంచే వితంతువు వివాహాన్ని అమల్లో పెట్టింది. వితంతువు తన సహజమయిన 'శోక' కాలాన్ని మినహాయించి లక్షణంగా తన అలంకరణలు చేసుకోవచ్చు. మళ్ళీ పెళ్ళి చేసుకోవచ్చు. 'శోక' కాలంలో మటుకు తన అలంకరణలను సహజ రీతిలో మానుకోవాలి. 'శోక' కాలం నలభయి దినాలు.

(20-9-85)

—o—

ఎస్. కె. షరీఫ్ (ఎర్రగొండపాలెం)

**నేటి నాగరిక సమాజంలో పురుషుల దౌష్ట్యానికి బలవుతున్న స్త్రీకి, స్త్రీవల్ల సర్వనాశనమవుతున్న పురుషులకి మీరిచ్చే అమూల్యమయిన సలహా ఏమిటి?**

* మనుషుల్ని వారి మనస్సుల్ని సృజించిన ప్రభువు, తన సృష్టిలో ఉన్న మంచీ చెడుల్ని ఎరిగిన స్వామి, విశ్వ వ్యవస్థ నంతటినీ తన నియమాల ప్రకారం

నడుపుతూ మనిషికి ఒకింత స్వేచ్ఛా స్వాతంత్ర్యాల నిచ్చిన సర్వోపరిజ్ఞాని మానవ జీవితానికి- వ్యక్తిగత అంశాలు మొదలుకుని కుటుంబం, సమాజం ఇత్యాది రంగాలన్నిటికీ—మార్గదర్శకత్వం అందజేశాడు. దాన్ని పాటించడంలోనే మానవ శ్రేయో సుఖాలున్నాయి. ఆ పరిమితుల్ని ఆ నియమావళిని అనుసరించ డంలోనే జీవితానికి సాఫల్యం, సామరస్యం ప్రాప్తమవుతాయి. దాన్ని కాదన్న నాడు, ఏ మేరకు ఆ హద్దుల్ని అతిక్రమించడం జరుగుతుందో ఆ మేరకు మానవ జీవితం వినాశానికి గురవుతుంది. అలాంటి అతిక్రమణకు, శాసనోల్లంఘనకు ఫలితమే మీరు ప్రస్తావించిన ప్రశ్న. విశ్వప్రభువు నిర్ణయించిన ఆ హద్దు లేవో, ఆ నియమావళి ఏదో తెలుసుకుని మెలగడమే నేడు కావలసింది. ఇదే స్త్రీ పురుష లందరికీ నేనివ్వగలిగిన సలహా.

(11-4-86)

—: o :—

## యం.డి. రేహానా బేగం (బెల్లంపల్లి)

**నా యొక్క సందేహం తీర్చవచ్చా? "ఒక యువతి మానభంగం అయిన తరువాత ఆమెను వివాహము చేసుకోవడానికి ఎవరు ముందుకు వస్తారు. అందుకని ఆత్మహత్యయే ఆమెకి శరణ్యం."**

* బలాత్కారంగా జరిగిన మానభంగానికి ఆ యువతి బాధ్యురాలెలా అవుతుంది? కొందరు దుండగుల అత్యాచారం వల్ల ఆమె జీవించే హక్కును కోల్పోవలసిందేనా? నేరం చేసిందెవరో అయితే దానికి శిక్ష ఆమె అనుభవించాలా? ఇదెక్కడి న్యాయం? అయితే మన సమాజంలో నేరస్థుల్ని క్షమించివేసే 'విశాల' హృదయత అయితే ఏర్పడింది కాని అమాయకుల్ని ఆదరించే విశాల దృష్టి ఏర్పడలేక పోతోంది. కారణం. అసమంజసమయిన విలువలు, అసంబద్ధమయిన ప్రమాణాలు, నిరాధారమయిన నైతికత, దిగజారిపోయిన మానవత: సమాజాన్ని మంచి వైపుకు నడిపించే వారు కావాలి. విప్లవం అంటే రక్తపుటేరులు, కత్తి కటారులు, తుపాకి గుండ్లు కావని చెప్పే వారు కావాలి. విప్లవమంటే ఆలోచనా త్మకమైన తుఫానని, సృజనాత్మకమయిన చల్లని జల్లు అని, ఆచరణీయమ కాంతి మయమయిన బాట అని ప్రకటించేవారు కావాలి. దృష్టిలో, హృదయంలో

అనంతవిశాలత్వం గలవారు కావాలి. అప్పుడే సమాజం దుష్ట భావనల చీకటిలో నుండి, దురాచారాల ఊబిలో నుండి వెలికి రాగలదు. అందుకు నడుం బిగించారా ?

(25-4-86)

—: ౦ :—

## యస్.కె. షరీఫ్ (యర్రగొండపాలెం)

**స్త్రీని స్త్రీగా గౌరవించేదెప్పుడు? స్త్రీ స్వేచ్ఛ విషయంలో మీ అభిప్రాయం?**

* స్త్రీ స్వేచ్ఛ, స్త్రీ విమోచనం అన్నవి ఉత్తుత్తి అర్థంలేని పదాలు. పాశ్చాత్యులు నేర్పిన మాటల్ని దాస్యభావం వీడని మనం చిలకల్లా వల్లిస్తున్నాము. స్త్రీ స్వేచ్ఛ అంటే ఏమిటి? స్త్రీని క్లబ్బుల్లో నగ్నంగా పురుషుని చుట్టూ తిప్పుకుని సంబరపడి పోవడమా? స్త్రీని ఇంటి వెలుగుగా కాక బజారు దీపంగా మార్చడమా? స్త్రీని మీ పిల్లల్ని కనే మిషనుగాను, మీ ఇంటి బండ చాకిరి చేసే బానిసగాను వాడుకుని ఆ తరువాత 'పురుషునితో సమాన హక్కు' అనే తేనె పూసిన మాటలతో మభ్యపెట్టి బజారు కీడ్చి, ఆఫీసుల్లో, కార్ఖానాల్లో 'ఉద్యోగం' వెలగబెట్టించడమా? స్త్రీని స్త్రీగా గౌరవించడమంటే ఇదే అర్థమయితే ఈ 'గౌరవం' పొందిన ఆధునిక పాశ్చాత్య స్త్రీని అడగండి ఆ గౌరవానికి ఎంత పెద్ద ఖరీదు ఆమె చెల్లించవలసి వస్తున్నదో. నా దృష్టిలో స్త్రీని స్త్రీగా గౌరవించడమంటే ముందు స్త్రీని మనిషిగా గౌరవించాలి— పురుషుని విలాస క్రీడలకు పనిముట్టుగా కాకుండా. స్త్రీ పురుషుల మధ్య ఉన్న శారీరక, మానసిక, భావనాపరమయిన సహజమయిన వ్యత్యాసాల దృష్ట్యా ఆమెకు ఆమె కార్య పరిధిలో స్వేచ్ఛ, అధికారాలు లభించాలి. ఆమెలోని సహజ మయిన మమతానురాగాల మాధురితో కుటుంబ జీవితం అమృతమయమయ్యే వాతావరణం నెలకొనాలి. ఆమె తన సహజమయిన చాతుర్యంతో, నైపుణ్యంతో భావితరాలను సుశిక్షణ గరిపే గురువు పీఠాన్ని తన యింట అలంకరించాలి. కుటుంబజీవితంలో పురుషుని తోడుగా నిలిచే చెలి మాత్రమే కాదు, తన కార్య పరిధిలో మహారాజ్ఞి ఆమె కాగలగాలి. అదీ స్త్రీని గౌరవించడమంటే.

(10-10-86)

—: ౦ :—

స్యయ్యద్ షాకిర్ హుసైన్, షేక్ నౌషాద్, షరీఫ్ (యర్రగొండపాలెం)

**రాముడు అంతటివాడే భార్యపై అనుమానపడి ఇంటి నుండి పంపాడు కదా అంటూ, చీటికి, మాటికి తమ భార్యలను కష్టపెట్టే మగాళ్ళపై మీ అభిప్రాయం.**

* శ్రీరామచంద్రుడు చేసిన పనిని గురించి వ్యాఖ్యానించేంతటివాడను కాను. అయినా చరిత్ర భ్రమణంలో జరిగిన సంఘటనను వ్యాఖ్యానించి ప్రయోజనమూ లేదు. అయితే నేటి అపర రామచంద్రులు చేసే వేధింపు చర్యలు మాత్రం మగధీరుల బలహీనతలని గట్టిగా చెప్పగలను. శ్రీరామచంద్రుని అనుమానానికి ఏదో గుడ్డి ఆధారమయినా ఉండింది. నేటి "పురుషోత్తము"లు ఆ అనుమానాలను చేజేతులా సృష్టించుకుంటున్నారు. స్త్రీ పురుషుల మిశ్రమ సమావేశాల్లో భార్యల్ని హుషారుగా తీసుకెళ్ళుతారు. మిత్రులతో, అయినవారితో, కాని వారితో జంకు వంకు లేకుండా విచ్చలవిడిగా భార్యల్ని తిరగాడనిస్తారు. ఆ తరువాత అనుమానపు ఊబిలో ఇరుక్కుని అంతులేని వ్యధననుభవిస్తారు. ఇది ప్రకృతికి, మానవ ప్రవృత్తికి విరుద్ధంగా వ్యవహరించడం వల్ల సంభవించే అనివార్య పరిణామం. మహిళలు కూడా ఇలాంటి విషయాల్లో జాగ్రత్తగా మసలుకోవడం అవసరం. మగాళ్ళు మొదట ఎంతో ఉదారంగా కనిపించినా లోలోన అనుమానాన్ని పెంచి పోషించుకుంటూ చిన్నచిన్న సంఘటనల్ని సయితం ఆజ్యంగా వాడుకుంటూ ఆ అగ్నికి తాముా ఆహుతి అయి ఆడవాళ్ళనూ దహించి వేస్తుంటారు.

(24-10-86)

—: ○ :—

షేక్ అబ్దుర్రజ్జాక్ (విజయవాడ)

**ముస్లిం స్త్రీలకి ఇంటిపేరు ఉండకూడదా? పిల్లలకి పేరు పెట్టడంలో తీసుకోవలసిన నియమాలు తెలియపర్చగలరు.**

* పేరు అన్నది ఆనవాలు, గుర్తు. అయితే పేరుపెట్టే విధానం ఆయా సంప్రదాయాల కనుగుణంగా, ఆయా సంస్కృతుల కనుగుణంగా మారుతూ

వచ్చింది. ఇంకా మారుతూ ఉంది. ఇంటిపేరు లేక Surname ప్రపంచమంతా రకరకాలుగా ఉంది. కొన్ని ఇంటి పేర్లు వంశాన్ని సూచిస్తే మరికొన్ని వారు వచ్చిన ఊరి పేరును తెలుపుతాయి. తెగలు, లేక తెగల పెద్దల పేర్లు తెలిపే ఇంటి పేర్లుంటాయి. పాశ్చాత్యుల్లో స్త్రీకి పెళ్ళి అయ్యేవరకు తన తండ్రి ఇంటి పేరును ఆ తరువాత భర్త ఇంటిపేరును అతికించే సంప్రదాయముంది. దాన్నే కాబోలు మన నాట కూడా ఫ్యాషన్‌గా చాలామంది అనుసరిస్తున్నారు. కాని నా దృష్టిలో అలా చెయ్యడం స్త్రీ వ్యక్తిత్వాన్ని కించపరచడమే. ఆమెకు తనదంటూ ఓ ఆనవాలు ఉండకూడదా? ఇస్లాం కూడా ఇలా వ్యక్తిత్వాన్ని నిర్మూలించే ప్రయత్నాన్ని ఒప్పుకోదు. అందువల్ల స్త్రీకి తాను పుట్టినప్పటి ఇంటి పేరే గిట్టే వరకూ ఉండాలి. హజ్రత్ ఆయిషా (హజ్రత్ అబూబక్ర్ సిద్దీక్ కుమార్తె)ను ఆయిషా హాషిమా అనో ఆయిషా ముహమ్మద్ అనో పిలువరు, ఆయిషా సిద్దీకా అనే పిలుస్తారు. ఆమెకు గుర్తు పుట్టింటి ఆనవాలే కాని మెట్టినింటిది కాదు. చెప్పవచ్చిందేమంటే స్త్రీలకు (ముస్లిములయినా ఇతరులయినా) ఇంటి పేరంటూ ఏదయినా ఉంటే అది ఆమె పుట్టుకను సూచించేదే కావాలన్నది నా అభిమతం. ఇక పేర్లంటారా, పిల్లలకు మంచి పేర్లేపెట్టాలి. మంచి అర్థాలు వచ్చే పేర్లు పెట్టాలి. చరిత్రలో గొప్ప ఖ్యాతిగడించిన వారి పేర్లు పెట్టాలి. వారు సాధించిన ఘనకార్యాలేవో పిల్లలకు బోధపరచాలి. అది వారి వ్యక్తిత్వ నిర్మాణంలో ఎంతో తోడ్పడుతుంది. కేవలం పేర్లవల్ల ఒరిగేదేమీ లేదు- సరయిన పోషణ, శిక్షణలు లేకపోతే. వాటి వైపు కూడా ప్రత్యేకంగా శ్రద్ధవహించడం అవసరం.

(12-6-87)-

—:o:—

సయ్యద్ వహాబ్ (జుక్కల్.)

**శరీరంలోని ఒంపు సొంపుల్ని ప్రదర్శించే బట్టలే స్త్రీకి అందాన్ని ఇస్తాయా?**

* అనేకదా అంటున్నది ప్రపంచమంతా! మీరు మాత్రం కాదంటే ఒప్పుకునేవాడెవడు? స్త్రీ స్వేచ్ఛ అంటూ, అలంకరణలనుండే కాదు బట్టలనుండి కూడా విముక్తి కలిగించి స్వేచ్ఛను యథేచ్ఛగా పంచిపెడుతున్నాడు మగ

మారాజు. ఎంత ఉదార బుద్ధి మగవాడిది?" అని సంభ్రమాశ్చర్యాల్లో మునిగి పైకి తేలకుండా పోతుంది పిచ్చి మాతల్లి ఆడది! స్వేచ్ఛనిచ్చిన అయ్య చెప్పు చేతుల్లో బానిసగా మారి, వారు ఆడిస్తున్నట్లుగా ఆడుతోంది, పాడిస్తున్నట్లుగా పాడుతోంది. చివరికి బుద్ధిగా సంసారం చేసుకోవాలన్నా కట్నంకింద వేలకొద్ది నైవేద్యం సమర్పించుకోనిదే నీపెళ్ళి కాదంటే దానికీ ఒప్పుకుంటోంది. మరేమన్నా అంటే ఇదే నీకు స్వేచ్ఛ, బట్టలూడబెరుకు, నగ్నంగా నాట్యమాడు అంటు న్నాడు. పిల్లల పలకలు మొదలుకుని కంప్యూటర్ వరకు, గోడ గడియారం మొదలుకుని గడ్డంగీసే బ్లేడు వరకు, చెట్లుపెంచే యూరియా దగ్గర్నుంచి చేపలు పట్టేవల వరకు దేన్ని అమ్మాలన్నా చొంగలు కార్చే నీ సొగసులు చూపమంటు న్నాడు. స్వేచ్ఛా పరితప్త హృదయిని అన్నిటికీ సయ్యంటోంది! అమ్మా, నీ సహనానికి, నీస్థయిర్యానికి, నీ అమాయకత్వానికి కోటి దండాలు!

(17-7-87)

—: o :—

ముహమ్మద్ ఫసియుద్దీన్ (సైదాబాద్)

**కొంతమంది తమ తమ స్థితిగతులను బట్టి తమ కుమార్తెల హక్కు అని చెప్పి అడగకుండానే ఏవయినా ఇచ్చేస్తారు. అది వరకట్నం కిందికి వస్తుందా?**

* వరకట్నం అన్నది, దాని పేరు సూచిస్తున్నట్లు, వరునికి ఇచ్చేది. అది సాధారణంగా నిర్ణీతమయి ఉంటుంది. దాని ఊసే ఎత్తని ఉదార బుద్ధి గల మగ పెళ్ళి వారు కూడా అది కొంతయినా లభించదా? డబ్బుగా కాకపోతే మరే రూపంలోనయినా ప్రాప్తంకాకుండా ఉంటుందా? అని ఆశల సౌధాల్లో జీవిస్తుంటారు. మీరు చెప్పేదయితే మరో కోణంలో ఆలోచించవలసి ఉంటుంది. మగ పెళ్ళివారు అడగరు, ఆడపెళ్ళి వారు ఇవ్వరు. కాని పెళ్ళి కూతురికి ఆమె తండ్రి నగ రూపంలో, నగదు రూపంలో ఏదయినా ఇస్తాడు. అది కుమార్తె హక్కుగా ఇస్తే వరునికి ఎందుకు ఇస్తాడు? వధువుకే కదా ఇచ్చేది:: ఇలాంటిది వరుని తరపు వారు 'తీసుకునే' ప్రసక్తేలేదు. అది వధువు 'తీసుకుంటుంది'. అది వధువుకు సంబంధించిన ఆస్తియే కాని ఏ విధంగానూ, ఏ రూపంలోనూ వరునికి అందులో ఏ మాత్రం భాగం ఉండరాదు. వరుడు అందులో ఏమీ కోరనూ రాదు. పెళ్ళి అయిన తరువాత వధువు తండ్రి ఇష్టపడి ఏమయినా కానుకగా ఇచ్చినా అది తిరస్కరించనవసరమూ లేదు.

(3-6-88)

—: o :—

# 10. బాధ్యతాభావం

మణి (కర్నూలు)

**మంచితనాన్ని బలహీనతగా ఎంచి మంచివాళ్ళను వేధించే దుష్టుల ఎడ ఎంతవరకు సహనం వహించాలి ?**

* మీ ప్రశ్నలోని "వేధించే వారు" చెడు పని చేస్తున్నారు. చెడు నిర్మూలనను గురించి ఇస్లాం మూడు దశలను ప్రతిపాదిస్తుంది. ఒకటి శక్యమైతే చెయ్యితో అంటె శక్తితో చెడును నిరోధించడం, నిర్మూలించడం. రెండో దశ, మొదటి దశ వీలు కాకపోతే చెడును గురించి నోటితో వారించడం, "ఇది చెడు" అని ప్రకటించడం. ప్రచారం చెయ్యడం, దాన్ని గురించి అందరిలో చైతన్యం కలగజెయ్యడం. మూడోదశ ఏమిటంటే ఇదీ సాధ్యపడకపోతే, చెడును చెడుగా గుర్తించడం. చెడుగా భావించడం, దానిపట్ల ఏహ్యభావం, అసహ్యం, అసహనం కలిగి ఉండడం. ఇదీ చెడుల నిర్మూలనకై ఇస్లాం ప్రతిపాదించే మార్గాలు. వీటిని కాస్త లోతుగా పరిశీలిస్తే సహజంగా ఏ సమాజమైనా అనుసరించడానికి ఇవి తప్ప మరే ఇతర మార్గాలు సవ్యమైనవిగా, సాధ్యమయినవిగా గోచరించవు.

దీన్నిబట్టి తెలిసేదేమిటంటే. ప్రతిదాన్ని ఓర్చుకోవడం, ఒక చెంపపై దెబ్బ సహించి మరో చెంప అందించడం నిజానికి "మంచితనం". మానవ సహజమయిన మంచితనం మాత్రం కాదు, అది బలహీనతే. ఐతే ఆ "బలహీనత" భావిలో చెడు చేసే వ్యక్తిలో పరివర్తనను కాంక్షించి, అతన్ని మార్చడానికి కృషి జరుపుతూవహించే ఓర్పు అయితే దాన్ని సమర్థించవచ్చు. కాని అలాంటి ప్రయత్నాలేమీ లేకుండా సహనం వహించడం కేవలం బలహీనతే- ముమ్మాటికీ బలహీనతే తప్ప మరేమీకాదు.

(7-10-83).

—: ం :—

జహీర్ అహ్మద్ (వినుకొండ)

**ప్రపంచంలోనే పెద్ద ప్రజాస్వామిక దేశమనబడే మనదేశంలో ఎన్నో అత్యాచారాలు, అక్రమాలు, మతకలహాలు జరుగుతుంటే వీటిని నిరోధించ డానికి పూనుకోకుండా మేధావి వర్గమంతా ఏం చేస్తున్నట్లు?**

* మనదేశాన్ని పీడిస్తున్న మహాశాపం అత్యధిక సంఖ్యలో ఉన్న "అజ్ఞాన ప్రజ" అని ఓ సందర్భంలో గొప్పకవి శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మ అన్నారు. అది అక్షరాల వాస్తవం. దాదాపు 80 శాతం ఉన్న ఈ "ప్రజ" పోగా మిగిలిన 20 శాతం ప్రజల్లో మేధావు లెంతమంది అంటారు? అసలు ఎవరిని మేధావులని అంటారు? మేధావి వర్గంలో అత్యధిక శాతం - కడుపుచేత పట్టుకుని, పాశ్చాత్య దేశాల్లోని మేధావుల్ని, వారి ఆడంబరాలను, అట్టహాసాలను చూస్తూ, అలాంటి మహా భాగ్యాలు తమకు లేకపోయెనే అని బాధపడుతూ, ఒకింత కుమిలిపోతూ, తమ మేధా సంపత్తినీ కాస్తా ఆ మంటలకు కాల్చివేస్తూ ఆశా నిరాశల మధ్య ఊగిస లాడే వారే ఉన్నారు. ప్రజాసేవ అంటే అధికారం సంపాయించడం, పరిపా లించడం తప్ప మరొకటి కాదని భావించిన మేధావులు రాజకీయాల్లోకి పోతున్నారు. ఈ నిద్రాణమయి ఉన్న అజ్ఞాన ప్రజను మేల్కొలిపే పరిస్థితుల్ని చక్క బెట్టేందుకు ఉద్యుక్తులవడానికి, ఆ బాటన నడవాలంటే కావలసిన నిరాడంబరతను, నిస్వార్థతను, సేవాతత్పరతను అలవర్చుకోడానికి, ఆ మార్గంలో ఆసన్నమయ్యే కష్ట నిష్ఠూరాలను, ఎగుడు దిగుళ్ళను అధిగమించి ముందుకు సాగడానికి సమాయత్తమయ్యే వారెందరుంటారు? 70 కన్నా అధికశాతం ప్రజలు దారి ద్ర్యాన్ని అనుభవించే మన వ్యవస్థలో ఇలాంటి "శుష్క" కార్యంలో నిమగ్న లవడానికి ప్రేరణ ఏది కాగలదు? మేధావుల ముందు పరలోక భావన వుండి, ఇక్కడి కష్టాలు కష్టాలు కావని, ఇక్కడి బాధలు బాధలు కావని, పరలోకంలోని సౌఖ్యమే సౌఖ్యమని అక్కడి విశ్రాంతే అసలయిన విశ్రాంతి అని వారు నమ్మ గలిగి ఉంటే తప్ప వారు ఈ కార్యోన్ముఖులు కాజాలరు. ఆ మాటకువస్తే ముస్లిముల్లోని మేధావులు ఈ నమ్మకాలున్న వారు ఎంత మంది సమాజ సంస్క రణకు పూనుకుంటున్నారు?

(7-12-84)

—: ౦ :—

అబ్దుల్ మునాఫ్ (రాజమండ్రి)

**కొంత మంది పుణ్యాత్ముల ఫలితమే మన రాష్ట్రములో ఏ విధమయిన తుఫాను గానీ "అజాబ్ గాని" రాదు. అని అంటారు.**

* దేవుని ఈ సృష్టి రాజ్యంలో మీపీ, నాపీ, ఇంకెవరిపయినా — సిద్ధాంతాలకు చోటులేదు. మీరు ఆ హదీసు వినలేదేమో. దాని సారాంశం టూకీగా చెబుతాను వినండి. ఓ ప్రదేశంలో అన్యాయాలు, అక్రమాలు, దౌర్జన్యాలు, దుష్కార్యాలు, పాపాలు, అపరాధాలు ప్రబలిపోయ్యాయి. చెడుగులు లేని కుటుంబం, దుర్మార్గం సోకని మనిషి అంటూ లేకుండా పోయింది ఆ వాతావరణం. అలాంటి ఓ వాతావరణాన్ని పరీక్షించి, అందులో ఎక్కడయినా, ఎప్పుడయినా ఓ మంచి వర్గం ముందుకు వస్తుందేమో, సమాజాన్ని శుద్ధపరుస్తుందేమో అని దైవ పరిపాలన నిరీక్షించింది. కాని దౌష్ట్యంలోనే ఆ ప్రదేశం ప్రజలు అత్యధికంగా మునిగిపోసాగారు. అప్పుడు దైవం తరఫున దాన్ని సర్వనాశనం చెయ్యాలని ఆదేశమయింది. అప్పుడు దైవ దూతల్లో అగ్రగణ్యుంయిన జిబ్రీల్ (అలైహిస్సలామ్) 'ప్రభూ! ఆ దేశంలో ఫలానా చోట ఫలానా వ్యక్తి ఉన్నాడు కదా! అతడు భక్తాగ్రేసరుడు. నిరంతర ధ్యానం, ఉపాసనల్లో, ఆధ్యాత్మిక చింతనల్లో నిమగ్నుడయి ఉంటున్నాడు కదా!! నీకు తెలియనిదేముంది? అలాంటి వ్యక్తి ఉన్న దేశాన్ని నాశనం చెయ్యడమెలా?'' అన్నారు. దానిపై ఈ విధంగా ఆదేశమయింది: ''తాను మాత్రం మంచివానిగా ఉంటూ, కేవలం తన ఆధ్యాత్మిక ప్రక్షాళన, తన ధ్యాస చింతనల్లోనే విలీనమయి ఉండి, చుట్టు పట్ల జరుగుతున్న కీడుల్ని గమనించకుండా వాటి సంస్కరణకై కృషి చెయ్యకుండా ఉన్న ఆ భక్త పరమోత్తమునితోనే ఆ ప్రాంతం వినాశాన్ని ప్రారంభించు''. ఈ హదీసు మనల్ని కోరేదేమిటో ఓసారి ఆలోచించండి. మన కర్తవ్యం ఏమిటి ? ఎవరో కొందరు 'మంచి వారి' వల్ల దేశంలో ఎలాంటి ప్రమాదాలు, విపత్తులు రాకుండా ఉన్నాయని తృప్తిపడి కూచోవడమా? దైవం ఇచ్చిన ఈ అవకాశం మీరిపోయిన తరువాత ఆపదలు, విపత్తులు వచ్చి సరిగ్గా ఆ 'మంచి వారి'ని ముంచుకు పోయినప్పుడు కళ్ళు తెరవడమా ? అప్పుడు కళ్ళు తెరిచినా తెరుచుకోవు మనకు, తెలియకుండానే మూతపడతాయి.

(12-7-85)

—: ౦ :—

చందా, దిల్‌సుక్‌నగర్.

**హిందువుల్లో నైతిక ఉదాసీనత, నైతికపతనంకంటే ముస్లింలలో చాలా ఎక్కువగా ఉన్నట్లు అనిపించింది. లంచాలు తీసుకోవడం అవినీతిగాగాని అన్యాయంగాగాని నామోషిగాగాని భావించక అది కూడా తమ వేతనంలో భాగం మాదిరిగా జంకుగొంకు లేకుండా పీడించే ముస్లిం అధికార్లను నా కళ్ళారా చూశాను.**

* హాయిగా పారుతున్న గంగలో చేతులు కడుక్కోడానికి ఎవరయితే మటుకేమిటి? ముస్లిములని పేరు పెట్టుకున్నంత మాత్రాన 'తక్కువ తిన్నరా'? తక్కువ తినాలా?? సమంగానే తింటారు. మనిషికి కావలసింది పేరుగాదు, మనసులో పాపభీతి, పరలోక ప్రీతి. ముస్లిములయినా సరయిన ధర్మావగాహన లేనివారు, జ్ఞానశూన్యులూ, ఆచరణహీనులూ అయినవారంతా ఏ విషయంలోనూ మరే మతం వారికీ 'వెనకబడి' ఉండడానికి ఇష్టపడరు. కాకపోతే అవకాశాలు, సంఖ్యాబలం, పైవారి కటాక్షవీక్షణం, క్రిందివారి దయాదాక్షిణ్యాలు ఏ మేరకు తోడ్పడతాయన్న అంశం ఒక్కటే పరిగణనలోకి వస్తుంది. అవన్నీ సవ్యంగా కుదిరితే అంతా అంతే! అయితే ఇది అంతేలే అని చూస్తూ కూర్చోవడంకన్నా ఘోరమైన పాపం మరొకటి లేదు. ఈ కుళ్ళు వ్యవస్థను అసహ్యించుకుంటూ ఇందులోనే బోర్లాపడి జుర్రుకోవడంకంటే నీచమయిన దోషం ఇంకేదీలేదు. దీన్ని మార్చేందుకు, చక్కదిద్దేందుకు మన పాత్ర ఎంత ఉంది అన్నదే ప్రశ్న. ఆ ప్రయత్నంలేకుండా ఇక్కడ ఒక్కక్షణంకూడా శ్వాస పీల్చడానికి మనకు హక్కులేదు. అలాంటి జీవితం మురికిలోని పురుగుకంటే కడుహీనమయింది!

(5-6-87)

— ० —

# 11. ప్రేమ పురాణాలు

ఒక సోదరుడు (ధన్‌వాడ)

**అందమైన అమ్మాయిని ప్రేమించి చిక్కుల్లో పడినాను. నా యొక్క చిక్కు సమస్యను తీర్చగలరు. ఇస్‌లాం ప్రకారం మొదటి వివాహం జరిగిన తర్వాత వేరే అమ్మాయిని చేసుకునే పద్ధతి యున్నదా ?**

* అందువల్లనే మిశ్రమ సమాజం (స్త్రీలు, పురుషులు కలసిమెలసి తిరిగే సమాజం) మిశ్రమ విద్యావ్యవస్థ ఎంతో అనర్థదాయకమని ఇస్లాం చాటుతుంది. మీరు 'ప్రేమించాను' అని అంటున్న ఆ అమ్మాయిని వాళ్ళ పెద్దలతో చెప్పి ఇస్లామీయ షరీఅత్ ప్రకారం నికాహ్ జరిపించుకునేందుకు ఒప్పించలేకపోయ్యారు. ఆ అమ్మాయికీ అంత తెగింపులేక పోయింది. మీరు మీ తల్లిదండ్రులకు కూడా అసలు విషయాన్ని చెప్పి వారినీ ఒప్పించలేక పొయ్యారు. ఆ అమ్మాయి పాపం పిచ్చిది. మీ పేరు చెప్పుకుని కాలం వెళ్ళదీస్తున్నది. మీరు ప్రేమించుకున్నామని చెబుతున్నది నిజం కాదు. నిజానికి అది మీ వయస్సులో కలిగే పరస్పర ఆకర్షణ మాత్రమే. ఇలాంటి తాత్కాలికమయిన ఆకర్షణలకు లోనయి జీవితాలు నాశనం చేసుకోవడం సముచితంకాదు. ఆ అమ్మాయి మరొకనితో పెళ్ళికి ససేమిరా ఒప్పుకోవడం లేదంటున్నారు. అసలు యదార్థాన్ని మీ తల్లిదండ్రులకూ, ఆ అమ్మాయి పెద్దలకూచెప్పి మీ ఇద్దరికీ నికాహ్ జరిపించడం తప్ప వేరే గత్యంతరం లేదని ఒప్పించండి. అమ్మాయి మేజర్ అయినట్లయితే (18 ఏండ్ల వయసు దాటినట్లయితే) మీ ఇరువురి తల్లిదండ్రులు ఒప్పుకోకపోయినా వధూవరులు ఒప్పుకుంటే చాలు నికాహ్ జరుపుకోవచ్చు. తతిమ్మా వివరాలు మీ 'కాజీ'ని లేదా దగ్గరలో ఉన్న ధర్మవేత్తలను అడిగి తెలుసుకోండి.

(22-2-85)

—:o:—

ఎం. కె. ఎం. (ఆర్మూరు)

**ప్రేమ అంటే తెలియని నా జీవితంలో మొదటగా ప్రేమించిన వ్యక్తి అంటే నాకు పంచప్రాణాలు. ఇప్పుడు నేను ఇంటర్ సెకండ్ ఇయర్ చదువుతున్నాను. 10 సంవత్సరాలు ఆగమన్నా ఆగుతాను. కాని...**

* నన్ను అన్నా అని నోరారా పిలిచావు. అందువల్ల ఆ పిలుపుయొక్క గౌరవాన్ని కాపాడతావన్న ఆశతో సలహానిస్తున్నాను. ఇప్పుడు నువ్వు ఇంటర్ సెకండియర్ చదువుతున్నావు. అంటే 17, 18 ఏళ్ళున్నాయన్న మాట. ఈ వయసులో ప్రేమ అనబడే ఆకర్షణకు లోనవడం అసహజం ఏమీ కాదు. మనముంటున్న వాతావరణంలో — ఆడపిల్లలూ మగపిల్లలూ కలిసిమెలసి చదువుకుంటున్న ఈ వ్యవస్థలో, ప్రేమకథలే తప్ప మరో వృత్తాంతం లేకుండా వచ్చే సినిమాలు, నవలలు, కథానికలు కోకొల్లలుగా, అడుగడుగునా ఎదురయ్యే పరిస్థితుల్లో ఇంత కంటే మరో పరిణామాన్ని ఆశించటం అత్యాశే అవుతుంది. టీనేజి (13–19 సంవత్సరాలు) లో ఉన్న మీరిరువురూ 10 సంవత్సరాలాగడమంటే మన దేశంలో వేళాకోళం కాదు. ఏదో సినిమాలో విన్నవో, నవలల్లో చదివినవో డైలాగులు వల్లెవెయ్యడం వేరు. ఇప్పుడున్న అపరిపక్వ మానసికావస్థ నుండి ఎదిగి (పదేళ్ళ తరువాత) పరిపక్వతను సాధించిన నాటికి నేడున్న భావాల్లోని వేడిమి, మాటల్లోని వాడిమి, చేతల్లోని వేగమూ మిగలవు. నేడు నువ్వు వాడిన మాటలు రేపు (పదేళ్ళ నాటికి) నీకే రుచించక పోవచ్చు—అంతవరకూ నిన్ను నీవు అన్నివిధాలా కాపాడుకుంటూవస్తే! అందువల్ల అన్నీ కట్టిపెట్టి లక్షణంగా చదువుకుని, నీ కాళ్ళమీద నువ్వు నిలబడగలిగే విధంగా చూసుకో. ఆనాటికి పరిస్థితులెలా ఉంటే అలా నడుచుకోవచ్చు. దానికోసం నేటినుండే పరితపించవలసిన అవసరం ఏ మాత్రం లేదు. అవన్నీ ఆలోచించుకుని మనఃక్లేశాన్ని పెంచుకోవలసిన పరిస్థితి అంతకన్నా లేదు.

(12-7-85)

—: o :—

అహ్మద్ బాష (నర్సన్నపేట్)

**ఓ అమ్మాయి నన్ను ప్రేమిస్తుంది కానీ మా తల్లిదండ్రులకు చెప్పడానికి నాకు భయంగా ఉంది.**

* మీ తల్లిదండ్రులతో చెప్పుకోడానికి మీకు భయం. ఆవిడేమో తన వారినందరినీ వదిలేసి మీ వద్దకు రావడానికి సిద్ధంగా ఉంది - ఎంత విచిత్రం! ఎందుకు వచ్చిన తంటా, వదిలెయ్యండి. ప్రేమ అని భ్రమపడే ఈ వ్యవహార మంతా ఆకర్షణ తప్ప మరేమీకాదు. ప్రేమ అన్నది ఏ వ్యక్తుల్లో ఏర్పడినా పరస్పర ఆకర్షణవల్ల మాత్రం కాదు— పరస్పర అవగాహన ద్వారానే. పాఠశాల మొదలుకుని రాజకీయాలవరకు, ఇండ్లు మొదలుకుని బజారులు, ఆఫీసులవరకు ఆడా మగా కలసి జీవించే ఈ సంకీర్ణ సమాజంలో ఇలాంటి ఆకర్షణలు కలగటం, పర్యవసానంగా అసంపూర్ణ ప్రేమ కథలు రూపు దిద్దుకోవడం, ఏ కథలయినా సందర్భవశాత్తు పూర్తయినా ఆకర్షణా మత్తు దిగగానే అవి కాస్తా తుస్సుమనడం—దుఃఖాస్పదంగానో హాస్యాస్పదంగానో పరిణమించడం మామూలే. అందువల్ల మిత్రమా, ఆ గోతిలో పడకండి. దైవ ధర్మాన్ని అనుసరించడం వివాహంతో లేక ఇతర ప్రాపంచిక ప్రయోజనాలతో ముడిపడి ఉండటం భావ్యంకాదు. మీ సంబంధం కుదరకపోయినా ఆ అమ్మాయి ధర్మావలంబనలో స్థిర చిత్తురాలు కాగలిగితే అది ఎంతో పుణ్యప్రదం.

(7-2-86)

—: ౦ :—

షేక్ సుభాని (తిరువూరు)

**ఈనాడు హైస్కూల్స్‌లో 18 సంవత్సరాల లోపువయస్సుగల బాలురు, బాలికలు ప్రేమించుకుంటున్నారు. ఇది ఇస్లాం దృష్టిలో...**

* కో ఎడ్యుకేషన్ వల్ల సంభవించే ప్రమాదాల్లో అతి ముఖ్యమయింది మీరు చెప్పిన ప్రమాదం. స్త్రీ పురుషుల మధ్య సహజంగా ఉండే లైంగిక ఆకర్షణ, సంబంధాన్ని ఎంతో పవిత్రంగా, పరిశుద్ధంగా ఉండాలని కోరుతుంది ఇస్లాం. సమాజానికి పునాది అయిన కుటుంబంలో పునాదిరాళ్ళు కూడా ఎంతో

పవిత్రంగా ఉండాలన్నది. అందులో ఎలాంటి తప్పుడు భావనలు, అపోహలు, అపార్థాలు చోటు చేసుకోరాదన్నది దాని అభిమతం. స్త్రీపురుషులు యుక్త వయస్కులు కాగానే వేర్వేరుగా వ్యవహరించాలని అది కోరుకుంటుంది. తగిన వయసు, సంబంధాలు రాగానే యువతీ యువకులకు పెళ్ళిళ్ళు జరపాలని, పెళ్ళిని ఎంతో సులువయిన కార్యంగా చేసింది. అక్రమ లైంగిక సంబంధాలు, వ్యభిచారాల మార్గంలో అనేక అంతరాయాలు సృష్టించింది. పెళ్ళికి యోగ్యులయిన స్త్రీపురుషులు కలసి తిరగకుండా 'పరదా' వ్యవస్థను స్థాపించింది. పరదా అన్నది స్త్రీలు వేసుకునే బురకామాత్రమే కాదు. అదొక వ్యవస్థ. దానికి కొన్ని నియమాలు నిబంధనలున్నాయి. అందులో ఒకటి స్త్రీపురుషులు కలిసి ఉండటాన్ని నిషేధించడం. దీని దృష్ట్యా ప్రాజ్ఞత పొందిన యువతీ యువకులు కలసి తిరగడం, పెళ్ళికాకుండా ప్రేమ పేరుతో పరస్పర ఆకర్షణకు లోనయి తప్పుడు త్రోవల్ని త్రొక్కడం ఇదంతా నిషిద్ధమే. లైగింక సంబంధానికి పెళ్ళి ఒక్కటే సక్రమమయిన, సరయిన, సమంజసమయిన మార్గం. ఏ పేరుతో. ఏ రూపులో, ఏ వయసులో దీనికి భిన్నమయిన మార్గం అవలంబించినా అది తప్పుడుబాటే కాగలదు.

(18-4-86)

—: o :—

యం. డి. హనీఫ్ (భీమవరము)

**నేను నా మరదలిని ప్రేమించాను. ఆమె కూడా నన్ను ప్రేమిస్తోంది. ఒకవేళ మా పెళ్ళికి ఒప్పుకొనకపోతే, మేం ఏం చెయ్యాలి ?**

* మీరు 'మరదలు' అని వ్రాశారు అంటే మీ భార్య చెల్లెలా ? లేక మీ తమ్ముడి భార్యనా ? రెండు విధాలుగానూ మీ పెళ్ళి ధర్మ సమ్మతం కాదు—హరాం. భార్య బ్రతికి ఉండగా ఆమె చెల్లెలితోనయినా లేక తమ్ముడు బ్రతికుండగా అతని భార్యతోనయినా పెళ్ళి చేసుకోవాలి అని అనుకోవడం ఘోరమయిన పాపం. మీరు మీ తండ్రి సోదరి (మేనత్త) బిడ్డనో లేక మీ తల్లి సోదరుని (మేనమామ) బిడ్డనో ఉద్దేశించి అలా అని ఉంటే పెళ్ళి ధర్మ సమ్మతమే అవుతుంది. అంతేకాదు మీ తండ్రి సోదరుని (బాబాయి) కుమార్తెను, మీ తల్లి సోదరి (పిన్నమ్మ) కుమార్తెను సయితం మీరు పెళ్ళి

చేసుకోవడంలో తప్పులేదు. ఈ నాలుగు సంబంధాలూ సోదరీ సోదర సంబంధాలే, అయితే ఇస్లామీయ షరీఅత్ ప్రకారం ఒక సొంత రక్తం పంచుకు పుట్టిన సోదర సోదరీలు తప్ప ఇతర సోదర సోదరీ లనబడే వారంతా పెళ్ళి చేసుకోవచ్చు. కాని మీరు చెప్పిన ప్రేమ వ్యవహారమంతా నేటి మిశ్రమ సమాజంలో స్త్రీలు పురుషులు విచ్చలవిడిగా తిరగాడటం మూలాన జనిస్తున్న ఆకర్షణే తప్ప అందులో నిజమయిన మానసిక ప్రేరణ, భావ సమైక్యత, ఉద్రేకాల సమ్మేళనం బహు స్వల్పం. అవన్నీ వాస్తవంగా పెళ్ళి తరువాతే జనించే అవకాశముంది. ప్రేమ అనుకుని భ్రమపడేదంతా పై మెరుగుల ఆకర్షణే.

(16-1-87)

—: o :—

ఓ సోదరుడు (కదిరి)

**బాల్యంలో మా మామ కూతురికి, నాకు పెళ్ళిచెయ్యాలని ఇంట్లో అనుకునే వారు. కాని ఊహ తెలిసినప్పటినుండి ఆ అమ్మాయిమీద అయిష్ట భావం ఏర్పడుతూ వచ్చింది. ఆ అమ్మాయిని పెళ్ళాడకపోతే ఆమెను అన్యాయం చేసిన వాడ్ని అవుతానా?**

* చుట్టాల్లో ఇలాంటివి అనుకోవడం సహజమే. ఇలా అనుకునే వారు రేపు పిల్లలు పెద్దలయి వారి మనసులు ఎలా మారతాయో, పరిస్థితులు ఎలా రూపొందుతాయో అని ఆలోచించకుండా అనుకుంటారు. పర్యవసానంగా తరువాత మథనపడతారు. ఆవేదన చెందుతారు. ఇరువర్గాల వారికీ మనస్తాపాలు కలుగుతాయి. అందువల్ల అలా అనుకోవడం సరయిన పద్ధతి కాదు. మీకు ఇష్టం లేకపోయినా, లేక ఆ అమ్మాయికి ఇష్టం లేకపోయినా షరీఅత్ ప్రకారం పెళ్ళి కానేరదు. మీరు మీ అభిమతాన్ని మీ తల్లిదండ్రులకు చెప్పివెయ్యండి మీకు ఆ అమ్మాయిని చేసుకోవాలని లేదని. ఇకపోతే తల్లి మాటనంటారా? అది మీపై ఆధారపడి ఉంది. తల్లి మాటకు విలువ నివ్వాలని, మీకు ఇష్టం లేకపోయినా తల్లి మాటకోసం, ఆ అమ్మాయి కోసం మీరు పెళ్ళి చేసుకుని, ఏదో నిష్కార ణంగా ఆ అమ్మాయిపై పెంచుకున్న అయిష్టాన్ని మార్చుకోగలనన్న ఆత్మ

స్థయిర్యం మీకు ఉన్నట్లయితే అమ్మ మాట ప్రకారం పెళ్ళి చేసుకోవడం గొప్ప విషయం, పుణ్యప్రదం. కాని మరెక్కడో పై ఆకర్షణలను లోనయి, కేవలం ఆ ఆకర్షణల కారణంగా ఎలాంటి వంకలేని అమ్మాయిని కాదని, అమ్మ మనస్సును బాధపెట్టి మీరు ఏ మాత్రం సుఖపడగలరో, ఆలోచించుకోండి. పై మెరుగులు పై మెరుగులే. ఆత్మలాలిత్యం, గుణ సౌందర్యం, అవగాహనా పీఠం అన్నింటి కంటే ముఖ్యమయినవి. ఆలోచించి మరీ నిర్ణయానికి రండి. అదే నేనివ్వగల సలహా.

(21-8-87)

—: o :—

జి. కె. వి (కదిరి)

**మతాంతర వివాహాల్ని ఈ రోజుల్లో ప్రతి ఒక్కరూ హర్షిస్తున్నారు. భార్యా భర్తల మధ్య, ప్రేమానురాగాలు, సదవగాహన అవసరం, అవి లేనినాడు ఎలాంటి వారి మధ్యయినా విభేదాలు రాకమానవు: మతాంతర వివాహాల్ని ముఖ్యంగా ఇస్లాం మతమెందుకు ప్రోత్సహించడం లేదో తెల్సుకోవచ్చా?**

* మీ ప్రశ్నను బట్టి చూస్తే మతాంతర వివాహాల్లోనే ప్రేమానురాగాలు సదవగాహన వెల్లి విరుస్తాయన్నట్లు తెలుస్తోంది. నిజమా? మతాంతరం కాని వివాహాలన్నీ బెడిసి కొడుతున్నాయా?? మీకున్న అవగాహన ఏ పాటిదో కాని వాస్తవం మటుకు దీనికి పూర్తిగా భిన్నమయింది. ఇస్లాం విషయానికి వస్తే, ఇస్లాం నిర్మించదలచింది ఓ సైద్ధాంతిక సమాజం. ఆ సిద్ధాంతాన్ని నమ్మేవారు ఇహపరాల సాఫల్యాన్ని పొందుతారని, నమ్మనివారు నిరాశను నిష్ఫల పర్యవసానానికి గురిఅవుతారని అంటుంది. మీరన్న ప్రేమానురాగాలు గల భార్య అయినా భర్త అయినా తన భర్తో లేక భార్యో అగ్నికి ఆహుతి అవడాన్ని ఇష్టపడతారా? మతాంతర వివాహంలో ఏమవుతుంది? భర్త తూర్పు అంటే భార్య పడమర అంటుంది! సైద్ధాంతిక విభేదాలు నరనరాల్లో జీర్ణించుకుపోయిన కుటుంబంలో శాంతి, సామరస్యం, సౌమనస్యం దీవిటి పట్టుకు వెదికినా కానరావు. మీరు చెప్పే 'ప్రేమ', 'అవగాహన' అంతా ఆవిరయి గగనతలంలో తేలియాడుతూ ఉంటుంది. మనిషికి అన్నింటికంటే ప్రేమప్రదమయినవి అతని ఆలోచనలు,

నమ్మకాలు, లక్ష్యాలు, ఆదర్శాలు. ఇవి ఏకోన్ముఖమయితే రెండు భిన్న ధృవాల్లో ఉన్నవారినీ కలిపి ఉంచగలవు. ఇవి సమాంతరమయితే ఎన్ని యుగాలు గడిచినా ఒకేచోట ఉన్నవారినీ కలపలేవు. అందరూ తిన్నదే మీరూ తినాలన్న రూలులేదు. బుద్ధినుపయోగించి మరీ తినండి.

(20-5-88)

—: ౦ :—

ఒక పాఠకుడు (కదిరి)

**మా వీధిలోని ఓ అమ్మాయితో నాకు రెండేళ్ళ పరిచయం (ప్రేమ) వుంది. ఇరువురి ఇష్టానుసారం శారీరకంగాను చాలా సార్లు కలిశాం. ఒకే కుల మైనప్పటికీ, మా పెళ్ళి జరగటానికి చాలా ఆటంకాలు వున్నాయి...**

* మీరు ఏ కులమయినా, ఏ మతమయినా పెళ్ళి కాకుండా శారీరకంగా ఏకం కావడం ప్రపంచంలో ఏ ఛట్టం ప్రకారం చూసినా వ్యభిచారమే. ఆ విషయంలో మీకు అనుమానం ఎందుకు వచ్చిందో బోధ పడటం లేదు. ఇస్లాం ప్రకారమయితే ఘోరమైన అపరాధం. ఇస్లామీయ రాజ్యంలో నివసించేవారు ఎవరు దానికి పాల్పడినా మరణశిక్ష విధిస్తారు. మీరు ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకున్నా ప్రపంచంలో కొంతవరకు ఆమె బాధను నివారించిన వారవుతారేమో గాని పరలోకంలో దైవం విధించే శిక్షను మటుకు తప్పించుకోలేరు— మీరు మీ అంతర్యాన్ని మార్చుకుని, రుజు మార్గానికి, దేవుని విధేయతా మార్గమయిన ఇస్లాం మార్గానికి వచ్చి, మీరు గతంలో చేసిన తప్పిదానికి గాను క్షమాభిక్షకై దైవాన్ని వేడుకుంటే ప్రభువు కటాక్షించవచ్చు.

(8-7-88)

—: ౦ :—

# సర్వసాధారణం

## 12. సైద్ధాంతికం

మణి (కర్నూలు)

**హైందవులలో అగ్రకులాలని అధమ కులాలని, హిందూ — ముస్లింలని క్రైస్తవులలో కాథలిక్కులు, ప్రొటెస్టెంట్లని, సిక్కులలో నిరంకారీలు, అకాలీలని, ఆఫ్రికా, ఐరోపా దేశాలలో నలుపు - తెలుపనీ చివరకు మతాలన్నిటిలో విశిష్ట మతమని చెప్పబడుతున్న ఇస్లాం మతంలో సయితం షియా - సున్నీలని సున్నీలలో కూడా అసంఖ్యాక వర్గాలుగా విడిపోయి పరస్పర వైరుధ్యాలతో మానవత్వాన్ని మరచి నిత్యం దారుణ మారణ హోమం జరుపుకుంటున్నారు. కమ్యూనిస్టు దేశాలలో ఇలాంటి అమానుషాలు మచ్చుకయినా కానరావు. కారణమేమంటారు ?**

* మీరు విభిన్న విషయాలను కలగాపులగం చేసివేశారు. పొరపాటుననె అయి ఉంటుందన్న సద్భావనతోనే నేను ముందుకు సాగుతాను. మీ లేఖలో ప్రస్తావనకు వచ్చిన అంశాలు: విభిన్న మతాలు; ఒక్కొ మతంలో అంతర్గత విభేదాలు; ఈ మతాల పేరుతో జరిగే "దారుణ హోమం"; చివరన కమ్యూనిస్టు దేశాలు. అయితే "కమ్యూనిజం" ఎందుకో మీ కలం నుండి జారిపోయింది. అందులోని "శాంతి ప్రియత్వాన్ని", "సైద్ధాంతిక ఏకత్వాన్ని" ఎందుకో పేర్కొనడం మరిచారు మీరు.

మతాల మాటకువస్తే అవి బహు పురాతనమయినవి, అత్యంత ఆధునికమయిందని చెప్పబడే ఇస్లాం కూడా నేటికి వెయ్యిన్నర సంవత్సరాల క్రితం ఉద్భ

మించింది. వేరే మతాల విషయానికి పోనవసరం లేదు. మీరు ప్రస్తావించిన కమ్యూనిస్టు దేశాలు పుట్టి ఎన్నేళ్ళయింది? కమ్యూనిజం తన "స్థాపన"కు స్థాపన అంటూ ఏదయినా జరిగితే) శతాబ్దిని కూడా పూర్తిచేసుకోలేదు. అంతలోనే ఎన్ని చీలికలు! ఎన్ని పేలికలు? కమ్యూనిజాల్లో ఎన్ని రకాలో నాకంటే మీకే తెలుసను కుంటా. మార్క్సిస్టులు, లెనినిస్టులు, రష్యా తొత్తులు, చైనా బిడ్డలు, ఉగ్ర వాదులు, ఆగ్రహవాదులు, మావోయిస్టులు, యాంటి మావోయిస్టులు— ఎన్నని చెప్పమంటారు. పోనీ రష్యా చైనా రెండూ విజ్ఞానవంతమయిన అత్యాధునిక యుగంలో(మధ్యయుగాల మూఢకాలంలో కాదు)—వెలసిన సైద్ధాంతిక దేశాలుగా! ఇక్కడ ఒకే సిద్ధాంతం ఆధారంగా "విప్లవం" తెచ్చి కమ్యూనిజాన్ని పరిపాలనా స్థానంలో కూచోబెట్టారు. ఈ ఉభయ దేశాల "అభిప్రాయ భేదం" కాదు "వైరం" "వైషమ్యం" గురించి నేడు పేపరు చదివే ప్రతి "పామరుడూ" చర్చించమంటే గంటల తరబడి చర్చిస్తాడు. బోడె ఇండియన్ కమ్యూనిస్టుల మాట అలా వదిలెయ్యండి!

'కమ్యూనిస్ట్ ఇంటర్నేషనల్' అని అంతర్జాతీయతను కూడా ఇంకా కొన్నాళ్ళకు ఆరిపోయే ఆ ఉద్యమానికి పులిమారు. అయితే క్రిందటిసారి జరిగిన కాన్ఫరెన్సులో కమ్యూనిస్టులు "ఏషియన్ కమ్యూనిజం" అనీ "యూరోపియన్ కమ్యూనిజం" అనీ కొత్త పదబంధాలు సృష్టించుకున్న యదార్థం ఎవరికి తెలియదు?

ఇవండి కమ్యూనిస్టుల స్మశాన శాంతికి అంతర్గత తరంగాలు. ఇక రక్త పాతమంటారా? రష్యాలో విప్లవం కొరకు ఎంత రక్తపాతం జరిగిందో, ఉక్కు తెరల వెనక నేటికీ ఎంత రక్తపాతం జరుగుతుందో నాచేత చెప్పించకండి. చైనాలో సాంస్కృతిక విప్లవం ఎంతటి ఎర్రటి చీకటిని చీల్చుకువచ్చిందోకూడా నన్నడక్కండి. సైబేరియా బందిఖానాల గురించి నేను ఒక్క మాటకూడ చెప్పనవసరం లేదు. కాని నిన్నటి హంగేరీ, పోలాండ్, నేటి అఫ్గానిస్తాన్, అటు వియత్నాం, కంపూచియాల్లో ఏం జరిగిందో, ఏం జరుగుతుందో కూడ చెప్పవద్దంటారా? సరే ఇవంతా ఎలా ఉన్నా అక్కడ "అమానుషాలు కానరావు" అని మీరు నమ్మమంటే తప్పక నమ్ముతాను.

యదార్థం ఏమంటే ప్రపంచ చరిత్రకు వక్రభాష్యం చెప్పిన హేగల్, మార్క్సు బోధలకు పాడైన మన బుర్రలు యదార్థాన్ని గ్రహించలేకున్నాయి. కామెర్లవ్యాధి సోకినవాడి పరిస్థితే నేడు మనది. ఆ వ్యాధి కాస్తా నయంచేయించుకుని ఎలాంటి Pre Conceived Notions లేకుండా చరిత్రను అధ్యయనం చేస్తే అర్థమవుతుంది యదార్థమేదో !

(4-3-83)

—: ० :—

ముస్తఫా (పెద్దకూరపాడు)

**1921లో లెనిన్ స్థాపించిన, మరియు మార్క్సు సిద్ధంతాన్ని రూపకల్పన జేసిన కమ్యునిస్టుపార్టీ ఇంత తొందరగా అభివృద్ధి అయి అనేక దేశాలు కమ్యూనిస్టుల వశమైనప్పుడు, 1400 సంవత్సరాల క్రితం పరిపూర్ణమైన ఇస్లామిక్ సిద్ధాంతాలు అభివృద్ధి కాకపోవటం, మార్గదర్శకంగా కనీసం ఒక్క ఇస్లామిక్ దేశమయినా లేక పోవటానికి గల కారణం కేవలం ఇస్లామిక్ సిద్ధాంతాలలోని లోపాలేనని, రాజ్యంగ సవరణ మానవుల చేతుల్లో ఉంచాలిగాని, (Fixed constitution) వల్ల అనేక అనర్థాలు ఉంటాయని అంటాడు మా మిత్రుడు**

* కమ్యూనిజం అంతిమ లక్ష్యం కూడు, గూడు, గుడ్డ, విద్య, ఉద్యోగాలు అందరికీ 'సమ నిష్పత్తి'లో పంచి పెట్టటం కాదు. మీ మిత్రులు గారికి తెలియకపోతే చెప్పండి: ఎక్కడయితే సామాజిక వ్యవస్థలోని అన్ని అంగాలు గడియారపు "యంత్రాల్లా" పని చేసుకుపోతూ ఉంటాయో, ఎక్కడైతే ఎలాంటి "రాజకీయ వ్యవస్థ" "పరిపాలనా వ్యవస్థ" "న్యాయవ్యవస్థ" అన్నవి లేకుండా సకల వ్యవహారాలు వాటంతట అవే, ఏ పోలీసు, ఏ నిఘా విభాగం, ఏ ఆడిట్ సంస్థ లేకుండా చకచకా జరుగుతూ పోతాయో అక్కడికి చేరిన తరువాతే కమ్యూనిజం "మహా ప్రస్థానం" ముగుస్తుంది. అదే "సమ సమాజం" అంటే ! తాను ఈ వ్యవస్థను గురించి కన్న కలలను కమ్యూనిజం ఇంతవరకు నిజం చెయ్యలేక పోయిందన్నది మాత్రం పచ్చి నిజం.

మీ మిత్రుడు కమ్యూనిస్టు దేశాలు (?) ఏ ప్రగతి సాధించాయని వాదిస్తున్నాడో ఆ ప్రగతిని అంతకంటే ఘనమయిన స్థాయిలో కమ్యూనిజానికి పూర్తిగా వ్యతిరేకమయిన సిద్ధాంతాన్ని (కాపటలిజం) పాటించే దేశాలు సాధించాయని గుర్తించలేకపోతే అది కేవలం పచ్చకామెర్ల వ్యాధికి చిహ్నమని తెలుసుకోండి. కాపటలిజానికి ధ్వజవాహిక అయిన దేశం అమెరికా. అది, కమ్యూనిస్టు రష్యాలో ఏ ఒక్క వ్యక్తికి చివరికి దాని ప్రధాని, అధ్యక్షులకు కూడా—లభ్యం కాని స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను అమెరికా అట్టడుగు పౌరునికి కూడా కల్పించి అతను కోరిన సుఖాలను, సౌలభ్యాలను సయితం విరివిగా అందజేసింది. అయితే ఆ సమాజంలో ఉండే రుగ్మతలు దానికున్నాయన్నది వేరే విషయం.

దీన్నిబట్టి ప్రగతి అన్నది "ఇజాన్ని" బట్టి మాత్రమే కాదు. ప్రత్యేక దేశంలో గల వనరులు, సాధనాలు, మేధా సంపద, ప్రణాళికా రూపకల్పన, కార్యదక్షత, ఇత్యాది విషయాలపై అధికంగా ఆధార భూతమయి ఉంటుందన్న విషయం బోధపడుతుంది. అందువల్ల రష్యా సాధించిన ప్రగతిని కమ్యూనిజానికి అంటగట్టడం, భారతదేశం స్వాతంత్ర్యం సాధించడాన్ని నెహూ్రు కుటుంబంతో ముడి పెట్టడం లాంటిది!

ముస్లిం దేశాలు ఇస్లాంను అనుసరించి ఒక నిజమయిన ఇస్లామీయ రాజ్యాన్ని స్థాపించలేకపోవడానికి ఎన్నో కారణాలున్నాయి. వెయ్యి సంవత్సరాల నుండి, ఒకప్పుడు ప్రపంచానికి మార్గం చూపిన ముస్లిం జగత్తు మత్తులో పడిపోయింది. అందువల్ల అందులో అనుశీలన, అన్వేషణ ఆగిపోయింది. ప్రగతి నిలిచిపోయింది. ఎలాంటి ఉన్నత సిద్ధాంతాలయినా అనుయాయులు క్రియాశీలురు కాకపోతే అవి తమవారిలోనే క్రొత్తవయిపోతాయి. నేడు ఇస్లామీయ జీవన వ్యవస్థ పరిస్థితి కూడా అలాగే ఉంది. ఈ విషయాన్నే మహా ప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఒక ప్రవచనం (హదీసు)లో ఇలా అన్నారు: "రాబోవు కాలంలో నా సంప్రదాయాన్ని ఆచరించేవాడు (దాని అనుయాయులమని చెప్పుకునే వారిలోనే) అపరిచితులు (Strangers)గా రూపొందుతారు." నేడు ఇస్లామీయ సిద్ధాంతాలన్నా వాటిని పాటించేవారన్నా ముస్లిం జగత్తులోనే స్ట్రేంజర్స్ అయిపోయ్యారు. ఈ పరిస్థితి ఇప్పుడిప్పుడే మారుతోంది. ఆదర్శవంతమయిన ఓ ఇస్లామీయ రాజ్యం ఆవిర్భవించడం బహుదూరంలో లేదు. Fixed constitu-

tion అంటే నిర్వచనమేమిటో మీ మిత్రుణ్ణే అడగండి. ఇస్లాం ప్రతిపాదించే రాజ్యాంగ వ్యవస్థలో కొన్ని మౌలిక సూత్రాలు తప్ప ఇతర వివరాలన్నీ ప్రజలే నిర్ణయిస్తారు. ఫెడరల్ వ్యవస్థ కావాలో, లేక యూనిటరీ వ్యవస్థనో, పార్లమెంటరీ విధానం కావాలో లేక అధ్యక్షతరహా పాలన కావాలో, పబ్లికు సెక్టర్ పరిమితులేవో, ప్రయివేటు సెక్టర్ అవధులేవో ప్రజలే నిర్ణయించు కుంటారు. ప్రజల పరిశీలన, పరిశోధన, ఆలోచనలకు సంబంధించిన అన్ని సామూహిక రంగాల్లోనూ ప్రజలకు ఎంతో స్వేచ్ఛ ఉంది. రష్యా రాజ్యాంగంలో ఇవన్నీ ఉన్నాయేమో అడిగి తెలుసుకోండి!

(29-7-83)

—: o :—

ఎం. ఏ. అఫ్జల్ (చాగల్లు)

**వివేకము (Intellect) అంతర్వాణి (Intuition) లల్లో ఏది ఎక్కువగా "యదార్థాన్ని" గ్రహించ గలుగుతుంది?**

* Intuition అన్నది నిజానికి మనిషిలో ప్రకృతిసిద్ధమైన అంతః ప్రేరణవల్ల జనించే మంచి - చెడుల విచక్షణా జ్ఞానం. ఇది అనంతం. మేధ (Intellect) అన్నది మాత్రం పరిమితం. అవగాహనా మార్గంద్వారా బుద్ధీ, జ్ఞానాల పరిధిలోకి వచ్చిన విషయాన్నే ఇది స్వీకరిస్తుంది. సామాన్యంగా మేధ సరిగ్గా పనిచేస్తే పొరపడటం అన్నది జరగటం బహు అరుదు. అయితే మేధ వక్ర బోవడం కూడా కద్దు. కాని మనిషి ఏ నైతిక ప్రమాణాల ఆధారంగా జీవించినా అతని అంతఃప్రేరణ పొరపడటం మాత్రం జరగదు. దాని ఘోషను మనిషి తన వక్ర మేధవల్ల అణచడం సంభవమే అయినా అతని అంతరాంత రాళంలో అతనికి తెలుసు—తనకు "సత్యం" ఏదో గ్రహింపు కలిగినా తన ఆ అవగాహనను తాను అణచి వేస్తున్నాడని! ఈ Intuition నే దివ్య ఖుర్ ఆన్ "నఫ్సుల్ లవ్వామ" అంటుంది.

(2-12-83)

—: o :—

## ఎం. ఎ. బసీర్ అమ్‌జద్ (మెట్‌పల్లి)

**"మతానికి, మానవత్వానికి గల తేడా"**

* యూరోపు పునరుజ్జీవనోద్యమానికి పరోక్షంగా ప్రాణంపోసిన 14 వ శతాబ్దపు ఇటాలియన్ విద్వాంసుడు, కవి, మేధావి 'పేట్రార్క్' ద్వారా వెలుగు లోకి వచ్చి ప్రచారం పొందిన 'మానవతా' భావనలు ప్రారంభంలోనే దైవాన్ని తిరస్కరించలేదు. పైగా దైవం, ధర్మం, ధార్మిక బోధనలు, గ్రంథాలు, వాటి అధ్యయనం వైపుకు మనిషిని అత్యధికంగా పురికొలిపాయి. అయితే అది క్రమంగా మత విశ్వాసాలను, తాత్విక చింతనలను, హేతువాదాన్ని త్యజించసాగింది. అన్నింటిపై 'మానవతా ప్రమాణాల'కే ప్రాధాన్యం ఉందని వాదించసాగింది. అయితే ఆ విలువలు. ప్రమాణాలు ఎక్కడ నుండి వచ్చాయి అన్న అంశాన్ని విస్మరించింది. ప్రతి మనిషి వ్యక్తిగతంగా విలువ, ప్రాధాన్యంకలిగి ఉన్నాడన్న భావనకు మానవతావాదం ప్రాముఖ్యతనిస్తుంది. మానవుడే అన్ని మంచి చెడులకు ప్రమాణం అంటుంది. ముఖ్యమయిన మంచి విలువల ప్రచారానికి, వాటిని నిత్య జీవితంలో అమలు జరపడానికి దైవ భావన ఆధారం లేకుండా కృషిజరిపే సెక్యులర్ హ్యూమనిస్టు (దైవ విశ్వాసంలేని మానవతా వాదు)ల సంఘాలుకూడా ఎన్నో ఉన్నాయి.

మతం లేక ధర్మం అన్నది దైవం, మరణానంతర జీవితం, దైవ మార్గదర్శకత్వంలో నమ్మకాన్ని, వాటి ఆధారంగా ఓ జీవన విధానాన్ని, నైతిక ప్రమాణాలను, బోధిస్తుంది. దీని ద్వారా వెలుగులోకి వచ్చే మానవత్వపు విలువలకు పటిష్ఠమయిన ఆధారం—దైవం, పరలోకం పట్ల విశ్వాసాలు— ఉన్నాయి. కాని దైవ విశ్వాసం శూన్యమయిన మానవతా వాదంలో మంచికి ప్రమాణం మనిషే కాబట్టి ఒక మనిషికి లాభకరమయింది మరో మనిషికి హాని కరం కావచ్చు. దొంగతనం చేసేవాణ్ణి, హత్యలు చేసేవాణ్ణి దయతలచి వదలి వెయ్యడం మానవతావాదం. సంఘంలోని అలాంటి చీడపురుగుల్ని ఏరివెయ్యడం ధార్మిక వాదం.

(20-4-84)

—: ० :—

## ముహమ్మద్ అస్లం (ఇల్లందు)

**స్వజాత్యాభిమానం అంటే పూర్తి అర్థం ఏమిటి?**

* జాతి అనే పదాన్ని మనం ఇంగ్లీషు పదం Nation కు బదులుగా ప్రయోగిస్తున్నాము. Nation అంటే ఏమిటి? అన్న విషయంలో పాశ్చాత్య శాస్త్రవేత్తలు, ప్రాచ్య శాస్త్రవేత్తలు విభిన్నాభిప్రాయాలు కలిగి ఉన్నారు. ఒకే భాష, ఒకే సంస్కృతి, ఒకే మతం, ఒకే రాజ్యాధికారం, ఒకే ప్రాదేశిక పరిధిలో నివసించేవారాంతా ఒక జాతి లేక ఒక Nation అని చెప్పారు. కాదు ఇవన్నీ అక్కరలేదు, కేవలం ఓ రాజ్యాధికార పరిధిలో నుండే వారు ప్రాదేశిక పరిధులు వేరయినప్పటికీ ఒకే జాతి అన్నారు. అదీకాదు, ఓ భూభాగాన ఓ రాజ్యాధికారం కలిగి ఉండేవారు మాత్రమే జాతి అన్నారు. సాంస్కృతిక ఐక్యతగలవారే ఓ జాతి అంటున్నారు కొందరు. ఓ రాజ్యాధికార పరిధిలో, ఓ సాంస్కృతిక సమత్వమో, అనువంశిక (Racial) సమత్వమో, భాషా సమత్వమో, మత పరమయిన సమత్వమో కలిగి ఉన్నవారు ఎన్ని వర్గాలున్నా వారంతా ఒకేజాతి అని కొందరంటుంటే, అదేం కాదు వారంతా విభిన్న జాతులని ఇంకా కొంద రంటున్నారు. ఓ భూభాగంలో పుట్టి అక్కడి ప్రత్యేక భాష, సంస్కృతిని కలిగి ఉన్నవారు ఏ రాజ్య పరిధిలో నివసించినా వారంతా ఒకే జాతి అని కొంద రంటున్నారు. వారంతా ఆ పుట్టిన దేశం-మాతృదేశం-పట్లే తమ అభిమానాన్ని, భక్తినీ కనబరచాలని కూడా కోరుతున్నారు. అయితే రాజకీయ పరిభాషలో 'జాతి' అంటే ఓ రాజకీయ సత్తా కలిగిన 'దేశం' అని అర్థం. ఆ దేశం ఏవో కారణాలవల్ల రెండు ముక్కలుగా చీలిపోయి రెండు వేర్వేరు రాజ్యాలుగా ఏర్పడితే అప్పుడు ఆ 'జాతి' రెండు 'జాతులు'గా రూపొందుతుందన్న మాట. ఈ అర్థా లన్నింటిలోనూ 'స్వజాత్యాభిమానం' కనబరుస్తున్నారు మనుషులు. మీకు దేని గురించి చెప్పమంటారు? ఒక్క మాటలో చెప్పాలంటే, సత్యం, న్యాయం ఏమయినా తన 'జాతి' పక్షాన నిర్ద్వంద్వంగా నిలుచోవడమే నేడు స్వజాత్యాభి మానం అనబడుతోంది. — జాతి అంటే పై అర్థాలు మరువకండి! నిజానికి ఇది దురభిమానం. పై వివరణవల్ల తెలిందేమంటే, 'జాతి' అనేదానికి ప్రజలు-భూమిని, వంశాన్ని (Race), భాషను, సంస్కృతిని, మతాన్ని, రాజ్యాధికారాన్ని ప్రాతిపదికగా పరిగణించారు. ఈ ప్రాతిపదికల పై మానవాళి రెండు ప్రపంచ మహా

సంగ్రామాలను చవిచూసింది. దాని చేదు అనుభవాలు నేటికీ ఇంకా మరువలేదు మనం. కాని ఇంకా వీటి ఇంద్రజాలం నుండి బయటపడకపోవటం అలా వుంచి మనం,కుంచించుకుపోతున్న ఆ సంకుచిత పరిధులలో ఇంకా ఇరుక్కుపోతున్నాము. దీనికి భిన్నంగా ఇస్లాం ప్రతిపాదించే భావన విస్తృతమయింది, సహజమయింది, సమంజసమయింది కూడాను. దాని ప్రకారం మొదట, మనిషి ఏ గడ్డపై పుడతాడో దానిపట్ల సహజంగానే అభిమానం, అక్కడి ప్రజలపట్ల ప్రేమ కలిగి ఉంటాడు. కనుక ఆ ప్రేమాభిమానాలు కలిగి ఉండటం అనివార్యం. కాని అది, 'తప్పు చెప్పినా ఒప్పు చెప్పినా-నా ప్రజలు' అన్న రీతిలో ఉండరాదు. న్యాయానికి, సత్యానికి లోబడి మాత్రమే ఏ అభిమానమయినా, ఏ ప్రేమ అయినా, ప్రేమ గుడ్డిదికారాదు! ఆ తరువాత ఇస్లాం ప్రతిపాదించే జాతిభావనలోని రెండో అంశం సైద్ధాంతికమయింది. ఒక విశ్వజనీన సిద్ధాంతాన్ని-ఇస్లాంను-విశ్వసించే వారు ఏ దేశంలో ఉన్నా, ఏ వంశానికి (Race) చెందినా ఏ భాష మాట్లాడినా, ఏ విధమైన వస్త్రధారణ చేసినా, ఏ సంస్కృతిని పాటించినా వారంతా ఒకే జాతి. మూడో విషయం విశ్వజనీనమయిన మానవ సోదరత్వపు భావన. దాని ప్రకారం ఏ జాత్యాభి మానమయినా ఏ దేశ భక్తి అయినా మానవీయ ప్రమాణాల పరి పూర్తిలో అడ్డు రాకాదు. క్లుప్తంగా ఈ వేదికలో ఇంతే చెప్ప వీలవుతుంది.

(4-10-1985)

—: o :—

యం. జనార్ధన్ (భువనగిరి)

**గురూజీ! దైవ పరిపాలనకు - ప్రజాసామ్య పరిపాలనకు తేడా ఏమిటి?**

* మీరు 'దైవ పరిపాలన' అన్న మాట ఏ భావంలో వాడారో కాని నిజానికి దైవ పరిపాలన అంతఃపిండ బ్రహ్మాండమంతటా విస్తరించి ప్రచండంగా సాగుతోంది. ఈ విశ్వ వ్యవస్థ అంతా ఆయన ఆదేశాల కనుగుణంగా, ఆయన నిర్ణయించిన నియమాల ప్రకారం ముందుకు సాగుతోంది. చివరికి ఆయన నియమించిన ప్రకృతి సిద్ధాంతాలను కాదని మనిషి ఒక్క మార్పు నయినా చెయ్యలేడు. అంతెందుకు? నోటితో చూడటం గాని చెవులతో మాట్లాడడం కాని ఒక్క క్షణానికి కూడా చెయ్యలేడు. ఇదంతా ఆయన పరిపాలన. మరి మీరన్న ప్రజాస్వామ్యమో?

'ప్రజాస్వామ్యం'లో 'ప్రజల' నోళ్ళు నొక్కి వెయ్యడం, గొంతు నులిమి వెయ్యడం, నడుం విరగ్గొట్టడం, కాళ్ళు తెగ నరకడం మన నిత్యానుభవమే. 'దైవ పరిపాలన' అన్నది దైవ మార్గదర్శకత్వంలో సాగే ప్రాతినిధ్యపు పరిపాలన అనే రాజకీయ భావంలో అయితే దాని రూపు రేఖలు ఎలా ఉంటాయో ఈ పంక్తుల్లో వ్యక్తం చెయ్యడం సులభసాధ్యం కాదు. ప్రజాస్వామ్యమనబడే నేటి రాక్షస పరిపాలనకన్నా అనేక రెట్లు మేలయిన ప్రజా రంజకమయిన ప్రజా పరిపాలన అని మాత్రం గట్టిగా చెప్పవచ్చు. వివరాలకు 'ఇస్లాం రాజకీయ సిద్ధాంతం' చదవండి.

(3-6-88)

—:o:—

# 13. క్రియాజీవితం

**ఎం. ఎ. అఫ్‌జల్ (బాగల్లు)**

**భావనకు, ఆచరణకు సమన్వయము కుదిర్చేదెట్లా?**

* మనిషి ఆచరణకు 3 మెట్లున్నాయి. ఒకటి ఆలోచన, రెండు సంకల్పం, మూడు ఆచరణ. సంకల్పానికి సామర్థ్యం తోడునీడ. వీటిలో మధ్యలోనిదే (సంకల్పం) ముఖ్యమయినది. అది ఎంత బలవత్తరమయినదయితే అంతే పకడ్బందీగా సాగుతుంది ఆచరణ. అదే సడలిపోతే ఎంత మంచి ఆలోచన కలిగి ఉన్నా నిష్ప్రయోజనమే. మనిషి మంచి ఆలోచన కలిగి, దృఢ సంకల్పముండి, అవసరమైన సామర్థ్యం కలవాడయి ఉన్నా ఒక్కోసారి కేవలం "ఆత్మన్యూనతాభావం" వల్ల ఎన్నో చిన్న పనులు కూడా చెయ్యలేక పోతాడు. నెపోలియన్ బోనాపార్టె "అసాధ్యం" అన్నది నా డిక్షనరీలో లేదని అన్నాడట! అతడు అలా అన్నాడో లేదో . చేసి మాత్రం చూపాడు. యూరోపు చారిత్రక, రాజకీయ చిత్రపటాన్నే మార్చివేశాడు. 27 ఏళ్ళ వయసులో రెండు రోజుల పెళ్ళికొడుకుగా ఫ్రెంచి సైన్యానికి నాయకుడుగా నియమించబడినప్పుడు అతని రిజిస్టరులో 43,000 మంది ఉన్నా నిజంగా ఉన్నవారిని లెక్కిస్తే అతి కష్టం మీద సరిగ్గా బట్టల్లేని తిండిలేని 30,000 మందే మిగులుతారు. వారిని సంబోధిస్తూ "మీకు దుస్తుల్లేవు, సరయిన ఆహారం లేదు... రేపు సిరిగల రాజ్యాలు ఘనతగల పట్టణాలు మీ పాదాక్రాంతమవుతాయి. అక్కడ మీరు గౌరవాన్ని, ఔన్నత్యాన్ని సిరులనూ పొందగలుగుతారు" అని అన్నాడు. అలా అన్నది 8 ఏళ్ళలో సాధించాడు. 1796 మార్చి 28 న చెప్పిన పై మాటలకు 1804 లో మహా సామ్రాజ్యానికి చక్రవర్తి అవడంతో కల సమన్వయమే ఆలోచనకు, ఆచరణకు సమన్వయం కుదుర్చుకోవడమంటే.

(12-8-83)

—: o :—

ఎన్. రాజశేఖర్ (ఇల్లందు)

**మనది మతప్రమేయంలేని రాజ్యం అని మన రాజ్యాంగంలో ఉంది. అయినా సీటు కావాలన్నా ఉద్యోగం రావాలన్నా సంఘంలో పాటి మని షని అని చెప్పుకోవాలన్నా కులమతాలు కావాలి?**

* లోగడ అలా ఉండేదికాదు. ఎమర్జన్సీలో ఆ పదాన్ని మరికొన్ని పదాలతోబాటు చేర్చడం జరిగింది. మన రాజ్యాంగం ఒక్కటే కాదు, ఇక్కడి రాజకీయ, న్యాయ, పరిపాలనా వ్యవస్థలన్నీ పూర్తిగా మన సమాజానికి తగినట్టుగా లేవు. వీటిని సొంతం మార్చివెయ్యాలని చాలా మంది అభిప్రాయ పడుతున్నారు. వారిలో మీరూ ఒకరేమో. వాస్తవమేమంటే వివిధ మతాలు విభిన్న భావాలు, దృక్పథాలుగల ప్రజలున్న మనదేశంలో—సెక్యులర్ అని ప్రకటించుకున్నా, ప్రకటించుకోకపోయినా—ఆచరణయోగ్యమయింది సెక్యులర్ రాజకీయ విధానమే. సెక్యులరిజం అంటే ఇక్కడ "మత ప్రసక్తిలేని"అని భావం కాదు. భారతీయ పూర్వరంగంలో మాట్లాడినప్పుడు దానికి, "అన్ని మతాలపట్ల సమ భావన కలిగి ఉండటం" అని భావం. అంటే "రాజ్యానికయినా లేక ప్రభుత్వం యొక్క ఏ అంగానికైనా అన్ని మతాలూ సమానమే. అని ఏ మతంపట్ల అయినా వివక్ష చూపలేవు. పక్షపాతం కనబరచలేవు" అని భావం. కులమతాల ప్రాబల్యం అంటారా—అది పోవాలంటే విజ్ఞానం ప్రాచుర్యం పొంది, విశాల దృక్పథం ప్రజల్లో ఏర్పడాలి అప్పుడే కులమతాల సంకుచితత్వం నశిస్తుంది.

(7-10-83)

—: o :—

ఎండి. తాజుద్దీన్ ఆరిఫ్ (హైదరాబాదు)

**ఎంత చదువులు చదివినా భవిష్యత్తులేని విద్యార్థులపై మీ అభిప్రాయం?**

* "చదువులు" "భవిష్యత్తు"ను నిర్మించుకోవడం కొరకు మాత్రమే అనుకుంటూ చదివినంత కాలం ఈ "విద్యార్థుల"కు ఎలాంటి భవిష్యత్తు లేదు. ఈ సమాధానం మరీ దారుణంగా అగుపించవచ్చు. కాని ఇదే యదార్థం. విద్య అన్నది స్వయంగా ధనం— తరగని ధనం— అన్నారు పెద్దలు. (విత్

య = ఏదయితే ధనమో అది): కాని కేవలం ధన సముపార్జనకు పెట్టుబడిగా పెట్టడానికి కాదు— జ్ఞాన సముపార్జనకు ఆధారంగా వినియోగించుకోవడానికి. దానికి బదులు ఉద్యోగాలు సంపాయించి ఉజ్జ్వలమైన "భవిష్యత్తు"ను నిర్మించుకోవడానికి, అంటే సకల విధాలుగా సుఖప్రదమయిన జీవితం గడపడానికి చదువును కూడా వాడుకోవాలన్న సంకల్పంతోనే తయారవుతున్నారు నేటి విద్యార్థులు. సంకల్పంలో ఉన్న ఈ వక్రత జీవితాంతం వక్ర మార్గాన్నే పయనింప జేస్తుంది. దాన్ని ఎవరూ సక్రమ పరచలేరు. సంకల్పపు పునాదులు సక్రమంగా పడితే పదవులు, ఉద్యోగాలు అన్నీ వెతుక్కుంటూ వస్తాయి. జీవిత పయనం లేమిలో నయినా "సుఖవంత" మవుతుంది, తృప్తి దాయకమవుతుంది. "విద్యార్థులు" తమ సంకల్పపు ప్రాతిపదికల్ని సక్రమ పరచుకోవాలన్నదే మా సందేశం.

(10-2-84)

—: o :—

డాక్టర్. షేక్ ఆజమ్ (ఎల్లందు)

**ఈ రోజులలో ఏ వ్యక్తి అయినా రోజుకు ఒక చిన్న అబద్ధం చెప్పకుండా బ్రతకగలడా చెప్పండి.**

* 'చెడు' అన్నది చిన్నదైనా పెద్దదయినా దాని గుణంలో మార్పు రాదు. అది సర్వదా వినాశ కారియే అన్నది నిర్వివాదాంశం. 'గొర్రెల కాపరి—పులి' కథలో ఆ కాపరి కుర్రోడు చెప్పింది అంతా సరదా కోసమే. ఎవ్వరినీ నొప్పించాలనీ, ఎవ్వరినీ నష్టపరచాలని, తనకు ఏదో విధమయిన లాభాన్ని చేకూర్చుకోవాలని అతడు ఆ అబద్ధం చెప్పలేదు. కాని జరిగిందేమిటి? సర్వనాశనం. అలాగే 'మంచి' అన్నది శుభదాయిని, దాని వల్ల కీడు కలిగేలా అగుపించినా వ్యక్తికీ, సమాజానికీ మేలే కలుగుతుంది కాని కీడు ఏ మాత్రం కాదు. హజ్రత్ అబ్దుల్ ఖాదర్ జీలాని (రహ్మతై) బాల్యదశలోని గాథ నేర్పే నీతి ఏమిటి? ఏ మనిషికీ అగుపించని చోట చొక్కా లోపల, చంక క్రింద కుట్టి పెట్టిన ధనం గురించి, ఆయన, దొంగలకు నిజం చెప్పక పోయినా కలిగే నష్ట మేమీ లేదు. పైగా దొంగలతో అబద్ధం చెప్పడమే మంచిదని ఎవరికయినా

తోస్తుంది. కాని ఆయన నిజం చెప్పడానికే నిర్ణయించుకున్నారు. దాని వల్ల జరిగిన మేలు ఎంత ఘనమయింది? ఆ దొంగల నాయకుడు తన సహచరులందరితో సహా ఎంతో ఉత్తముడుగా పరివర్తన చెందుతాడు. గొప్ప విద్వాంసుడు, నైతిక బోధకుడు, విస్తృత అనుయాయిగణం గల మార్గదర్శకుడుగా రూపాంతరం చెందుతాడు. దీనంతటికీ కారణం ఒక చిన్న అబద్ధం—ఎవరికీ హాని చెయ్యజాలని అబద్ధం—చెప్పకుండా నిజం చెప్పడం మాత్రమే. అందుకే సత్యం శుభప్రదాయిని, అసత్యం సర్వవినాశిని!

(8-3-85)

—: o :—

ముహమ్మద్ తాజుద్దీన్ ఆరిప్ (హైద్రాబాద్)

**జీవితమే ఒక వెలుగు నీడల సంగమం అని గ్రహించకుండ ఎప్పుడు వెలుగు యుంటుందని భ్రమపడుతుయుండే వారిపై మీ అభిప్రాయం?**

* నా అభిప్రాయం ఏదయినా చరిత్ర చాటిచెప్పే సత్యాన్ని కాస్త గమనించండి. రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యం రెండు ప్రపంచ యుద్ధాల్లో కీలకపాత్ర వహించి చివరికి దాని పుట్టినిల్లు చేరుకుని కునుకుతీస్తోంది. ఎన్నడు పూర్తిగా అస్తమిస్తుందో! తరతరాలుగా పర్షియా భూభాగానికి ఏకఛత్రాధిపత్యం వహిస్తూ వచ్చిన 'పహలవీ' రాజ వంశీయులు నిన్న మొన్ననే సొంత దేశంలో నిలువ నీడలేకుండా పోయి శరణార్థులుగా పరదేశంలో అక్షరాలా 'దిక్కులేని' చావు చావవలసి వచ్చింది. వారి సంతానం నేడు అనాథలుగా పరపంచన పడిగాపులు కాస్తున్నారు. 'నా మాటకు ఎదురేది?' అన్న కశ్మీరీ నారీమణి, భారత దేశాన్ని పరిపాలించి, "ప్రజాస్వామ్య నిరంకుశత్వ"పు భావనను సృష్టించిన కీర్తి దక్కించుకుని, ఒక్క కలంపోటుతో దేశ ప్రజల అదృష్టాన్నే మార్చివేయగలనన్న దురహంకారంతో మెలిగింది. కాని ప్రజలు ఒక్క ఓటు పోటుతో ఆమెని తెరమరుగు చేశారు. అలా అవుతుందని ఆవిడగారు కలలోనయినా ఊహించి ఉండరు. తన తరువాతి వారు చేసిన తప్పుల కారణంగా తిరిగి పాలనా వేదిక నెక్కి మళ్ళీ తన పాత ధోరణినే అవలంబించగా ఓ దౌర్భాగ్యుని చేతుల్లో 'అమరనారీ' అయ్యారు. ఇదంతా మన కళ్ళెదుటి చరిత్ర, దాన్ని చూసినవారు

కూడా తమకు నిత్యం మంగళ సంగీతమే వినిపిస్తూ ఉంటుందని భ్రమలకు లోనయి వెర్రిగా విర్రవీగితే ఏమని చెప్పగలం? ఇక్కడ-చేసుకున్న వారికి చేసుకున్నంత- అన్నది మౌలిక సూత్రం.

(15-11-85)

—: 0 :—

ఎండి. ఖమ్రుద్దీన్ (బెల్లంపల్లి)

**ఈ మధ్యకాలంలో సినిమాలలో మరీ నగ్నంగా నటించుచున్నారు దీనికి కారణం?**

* మానవుని పాశవిక జీవితానికి మూలం రెండు బలమయిన వాంఛలు. ఒకటి కడుపు ఆకలి, రెండవది లైంగిక తృష్ణ. నేడు మానవ సమాజంనుండి మానవీయ ప్రమాణాలన్నీ పడిపోయి ఈ రెండు పాశవిక కాంక్షలు మాత్రం రాజ్యమేలుతున్నాయి. మనిషి చేసే సకల వ్యయ ప్రయాసలకు లక్ష్యం ఈ కాంక్షల పరిపూర్తియే అన్న ధోరణి పొడసూపుతోంది. సౌశీల్యం, వ్రీడా, లజ్జ అనే విలువలకు నేడు స్థానం లేదు. ఇలాంటి ఉన్నత ప్రమాణాలను పోషించ వలసిన ఆధ్యాత్మిక వ్యవస్థ సయితం నేడు స్వేచ్ఛాయుత లైంగిక సంబంధాలను ప్రోత్సహిస్తోంది. "భగవాన్ రజనీష్" గాథ మీరు వినలేదా? ఆ "భగవానుడు" తన రాసక్రీడల ఆశ్రమాలను నెలకొలిపి, మనిషికి 'ఇహం'లోనే 'పరం' జూప తలపెట్టాడు. పూణెలో అతని కుండ ప్రేలి బ్రద్దలయింది. అమెరికాలో దాదాపు 8 సంవత్సరాలు అక్కడి వాతావరణాన్ని తన కార్యకలాపాలతో పునీతం చేసి, తన రహస్యాలన్నీ బట్టబయలు కాగా తిరిగి భారత పుణ్యావనిని చేరుకున్నాడు ఇక్కడే తన గంధం పంచిపెడదామని. చెప్పవచ్చిందేమంటే ఆధ్యాత్మికత పేరిట ఇన్ని అసహ్యాకరమయిన, అసభ్యకరమైన చేష్టలు కొనసాగుతుండగా పాపం నడిబజారులో, అశ్లీలాన్నే ఆధారంగా తీసుకుని బ్రతుకుతెరువు సాగిస్తున్న సినిమా వాళ్ళను ఏమని అనగలం? ఏమయినా చెప్పాలనుకుంటే, వాటిని ఆదరించి, ఇలాంటివే మరిన్ని కావాలని మారాముచేసే "ఆబాలగోపాలాన్ని" అనండి. సినిమా ఓ కాలంలో విజ్ఞానదాయినిగా, వినోదకారిణిగా రాణించింది. ఇప్పుడు అది కేవలం క్షుద్రమయిన కోరికల్ని రేకెత్తించే, మీరు ఏరికోరి చూచి

ఆనందించే, వాణిజ్య ప్రధానమయిన సాధనం, అంతే తప్ప మరేమీకాదు. ఈ రంగాన్ని నిర్మాణాత్మక మార్గాన మరల్చగల ధీశాలు రెవరయినా ఉంటే వారిని "యుగవీర" అనే బిరుదునివ్వవచ్చు.

(22-11-85)

—: o :—

హెచ్.ఎండి. శుజావుద్దీన్ (మహబూబ్‌నగర్)

**ప్రస్తుతము హిందువులలో ఇస్లాం గురించి తప్పుడు అభిప్రాయములు చాలా యున్నవి. అలాంటప్పుడు క్రైస్తవుల్లాగా రేడియోలలో మరియు గోడల మీద ఎలక్ట్రికల్ స్తంభాలమీద ఖురాన్ సూక్తులను వ్రాసి ప్రజలలోయున్న ఇస్లాం గురించి అపోహను తొలగించవచ్చుగదా? మరియు ఇతర సంస్థల కార్యకర్తలలాగా జమాఅతె ఇస్లామీయ కార్యకర్తలు ప్రతి ఇంటికిపోయి కరపత్రములు పంచి ఇస్లాం గురించి తెలుపకూడదా?**

* ఒక్క హిందువుల్లోనే కాదు, క్రైస్తవుల్లో, శిక్కుల్లో, బౌద్ధుల్లో, పార్సీల్లో, జైనుల్లో, నాస్తికుల్లో, సెక్యులర్ హ్యూమనిస్టుల్లో, కమ్యూనిస్టుల్లో—అనేక వర్గాల్లో, అనేక విధాలుగా అపోహలు, అపార్థాలు అపారంగా ఉన్నాయి. ఆ మాటకు వస్తే ముస్లిముల్లోనే అనేక మందిలో అనేక సందేహాలు తమ ధర్మం గురించి పొడసూపుతుంటాయి అప్పుడప్పుడు. ఈ విభిన్న వర్గాల సందేహాల నివృత్తికై, వారిలోని అపోహలు దూరం చెయ్యడానికై ఎంతో కృషి సలపవలసి ఉంది. రేడియో కూడా ఈ విషయంలో గొప్ప సాధనం కావచ్చు. కాని గోడలపై వ్రాయడమో, ఎలక్ట్రిక్ స్థంభాలపై వ్రాయడమో అసభ్యకరమయిన విషయం—ఆ గోడల యజమానుల అనుమతితో వ్రాయడంలో తప్పులేదు. కరపత్రాలు పంచడం కూడా మంచిదే. కాని, నన్నడిగితే, ఇవన్నీ ఒక ఎత్తు, మీ ప్రవర్తన, మీ పొరుగువారిపట్ల మీ నడత, మీరు అనుసరించే విధానాలు మరో ఎత్తు. మీరు మీ నిజ జీవితంలో ఇస్లాంను సరిగ్గా అనుసరిస్తున్నారా? ఇస్లాం సూచించిన తోటి మానవ సోదరుల హక్కుల్ని (హుకూకల్ ఇబాద్) సరిగా నిర్వర్తిస్తున్నారా? ప్రతి మనిషిని మీ సోదరునిగా భావించి—మీరు మీ స్వ ప్రయోజనాలకొరకు దేన్ని అభిలషిస్తారో దాన్నే మీ తోటి సోదరునికోసం కోరు

కునే విశాల హృదయం మీకు ఏర్పడిందా? ఇవి, ఇంకా ఇలాంటివే అనేక ప్రశ్నలున్నాయి. వాటికి సరయిన సమాధానమే అనేక అపోహలకు, అనేక అపార్థాలకు నివారణోపాయం. పోతే జమాఅతె ఇస్లామీ కార్యకర్తల విషయం: జమాఅత్ కార్యకర్తలు ఎక్కడ్నుంచి వస్తారు? ఆకాశాన్నుండి వూడిపడతారనుకున్నారా? జమాఅత్‌కు సరయిన అంగబలం, అర్థబలం చేకూరితే ఇవన్నీ చేయాలనే అది తన ప్రోగ్రాములో ఆశించింది. లభ్యమయిన వనరులతో, సహకారంతో సాధ్యమయినన్ని కార్యక్రమాలు నిర్వహిస్తూనే ఉంది. మీరు దానితో ఏకీభవిస్తే ముందుకు వచ్చి సహాయ సహకారాలు అందజెయ్యండి.

(31-1-86)

—: o :—

బొమ్మ వెంకటస్వామి (రాయవరం)

**కులమత భేదాలు లేవని ప్రభుత్వం, పత్రికల ద్వారా ప్రచారం చేస్తుంది. కాలేజీలలో చేరేటప్పుడు, ఉద్యోగాలలో చేరేటప్పుడు కుల మతాలు వ్రాయమని అంటారు.**

* మత ప్రమేయం లేని (సెక్యులర్) రాజ్యం అని చెప్పడాన్ని మీరు ప్రస్తావిస్తున్నట్లుంది. మత ప్రమేయం లేని రాజ్యం అంటే రాజ్యం ఏ మతం పట్లనయినా, ఏ మత ప్రజల పట్లనయినా వివక్ష చూపకుండా అన్ని మతాలను, అన్ని మతస్థుల్ని సమానంగా చూస్తుందని భావం. ఆ భావం దృష్ట్యా మనది సెక్యులర్ రాజ్యమే. అయితే దానికి భిన్నంగా అప్పుడప్పుడు పాలకుల అభీష్టానికి అభిరుచికి అనుగుణంగా ఎక్కడయినా ఏమయినా జరుగుతూ ఉంటుందన్నది వేరే విషయం. అలాగే రాజ్యాంగం ప్రకారం కొన్ని కులాల, తెగల, వర్గాల ప్రజలను, వారు శతాబ్దాల తరబడి అణచివేతకు గురవుతూ వస్తున్న కారణంగా ప్రత్యేక రాయితీలు ఇవ్వడం కూడా రాజ్యం బాధ్యతే.అందువల్ల ఎవరు ఏ కులం, ఏ తెగ, ఏ వర్గానికి చెందిన వారో తెలుసుకోవడం రాజ్యాధికారులకు ఎంతయినా అవసరమే. మన రాజ్యాంగం అమల్లోకి వచ్చిన తరువాత నేటికి 36 ఏళ్ళు గడిచినా ఇంకా ఆ వర్గాల ప్రజలు సముద్ధరించబడలేదంటే, వారు అభివృద్ధి ఫలాలను అందుకోలేకపోతున్నారంటే కేవలం మన వ్యవస్థను నిందించడం

సబబు కాదు. మన ప్రజల మనస్తత్వం, వారి వైఖరి, కొరవడిన సమతాభావం, సముద్ధరణాభిలాష కూడా మౌలిక కారణాల్లోని అంశాలే.

(5-9-86)

—: ০ :—

గనేశన్, ఎస్. ఎ. గఫూర్ (శ్రీకాళహస్తి)

**దేవుడు అనంత కరుణామయుడు కదా! మరి మానవులలో కొందరికి మంచి మనస్సు మరికొందరికి చెడ్డ మనస్సు ఎందువల్ల? కుండ సొట్టపోయిన తప్పు కుమ్మరిదా? కుండదా? వ్యాఖ్యానించండి.**

*మనిషి కుండలాంటి నిర్జీవ పదార్థం కాదు. కేవలం ప్రాణం మాత్రమే ఉన్న పశువులాంటి జీవి కూడా కాదు. మనిషి, విచక్షణా జ్ఞానంగల, తనకు కావలసింది ఎన్నుకునే, స్వీకరించే స్వేచ్ఛగల—ఓ విధంగా స్వయం ప్రతిపత్తి గల - జీవి. ఇతని మానసిక నిర్మాణంలో తల్లిదండ్రులు, కుటుంబం, పరిసర వాతావరణం, మొత్తం సమాజం, జ్ఞానాన్ని పెంపొందింపజేసే, స్కూళ్ళు, సినిమాలు, వార్తాపత్రికలు ఇత్యాదివి — అనేక అంశాలు కలసి ప్రభావం వేస్తాయి. స్వాభావికంగా మనిషి చాలావరకు ఉత్తమ గుణాలతోనే లోకంలో కళ్ళు తెరుస్తాడు. అదిగో ఆ క్షణంనుండే ప్రారంభమవుతుంది అతని మనోగత నిర్మాణ కార్యక్రమం. జన్యుశాస్త్రం ప్రకారం కొన్ని లక్షణాలో అవలక్షణాలో తల్లిదండ్రుల నుండి కూడా వారసత్వంగా తీసుకువస్తాడన్న విషయం నిజమే అయినా, వాతావరణ ప్రభావంవల్ల మానసిక శిక్షణ ద్వారా వాటిలో మార్పు లేక వాటి తర్ఫీదు జరగటం కూడా యదార్థమే. అందువల్ల మనిషి కుండకాదు, బిందె. సొట్టబోతే దాన్ని మోసే వారిదే తప్పు!

(28-11-86)

—: ০ :—

డి. దస్తగిరి (నంద్యాల)

**టి. డి. పి. మరియు కాంగ్రెస్ (ఐ) ఇంకా మిగతా పార్టీలు కూడా సరియైనవి కావని వారి పరిపాలన వల్ల తెలుస్తున్నది. అలాంటప్పుడు ఓటరు ఎవరికి తన ఓటు వేయాలి.**

* ఆర్భాటపు ఓటరుకు ఆరుగురు పార్టీ నాయకులట! అని మా మిత్రులొకరు జోకు వేసేవారు. అది కాస్తా నిజమయి కూర్చుంది. సిద్ధాంతాలులేని ప్రజ, సిద్ధాంతాలు లేని పార్టీలు, సిద్ధాంతాలు లేని వ్యవస్థ - మన దౌర్భాగ్యం ఇలా ఏడిస్తే ఎవరిని మటుకు ఏమనగలం? ప్రజల జీవితానికి ఓ ఆశయమని, ఓ ఆదర్శమని, ఓ మార్గమని ఉంటే వాటికనుగుణంగా పార్టీలు వాటంతట అవే ఆవిర్భవించేవి. అంతే కాదు మన పరిస్థితి ఎంతగా దిగజారిపోయిందంటే రాజకీయ సామాజిక వ్యవస్థల్లో నీతిమంతులయిన నాయకులే కరువయితే ఉన్న వారితోనే సర్దుకుని వారినే అందలమెక్కించుకు పోతున్నాము మనం. ఎక్కడయినా నీతి కాస్తో కూస్తో మిగిలి ఉంటే అవినీతి మయమయిన గాఢాంధకారంతో పోరాడే ధైర్యం చాలక అది అజ్ఞాత మూలల్లో నక్కి కూర్చోవడమే శ్రేయస్కరమని భావిస్తోంది. ఎందుకంటే దానికి తెలుసు - A corrupt system alone could be sustained by a corrupt people (కేవలం ఓ నీతిలేని వ్యవస్థ మటుకే నీతిలేని ప్రజల సమర్థింపును పొందగలదు) అని. చెప్పవచ్చిందేమంటే ఉన్న పార్టీలు సమర్థవంతం, నీతిమంతం కావని ఎవరయినా అనుకుంటే అలా అనుకుని కూర్చోవడం నీతి అనిపించుకోదు. దేశంలో తమ అభిప్రాయాలకు సమీపంగా ఎవరయినా ఉన్నారా అని అన్వేషించాలి. ఉంటే వారికి తోడయి మంచి వ్యవస్థను నెలకొలిపే కృషి చెయ్యాలి. లేకపోతే మంచి పునాదులపై సంఘ నవనిర్మాణ కార్యక్రమాన్ని చేపట్టాలి. అంతేగాని గోళ్ళు గిల్లుకుంటూ 'ఎవరూ లేరే, ఏం చెయ్యాలి?' అని ఆలోచించే సమయం కాదిది.

(8-5-87)

—: o :—

ఎస్.కె. జహీర్ అహ్మద్ (దబ్బకుపల్లి)

**ముస్లింలు, హిందువులు ఒకే మతం కావాలి, ఏం చేస్తే అవుతారు?**

* అవన్నీ కాని పనులు, ఏమి చేసినా కారు. గత 50 ఏళ్ళుగా దేశంలో ఒక వర్గం కోరుకుంటున్నది అదే. అల్పసంఖ్యాక ముస్లిములు తమ వ్యక్తిత్వాన్ని, ప్రత్యేకతను నీళ్ళకు వదిలేసి 'జాతీయ జీవన స్రవంతి' అనే వారి ఊహాజనిత

మహానదిలో కొట్టుకుపోవాలని వారి తాపత్రయం. మాటలతో వినకపోతే 'చేత'ం ద్వారా అల్పసంఖ్యాకులకు బుద్ధిచెప్పడానికి జబల్పూర్లు, జంషెడ్పూర్లు, అహ్మదాబాదులు, భివండీలు, హైదరాబాదులు, మురాదాబాదులు, మీరట్లు సృష్టి స్తున్నారు. ముస్లిములు వందలాదిగా ప్రాణాలు కోల్పోయినా, లక్షలాది రూపా యల ఆస్తి నష్టం కలిగినా, వేలాది జనం అనాథలుగా మిగిలినా ఆ స్రవంతిలో కాలిడడానికి సిద్ధంగా లేరు. అది చూసి జాతీయ జీవన స్రవంతి ప్రవాహకులు మరీ రెచ్చిపోతున్నారు. మరిన్ని రక్తపుటేరులు ఆ స్రవంతికి అడ్డుగోడలుగా నిలుస్తున్నాయి. నిజానికి మన దేశం అన్ని విధాలా ప్రత్యేకమయింది. నైసర్గిక స్వరూపం దృష్ట్యా, మతాలు, జాతుల దృష్ట్యా కూడా ఇది విలక్షణమయింది. ఇక్కడ నివసించే ఆదిమ జాతులు కేవలం నేడు గిరిజనులనబడుతున్న తెగలే. ద్రావిడులయినా, ఆర్యులయినా ఇక్కడ 'పర' దేశీయులే. ముందు, నేడు ద్రావిడు లనబడుతున్న వారు మెసపటోమియా ప్రాంతాల నుంచి, మధ్యధరా సముద్రం తూర్పుతీరాలనుండి వచ్చి సింధూ ప్రాంతాల్లో నివసించి సింధూ నాగరికత (మొహంజోదారో, హరప్పా)ను నెలకొలిపారు. ఆ తరువాత వచ్చిన ఆర్యులు వారిని దక్షిణాదికి తరిమి ఉత్తర భారతాన్ని ఆక్రమించుకున్నారు. ఆ తరువాత కూడా వలస 'స్రవంతి' ఆగలేదు. అలాంటి మన దేశంలో ఒకేజాతి, ఒకే మతం, ఒకే సంస్కృతి, ఒకే భాష నినాదాలు అవివేకమయినవే కాని మరేమీ కావు.

(5-6-87)

—: o :—

ముహమ్మద్ నజీర్ అహ్మద్ (హిల్ కాలనీ)

**ప్రజల్లో అన్ని వర్గాలవారు కట్టే పన్నుల ద్వారా వచ్చే ప్రజా ధనంలో దాదాపుగా నాలుగో వంతు ప్రభుత్వం BC, SC, ST లకు కల్పిస్తున్న దుస్తులు, పుస్తకాలు, తిండి, స్కాలర్‌షిప్పులు, స్టయిఫండ్, పాకెట్ మనీలు, ఉద్యోగావకాశాలు, కాలేజీ సీట్లు వగైరావంటి సదుపాయాలకు ఖర్చవుతోంది. FCల్లో ఆర్థికంగా గడవని వారికి (ముఖ్యంగా మైనారిటీస్‌కు) కూడా ఇవి లభించేటట్లు చేసి వారి స్థితిగతులను మెరుగుపరచే విషయం ప్రజా నాయకుల బాధ్యత కాదా?**

* మన తమ్ముడో, అన్నో చెల్లెలో బాధల్లో ఉన్నట్లయితే మన సంపాదన లోని కొంత భాగం వారికి కేటాయించి వారి నాదుకోమా ? అలాగే వెనకబడ్డ వారినీ ఆదుకోవలసిందే. BC, SC, STల వారు అత్యధికంగా సర్వసాధారణంగా వెనకబడి ఉండటాన వారికై ఆ సౌకర్యం కల్పించడం జరిగినది. అయితే నేడు, రాజ్యాంగం ఉనికిలోకి వచ్చిన దాదాపు 40 సంవత్సరాలకు, అలాంటి సౌకర్యం కుల ప్రాతిపదికపై కాక ఆర్థిక పరిస్థితుల ఆధారంగా ఉంటే బావుంటుందని అనేక మంది అంటున్నారు. ఇది చాలా సమంజసమయిందే అని నేనూ భావిస్తాను. అయినప్పటికీ ఆ "మోసపోయిన తమ్ముళ్ళకు" సౌకర్యాల వాటా కాస్త పెద్దదిగా కేటాయించాలనడంలోనూ తప్పులేదు. దళిత సోదరుల అసలు సమస్య ఆర్థికమయినది కాదు, సామాజిక మయింది అని నేడు అనేక దళిత సోదరులు కూడా గ్రహించ గలుగుతున్నారు. ఇది సంతోషకరమయిన పరిణామం. సమాజంలో వారి స్థితిగతులు పెరగడం ఒక్కటే కాదు, వ్యక్తిగత స్థాయిలో వారిలోని ప్రతి ఒక్కరిలోనూ ఆత్మవిశ్వాసం, ఆత్మగౌరవం పెరగాలి, తాము ఫలానా అప్ప కులానికి చెందిన వారమన్న న్యూనతా భావం పోవాలి. శ్రీ భగవాన్‌దాస్ (ఢిల్లీ) మాదిరిగా "మైఁ భంగీహూఁ" (ఆయనగారి "నేను పాకీ వాణ్ణి" అనే రచన) అని ఘంటా పథంగా ధైర్యంగా, నిబ్బరంగా చెప్పకోగలగాలి.

(25-12-87)

—: o: —

డి. దస్తగిరి (నంద్యాల)

**"నేటి బాలురే-రేపటి పౌరులు" మరి వీరి యొక్క "పోషణ-శిక్షణ" విషయంలో మీ యొక్క అభిప్రాయం తెలుపండి.**

* పుట్టే ప్రతి శిశువు ప్రకృతి సిద్ధమయిన రీతిలో సద్గుణాలతో పుడతాడు. కాని అతని పెంపకంలో జరిగే అవకతవకల వల్ల అతడు చెడిపోవడమో, దుర్మార్గంలో పడటమో జరుగుతూ ఉంటుందన్నది నా నమ్మకం. అందువల్ల పిల్లల్ని రుజువర్తనులయిన పౌరులుగా మలచాలంటే ఆ విధమయిన ఇంటి వాతావరణాన్ని, పరిసరాలను, విద్యను, శిక్షణను కల్పించవలసి ఉంటుంది.

మన నాట అది ఎక్కడా కానరాదు. సిగరెట్లు కాల్చి, మద్యం సేవించి, జూద మాడి డబ్బునంతా తగులబెట్టే ప్రబుద్ధులు సయితం తమ సంతానం అపర శ్రీరామచంద్రు లవ్వాలని కోరుకుంటుంటారు మనదేశంలో. భావితరం వారు మనల్ని తిట్టుకోకుండా మంచివారుగా అలరారాలంటే, మనదేశ ప్రతిష్ఠను ఇనుమ డింప జెయ్యాలంటే ముందు మనం మారాలి, మన పరిసరాలు మారాలి, మన విద్యా విధానం మారాలి, మన సామాజికస్వరూపం మారాలి, మన సాంస్కృతిక విలువలు, నైతిక ప్రమాణాలు మారాలి. అప్పుడే మన భావితరాలు మనం కోరుకున్న విధంగా రూపొందగలవు. తుమ్మ విత్తనం నాటి, ముండ్లులేని చెట్టు, తియ్యని ఫలాల నిచ్చే మామిడి చెట్టు మొలకెత్తాలంటే సాధ్యమా?

(1-1-88)

—: o :—

ముహమ్మద్ మహబూబ్ బేగ్ (గుంటూరు)

**నేను చనిపోయే ముందు పది మందికి ఉపయోగపడే ఏదైనా ఒక మంచి పని చేయాలనుకున్నా, అది ధార్మిక పాఠశాల అయితే బాగుంటుందని నా ఆలోచన.**

* సామాజిక ప్రయోజనాలకై చేపట్టే ఏ కార్యమయినా సరే ఒక వ్యక్తి పూనుకుని చెయ్యగలననుకోవడం, అదీ ఈ రోజుల్లో-జరగని పని. మీరు మీ భావాన్ని ఇలాంటి విషయాల్లో శ్రద్ధగలవారి ముందు పెట్టండి. ముందు మీరు కొందరినయినా కూడదీసుకోగలిగితే ఆ తరువాత ఆ స్కీమును ప్రజల ముందు వివరంగా చెప్పవచ్చు. ప్రజల సహాయం కావాలన్నప్పుడు ప్రజల్లో పలుకుబడి గల మంచివారి కొందరి సహకారమయినా లభించకపోతే ఎలా? మరో విషయాన్ని కూడా ఆలోచించండి. మీ ప్రాంతాల్లో మీరనుకుంటున్న విధంగా మరే విద్యా సంస్థ అయినా ఉందేమో ఆరాతీసి దాన్ని మంచిగా మలచడానికి, పటిష్ఠం చెయ్యడానికి కృషి చెయ్యండి. మీ లక్ష్యం నెరవేరడమే కదా మీకు కావలసింది! పేరు, ప్రతిష్ఠలు, వగైరా కాదు కదా. అందువల్ల దీన్ని గురించి కూడా ఆలోచించండి.

(8-1-1988).

—: o :—

డి. దస్తగిరి, డి. నాగేశ్వరరావు (నంద్యాల)

**"మూత్రానికి శుభ్రత పాటిస్తారు కాని శరీరం నుండి వెలువడే చెమటకు ఎందుకు శుభ్రత పాటించరని సందేహం?"**

* మూత్రం, మలం అశుద్ధమయినవని ప్రపంచమంతా ఒప్పుకుంటుంది. అందుకే వాటిని పరిశుభ్ర పరుస్తారు. రెండూ శరీరంలోనే ఉంటాయి. అంత మాత్రాన మనం వాటిని వంటికి పూసుకుని తిరగలేము కదా? మీ మిత్రునికి అంతగా వాటి పట్ల మక్కువ ఉంటే మలమూత్రములు వంటికి రాసుకుని తిరగమని సలహా ఇవ్వండి. పోతే చెమట విషయం, చెమట అనునిత్యం వంటి నుండి స్రవించే ద్రవం. దాన్ని పరిశుభ్రపరచుకోవాలంటే సదా నీటిలో మునిగి ఉండటం ఒక్కటే మార్గం. దేవుడు ఏది సులభసాధ్యమో ఏది కష్టసాధ్యమో అన్నీ తెలిసినవాడు. మల మూత్రాలు నిర్ణీత కాలాల్లో బయటికివస్తే చెమట ప్రతి క్షణం వెలువడటం ఒక్కటే చాలు దేవుని విజ్ఞత, వివేచనల్ని అర్థం చేసుకోవడానికి. వాటిలో ఉండే దుర్వాసనలపరిధి, ప్రమాణాలనుబట్టి వాటిని పరిశుభ్ర పరిచే విధానాలుకూడ ఏర్పరిచాడు. మలమూత్రాలను కడిగి శుభ్ర పరచుకోవాలని నియమమయితే చెమటను అప్పుడప్పుడు స్నానం ద్వారా పరిశుభ్రపరచుకోవాలని నియమం. 'అప్పుడప్పుడు' 'అంటే ఎప్పుడూ? అనడిగితే, పరిస్థితులు సౌకర్యాలు, నాగరికత, వాతావరణం ఇత్యాది విషయాల ఆధారంగా ఆ నియమాలు చేసుకునే స్వేచ్ఛనూ ఇచ్చాడు. దాన్ని మనం కాస్త ఆలోచించినా అర్థం చేసుకోగలం. ఆలోచించడానికే మనం సిద్ధంగా లేమా?

(10-6-88)

—: ౦ :—

ముహమ్మద్ మసూద్ అలీ (మహబూబాబాద్)

**ప్రస్తుతి స్వాతంత్ర్య దినోత్సవం రోజు మరియు ప్రతి గణతంత్ర దినోత్సవం రోజు ప్రతిపాఠశాలలో మరియు ప్రతి ప్రభుత్వ కార్యాలయంలో కేవలం గాంధీగారి ఫోటో మాత్రమే ఉంచి దానికి కొబ్బరికాయ వగైరా కొట్టింతరు వాతనే జాతీయ పతాకం ఎగురవేస్తారు? ఇది ఎంతవరకు సమంజసమంటారు? మిగతా నాయకులందరు ఏమైనట్లు?**

* అయితే మీ బాధల్లా, ఒక్క గాంధీ దేముడి గారికే పూజలు ఎందుకు జరిపారు, పాపం మిగతా 'నాయక దేవతలు' ఏం పాపం చేశాయి? అన్నదేగా? మీ దృష్టిలో ఉన్న ఛోటా దేముళ్ళకు కూడా అప్పుడప్పుడు ఈ జుగుప్సాకర మయిన వ్యవస్థలో పూజలు జరుగుతూనే ఉంటాయి. మన భారతీయ సమాజం, దేవుణ్ని తీసుకెళ్ళి ఆరాధనాలయంలో కూచోబెట్టి, 'నువ్వు మా జీవితాల్లోకి రాబాకు, మేము నీకు కావలసిన షోడశోపచారాలన్నీ ఘనంగా ఇక్కడే జరుపుతాము' అని నిత్యజీవితంలో విశృంఖల విహారం చేసే వైఖరిని అవలంబిస్తోంది. ఆ మనస్తత్వం, ఆ దృక్పథంతో మనతో సంబంధంలేని దైవాన్ని సృష్టించుకున్న సమాజం మనది. ఏ నాయకుడినయినా ఇట్టే దేముడు చేసివేస్తుంది-దేముడంటే మన నిత్య జీవితంలో అతని భావాలు, అభిప్రాయాలు పనికిరాని శక్తి అని మాత్రం మరువకండి. ఇది పూజ, భక్తి ఆరాధన గట్రా కావు. కేవలం గౌరవం, ఆదరం మటుకే అని అంటే ఆదరించవలసింది, గౌరవించవలసింది ఆయన ఫోటోని కాదు, ఆయన భావాలను, బోధనలనే అని తెలుసుకోవాలి మనవాళ్ళు.

(1-7-88)

—: o :—

# 14. ఊహాలోకం

ఖల్ల శ్రీనివాసరావు (ఇల్లందు)

**మనం జరుగుతాయి అన్న విషయములు కొన్ని జరుగవు ఎందుకు?**

* భవిష్యత్తు నిత్యం చీకటిలోనే ఉంటుంది. మనం వేసుకునే అంచనాలు కేవలం చీకటిలో వదలిన బాణం లాంటివి. వాటిని మన అనుభవం, విజ్ఞానం, వివేచనల ఆధారంగా మాత్రమే వేసుకుంటాము. భవిష్యత్తును గురించి నిర్దుష్టమైన జ్ఞానం మనకుండదు! అది కేవలం మన అంచనా మాత్రమే. అలాంటి అంచనాలు ఏ కారణాలవల్లనయినా సరే తారుమారవడంలో చిత్రమేముంది? నేడు సశాస్త్రీయ "జ్ఞానం"తో వేసుకున్న అంచనాలు సయితమూ తలక్రిందులవడం మనం కళ్ళారా చూడటం లేదా? వర్షాలను గురించి, వాతావరణం గురించి,మనం ఎన్నో ప్రకటనలు రోజూ మన శాస్త్రీయ నిలయాలనుండి వింటుంటాము.వాటిలో అనేకం ఒక్కసారిగా, ఊహాతీతంగా మారిపోతాయి. అంతమాత్రాన సైంటిఫిక్ జ్ఞానాన్ని కించపరచ లేము. ఎందుకంటే అది మన శతాబ్దాల అనుశీలన, పరిశోధన అనుభవాల ఫలితం. అయితే అది మాత్రం సంపూర్ణం కాదు. మానవ జ్ఞానం ఎంతయినా విశ్వానికి సంబంధించిన విజ్ఞాన సముద్రంలో ఓ బిందుప్రాయమయిందే!

(2-9-83)

—: ० :—

ఎం.ఎ. అఫ్జల్ (చాగల్లు)

**హిప్నోథెరపి ద్వారా వ్యక్తుల్లో నైతిక భావనలను ఇంజెక్టుచేసి, సమాజంలో నైతిక ప్రసారం నింపవచ్చును కదా?**

* హిప్నోథెరపివల్ల అన్ని అద్భుతాలు సాధించవచ్చు అని అనుకోవడం వట్టి భ్రమ. ఇటీవల ఓ న్యూరో సర్జరీ (మెదడుకు సంబంధించిన చికిత్స)కి

చెందిన కేసును గురించి తెలుసుకునే అవకాశం లభించింది. స్కూటర్ ఏక్సి డెంటులో గాయపడ్డ మెదడును శస్త్ర చికిత్స ద్వారా బాగుచెయ్యడం జరిగింది. తరువాత కొంతకాలం వరకు ఫాలో అప్ ట్రీట్‌మెంట్ జరిగింది. ఎంత చేసినా రోగి జ్ఞాపక శక్తి పూర్తిగా పునరుద్ధరించే పరిస్థితి రాలేదు. యాదృచ్ఛికంగా రోగి బంధువులు ఓ చిన్న హోమియో వైద్యుని సంప్రతించారు. ఆయన యథా ప్రకారం మూడు పొట్లాలు ఇచ్చాడట. మొదటి పొట్లం తిన్న మరునాడే జ్ఞాపక శక్తి తిరిగి వచ్చిందట. మూడు పొట్లాల తరువాత ఇక చెప్పనవసరం లేదు. ఇంకా శాస్త్ర చికిత్స జరిగిన తరువాత పేరలైజయిపోయిన ముక్కు కండరాలన్నీ సర్దుకున్నాయి. దీని ఆధారంగా ఎవరన్నా న్యూరోలజీకి సంబంధించిన కేసు లన్నీ హోమియోపతి ద్వారానే బాగుచెయ్యకూడదా అని అనుకుంటే ఏమని చెప్పగలం?

నైతిక భావాలన్నవి మనోమయ జగత్తుకు సంబంధించినవి. ఆ జగత్తు మారనిదే నైతిక పరివర్తన, ప్రవర్తన మనిషిలోరాదు. దానికి హిప్నోథెరపి కాదు, స్పిరిచ్యుయల్ థెరపి అవసరం. అది ధార్మిక వ్యవస్థ ద్వారా మాత్రం లభ్యమవుతుంది.

(28-10-83)

—: o :—

షేక్ అబ్దుల్ అజీమ్ (ఉరవకొండ)

**మనిషికి గర్వం ఉన్నప్పుడు ఇతరులను ఎందుకు ఖాతరు చెయ్యడు?**

* ఇతరులను ఖాతరు చెయ్యకపోవడం వల్లనే కదా అతనికి గర్వం ఉందని గ్రహించారు మీరు? గర్వం అంటే మనిషికి గల ధనం వల్లనో, విద్యవల్లనో, అధికారం వల్లనో, ప్రావీణ్యం వల్లనో ఏర్పడే తుచ్ఛమయిన భావన. ఉన్నత నైజం గల వ్యక్తిలో ఈ గొప్పదనాలు మంచితనాన్ని ప్రేరే పిస్తే, అల్పమయిన నైజం గల వానిలో గర్వం, అహంకారాలను సృజిస్తాయి. ఇతరుల్ని ఖాతరు చెయ్యక పోవడం అన్నది ఒక్కోసారి ఆత్మన్యూనతా భావం వల్ల కూడా ఏర్పడుతుంది. న్యూనతా భావానికి గురయిన వ్యక్తి తన బల హీనతను దాచుకోవడానికి తాను ఇతరులపై ఆధిక్యతగలవాడని నిరూపించు

కోడానికి ఏవో అగచాట్లు పడతాడు. ఉన్నంతలోనే తనలో ఏదో గొప్పదనం ఉన్నట్లు ప్రవర్తిస్తాడు. అది అతనికి తృప్తినిస్తుంది. కాని దాని వల్ల అతని పట్ల ఇతరుల్లో సద్భావన అంటూ ఏర్పడడం కష్టం. ఈ మానసికావస్థను, తెలుసుకున్న వ్యక్తి సమంజసంగా సద్దుకోవడం నేర్చుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

(6-4-84)

—: o :—

ముహమ్మద్ అస్లం (ఇల్లందు)

**అరచేతిలోని రేఖలు భగవంతుడు వ్రాసినవే నంటారా....?**

* ఒక్క అరచేతి రేఖలేమిటి సృష్టి మొత్తాన్ని, అందులోని మనిషిని, మనిషిలోని ప్రతి అంగాన్ని దాని స్వల్పాతి స్వల్పమయిన వివరాన్ని దైవం తన రచనా శిల్పంతోనే తీర్చిదిద్దాడు. ఇందులో సందేహం కలగడానికి ఆస్కారమే లేదు. మరి మీకు ఎందుకు కలిగిందో! మీ బాధంతా ఏమిటంటే, అరచేతి రేఖల్ని కొందరు చదివి వాటి ద్వారా మనిషి అదృష్టాలను తెలుపుతారే అదేమిటి? అన్నదే. మీరు కొందరిని చూడగానే "ఈ వ్యక్తి మృదు స్వభావి, అతను చాలా జిత్తులమారి, వీడు పక్కా రౌడి, ఆయన మహా మేధావి, ఇప్పుడు అతను కోపంగా ఉన్నాడు, ఇతడు బాధలో ఉన్నాడు" అని వాళ్ళ గురించి మీకు తెలియకపోయినా వారి ముఖ కవళికల్ని మాత్రమే చూచి అంచనాల వంతెనలు కడతారు. ఇలా అంచనాలు వెయ్యడం ఎలా సాధ్యమవుతుంది? ఇది మనిషియొక్క కల్పనా శక్తి, పరిశీలనా దృష్టి, అనుభవం, విజ్ఞానాల వల్ల సాధ్యమవుతుంది. దీన్ని ఓ శాస్త్రంగా, విద్యగా వ్యవస్థీకరించడం సాధ్యమా అనంటారా? సాధ్యమే. అలాగే హస్త రేఖల్ని బట్టి మనిషి యొక్క మనస్తత్వాన్ని, అతని గుణగణాల మౌలిక అంశాలను మనిషి తన కల్పనా శక్తి, అనుభవాల ద్వారా అంచనా వెయ్యగలడు. దాన్నే ఓ విద్యగా మలచి 'హస్త సాముద్రిక' విద్యగా పేర్కొంటారు. అంతే. దాని ఆధారంగా మనిషి సౌభాగ్య దౌర్భాగ్యాలను గురించి చెప్పే కథలన్నీ కల్పనలే; అవి ఆ మౌలిక అంశాల ఆధారంగా జ్యోతిష్కులు తమ ఊహల్ని జోడించి కట్టే కట్టడాలే.

(2-11-84)

—: o :—

కె. గోపికృష్ణ (రేపల్లె)

**చనిపోయినవారి మృతదేహములో జీవించి ఉన్నవారి ఆత్మను ప్రవేశింప చేయటము పరకాయ ప్రవేశము అంటారు. పరకాయ ప్రవేశము మీద మీ అభిప్రాయము ఏమిటి?**

* హిందూ మతంలో, దాని అంతర్భాగమయిన మార్మిక విద్యకు సంబంధించిన విషయమది. ఈ మార్మిక విద్యలో అనేక అంశాలు బుద్ధి కందనివి, అనుభవానికి దూరమయినవి. వేదకాలంలో (అంటే 5 వేల ఏండ్ల క్రితం అన్నమాట) అవన్నీ అనుభవంలోకి వచ్చిన యదార్థాలే అని అంటారు. కాలానుగుణమయిన శక్తుల్ని, సామర్థ్యాలను, జ్ఞానసంపదను దైవం ప్రసాదిస్తాడన్న విషయాన్ని నేను నమ్ముతాను. అయితే ఈ "పరకాయ ప్రవేశం" విషయంలో దానిలోని ఆ "మర్మం" ఏమిటో తెలుసుకోకుండా నోరు విప్పడం భావ్యంకాదని భావిస్తున్నాను. నేడు మాత్రం ఆ విద్యను అభ్యసించి ఆచరించి చూపగలవారు లేరన్నది మాత్రం రూఢంగా తెలిసిన విషయం.

(21-7-85)

—: o :—

సయ్యద్. సాబిర్ హుసేన్ (ఎర్రగొండపాలెం)

**పగటి కలలు నిజమవుతాయా ?**

* సామెతగా చెప్పే పగటికలలా లేక నిజంగానే పగటికలలా? సామెతలోని పగటి కలలంటే మనిషి ఊహించే కోరికల ఫలాలన్నమాట. అంటే ఉదాహరణకు, నేను ఇంట్లోనే కూచోని (అది రేయి కావచ్చు పగలూకావచ్చు) అమెరికా వెళ్ళి ప్రెసిడెంట్ రేగన్‌తో మాట్లాడి ఏదో ఒప్పందం చేసుకున్నాననీ, అక్కడ రేగన్‌గారి ముఖ్య అతిథిగా సత్కారాలు పొందానని, ఏదో కోపం వచ్చి ఓ నౌకరును తన్నానని ఊహించుకుంటున్నాననుకోండి. ఏమవుతుంది? నౌకరును తన్నిన తన్ను నేరుగా, నా కాళ్ళదగ్గర కూచున్న మా పాపనో, బాబునో తాకుతుంది. ఫలితం అర్థమవుతూనే ఉందికదా. పగటి కలలు ఇలా నిజమవుతాయన్న మాట! పోతే, నిజంగానే పగటిపూట నిద్రపోయి కన్న కలల విషయం.

కలల పగలుకన్నా రాత్రులుకన్నా వాటికి మానవ జీవితంతో అవినాభావసంబంధం ఉందన్న విషయం మాత్రం నిర్వివాదాంశం. సాధారణంగా గతంలోని విషయాలు, మనిషి అంతర్యంలోని కోరికలు, వాంఛలు కలల రూపు ధరిస్తాయన్నది కొంతవరకు అనుభవంద్వారా అందరూ గ్రహించగల సత్యం. అయితే కలలు మనిషి భవిష్యత్తును కూడా సూచిస్తాయా? అన్న విషయంలో శాస్త్రజ్ఞుల్లో అభిప్రాయ భేదాలున్నాయి. కొన్ని పర్యాయాలు కొందరు వ్యక్తులు భవిష్యత్తులో ఎప్పుడో జరగనున్న విషయాలు చూడటం అనేక రకాలుగా అనుభవంలోకి వచ్చింది. కలలకు మర్మ హేతువు వేరుగా ఉంటుందని, దాన్ని అర్థంచేసుకోవడం కూడా ఒక విద్య అని, హజ్రత్ యూసుఫ్ (అస్సలాం) ఆ కళలో ఆరితేరిన వారని మనకు దివ్య ఖుర్ఆన్, ప్రవక్త హదీసుల ద్వారా తెలుస్తోంది.

(13-12-85)

—: o :—

రాంపేట ఖాజాహుసేన్ (చిప్పగిరి)

**"మనుషులలో ప్రాణ భీతి లేని వారు చాలా తక్కువ. ప్రాణ భీతి పోవడానికి తెలుసుకోవలసిన విషయాలు, ఆచరించవలసిన పనులు ఏవి?"**

* ఈ జీవితం తనదని, తన కృషివల్ల లభించిందని అపోహకు గురయిన వ్యక్తియే ప్రాణభీతికి లోనవుతాడు. "ఈ శరీరం, జీవితం, ప్రాణం—సర్వం ఆ సర్వేశ్వరునిదే, ఆయనే నా శక్తి సామర్థ్యాలకు, నా ప్రాణానికి నిజమయిన స్వామి. ఆయన తలచినన్నాళ్ళు అవి నాతోపాటు ఉంటాయి. ఆయన కాదన్ననాడు అవి నాకు దూరమవుతాయి. ఏవయినా నా సొంతమయితే కదా నాకు బాధ. నావి కానప్పుడు అవి ఉన్నా పోయినా నేనెవణ్ణి కాదనడానికి? నిజానికి ఇవన్నీ నాకు ఆ ప్రభువు తరపున అప్పగించబడిన అమానతు. వాటిని నాకు వీలయినంత వరకు సురక్షితంగా ఉంచడమే నా బాధ్యత. సరయిన పంథాలో వాటిని వినియోగించడమే నా విధి" అని తెలుసుకున్ననాడు మనిషి అన్ని చింతలకు దూరమయి తన విధి నిర్వహణలో నిమగ్నుడవుతాడు. అనవసరమయిన భయాలకు, బాధలకు గురికాకుండా ప్రశాంతంగా జీవితం గడుపుకోగలుగుతాడు. మనిషి తన శక్తి

సామర్థ్యాలకు, విధులకు మధ్య సామరస్యం కుదుర్చుకున్ననాడే సకల పరిణామాలకు అతీతుడుగా మెలగగలడు.

(25-4-86)

—: o :—

ఎం. ఏ. అఫ్‌జల్ (చాగల్లు)

**కోర్టులోని న్యాయదేవత ప్రతిమకు కళ్ళకు గంతలు కట్టుట ఎంతవరకు సమంజసంగా యుంది?**

* న్యాయస్థానానికి చెవులేకాని కళ్ళుండవని సంకేతప్రాయంగా చెప్పడమే దాని ధ్యేయం. బ్రిటిష్ వారు మనకు అప్పగించిన న్యాయవ్యవస్థలో బాధితుడు మొరపెట్టుకోనంతవరకు, న్యాయమూర్తిగారు ఖుద్దుగా దౌర్జన్యం జరుగుతూ ఉండటాన్ని చూచినా ఏమీ చెయ్యలేరు. వాదోపవాదాలు, సాక్ష్యాలు వినడానికి చెవులు, తీర్పు చెప్పడానికి గళము (కలము) మాత్రముంటే చాలన్నది ఆ ప్రతిమ చాటుతూ ఉండే సత్యం. యదార్థం కూడా అంతే. కోర్టులో ఉండే న్యాయమూర్తి రాగద్వేషాలకు అతీతుడయి కేవలం తన ముందు వచ్చిన విచారణ వివరాలు, సాక్ష్యాల ఆధారంగానే తీర్పు చెప్పవలసి ఉంటుంది ఏదేని కేసుతో న్యాయమూర్తికి ఏవయినా యదార్థాలు తెలిసి ఉన్నా అవి కోర్టు ప్రొసీడింగ్స్‌లో రికార్డు కానంతవరకు వాటిని ఆధారంగా చేసుకుని తన తీర్పు చెప్పలేడు. మహా ప్రవక్త (స.అసం) ఒకసారి, 'మీలో ఎవరయినా తమ వాక్చాతుర్యంతో కేసును నా ముందు ఉంచి తమ పక్షంగా తీర్పు చెప్పించుకుంటే దానికి నేను బాధ్యుణ్ణి కాను. మీలో ఎవరూ మరొకరి హక్కును కొట్టివేసే ప్రయత్నం చెయ్యరాదు.' అన్న భావం వచ్చే ప్రబోధం చేశారు.

(2-5-1986)

—: o :—

సయ్యద్ జలాలుద్దీన్ ఖాద్రి (కల్లూరు)

**మనిషి మనసు మలినమైతే దేనితో శుభ్రం చేయవచ్చు?**

* మనసు మలినమవడమన్నది అనేక విధాలుగా జరగవచ్చు. చెడు ఆలోచనలు అభిప్రాయాలు మనసును ఆక్రమించుకుంటే, మనిషి చెడు నడతను

అవలంబిస్తే మనసు మలినమవుతుంది. ఒక్కొక్కసారి ఒక వ్యక్తి లేక కొందరు వ్యక్తుల పట్ల ఏర్పడే దురభిప్రాయాల వల్ల కూడా. ఆ వ్యక్తుల వరకు మనసు మైలపడే అవకాశముంది. ఇలా మనసులో మాలిన్యం చేరే మార్గాలు అనేకం. ఆ మార్గాలనుదూరం చేసుకుంటే మనసు పరిశుద్ధమవుతుంది. ప్రప్రథమంగా కావలసింది మనసు ప్రక్షాళనం చేసుకునే చిత్తశుద్ధి, దృఢ సంకల్పం. రెండోది ఆ కారణాన్ని దూరం చేసుకోవడం. చెడు భావాలు ఏర్పడితే వాటికి దూరంగా ఉండాలి. మంచి భావాలు, ఆలోచనలు, ఏర్పడేందుకు మంచి గ్రంథాల ఉత్తమ వ్యక్తుల సాంగత్యాన్ని అలవరచుకోవాలి. చెడు ఆలోచనలు షైతాన్ ప్రేరితాలు లేక అలాంటి ప్రజల ప్రేరితాలు (అల్లజీ యువస్విసు ఫీ సుదూరిన్నాసి మినల్ జిన్నతి వన్నాస్) ఎవరయితే మనుషుల మనస్సుల్లో సందేహాలను, సంశయాలను కుశంకలను రేపుతారో వారు - జిన్నుల్లోని వారయినా, మనుషుల్లో వారయినా! వారికి దూరమవ్వాలి. చెడు పనుల వల్ల మలినమయితే ఆ పనులకు వెంటనే స్వస్తి చెప్పాలి. వాటి స్థానే మంచి కార్యాలకు ఉపక్రమించాలి. వీలుంటే దాన ధర్మాలు కూడా చెయ్యాలి. (ఇన్నల్ హసనాతి యుజ్ హిబ్న సయ్యి ఆత్) 'మంచి' వన్నీ చెడుల్ని పారద్రోలుతాయనడంలో సందేహం లేదు. ఇక మనసు మైలపడటానికి కారణం ఇతరుల పట్ల చెడు అభిప్రాయాలు ఏర్పడట మయితే వారిని చేరి ఆ అభిప్రాయానికి మూలకారణమయిన విషయం వారితో చర్చించి దాని గురించి కలిగిన అపోహ దూరం చేసుకోవడమో లేక అదే నిజమయితే దాన్ని గురించి వారికి నచ్చజెప్పి వారిని సంస్కరించడమో లేక మనల్ని సంస్కరించుకోవడమో చేసుకోవాలి. అంతే కాని మనసు మలినమయిందని విచారిస్తూ కుర్చోవడం, ఆ విధంగా మైలపడిన మనసుతో అంతర్యంలో అపరాధ భావం పెంచుకుంటూ ఓ నరకంలో బ్రతకడంకన్నా హీనమయిన స్థితి మరొకటి ఉండదేమో !

(6-6-86)

—: ० :—

ఎం. ఎ. అఫ్జల్ (చాగల్లు)

**ఒక ప్రొఫెసర్‌గారు ఈనాటి పత్రికల్ని ఎక్కువగా చదవవద్దని, ఏదో కొద్దిగా స్పృశించి వదిలేయమని, అవి అబద్ధాలతో అసహ్యంగా వ్రాయబడి ఉంటున్నాయని అన్నారు.**

* ఒకటి మాత్రం వాస్తవం. వార్తా పత్రికలు మునుపు వార్తల్ని కేవలం వార్తలుగా వ్రాసేవి. పత్రికల అభిప్రాయాలు సంపాదకీయాల్లో, వ్యాసాల్లో, వ్యాఖ్యల్లో వ్యక్తమయ్యేవి. ఇప్పుడు అలాకాక వార్తలతోపాటు వ్యాఖ్యలు కూడా ప్రక్షిప్తమయి వస్తున్నాయి. వార్త ఏదో విలేఖరి మహోదయుల అభిప్రాయమేదో తెలుసుకోవాలంటే వార్తల తీరును గురించి సునిశిత దృష్టి గలవారికే సాధ్యం. దాన్ని దృష్టిలో ఉంచుకుని ఆ ప్రొఫెసర్‌గారు అలా వ్యాఖ్యానించి ఉంటారు. కాని అది ఓ నకారాత్మక లేక విలోమ వైఖరి (Nagative attitude), దానికి బదులుగా ఆయన తన విద్యార్థులకు నేటి పత్రికల్లో నుంచి వార్తల్ని పట్టడం (చేపల్ని పట్టినట్టు) ఎలాగో నేర్పి ఉంటే, అది కష్టమయినా బావుండేది.
(3-4-87)

—: o :—

ముహమ్మద్ సాదత్ అలి (వనపర్తి)

**హిప్నాటిజం ఒక కళనా, ఒక శాస్త్రమా? గారడి ఆటనా లేక మంత్రమా?**

* మనిషి సాధన ద్వారా సాధించగల విద్య. పాశ్చాత్యులు దాన్ని శాస్త్రబద్ధం చేసినట్టు నేడు చెప్పుకుంటున్నారు. కాని వాస్తవానికి ఇది గణిత, భౌతిక రసాయనశాస్త్రాల్లా సిద్ధాంతబద్ధమయిన, ఖచ్చితమయిన శాస్త్రం కాదు. సాధనే దీనికి ఊపిరి. ఏ శాస్త్రమూ ఎరుగని వాడూ సాధించగల విద్య ఇది. ఒకానొక మానసికావస్థకు సంబంధించిన విద్య. దీని ద్వారా మానవ శ్రేయోసుఖాలకు దారులు వెదకటం ఎంత సాధ్యమో, నీచమయిన కోరికల పరిపూర్తికి కూడా అంతే వీలుంది. మనిషిలో మంచి అన్నదే లేకపోతే, ఎదుటి వారికి మేలు చెయ్యాలన్న ధ్యాసే లేకపోతే, ఈ విద్య ద్వారా ఎన్ని రకాలయిన కీడులైనా చెయ్యగలడు. అందువల్ల ఇలాంటి వాటిలో పడి మనిషి తనకోసం భ్రష్టమార్గాన్ని కూడా తెరచి ఉంచుకోవడంకన్నా మరో నిర్మాణాత్మకమయిన వ్యాపకంలో నిమగ్నమవడం మంచిది. ప్రభుత్వ పోషణలోని సినిమా, టీవి, రేడియోల ద్వారా జన మూడుతున్న 'ప్రయోజనాలు' చాలక హిప్నాటిజం కూడా ఏలిన వారి అండదండలతో ప్రవర్ధమానమయితే ఇక జరిగే 'మంచి'ని గురించి ఊహించడం కూడా కష్టమేమో!
(24-4-..)

—: o :—

అబ్దుల్ మునాఫ్ (రాజమండ్రి)

**కాలము చాలా విలువైనదని అంటారు పెద్దలు, మరి కాలముయొక్క విలువ మనిషికి ఎలా తెలుస్తుంది?**

* కాలం విలువ తెలియాలంటే కాస్త ఓసారి వెనక్కి తిరిగి చూసుకోండి. (మీ వయసెంతోగాని) గతమంతా ఓ కలలా, ఓ క్షణంలో గడిచిపోయిన కాలంలా అగుపిస్తుంది. ఇంత కాలం గడిచిపోతే మీరు సాధించిందేమిటో బేరీజు వేసుక్కోండి. భయపడకండి. గుండె దిటవు చేసుకుని అంతా నెమరువేసుకోండి మీరు ఎంతకాలం వృధా చేశార్లో, ఎంతకాలం విలువ లేకుండా గడచిపోయిందో బోధపడుతుంది. అంత మాత్రాన గుండె ఆగిపోనవసరం లేదు. ఒకటి మాత్రం మరువకండి. అనుక్షణం మీ వయసు పెరుగుతుందని మీరు అనుకుంటున్నారేమో, అదేమీ కాదు. గడచే ప్రతిక్షణం మీ అసలు వయసులో నుండి తరుగుతోంది. మిమ్మల్ని మీ మృత్యువుకు సమీపం చేస్తోంది. మిగిలి ఉన్న క్షణాలెన్నో మీకు ఏ మాత్రం తెలీదు. ఈ భావన, ఈ కాలస్పృహ కలగగానే మీరు కాలంయొక్క విలువను తెలుసుకుంటారు. ఒక్కొ క్షణం ఎంత విలువయిందో గ్రహించి నడుచుకుంటారు. అనవసరపు పనుల్లో నుండి నిష్ప్రయోజనకరమయిన కార్యకలాపాల నుండి తప్పుకుంటారు.

(26-6-87)

—: ○ :—

పి. మహబూబ్ ఖాన్ (తెనాలి)

**భావ విప్లవం అంటే ఏమిటి? భావ దారిద్ర్యం అంటే ఏమిటండి?**

* ముందు విప్లవమంటే ఏమిటో తెలుసుకుందాము. నిఘంటువు ఏమని చెప్పినా దీన్ని 'మార్పు' అనే భావంలో వాడుతున్నాము మనం—అదీ సామూహిక విషయాల్లోనే వాడతాము. ఉదాహరణకు, రాజకీయ విప్లవం, సైనిక విప్లవం, ధార్మిక విప్లవం, సాయుధ విప్లవం, శాంతియుత విప్లవం అలాగే మీరన్న భావ విప్లవం. విప్లవం అన్న పదాన్ని ఇంగ్లీషు పదం Revolutionకు మారుగా ప్రయోగిస్తున్నామన్న మాట. ఒక సమాజంలో, సామాజిక వ్యవస్థలో,

సమాజంలోని సంస్థల్లో వచ్చే మార్పునే మనం విప్లవం అని అంటున్నాము. సమాజం అంటే మనుషులు తప్ప మరేంకాదు కదా. అందువల్ల విప్లవం మనుషులకు కూడా సంబంధించిందే అన్నమాట. మనుషుల దృక్పథాల్లో, జీవన భావనల్లో, ఆలోచనా రీతుల్లో, సామాజిక సిద్ధాంతాల్లో, సామాజిక ప్రాతిపదికల్లో తెచ్చే మార్పునే భావ విప్లవం అనంటారు. అంటే మనుషుల్లోనూ మనుషులతో కూడిన సమాజంలోనూ భావపరంగా వచ్చే మార్పే భావ విప్లవం. మనిషికీ, ఇతర జీవ రాసులకూ గల భేదం ఈ "భావం" ఒక్కటే అని వేరే చెప్పనవసరం లేదు. మనిషికి తన జీవితంపట్ల స్పష్టమయిన భావన, ఒక దృక్పథం అంటూ ఉండాలి. అదే అతన్ని శ్రేష్ఠ జీవిగా నిలబెడుతుంది. ఆ భావన ఆధారంగా మనిషి వ్యక్తిగత జీవితంలోనూ, అతని సామూహిక వ్యవహారాల్లోనూ ఖచ్చిత మయిన సిద్ధాంతాలు, మార్గాలూ నిర్దిష్టమయి ఉండాలి. అంటే మనిషి ఆధ్యాత్మిక, నైతిక నడవడి మొదలుకొని అతని కుటుంబ విషయాలు, ఆర్థిక, సామాజిక, రాజకీయ వ్యవహారాల వరకు అతనికి కొన్ని సిద్ధాంతాలు, సూత్రాలు వాటికనుగుణంగా ఆచరణా మార్గాలూ ఉండాలి. ఇవన్నీ ఏవి? అవి సరయినవా కావా అన్నది వేరే విషయం. అయితే ఎలాంటి ఖచ్చితమయిన భావనలు, భావాలు లేకుండా ఎటు బడితే అటు, ఏ వానకాగొడుగు రీత్యా, ఏ గాలికి ఆ దిక్కు రీత్యా సాగే జీవితం— అది వ్యక్తులదయినా, సమాజాలదయినా - భావ దారిద్ర్యానికి గురయిన జీవితం అన్నమాట. ఆ జీవితం పశుప్రాయమయిందే తప్ప మరేమీ కాదు.

(7-8-87)

—: o :—

సయ్యద్ సాద్-అల్-హుసైని (యూసుఫ్‌గూడ)

**ప్రపంచములో ఎప్పటికి అంతము కాని సంతోషము ఏది?**

* సుఖ దుఃఖాలు సాపేక్షకమయిన (Relative) విషయాలు. అయితే విశ్వజనీనంగా ఒక కోవకు చెందిన ఆనందం అన్నింటిపై ఆధిక్యత పొందగలదని చెప్పవచ్చు, అది ఒక మంచి పని చేసినప్పుడు కలిగే ఆనందం! మహనీయ ముహమ్మద్ (సఅసం) మంచీ చెడుల విషయంలో కొండగురుతుగా చెప్పిన సత్యం మానవ మనస్తత్వం ఎరిగిన వారికి ఎంతయినా ఆకట్టుకోగలదు. ఆయన

ఏ పని చేసయితే నీ అంతర్యం ఆనందానుభూతిని పొందుతుందో అదే సత్కార్యం. ఏ పని చేస్తున్నప్పుడయితే నీ మనస్సు జంకుతూ లోనుండి నిన్ను వారిస్తుందో అదే దుష్కార్యం, అని బోధించారు. మనిషి ఓ మంచి పని చేస్తూ అనుభవించే ఆనందం వర్ణనాతీతమే కాదు, అనంతమూ, నిరంతరమూ కూడా!

(25-12-87)

—: ० :—

పి. మహబూబ్ ఖాన్ (తెనాలి)

**మనిషి తన మనసు (Mind) ను రోజుకు ఎన్ని గంటలపాటు వాడుకో వచ్చును? ఒకవేళ ఎక్కువగా వాడుకుంటే అనర్థాలేవయినా కలుగుతాయా? ఆ అనర్థాలేమిటి?**

* మనిషి పడుకునేటప్పుడు కూడా మెదడు (చిన్న మెదడు) పని చేస్తూనే ఉంటుంది. జాగ్రదవస్థలో ఏ పని చేస్తూ ఉన్నా మెదడు పని చెయ్యకుండా ఉండటమన్నది జరగదు. అయితే శరీరంలో ఏ అవయవం పని చేస్తూ ఉన్నా దానికి విరామం, విశ్రాంతి అవసరమే. ఆ మార్పు, మెదడు దగ్గరికి వస్తే మరీ అవసరమవుతుంది. మానసిక కార్యకలాపాల్లో నిమగ్నులయ్యేవారు మెదడుకు తగినంత విశ్రాంతి నివ్వడానికి శారీరక కార్యకలాపాల్లో పాల్గొనడం అవసరం. ఏది ఎవరికి విశ్రాంతియో చెప్పడం సాపేక్షకమయిన విషయం. ఆలోచించేవారికి, వ్రాసేవారికి, తమ పని తరువాత కట్టెలు కొట్టడం, నేల త్రవ్వడం, రాళ్ళు పగుల గొట్టడం వాస్తవానికి "విశ్రాంతి" అన్నమాట. అలాగే కాయకష్టాల్లో నిమగ్నులయ్యేవారికి కూర్చొని పుస్తకాలు చదువుకోవడమో, వ్రాయడమో, మరేదయినా కూచొని ఆడే ఆటలో పాల్గొనడమో విరామం!! ఎవరికి ఎంత విరామం కావాలన్నది, ఎవరు ఎంత పని చెయ్యాలన్నది కూడా ఆయా వ్యక్తులకు కలిగే 'గ్లాని'ని బట్టి ఉంటుంది. కేవలం 3 గంటలు నిద్రపోయి, మధ్య మధ్య దాదాపు 3 గంటల 'విరామం'తో మిగతా కాలమంతా పని చేసేవారు ప్రపంచంలో అనేక మంది ఉన్నారు. ఇంతకూ ఈ ప్రశ్న వ్రాసేటప్పుడు మీరు విరామావస్థలో నయితే లేరు కదా?

(22-7-88)

—: ० :—

# 15. దురభిమానం

షేక్ షబ్బీర్, ఎం. ఎస్. ఇమాంబాష (తాడికొండ)

**"హిందువులం మనమంతా సోదరులం" అని 'విశ్వహిందూ పరిషత్' వారి నినాదాలు వున్నాయి. మరి భారతదేశంలో వున్న ప్రజలంతా ఎవరు?**

* ఇందులో తప్పేమిటో నాకు బోధపడలేదు. హిందూ మతస్థులంతా ఒకే మత భావనను, కట్టుబాటును, నియమాన్ని అనుసరించేవారు, ఒకే సంస్కృతి గలవారు కావటంచేత ఆ అర్థంలో 'అంతా సోదరులం' అనుకుంటే తప్పులేదు. ఆ మాటకువస్తే హిందువులే కాదు, క్రైస్తవులు, సిక్కులు, జైనులు, ముస్లిములు అందరూ పైన పేర్కొన్న భావంలో 'సోదరులం' అనుకుంటే అందులోనూ తప్పులేదు. తప్పువచ్చే దెక్కడంటే మేమంతా ఒక్కటే, ఫలానావారు మాకు శత్రువులు అన్నప్పుడు మాత్రమే. సొంత వర్గానికి మేలు చేకూర్చుకోవడం, ఎదుటి వర్గానికి కీడు తలపెట్టనంతవరకు, ఇతర వర్గానికి హానికరం కానంత వరకు అభ్యంతరకరం కాదు. దీనిని మరో కోణంనుంచి ఆలోచిస్తే మీరన్నట్టు భారతదేశీయులంతా ఒకే దేశానికి చెందినవారయిన భావంలో సోదరులే. ఆ మాటకు వస్తే ఇస్లాం దృక్పథంలో ప్రపంచ మానవులంతా, ఒకే మానవ జంటకు సంతానం అవటంచేత, సోదరులే! మానవాళిని, దేశం, కులం మతంలాంటి ఎల్లలకు ఇంకా సంకుచిత ప్రాంతం, భాషా సరిహద్దులకు పరిమితం చేసి, విభజించే భావనలు అన్నీ నిజానికి ఖండించదగినవే. పరులపట్ల విద్వేషాన్ని జనింపజేసే ఏ భావనఅయినా ఆక్షేపించవలసిందే. ద్వేషం నిర్మూలనాత్మకం, ప్రేమ నిర్మాణాత్మకం! ఇది మా నినాదం! !

(9-3-84)

—: o :—

ఎస్. అబ్దుల్ గఫూర్ (వెలంపాళెం)

**మా ఊరి కాలేజి గోడలమీద "ఈ దేశంలో ఉంటాలంటే వందేమాతరం అనాలి" ABVP అని వుంది. దీని భావమేమిటో వివరించగలరు.**

* 'వందేమాతరం' అంటే 'తల్లీ నీకే స్తోత్రం' అని అర్థం! (పోల్చి చూడండి అల్‌హమ్దు లిల్లాహ్ - స్తోత్రం దైవం కొరకే అన్న దానితో) 'మాత' అంటే ఇక్కడ భూమి అని అర్థం. భూమి అంటే భారత భూమి అన్నదే అని మరువకండి. భావమేమిటంటే ఈ దేశంలో ఉండాలంటే ఇక్కడి మట్టిని పూజించడం తప్పదు అని. 'దేశం అంటే మట్టి కాదోయ్, మనుషులోయ్' అన్న పిచ్చివాక్కు సంగతేమో కాని మీరు ప్రస్తావించిన వారు మాత్రం ఇక్కడి 'మనుషుల్ని' 'దేశం' నుండి వెళ్ళగొట్టి మట్టిని గట్టిగా పూజిస్తారని రూఢీ చేస్తున్నారు. దేశం నుండి వెళ్ళగొట్టడం నేటి ఆధునిక రాజకీయ వ్యవస్థలో అంత సునాయాసంగా సాధ్యపడదు గనుక ప్రపంచం నుంచే శాశ్వతంగా పంపించి వేస్తున్నారు. అలా పంపితే వారి శరీరాలే భూస్థాపితమయి భూపూజలు జరిపేటప్పుడు పూజలందుకుంటాయని బహుశా శ్రద్ధాభక్తుల కారణంగా అలా చేస్తున్నారేమో!

(1-6-84)

—: o :—

ఎం.ఎం. కమాల్‌బాషా (గుంటూరు)

**పెక్కుమంది ముస్లింల దేశభక్తిని శంకిస్తుంటారు. కాని ఇక్కడి కమ్యూనిష్టులు ఇక్కడి వివిధ రాజకీయపార్టీ నాయకులను హీనంగా విమర్శిస్తూ, కమ్యూనిస్టు దేశాలను, అక్కడి నాయకులను ఆకాశానికి ఎత్తేస్తూ ఉంటారు. భారతదేశంలో పుట్టుటమే తప్పుగా భావిస్తు ఉంటారు. వారి నోటి నుండిఎప్పుడూ వెలువడేవి మార్క్సు లెనిన్‌ల గొప్పతనమే. కాని వారిని వారి దేశభక్తిని కించిత్తు కూడ అనుమానించరు? దీనిపై మీ అభిప్రాయం?**

* ఇది చాలా విస్తృతంగా చర్చించవలసి ఉంటుంది. టూకీగా కొన్ని అంశాలు చెప్పడానికి ప్రయత్నిస్తాను. దేశ విభజన నేపథ్యంలో ముస్లింల గురించి ఇక్కడి అధికసంఖ్యాకుల్లో కొన్ని దురభిప్రాయాలు, అపోహలు, అపార్థాలు చోటు చేసుకున్నాయి. వాటి దృష్ట్యా ముస్లింలు ఏది చేసినా, ఏది చెప్పినా కుశంకకు గురికావలసి వస్తోంది. పైగా వారు బలమయిన రాజకీయ పక్షంగా కూడా రూపొందలేరు. నేటి ప్రత్యేకత ఏమిటంటే ప్రతి విషయమూ రాజకీయ ప్రయోజనాల దృష్టికోణంతోనే చూడటం జరుగుతోంది. రాజకీయాలు ఏదో సామెతగా కాదు నిజానికే వంటింట్లోకీ, పూజా మందిరాల్లోకీ చొరబడినాయి. రాజకీయంగా కాస్త బలం కలిగి (కనీసం వాపు కలిగి) ఉంటే వారు చేసే ఏ చెడునూ పట్టించుకునే వాడులేడు. కమ్యూనిస్టులు, మార్క్సిస్టులు ఓ సిద్ధాంతం ముసుగులో రాజ్యానికి వ్యతిరేకంగా, "భారతీయత"కు వ్యతిరేకంగా ఏమన్నా వారికి బద్ధ విరోధులయిన వారు, దేశీయత, జాతీయత అంటూ ప్రతి విషయంలో వల్లమాలిన దేశభక్తి ప్రతిపత్తులు ఒలకబోసేవారు, బిజెపి లాంటివారు కూడా వారితో పొత్తు పెట్టుకోడానికి సిద్ధమవుతున్నారు. ఎందుకు? రాజకీయం! నేడు రాజకీయాలకూ అంత బలముంది మరి! రాజకీయ శక్తిగా ముస్లిములు ముందుకు రావాలంటే కేవలం ఒక ప్రెషర్ గ్రూపుగా మాత్రం వెలియడం కూడా ఓ రాజకీయ వ్యూహం కాగలదని ఓ అభిప్రాయముంది. అలాకాక ముస్లింలు ఓ సైద్ధాంతిక వర్గం గనక వారు తమ సైద్ధాంతికమయిన ఉనికిని కాదని ఎలాంటి ఇతర లక్ష్యాల దృష్ట్యా రాజకీయ పక్షం నెలకొలుపుకోలేరని, వారి రాజకీయపు గుర్తింపుకూడా వారి సిద్ధాంతాలతోపాటే ముందుకు రావాలని మరో వాదముంది. ముస్లిములు తమ ధార్మిక సిద్ధాంతం ప్రాతిపదికగా సంఘటితమయి రాజకీయ, సామాజిక, విద్యావిషయక, ఆర్థిక సమస్యల్ని పరిష్కరించుకోగలరన్న విషయంలో ఎలాంటి సందేహం లేదు. ధర్మాన్ని త్రోసిరాజని నేడు ప్రపంచం ఎన్ని ఇక్కట్లకు గురవుతున్నదో చూస్తున్న ముస్లిములు తమవద్ద దైవదత్తమయిన సంపూర్ణ సమగ్రజీవన వ్యవస్థ ఉన్నప్పటికీ చీకట్లల్లో తచ్చాడటం వారి ఏ దారిద్ర్యానికి సూచన అని చెప్పమంటారు?లోకులు వారిని వేలెత్తి చూపుతారంటే, వారిని హీనంగా చూస్తారంటే ఏమని చెప్పమంటారూ?

(10-8-84)

—: o :—

షేక్. జహీర్ అహ్మద్ (వినుకొండ)

**మతోన్మాదం అంటే ఏమిటి? మతాభిమానం అంటే ఏమిటి?**

* మంచి ప్రశ్నే అడిగారు. అవగాహనాసౌలభ్యం కొరకు మీ ప్రశ్నని తారుమారు చేద్దాం. ఒక మతాన్ని అవలంబించే వ్యక్తి తన "మతం" సరయిన దని, అదే మానవ ఆధ్యాత్మిక అవసరాలను, నైతిక నియమాలను సవ్యంగా తీర్చిదిద్దుతిందని నమ్ముతాడు. తన మత సిద్ధాంతాలను, ఆచార వ్యవహారాలను ఇతరులెవరయినా దూషిస్తే (విమర్శిస్తేకాదు) ఆ దూషణల దాడిని ఎదుర్కొం టాడు. తన మతాన్ని అన్ని అపోహల నుండి, అపార్థాల నుండి రక్షిస్తాడు. తన మతంపై వచ్చిన అపనిందల్ని తొలగించడానికి కృషి చేస్తాడు. అతడు ఇతరులకూ వారి వారి అభీష్టం ప్రకారం నచ్చిన మతాన్ని అవలంబించే హక్కు ఉందని అంగీకరిస్తాడు. తాను అవలంబించే మతం మానవ మోక్షానికి సరయిన బాటగా భావిస్తాడు గనుక, ఆ మార్గంవైపుకు ఇతరుల్ని ఆహ్వానిస్తాడు. తన మతంయొక్క ప్రాశస్త్యాన్ని విశదీకరిస్తాడు, విశిష్టతను వివరిస్తాడు. అవసరం మేరకు ఎదుటి వారి మతాల్లో తనకు అగుపడిన లోపాలను ఎత్తిచూపుతాడు. అయితే ఆ మతాలనూ, వాటిని అవలంబించే వారినీ కించపరిచేలా, అవమానించేలా ఏ మాటాపలుకడు. తన మతాన్ని దానిపైజరిగే దాడుల్ని ఎలా ఎదుర్కొంటాడో అదే విధంగా ఇతర మతాలపై జరిగే దాడులకూ ఎదురొడ్డి నిలుస్తాడు. ఎవరి కయినా మనసు మారినప్పుడు ఇష్టమయిన మతాన్ని అవలంబించే స్వేచ్ఛ ఉండాలని కాంక్షిస్తాడు. బలత్కారం, బలవంతం, ఎవరిపైకూడా ఉండరాదని కోరుకుంటాడు. ఇలాంటి వ్యక్తి ఓ మతాభిమాని అని చెప్పవచ్చు. దీనికి భిన్నంగా మరో వ్యక్తి తన మతాన్ని అభిమానించడంతోపాటు తన మతం తప్పఇతర మతా లను ద్వేషిస్తాడు. వాటిని దూషిస్తాడు అవమాన పరుస్తాడు. పరమత గ్రంథాలను అవసరం కలిగితే శాస్త్రీయంగా విమర్శించడం మానేసి వాటి పట్ల అభూతకల్పనలు చేస్తాడు, వాటిలో లేని విషయాలు ఉన్నట్లు చిత్రించి అవహేళన చేస్తాడు. పర మతంలోని మతపరమయిన వ్యక్తిత్వాలపై వారిని కించపరిచే విధంగా అభాం డాలు మోపుతాడు, నిందారోపణలు చేస్తాడు, పరమతాల గురించి దుష్ప్రచారం చేస్తాడు. పరమతావలంబీకుల పట్ల ద్వేషం జనింపజేస్తాడు. ద్వేషమే ప్రాణంగా, దూషణే ఊపిరిగా, దుష్ప్రచారమే జీవితంగా జీవిస్తాడు. పరమతాలన్నింటిలో

అతనికి పురుగులే అగుపిస్తాయి. అయితే అతను తన మతాన్ని సరిగ్గా అనుసరించడు. విద్వేషం నిర్మూలనాత్మకం కనుక అతనివల్ల తనపట్ల, తన మతావలంబీకులపట్ల మంచి పని ఏదీ జరగదు. నిత్యం అతడు పరమత అనుయాయుల విద్వేషాగ్నిలో దహించుకుపోతూ; ఇతరులను దహిస్తూ ప్రపంచమంతా ఓ అగ్ని గుండంలా తయారు చెయ్యాలని అభిలషిస్తాడు. అతని విద్వేషం ఒక దశలో ఉన్మాదంగా పెరిగి, ఉగ్రవాదంగా పరిణమిస్తుంది. అతడు మదపుటేనుగులా విజృంభిస్తాడు. మారణకాండకు, దహనకాండకు కారకుడవుతాడు. విద్వేషం నిర్మూలనాత్మకం అని నిరూపిస్తాడు. ఇలాంటి వ్యక్తిని మతోన్మాది అని పిలువవచ్చు. ఈ ఉభయులూ మన సమాజంలో కానవస్తారు. వీరి చిత్రాలు రోజూ మన కళ్ళ ఎదుట కదలాడుతూనే ఉంటాయి.

(16-11-84)

—: o :—

సయ్యద్ ఇక్బాల్ మొయినుద్దీన్ (మొగుల్లపల్లి)

**ఆ మధ్య ఒక పక్ష పత్రికలో "ప్రగతి నిరోధక సంస్థలను నిషేధించాలి" అను శీర్షికలో**

* మీ సుదీర్ఘమైన లేఖకు, ఆ వ్యాసంపై వ్యాఖ్యానించవలసిందని నాపై చూపిన నమ్మకానికి, మీ అభిమానానికి కృతజ్ఞతలు. మీరు ఈ లేఖ ద్వారా, మీ ఆరాటాన్ని, ఇస్లాం పట్ల గల అవ్యాజమయిన ప్రేమను, దాన్ని నేటి యుగంలో ఓ మహత్తర శక్తిగా నిరూపించే తపనను చాటుకున్నారు. దైవం మిమ్మల్ని, మీ ఆవేదనను శత్రువులబారినుండి రక్షించాలని కోరుకుంటున్నాను. మీరు ఉదహరించినటువంటి వ్యాసాలు అనేకం మన నాట అనేక పత్రికల్లో వస్తూనే ఉంటాయి. వాటిలో అత్యధికంగా నిజంగానే కాలం చెల్లిన మత భావనలను, మూఢ నమ్మకాలను విమర్శించడం జరుగుతుంది (ప్రస్తుత వ్యాసంలో మాదిరిగా). పోతే మతాన్ని గురించి ఆడవాళ్ళ మాదిరిగా దూషణలు, ఆడి పోసుకోవడాలు, తిట్లతో సత్కరించడం కూడా జరుగుతుంది. ఆ తరువాత కమ్యూనిజం గురించి లేక సోషలిజం గురించి లేక పాశ్చాత్య వైజ్ఞానిక విజృంభణ గురించి, అవి మానవాళి జీవితాన్ని మూడు బాంబులూ ఆరు క్షిపణుల్లా ఎలా

వర్ధిల్లచేశాయో దాని గురించి, కొన్ని ప్రగల్భాలుంటాయి. సహేతుకమైన వాదనలంటూ ఈ వ్యాసాల్లో ఉండదు. అదంతా ప్రాపగండా మెటీరియల్ కిందికి వస్తుంది. దాన్ని అంతగా పట్టించుకోనక్కరలేదు. అయితే ఒకటి మాత్రం బాగా వ్యక్తమవుతోంది. రాజకీయాలు తమ బాహువుల్ని ఎంత నిడివి చేశాయో, ఎంత వరకు జీవనరంగాలన్నింటినీ ప్రభావితం చేశాయో తెలుస్తోంది. రాజకీయాలతో మనకేటి? అని పరమ పవిత్రత వెళ్ళగ్రక్కే ఛాందస మతస్థులకు ఇది కనువిప్పు కాగలిగితే అదే పదివేలు. ఈ ప్రాపగండా సరుకును అసలు పట్టించుకోకండి. మిమ్మల్ని ఆగ్రహావేశాలకు గురిచేసి మీరు వాటికి సమాధానాలిచ్చుకుంటూ కూర్చుంటే మీరు చేస్తున్న నిర్మాణాత్మకమయిన పనులు కొనసాగవు. నిర్మాణాత్మకమైన పనులనుండి మీ దృష్టిని మరల్చడమే వారి ఉద్దేశ్యం. వారి ఈ లక్ష్యం నెరవేరనివ్వకండి. నిజంగానే ఎవరయినా అర్థం చేసుకోదలిస్తే వారికి తగిన సాహిత్యం అందజెయ్యండి. నోటిమాటకంటే సాహిత్యం అద్భుతంగా పని చేస్తుంది.

(25-10-85)

—: o :—

ముహమ్మద్ సాదత్ అలి (వనపర్తి)

**ఇక్కడ గోడలమీద ఈ కొటేషన్ కూడా యున్నది.**

**"జిన్‌కో చాహిఏ పాకిస్తాన్**
**ఉన్‌కో భేజో ఖబరస్థాన్"**

**— కామెంట్ ప్లీజ్.**

* మనదేశంలో కొందరికి పాలకపక్షం మొదలుకుని ప్రతిపక్షాల వరకు—పాకిస్తాన్ ఫోబియా పట్టుకుంది. హైడ్రో ఫోబియా (నీటి భయం లేక కుక్కకాటువల్ల జనించే వ్యాధి) సోకినవాడు నీటిని చూడగానే కుక్కలా మొరుగుతాడు. అలాగే పైన పేర్కొన్న పాకిస్తాన్ ఫోబియా గ్రస్తులు ఇక్కడి ఓ వర్గాన్ని చూడగానే మీరు ఉదహరించినట్లు కేకలు పెడతారు. ఎవరయితే పాకిస్తాన్ కావాలనుకున్నారో వారంతా పాకిస్తాన్‌లోనే క్షేమంగా ఉన్నారనీ, (కబ్రస్తాన్‌లో కాదు!) కాదనుకున్నవారు మటుకు సజీవ దహనాలను, మారణ హోమాలను చవి

చూస్తూ, సజీవ నరకయాతనను అనుభవిస్తూ బ్రతికుండీ కబ్రస్తాన్ 'మజా' జుర్రుకుంటూ ఇక్కడే పడిఉన్నారని వారికి తెలీకకాదు, మీలాంటి వారు ఏమయినా రెచ్చిపోతారేమో చూద్దామని మీ సహనాన్ని పరీక్షించే నిమిత్తం అలా వ్రాసి ఉంటారు, అంతే. దాని గురించి బెంగపడకండి—భంగపడతారు!

(23-1-87)

—: o :—

జె. మోహనరావు (తిరువూరు)

**"ఔరంగజేబు పరమతద్వేషమునకు మచ్చుతునక" కామెంటు ప్లీజ్.**

* ఇలా అనేవారు రెండు రకాలు. ఒకటి క్రైస్తవ ప్రాచ్య శాస్త్రవేత్తలు (Orientalists) వ్రాసిన చరిత్ర గ్రంథాలు చదివి ప్రభావితులయి నిజంగానే అలా నమ్మేవారు. రెండు, నిజం అది కాదని తెలిసినా పనిగట్టుకుని దుష్ప్రచార బుద్ధితో ఆ "మహోద్యమాన్ని" దేశవ్యాప్తంగా నడుపుతున్నవారు. ఔరంగజేబు ఏ మేరకు పరమత సహనాన్ని ఆచరించాడో గీటురాయిలోనే అనేక వ్యాసాల్లో మీరు చదివి ఉంటారు. అవి చారిత్రక వాస్తవ ఆధారాలతో చెప్పిన గాథలు. ఔరంగజేబు చేసిన మహాపరాధం ఒక్కటే. ఆయన తన వ్యక్తిగత జీవితాన్ని నిష్ఠగా ఇస్లాం ధర్మ సూత్రాల కనుగుణంగా గడుపుకోవడం. ఆయన టోపీలు కుట్టి, దివ్య ఖుర్ఆన్ ప్రతులు వ్రాసి పొట్టపోసుకునేవాడు. భారతదేశం వంటి సౌభాగ్యవంతమయిన దేశానికి అధినేత అయి ఉండి అలా వ్యవహరించాడంటే అది కుత్సిత మనస్కులకు మత మౌఢ్యంగా గోచరించింది. మత మౌఢ్యం గలవాడు ఎలా వ్యవహరించి ఉంటాడు? తప్పక అతను పరమత ద్వేషి అయి ఉంటాడు అని ఊహించుకున్నారు. కథలల్లారు. బ్రిటిష్ పాలకులు, ఈ దేశంలో తమ పాలన సాగాలంటే అంతవరకు పాలకులుగా ఉన్నవారిని చెడుగా చిత్రించడం, తద్వారా పాలకుల మతస్థులపట్ల ఇక్కడి జన సామాన్యంలో చెడుభావాలు నూరి పొయ్యడం అవసరమని భావించారు. తదనుగుణంగా చేసిన దుష్ప్రచారం నేడు తలెత్తుతున్న నియో మత మౌఢ్యులకు, జాత్యహంకార ప్రచారకులకు బాగా ఉపయోగపడుతోంది. ఇదీ కథ. భారతదేశ చరిత్ర తిరిగి వ్రాయాలని కొందరు సంస్థలు కూడా నెలకొలిపారు. ఆ తిరిగి వ్రాసే చరిత్ర మళ్ళీ తిరగవ్రాసేలా

కాకుండా యదార్థాల ఆధారంగా వ్రాస్తే వారు దేశానికి నిజమయిన సేవ చేసిన వారవుతారు. దానిగ్గాను శాస్త్రీయ దృక్పథం, నిష్పక్షపాత ధోరణి కావాలి. ముందే చేసుకున్న నిర్ణయాలు (Preconceived notions)ని మనసు నుండి పారద్రోల గలిగేంతటి మనో అధీనత అలవడాలి.

(23-1-1987)

—: o :—

యం.డి. ఉస్మాన్ ఖాన్ (ఎన్. జగన్నాథపురం)

**పరాయివాడు గుణవంతుడై యుండి, తనవాడు గుణహీనుడై యున్నప్పుడు గుణవంతుడైన పరాయివాడికన్న గుణహీనుడైన మనవాడే మంచివాడు. తనవాడు తనవాడే పరాయివాడు పరాయివాడే (రామాయణం) కామెంట్ ప్లీజ్.**

* ఇలాంటి వాటికి కేవలం 'రామయణం' అని లేదా 'బైబిల్' అని, 'ఖుర్ఆన్' అని రిఫరెన్స్ ఇస్తే సరిపోదు. ఏ కాండం, ఏ శ్లోకమో కూడా వివరంగా వ్రాయాలి.ఇంతకు ఇదికరుడుగట్టినపచ్చిజాతి తత్వవాదం.దీనికే హిట్లరు,ముసోలినీ లాంటివారు ప్రాణ ప్రతిష్ఠ చేశారు. ఆర్యుల్లో ఇది ఒకింత అధికంగానే ఉండేదని, ఉందని తెలుస్తూనే ఉంది. నాటి హిట్లరయినా మొన్నటి రెజాషా పెహల్వీ అయినా నేటి భారత్‌లోని జాతితత్వ ఉగ్రవాదు లయినా అంతా ఆ కోవకు చెందినవారే. అదే సిద్ధాంతం ఇస్లాంకు పూర్వం అజ్ఞాన కాలపు అరబ్బుల్లోనూ ఉండేది—"మీ సోదరునికి తోడ్పడండి, అతను పీడితుడయినా పీడించేవాడయినా" అన్నది అరబ్బు నానుడి. దాన్ని మానవ మహోపకారి పూర్తిగా భిన్నమయిన భావంలో ప్రయోగించారు. పీడితుడికి సహాయపడటం సరే, పీడించే వాడికి సహాయ పడటం ఎలా అన్నదానికి ఆయన– "అతని ఆ దౌర్జన్యాన్ని నిరోధించి సహాయపడాలి" అని అన్నారు. అంతే కాదు. తప్పుడు విషయంలో, కేవలం తన జాతి అన్న దురభిమానం చేత సహాయపడడం, నూతిలో పడిపొయ్యే ఒంటె తోక పట్టుకుని దానితోపాటు నూతిలో పడటమే అని కూడా సెలవిచ్చారు. దురభిమానాన్ని రేకెత్తించేవాడు మనలోని వాడు కాడు అని కూడా అన్నారు.

(20-5-88)

—: o :—

# 16. ఆర్థికం

సి. సుబ్బలక్ష్మి (మండపేట)

**అవసరమైన వస్తువులమీద ఎక్కువ లాభం వేసుకున్నా ఫర్వాలేదట...**

* ధర నిర్ణయం కాని ఏ వస్తువులపైనైనా ఇష్టం వచ్చినట్లు లాభం గడించే అధికారం ఏ వ్యాపారికయినా, ఏ చట్టంలో నయినా ఉంది. అయితే కొన్ని నైతిక సూత్రాలను పాటించి, తమ వ్యాపారాన్ని స్థిరపరచుకోడానికి వ్యాపారులు అధమం ఎంత లాభం తీసుకుంటే సరిపోతుందో ఆలోచించి స్వయంగానే ధరల్ని నిర్ణయించుకుంటారు. ఇది మన నిత్యానుభవమే. మరో విషయాన్ని మనం ఆహార పదార్థాల కొరత ఏర్పడినప్పుడల్లా చూస్తూనే ఉన్నాము. వ్యాపారులు ధరలు ఇష్టమయిన రీతిలో పెంచడం, ప్రభుత్వం జోక్యం కల్పించుకుని ఏదో సర్దుబాటు చెయ్యడం, లేక ఆహార ధాన్యాల పంపిణీని ప్రభుత్వం స్వయంగా కొంతవరకయినా చేబట్టడం మనకు నేటి అనుభవమే. ఇవి సర్వసాధారణ విషయాలు. ఇకపోతే, ఇస్లామీయ రాజకీయ వ్యవస్థలో (అంటే ముస్లిం ప్రభుత్వం అని అర్థంకాదు అది ఇస్లామీయ ప్రభుత్వం అయి ఉండాలి) మీరు చెప్పినట్లు నిత్యావసర పదార్థాలకు ఎక్కువ లాభాలు, విలాస వస్తువులకు తక్కువ లాభాలు గడించే ఎలాంటి అనుమతి కూడా లభించదు. పోగా అలా లాభాలు గడించదలచినవారికి కఠిన శిక్షలు విధించ బడతాయి. ఇస్లామీయ ప్రభుత్వంలో హజ్రత్ ఉమర్ కాలంలో క్షామం ఏర్పడి నప్పుడు ప్రభుత్వమే ధాన్యం కొనుగోలు చేసి, లేనివారికి ఉచితంగాను, ఉన్న వారికి తక్కువ ధరకున్నూ పంచిపెట్టే ఏర్పాటు చేసింది. బహుశా ప్రపంచంలో "రేషనింగు"ను ఇలా ప్రారంభించిన ఘనత ఆనాటి ఇస్లామీయ ప్రభుత్వానికే దక్కుతుందేమో.

(13-7-84)

—:o:—

## జహీర్ అహ్మద్ (వినుకొండ)

**జనాభాకు తగినంత సంపదలేదా మనదేశంలో?**

* అంతర్జాతీయ ఆర్థిక అధ్యయనాలు కొన్ని గణాంక వివరాలు అందజేస్తున్నాయి. గత ముప్పయ్యేళ్ళలో ప్రపంచం మొత్తంమీద పెరుగుదల సగటున సంవత్సరానికి 4.7 శాతం ఉంటే ప్రపంచ ప్రజలు తమ జాతీయ ఉత్పత్తి ఆధారంగా తలసరి పెరుగుదల సంవత్సరానికి 2.7 శాతమే చూడగలిగారు. భారతదేశం మాటకువస్తే దేశం మొత్తంమీద సంవత్సరానికి 3.9 శాతం పెరగగలిగితే, ప్రజల తలసరి పెరుగుదల సంవత్సరానికి 1.5 శాతం మాత్రమే కాగలిగింది. గోధుమలు, వరి పంటల్లో ఉత్పాదన మన అవసరానికన్నా పెరిగినా 25 శాతం ఎక్కువగానే రాగలుగుతుందని మన నిపుణులు లెక్కలు కట్టి చెబుతున్నారు.

ఎంతటి కరువు పరిస్థితులు వచ్చినా తట్టుకోగలందులకు ప్రభుత్వ ధాన్యాగారాల్లో ఉండే నిల్వలు ఒక హద్దువరకే పోగలవు. ఒక్క గోధుమ విషయంలోనే రబీ పంటల సేకరణ ఇంకా ప్రారంభంకాక పూర్వమే అవసరాలన్నింటికీ సరిపడే ధాన్యం నిల్వలు ప్రభుత్వ ధాన్యాగారాల్లో ఉన్నాయి. ఇక ఆపై వచ్చే ధాన్యాన్ని ప్రభుత్వ స్థాయిలో ఎగుమతి చెయ్యడం తప్ప గత్యంతరం ఉండదని నిపుణులు భావిస్తున్నారు. అలాగే ఇతర ఆహార ఉత్పత్తుల విషయంలోనూ మనం క్రమేపి స్వయం సమృద్ధి వైపుకు పయనిస్తున్నామని చెప్పవచ్చు. అయితే లోపం మన దేశ వనరులు,సహజ సంపదల్లో లేదు.వాటిపై యాజమాన్యం చేస్తున్న విధానాల్లో, వినియోగంలో, వాటి పంపిణీకై జరిగే ఏర్పాట్లలోనే. రాజీవ్ ప్రభుత్వ ఆర్థిక విధానాన్ని నిపుణులు, మన గత పోకడకు పూర్తిగా భిన్నమయిందిగా వర్ణిస్తున్నారు. అది పారిశ్రామిక రంగానికి కొత్త ఊపు నిస్తుందని, ఆ రంగంలో కొత్త విధానానికి నాంది పలికిందని అన్నారు. పన్నుల కోతను, కంట్రోళ్ళ తగ్గుదలను, ప్రొసీజర్లు సరళం చెయ్యడాన్ని లైసెన్సు విధానానికి స్వేచ్ఛనివ్వడాన్ని, ఉత్పాదనలో, సామర్థ్యంలో పెరుగుదల కొరకు పోటీని ప్రోత్సహించడాన్ని నిపుణులు ఎంతో ఉత్సాహంగా, ఆశాజనకంగా చూస్తున్నారు. అయితే అదే సమయంలో మన దేశ పరిస్థితుల్ని బాగా అర్థం చేసుకుని

గ్రామీణాభివృద్ధిని, అక్షరాస్యతను, నిరుద్యోగాన్ని దృష్టిలో ఉంచుకుని మరి ప్రాధాన్యతలు నిర్ణయించాలని వారు అంటున్నారు. అవిభక్త భారత ఉపఖండం సాలీనా రెవెన్యూ ఆదాయం 1938-39లో కేవలం రూ. 84.47 కోట్లు అంటే అప్పుడు చెలామణిలో ఉన్న నోట్ల సంఖ్య 164.57 కోట్లు. నేడు అలాంటి కరెన్సీ దాదాపు దానికి 100 రెంతులు పెరిగిపోయింది.

(3-5-85)

—: o :—

జహీర్ అహ్మద్ (వినుకొండ)

**నిరుద్యోగ సమస్య నానాటికి పెరుగుతున్న ధరలు మొదలయిన సమస్యలపై మీ దృక్పథం ఏమిటి?**

* ఇవీ ఇంకా ఇలాంటి ఇతర ఆర్థిక సమస్యలకు కారణాలు సామాన్యంగా రెండే. ఒకటి మనపై వెలసిన ఆర్థిక వ్యవస్థ; రెండు, ప్లానింగు. వీటన్నింటికి మూలం పదార్థంగా ఉండవలసిందీ కాని నేడు మన వ్యక్తిగత సామూహిక జీవితాలనుండి కనుమరుగయినదీ అయిన నైతికత మూడవ అంశం. నైతికత లోపించడం మూలాన ఏవిధంగానయినా సరే అత్యధికంగా ధనార్జన చెయ్యాలన్న దురాశ అవినీతి కార్యకలాపాలకు తావునిచ్చింది. నల్లబజారు, కల్తీ వ్యాపారం, విశ్వాస ఘాతుకం, లాంటి అనేక దుర్గుణాలు ఈ దృక్పథం మూలాన వ్యాపించినవే. వడ్డీ వ్యవస్థ కారణంగా పుట్టే మన స్తత్వం కూడా అలాంటిదే. ఎదుటి వాడు ఏ విధంగా బాధపడుతున్నాడు అన్న ఆలోచన లేకుండా పారిశ్రామికవేత్తలు ఎంతసేపటికి తమ బ్యాంకు బేలన్సులను పెంచే ప్రయత్నమే అయితే కొనుగోలు శక్తి పడిపోయిన సామాన్యుడు, ఇన్ఫ్లేషన్‌కు గురయిన ఆర్థిక వ్యవస్థలో అధికధరల్ని కాక పోతే మరేమి చవిచూస్తాడు? మనదేశ వనరులు, జనాభా, అవసరాలను దృష్టిలో ఉంచుకుని ప్రణాళికా రచన జరిపిఉంటే నిరుద్యోగ సమస్య ఇలా పీడించేది కాదని ఆర్థిక నిపుణులు కొందరు అభిప్రాయపడతారు.

(28-12-84)

—: o :—

ముహమ్మద్ ఖమరుజ్జమ (డోర్నకల్)

**ఏదయినా వ్యాపారంలో ఎంత వరకు లాభము ధర్మబద్ధముగా తీసుకొన వచ్చును**

* వ్యాపారంలో మీరు ఎంతయినా లాభం సంపాయించవచ్చు. అందులో ప్రతిబంధకం ఏదీలేదు. అయితే నేటి వాణిజ్య రంగంలో మీరు మీ ఇష్టం ప్రకారం నడుచుకోలేరు. ధరలు నిర్ణయించే అంశాలు అనేక మయ్యాయి. కొన్ని వస్తువుల ధరల్ని ప్రభుత్వమే నిర్ణయిస్తోంది. కొన్నింటిని ఉత్పత్తి దారులే నిర్ణయించి అమ్మేవారికి కమీషన్ ఇస్తున్నారు. మరి కొన్నింటి విషయంలో 'మార్కెట్'ని బట్టి వ్యాపారస్తులు నిర్ణయించుకుపోతున్నారు. మీరు ధరలు నిర్ణయించిన 'మార్కెట్'ని కాదని వ్యాపారాన్ని నడుపుకోలేరు. వ్యాపారం సజావుగా సాగాలంటే వస్తువులోని మంచి చెబ్బరల్ని ఎలాంటి దాపరికం లేకుండా కొనుగోలు దారులకు వివరించి నిజాయితీగా మసలుకుంటే, కల్తీలు, ఓ పదార్థాన్ని మరో పదార్థంగా ప్రకటించడం, తూకంలో కొలతల్లో మోసం, మనిషిని చూసి ధరలు చెప్పడం లాంటివి చెయ్యకుండా వ్యాపారం చేస్తే మీరు అటు వ్యాపార రంగంలోనూ మనగలుగుతారు, షరీఅత్‌ని పాటించిన వారూ అవుతారు. బేరమాడడంలో తప్పులేదు కాని నేడు 'ఒకేధర' (Fixed Price) పద్ధతే విజయవంతమవుతుంది. ప్రారంభంలో కొంత కష్టం కలిగినా తరువాత అదే లాభదాయకమని మీకే బోధపడుతుంది. మరో విషయం ఏమిటంటే మీరు ఏ వస్తువుల్ని నిషిద్ధమయినవిగా భావిస్తారో వాటిని ఇతరుల కోసమని అమ్మడం కూడా తప్పే.

(4-4-86)

—: o :—

ఎస్. ఖాదర్‌బాష (విజయవాడ)

**ఖుర్ఆన్ Usury (అనగా చట్ట వ్యతిరేకమైన అధికవడ్డీ, వడ్డీనే వృత్తిగా చేయటం) మాత్రమే నిషేధిస్తుందని బ్యాంకింగ్ వడ్డీ ఖుర్ఆన్ ఆదేశాలకు వ్యతిరేకం కాదని ఒక ప్రముఖ ఇస్లామిక్ రచయిత ఈ మధ్య చెప్పినారు. అలాగే ఖుర్ఆన్‌లో వాడిన 'రిబా' అన్న పదంపై ధర్మవేత్తలలో నిర్వచనం**

**పై భేదాభిప్రాయా లున్నాయని వారు అన్నారు. దీనిపై మీ అభిప్రాయం తెలిపి బ్యాంకింగ్ వడ్డీ ఖుర్ఆన్‌కి వ్యతిరేకమో కాదో తెలియచేయగలరు.**

మనిషి డబ్బు ఇతరులకు (అప్పుగా, పెట్టుబడిగా) ఇచ్చి ఎలాంటి కష్ట నష్టాలకు లోనవకుండా, తన అసలు దబ్బుతో వాటిల్లే ఎలాంటి ప్రమాదా (Risk)న్ని స్వీకరించకుండా, ఏ శ్రమనూ తనపై వేసుకోకుండా పొందే అధిక లాభాన్ని వడ్డీ అనంటారు. నేటి బ్యాంకులు కూడా పరిశ్రమలకు, వ్యాపారాలకు సహాయాన్ని అందజేస్తాయి గనుక అవి ఇచ్చే లాభం వడ్డీక్రింద రాదని కొందరి వాదన. ఈ వాదన ధర్మవేత్తల సామాన్య ఆమోదాన్ని పొందలేదు. వడ్డీతో నిండిపోయిన నేటి ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో బ్యాంకు రుణాలు ఎంత వరకు తీసుకోవచ్చు, ఏ మేరకు తీసుకోరాదు అన్న విషయాల్లోనూ సమగ్రమయిన ఏకాభిప్రాయం షరీఅత్ వేత్తల మధ్య కుదరక పోవడానికి కూడా కారణం నేటి తికమక పెట్టే బ్యాంకింగ్ వ్యవస్థే. కేవలం పరిశ్రమలకు వ్యాపారాలకు మధ్యనే నడిచే బ్యాంకులైతే కొంతవరకు పై వాదనను అంగీకరించవచ్చని, బ్యాంకులు సేవింగ్స్‌తోపాటు ఎన్నో అనుత్పాదక (Non Productive) కార్యకలాపాలకు రుణాలు ఇవ్వడాన్ని తిరస్కరించలేవు గనుక, వాటిలో వచ్చే వడ్డీ డబ్బు కేవలం వాణిజ్య పరమయిన లాభం మాత్రమే అని చెప్పడానికి వీల్లేదు. అందువల్ల వేర్వేరు అవసరాలకు వేర్వేరు బ్యాంకులున్నట్లయితే ఈ బెడద కొంత వరకు తగ్గవచ్చు అన్న అభిప్రాయంకూడా కొందరు ఆర్థిక వేత్తలు వ్యక్తం చేస్తున్నారు. ఏది ఏమయినప్పటికీ నేటివరకు బ్యాంకులు ఇచ్చే వడ్డీ అయినా బ్యాంకులకు ఇచ్చే వడ్డీ అయినా నిషిద్ధమే అన్నది అంగీకృత ధర్మ నిర్ణయం. దానితోపాటు వడ్డీ లేని ఆర్థికవ్యవస్థ సంస్థాపనకై కృషి చెయ్యవలసిన బాధ్యత మానవ శ్రేయాన్ని కాంక్షించే వారందరిపైనా ఉంది.

(22-4-88)

—:o:—

# 17. చరిత్ర

యం. డి. మహమూద్ (చిన్న చింతకుంట)

**క్రీస్తుశకము అంటే ఏమిటి? ఇది ఎప్పటినుండి ప్రారంభించబడినది?**

* క్రీస్తు శకాన్ని ఇంగ్లీషులో AD అని, క్రీస్తు పూర్వంను BC అని వ్రాస్తారు. B. C. అంటే Before Christ అని అర్థం. A. D. అంటే Anno Domini లేక ప్రభువు సంవత్సరం అని అర్థం. దాని దొక పెద్ద గాథ. క్లుప్తంగా చెప్పాలంటే, దీన్ని వాస్తవంగా క్రీ.శ. 525 లో స్థాపించడం జరిగింది. దీని ఆవిష్కర్త ఇటలీకి చెందిన డయొనైలియస్ ఎక్సికూన్ అనే పాదిరి. రోము నగర స్థాపన జరిగిన సంవత్సరాన్ని భూమికగా తీసుకుని ఆ తరువాత 754 వ సంవత్సరం జనవరి ఒకటిన దీన్ని ప్రారంభించాడు. ఆయన లెక్కల ప్రకారం దానికి క్రిందటి సంవత్సరం అంటే 753 AUC లో (అంటే Ann Urbis Canditae – రోము నగరం స్థాపించబడిన సంవత్సరం అని అర్థం). డిశంబర్ 25న క్రీస్తు జన్మించారు. కాని తరువాత 8, 9వ శతాబ్దం (క్రీ. శ.)లో తేలిన చారిత్రక సత్యాల దృష్ట్యా ప్రవక్త ఏసుక్రీస్తు 750 AUC లో జన్మించినట్లు తేలింది. అందువల్ల క్రీ॥శ॥ ప్రకారం ఏసుక్రీస్తు జననం క్రీ. పూ. 4 వ సంవత్సరంలో జరిగిందన్న మాట!

ఈ క్రీస్తు శకాన్ని నేడు ప్రపంచమంతా అందరూ ఉపయోగిస్తున్నా దీన్ని పలుదేశాలు పలు కాలాల్లో ఆమోదించారు, స్వీకరించారు. 6 వ శతాబ్దంలో అది ఉనికిలోకి వచ్చినా యూరోపులో అది 11 వ శతాబ్దివరకు ఆమోదం పొందలేక పోయింది. 14 వ శతాబ్దిలోగాని స్పెయినులో అమల్లోకి రాలేదు. రష్యా 1918 లో దాన్ని స్వీకరిస్తే టర్కీ ఈరాన్ తప్ప ముస్లిం దేశాలన్నీ దాన్ని ఇంకా ఆమోదించలేదు. అక్కడ హిజ్రీ శకమే అమల్లో ఉంది.

(27-5-83)

—: ౦ :—

షేక్ జీలాని బాష (కువాయిత్)

**పాలస్తీనులకును మరియు ఇస్రాయెలులకును మధ్య జరుగుతున్న భయంకర మైన యుద్ధము యొక్క ముఖోద్దేశ్యమేమిటి ?**

* అరేబియాకు ఇంకా చమురు నిధులవల్ల ప్రాముఖ్యత లభించని రోజుల్లో, అరబ్బులు ఇంకా బీదరికంలో మగ్గుతూ ఎడారి మంటల్లో మాడుతున్న కాలంలో, రాజకీయంగా, ఆర్థికంగా యూరోపుదేశాలకు ఊడిగం చేస్తున్నదినాల్లో ఉస్మానియా Ottoman ఖిలాఫత్ వ్యవస్థ జీర్ణావస్థకు చేరుకున్న దశలో, తొలి ప్రపంచ సంగ్రామం ముగిసిన తరువాత అరబ్బులంతా చీలి ముక్కలు చెక్కలయి ఫ్రాన్సు, బ్రిటన్ సామ్రాజ్యాలకు తలఒగ్గినవేళ యూరపు రాజ్యాలు, ముఖ్యంగా బ్రిటన్ ప్రభుత్వం, ఎంతో చాకచక్యంతో పాలస్తీనా దేశంలో ఇస్రాయీల్ అనే యూదు రాజ్య స్థాపనకు పూనుకుంది. రెండో ప్రపంచ యుద్ధం తరువాత ఆ పథకం కాస్తా ఆచరణ రూపు ధరించింది. ఇస్రాయీల్ రాజ్యంలో, అనేక దేశాల్లో చెల్లాచెదురుగా ఉన్న యూదులను కూడబెట్టి తెచ్చి తిష్ఠ వేయించారు. అప్పుడు అక్కడ శతాబ్దాల తరబడి నివసిస్తూ వచ్చిన అరబ్బులు స్వదేశాన్ని వదిలి కాందిశీకులుగా, దేశ దిమ్మరులుగా బయలుదేరవలసి వచ్చింది. ఈ జులుంను, అన్యాయాన్ని నేడు శాంతి కాముకులమని చెప్పుకునే దేశాలు అనేకం కేవలం చూస్తూ సహించాయి. బలంలేని భారతదేశం లాంటివి నిరసనలు, ఖండనలు, ప్రకటనలు జారీ చేశాయి. అత్యాచారాన్ని, దౌర్జన్యాన్ని సహిస్తూ వస్తున్న పాలస్తీనా ప్రజలు నిరంతరం రకరకాలుగా పీడించబడుతూ వచ్చినా అన్యాయానికి ఎదురుతిరిగి ప్రతిఘటిస్తూ గట్టి పిండాలని పించుకుంటూ వస్తున్నారు. ఇప్పుడిప్పుడే కళ్ళు తెరుస్తున్న అరబ్బులు అపార ధన సంపదలు ఉంచుకునికూడా వివిధ సామ్రాజ్యవాద దేశాలకు కట్టుబానిసలయి ఉన్నందున, చేతులు ముడుచుకు కూచోవడం తప్ప మరేమీ చెయ్యలేక పోతు న్నారు. ఇదీ ముక్తసరిగా పాలస్తీనా సమస్యకు పూర్వరంగం. దక్షిణాన మదీనా నగరంతో సహా అరేబియా భూభాగాన్ని, ఉత్తరాన ఇరాక్‌ను కలుపుకుని విశాల ఇస్రాయీల్ సామ్రాజ్యాన్ని స్థాపించాలన్నది యూదుల అసలు పథకం వారు, ఆ పథకం పూర్తి కానంతవరకు విశ్రమించరాదని ప్రతినబూని ఆ ప్రకారమే ముందుకు సాగుతున్నారు. లెబనాన్‌లో సాగే మారణకాండ కూడా

ఆ పథకంలోని భాగమే. యూదులు వంచనా శిల్పంలో ఆరితేరినవారు. అమెరికా అధికార పీఠాన్ని అలంకరించేదెవరు? బ్రిటన్‌లో ఏ పార్టీ పైకి రావాలి? అరబ్బు దేశాల్లోను, దూర ప్రాచ్యదేశాలయిన ఇండోనేషియా, మలేషియాలోను ఏ వర్గం అధికారంలోకి రావాలి? అన్న నిర్ణయాన్ని జయోనిస్టు ఉద్యమం, దాని సహాయక ఉద్యమమైన, ఫ్రీమేసనరీ, దాని అనుబంధ సంస్థలు కలసి చేస్తాయంటే నమ్మ శక్యంకాదు. కాని యూదుల పనితీరు వారి వ్యవహారసరళిని గురించి కాస్తయినా తెలిసిన వాళ్ళు ఏమాత్రం ఆశ్చర్య పడరు. స్వయంగా మన దేశంలో, తొలి ప్రధాని పండిట్‌జీ మొదలుకుని మొన్న మూన్నాళ్ళ నిర్వాకం చేసిన మొరార్జీ చరణ్‌సింగ్‌ల వరకు అందరినీ మన దేశం నిత్యం ఖండిస్తూ వచ్చిన రాజ్యం, ఇస్రాయీల్ అధినేతలు రహస్యంగా కలసి సంప్రదింపులు జరిపినవైనం పత్రికల కెక్కలేదా? అందువల్ల ఏ పుట్టలో ఏ పాముందో? మరి ఉంటే అది ఇస్రాయీల్ పామే అన్నమాట !

(11-5-84)

—: ० :—

మణి (కర్నూలు)

**ఒకనాడు భారత దేశాన్ని అయిదు వందల ఏళ్ళు పరిపాలించిన మొగలులు, ఈనాడు అరేబియాలో ముప్పైయికి పైగా చిన్న చిన్న దేశాలను ఏలుతున్నవారు అందరూ ముస్లింలే. మరి వీరిలో ఏ ఒక్కరూ ఇస్లామీయ పరిపాలనను నెలకొల్పలేకపోయారు. ముస్లింలకే చేదైన ఇస్లామీయ వ్యవస్థను-ఇతరులెలా స్వీకరిస్తారు ?**

* ఒకనాటి - (అంటే దాదాపు 800 ఏళ్ళ క్రితం) రాజ భోగాలకు అలువడిన వారు చేరవలసిన పతనావస్థకే చేరిన - ముస్లిం నాయకత్వం చివరికి బానిస రాజ్యాల్లోకి విభజించబడింది. రాజకీయ బానిసత్వం, చివరికి భావదాస్యం, మనోకాంక్షల దాస్యంలా పరిణమించింది. ఆ తరువాత ఇస్లామీయ వ్యవస్థను పునరుద్ధరించడం మాట తలెత్తే ప్రశ్నే లేదు. నాటి మొగలులయినా నేటి అరబ్బులయినా అంతా ఒక్కటే. గత యాభయి, అరువయ్యేళ్ళుగా ముస్లిం జగత్తులో నవ చైతన్యం కానవస్తోంది. అనేక ముస్లిం దేశాల్లో ఇస్లామీయ జీవన వ్యవస్థను

సమస్తరంగాల్లో పునరుద్ధరించాలని పాలకులు, పాలితులు భావిస్తున్నారు. ముస్లిముల్లో రాజకీయ ఐక్యతను, భావ సమైక్యతను, నెలకొల్పడానికి అనేక విధాలుగా కృషి జరుగుతోంది. ముస్లిములకే చేదయినది ముస్లిమేతరులకు ఎందుకు రుచించదు? 'మంచి' అన్నదాన్ని ఫలానావాడు అనుసరించనిదే నేను అనుసరించనని చెప్పే మనస్తత్వం ఓ విధంగా పలాయనతత్వం అని చెప్పవచ్చు. తాను ఓ విషయాన్ని మంచిదని భావించిన వ్యక్తి దాన్ని ఎన్నుకుంటాడు, అదే సమాజంలో చెలామణి అయ్యే నాణెంగా మారాలని తన శక్తినంతా ధారపోసి పరిశ్రమిస్తాడు. అందువల్ల ఇస్లామీయ వ్యవస్థ సమగ్రంగా స్థాపించడం జరగాలంటే, నా వ్యక్తిగత అభిప్రాయంలో, ఎవరయినా ఏ ప్రాంతం వారయినా ఒక్కటే. ముస్లిములు ముస్లిమేతరులు అన్న వాదనలో పడడం నాకు ,పడదు

(25-5-84)

—: ० :—

మీరా మొహియుద్దీన్ (భీమవరం)

**తాజ్‌మహల్ హిందువులు నిర్మించిన కట్టడమయినా షాజహాన్ కట్టడముగా చరిత్రకెక్కినదని "ఆంధ్ర సచిత్రవారపత్రిక"లో గుమ్మనూరు రమేష్ బాబు అనే వ్యక్తి వ్రాసినారు.**

* తాజ్‌మహల్‌ను ఎవరు నిర్మించినా ఇప్పుడు పోయిందేమీ లేదు. కొందరు సంకుచిత మనస్కులు, మిడిమిడి జ్ఞానంతో, వినికిడితో అబ్బిన తెలివి తేటలతో ఇలాంటి 'అపూర్వమయిన' 'అద్వితీయమయిన' పరిశోధనల సారాంశం తమ పాఠకులకు తెలుపుతుంటారు. వ్రాసేవారు ఉండగా, ప్రచురించే వారుండగా చదివే వారేం కొదవని? తాజ్‌మహల్‌నే కాదు ఢిల్లీలోని ఎర్రకోటని, ఆగ్రాలోని కోటని కూడా కొందరు మేధావులనబడే వారు కళ్ళు మూసుకుని మొగల్ రాజులెవరూ నిర్మించలేదని, వాటిని నిర్మించినవారు హైందవ రాజులే అని వ్రాస్తున్నారు. ఎవరో ముస్లిం విద్వేషంతో వ్రాసినా దానికి ఓ అర్థముంది. కాని ఆ ప్రాపగండాకు 'మంచి' వారు సయితం ప్రభావితులవుతున్నారు. వాస్తు కళలోని సాంకేతిక, శాస్త్రీయ పరిజ్ఞానం అలా ఉంచి కనీసం కొంత కళాభిరుచి, కాస్త రసాస్వాదనకు తగిన స్వల్ప జ్ఞానం ఉన్నవారయినా ఎర్రకోటను తాజ్‌మహల్‌ను

లేక మరే మొగల్ కట్టడాన్నయినా చూచి ఇట్టే చెప్పగలరు - ఈ నిర్మాణపంథా "ఈగడ్డ"కు చెందిందికాదని. హైందవ రాజులు, మహారాజులు కట్టిన కోటలు కూడా మన దేశంలో ఇంకా ఉన్నాయి. కోట గోడల నిర్మాణం మొదలుకుని గోపురాలు, గుంబదులు అన్నింటినీ స్థూలంగా పరిశీలించినా బోధపడుతుంది - ఇవి భారతీయ వాస్తు సంప్రదాయానికి పూర్తిగా భిన్నమయిందని. తాజ్‌మహల్ లాంటిది మరో "తేజో మహాలయాన్ని" యావద్భారతదేశంలో ఒక్కటయినా చూచి పుణ్యం కట్టుకున్న వారెవరయినా ఉన్నారా? ఆ నిటారుగా నిలిచే కోట గోడలకూ, భారత సంప్రదాయంలోని ఒరిగేలా కన్పించే (slant) కోట గోడలకు ఏమయినా సంబంధం ఉందా? ఆ ద్వారాల నిర్మాణానికి పోలినది భారత పురాతన లేక ఆధునిక కట్టడాల్లో ఎక్కడయినా ఉందా? కేవలం "తాజ్"ను కట్టిన స్థలం ఒక హిందూ జమీందారుది కావడం, దాన్ని షాజహాన్ కొనడం ఆధారంగా తీసుకుని (చక్రవర్తిగా షాజహాన్ దాన్ని స్వాధీనం చేసుకున్నా ఆనాటి రాచరిక న్యాయంలో తప్పుగా భావించబడేది కాదేమో!) కథ అల్లడం, ఢిల్లీలో రాజపుత్రులు కట్టిన కోట Red Fort కాదు, పురానా కిలా (Old Fort) రూపంలో ఉందని, దానికీ ఎర్రకోటకు ఎలాంటి సామ్యం లేదని కూడా తెలియనివారు పరిశోధకులుగా అలరారడం చాలా సిగ్గుచేటు. ఇంతకు ఒకటి మాత్రం నిజం, తాజ్‌మహల్‌ని నిర్మించడానికి రోజూ పనిచేసిన 20 వేల మంది కూలీలెవరని అడిగే నాథుడే లేడని శ్రీశ్రీ వాపోయినట్లు, ముందే నిర్మించిన ఆ మహాలయాన్ని కేవలం మెరుగులు దిద్దడానికి 22 ఏళ్ళు ఎందుకు పట్టిందని, ఆ కాలంలో (1631-1653) నాలుగుకోట్ల రూపాయలు ఎందుకు ఖర్చయ్యాయని అడిగే నాథుడు కూడా కానరావటం లేదు.

(15-6-84)

— :o: —

హెచ్.యమ్. బాషా (ఉరవకొండ)

**జెరూసలం చరిత్ర పూర్వాపరాలను వివరించేది**

* నేడు జెరూసలేమ్ అనబడుతున్న చోట దాదాపు క్రీ.పూ. 1800లో కూడా జనవాసం ఉన్నట్టు పురావస్తు త్రవ్వకాల్లో ఆధారాలు దొరికినట్టుచెబుతారు. క్రీ.పూ. 1000లో హజ్రత్ దావూద్ (David) (అస్సలాం) ఇస్లామీయ రాజ్య

స్థాపన చేశారు. ఆ తరువాత రాజయిన హజ్రత్ సులైమాన్ (Solomon) అక్కడ ఏకేశ్వరోపాసనకుగాను ఓ ఆరాధనాలయాన్ని నిర్మించారు. (అప్పటికి మక్కా నగరంలో హజ్రత్ ఇబ్రాహీమ్ (అస్సలాం) చేతుల మీదుగా తొలి దైవ గృహం నిర్మాణం జరిగి దాదాపు 1300ఏండ్లు గడిచాయన్న యదార్థాన్ని స్మరించుకోవాలి) హజ్రత్ సులైమాన్ (అస్సలాం) తర్వాత ఎన్నో ఎత్తుపల్లాలకు గురయి ఆ నగరం క్రీ.పూ. 6వ శతాబ్ది ప్రారంభంలో పూర్తిగా నాశనమయింది. ఆ ఆరాధనాలయం పునర్నిర్మాణం, నగరగోడల పునర్నిర్మాణం జరిగింది. అలెగ్జాండర్ ది గ్రేట్ దిగ్విజయాల తరువాత పాశ్చాత్యుల చేతుల్లో ఆ నగరం నలుగుతూ వచ్చింది. క్రీ.పూ. 167లో గ్రీకుల చేతుల్లోనూ, క్రీ.పూ. 70లో రోమనుల చేతుల్లోనూ నగరం నేలమట్టమయింది. ఆ తరువాత తిరిగి క్రీ.శ. 324లో ఆ నగరం, దానితోపాటు ఆలయాన్ని క్రైస్తవ రోమన్ చక్రవర్తి కాన్స్టంటయిన్ నిర్మించాడు. క్రీ.శ. 638లో ప్రప్రథమంగా హజ్రత్ ఉమర్ (రజిఅన్) రెండవ ఖలీఫాగా జెరుసలేమ్‌లో ప్రవేశించారు. అబ్దుల్ మాలిక్ బిన్ మర్వాన్ (10వ ఖలీఫా క్రీ.శ. 688-691) డోమ్ ఆఫ్ ది రాక్ (కుబ్బతస్సఖరా) నిర్మించారు. ఆ తరువాత క్రీ.శ. 1099 నుండి 1187 వరకు అది పాశ్చాత్య క్రైస్తవ పాలకుల స్వాధీనములో ఉండింది. తిరిగి సలాహుద్దీన్ అయ్యూబి దాన్ని ముస్లిమ్ రాజ్య హస్తగతం చేశాడు. చివరికి ముస్లిమ్ రాజ్యాధినేతలయిన టర్కీ సుల్తానులు బలహీనపడసాగారు. 1838లో నగరంలో బ్రిటిష్ కాన్సలేట్ నెలకొల్పడం జరిగింది. ఇది ఆంగ్లేయుల కుటిల రాజకీయ నీతికి అంకురార్పణ అన్నమాట. 1917లో బ్రిటిష్ సైన్యాలు జెరూసలేమ్‌లో ప్రవేశించాయి. టర్కీ ప్రభుత్వాన్ని అంతంచేసి అప్పటి నానాజాతి సమితి తీర్పు ప్రకారం బ్రిటిష్ పాలన ప్రారంభమయింది. ఆ పరిపాలన 1948వరకు కొనసాగింది. అరబ్బులు, జియోనిస్టుల మధ్య కొనసాగిన ఘర్షణ కారణంగా నగరాన్ని విభజించటం జరిగింది. అయితే జూన్ 1967లో జరిగిన ఆరు రోజుల యుద్ధంలో ఇస్రాయీల్ సేనలు జెరుసలేం పాత నగరాన్ని కైవసం చేసుకున్నాయి. ముస్లిమ్, క్రైస్తవ, యూదు మతాల వారికి పుణ్యప్రదమైన ఆ మహా నగరాన్ని ఇస్రాయీల్ రాజధానిగా మార్చే పథకంపై ఇస్రాయీల్ ఓ వ్యూహరచనచేసి క్రమంగా అమలు జరుపుతోంది. రెండురోజుల క్రితమే పాలస్తీనా విమోచనోద్యమ నాయకుడు యాసిర్ అరఫాత్ "వచ్చే ఏడాది ముస్లిములు జెరుసలేమ్‌లో ఇన్షా అల్లాహ్ ఈద్ నమాజ్ చేస్తారు" అని ప్రకటించాడు. జరిగేదేమిటో, ముస్లిం రాజ్యాల అనైక్యత ఏ విధంగా పరిణమిస్తుందో వేచి చూడవలసిందే.

(6-7-84)

—: o :—

షేక్ కరీముల్లా (వినుకొండ)

**ఉస్మానియా ఖిలాఫత్ ఉద్యమ మనగా నేమి? అది ఏ విధంగా విఫల మయింది?**

* మీరు ఓ చిన్న ప్రశ్నలో 400 ఏళ్ళ చరిత్ర అడిగారు. ఎన్నో చేదు నిజాలతో నిండిన విషాద గాథ అది. క్లుప్తంగా చెప్పాలంటే, ఇస్లామీయ రాజ్యాధిపతి ఖలీఫా అని పిలవబడతాడు. హజ్రత్ అలీ (రజిఅన్) తరువాత ఇస్లామీయ ఖిలాఫత్ రాచరికంగా రూపొందినా రాజకీయ వ్యవస్థను ఖిలాఫత్‌గానే పరిగణిస్తూ వచ్చారు. అబ్బాసీ ఖలీఫాలు ఇస్లామీయ రాజ్యాన్ని పాలించే చివరి రోజుల్లో ముస్త'సిమ్ బిల్లాహ్ ఖలీఫాగా ఉన్నప్పుడు (క్రీ॥శ॥ 258) అప్పటికే ఛిన్నా భిన్న మయిన ఖిలాఫత్ వ్యవస్థ పూర్తిగా ధ్వంసమయిపోయింది. ప్రాంతీయ రాజ్యాలు ఏర్పడ్డాయి. చివరికి క్రీ.శ. 1517 లో నేటి టర్కీ (తుర్కీ) రాజులు (సుల్తానులు) ఈజిప్టుని కైవసం చేసుకున్న తరువాత తమను తాము సుల్తానులుగాను ఖలీఫాలు గానూ ప్రకటించుకున్నారు. వారే ఉస్మానియా ఖిలాఫత్ సంస్థాపకులు. ఆ ఖిలాఫత్ కూడా కాలానుగుణంగా మొదటి ప్రపంచ యుద్ధ కాలం వరకు (1914-1919) ముక్కలు చెక్కలయింది. మిగిలిఉన్న ఉస్మానియా ఖిలాఫత్‌ను ఫ్రాన్స్, రష్యా, బ్రిటన్‌ల కూటమి యుద్ధంలోకి ఈడ్చి దాని అంతాన్ని చూసింది. ఈ యుద్ధంలో ప్రాముఖ్యతను సంతరించుకున్న ఓ వ్యక్తి ముస్తఫా కమాల్ "అతాతుర్క్" ఆ తరువాత పరిస్థితుల ప్రాబల్యం అతన్ని ఉస్మానియా ఖిలాఫత్‌కు అధినేతగా చేసింది. యూరపు "ప్రగతి వికాసాల"కు దిగ్భ్రాంతి చెంది కళ్ళు చెదిరిన "అతాతుర్క్", ఆ ప్రగతి వికాసాల వెనక దాగిఉన్న యూరపు నిరంతర కృషి, పరిశోధన, పరిశ్రమల్ని కానలేక వారి జాతీయతత్వపు సిద్ధాంతాలకు, సంస్కృతికి దాసుడయ్యాడు. ప్రప్రథమంగా ధార్మిక రాజకీయ బంధనాల నుండి "తన దేశాన్ని" విముక్తం చేసి ఖిలాఫత్‌ను అంతమొందించినట్లు ప్రకటించాడు (1924). ఆ తరువాత క్రమంగా ధర్మాన్ని రాజ్యాధికారం నుండి పారద్రోలి సెక్యులరిజమ్‌ను రాజ్యాసనంపై కూర్చోబెట్టాడు(1928). ఈ విధంగా ఖిలాఫత్ వ్యవస్థ పూర్తిగా అంతమైపోయింది. తొలి ప్రపంచ యుద్ధంలో బాగా దెబ్బతిన్న ఉస్మానియా ఖిలాఫత్ "Treaty of sevres" అనే ఒప్పందం (1920) ద్వారా అరేబియన్ రాష్ట్రాలను, ఆసియా మైనర్‌లోని అధిక భాగాలను

కోల్పోయింది. ఈ విధంగా ఉస్మానియా ఖిలాఫత్ పడిపోవడాన్ని పసిగట్టారు భారతీయ ముస్లిములు. "అలీ సోదరులు" (మహమ్మద్ అలీ, షౌకత్ అలీ) ఆధ్వర్యాన ముస్లిముల ఐక్యతకు ప్రతీక అయిన ఖిలాఫత్‌ను నిలబెట్టడానికి వీరు కృషిచేశారు. అలా ప్రారంభించిన ఉద్యమాన్ని ఖిలాఫత్ ఉద్యమం అని అంటారు. భారతీయ ముస్లిములు ఇక్కడ భారతదేశంలో స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొంటూ బ్రిటిష్ ప్రభుత్వంపై ఒత్తిడితెస్తూ అటు అరబ్బు దేశాల్లోనూ టర్కీలోనూ ఇతర ముస్లిం రాజ్యాల్లోనూ పర్యటించి ముస్లిముల ఐక్యతకై అసాధారణ కృషి సలిపారు. అయితే ముస్తఫా కమాల్ అతాతుర్క్ ఖిలాఫత్‌ను అంత మొందించిన తరువాత ఆ ఉద్యమం కూడా చల్లారిపోయింది.

(2-11-84)

—: o :—

కె. ఫజ్‌లే హఖ్ (నంద్యాల) ఎం. యు. రామన్ (ఇల్లందు)

**జనాబ్ ఖాన్ అబ్దుల్ గఫ్ఫార్‌ఖాన్ గారిని 'సరిహద్దు గాంధి' అని ఎందుకు చెబుతారు ?**

* బ్రిటిష్ పరిపాలనా కాలం నాటి ఇండియాకు వాయవ్య దిశన ఉండే సరిహద్దు రాష్ట్రమయిన బలూచిస్తాన ఎంతో వెనక బడ్డది. ప్రజలు అవిద్య అజ్ఞానాల్లో కొట్టుమిట్టాడు తుండేవారు. వారు బ్రిటిష్ ప్రభువుల చేతనే కాక వారి అడుగులకు మడుగులొత్తే అక్కడి తెగ నాయకుల ద్వారా కూడా బాగా దోపిడికి గురయ్యేవారు. వారిని, ఆ దశనుండి పైకి లేవనెత్తాలని సమాయత్తమయిన నాయకుడు ఖాన్ అబ్దుల్ గఫ్ఫార్ ఖాన్. 1919 లో బ్రిటిష్ ప్రభుత్వం Rowlatt Acts అనే చట్టాన్ని ప్రవేశ పెట్టింది. దానిద్వారా ప్రభుత్వం, రాజకీయ ప్రత్యర్థుల్ని ఎలాంటి విచారణ లేకుండా నిర్బంధించే అధికారాలను సంతరించుకుంది. దాన్ని వ్యతిరేకిస్తూ ఆయన రాజకీయాల్లోకి దిగాడు. అప్పుడే ఉనికిలోకి వచ్చిన ఖిలాఫత్ ఉద్యమంలోకి 1920 లో చేరాడు. 1921 లో జిల్లా ఖిలాఫత్ కమిటీకి ప్రెసిడెంట్‌గా కూడా ఎన్నికయ్యాడు. అప్పట్నుంచి ముస్లింల ఐక్యత, పవిత్రతలకై అనేక విధాలుగా కృషిచేస్తూ వచ్చాడు. 1929 లో కాంగ్రెస్ మహాసభల్లో పండిత నెహ్రూ, గాంధీ ప్రభృతుల్ని కలుసుకుని ప్రభావితుడయి

"ఖుదాయి ఖిద్‌మత్‌గార్" (దైవిక సేవకులు) అన్న సంస్థను స్థాపించాడు. దాని ద్వారా పష్తూన్ల (పఠాన్ల) లో రాజకీయ చైతన్యం కలుగజేసేందుకు కృషిచేశాడు. దేశ విభజనను ఖండించిన అనేక ముస్లిం నాయకుల్లానే ఖాన్ అబ్దుల్ గఫ్ఫార్ ఖాన్‌కూడా పాకిస్తాన్‌లో నివసించడానికే ఇష్టపడ్డాడు. ఆయన నిరాడంబర జీవన విధానాన్ని, సాదా సీదా వ్యవహార సరళిని, నిర్మొహమాటంగా ధైర్యంగా చేసే అభిప్రాయ ప్రకటనా విధానాన్ని చూచి కాంగ్రెస్‌నాయకులు ప్రభావితులయ్యారు. సరిహద్దు ప్రాంతాలకు చెందిన ఆయన్ని 'సర్ హద్ గాంధి' అని పిలువసాగారు.

(7-3-86)

—: o :—

అవధాని (హైదరాబాద్)

**ముస్లిం పాలకులు దేశంలో సిరిసంపదలు, వజ్రవైఢూర్యాలు దోచుకుపోవడానికి అడుగుపెట్టకపోతే ఇక్కడి రాజులతో తరచూ యుద్ధాలు ఎందుకు చేయవలసి వచ్చింది? దేవాలయాల్ని ఎందుకు కొల్లగొట్టవలసి వచ్చింది?**

* మీ ప్రశ్నతో ఎన్నో విషయాలు ముడివడి ఉన్నాయి. ముస్లింరాజులు తమ సమకాలీన సంప్రదాయాలకు భిన్నంగా నడుచుకున్నట్లు ఏ దాఖలాలూ లేవు. అలెగ్జాండరు, సీజరు అశోకచక్రవర్తి మొదలయిన వారిలాగానే ఆనాడు పాలకులకు రాజ్య విస్తీరణా కాంక్ష మెండుగా ఉండేది. అందుకుగాను సైన్యాలకు శిక్షణనిచ్చి గొప్పగొప్ప దండయాత్రలు జరపడం తమ సామ్రాజ్యపు ఎల్లల్ని తూర్పు పడమరలుగా, ఉత్తర దక్షిణాలుగా విస్తరింపజేసుకోవడం, తాము ప్రపంచ విజేతలుగా ఎదురులేని మహారాజులుగా భాసిల్లాలని కోరుకోవడం రాజలక్షణంగా, అధికార చిహ్నంగా పరిగణించబడేది. ఆ ఉరవడిలోనే కొట్టుకుపోయ్యారు ముస్లిం 'రాజులు'కూడా! నిజానికి వారు రాజులుగా చెలామణి అవడమే ఇస్లాం బోధనలకు భిన్నమైంది. ఖలీఫాగా వ్యవహరించవలసింది. రాజ్యవిస్తీరణకు బదులు ధర్మప్రబోధన వారి లక్ష్యం కావల్సింది. కాని దురదృష్టవశాత్తూ అలా జరగలేదు. ఈ విధంగా మార్గం తప్పగానే దొరికిన బాటను వారు త్రొక్కారు. రాజ్య విస్తీరణా కాంక్షలో దేశాలు జయించారు. జయించినచోట్లా రాజ్యాలు స్థాపించి అక్కడే స్థిరపడ్డారు. రెండో విషయం ఏమిటంటే, భారత

దేశానికి వచ్చినవారు దోచుకు పొయ్యారనడం, అనుకోవడం చరిత్ర తెలియని వారయితే ఫరవాలేదు కాని మీలాంటి వారుకూడా అలా భావించడం భావ్యం కాదు. వారు ఇక్కడ రాజ్యమేలారు. ఇక్కడి ప్రజలతో కలసిమెలిసి జీవించారు. ఇక్కడ విద్యా విజ్ఞానాల వృద్ధి వికాసాలకు కృషి చేశారు, ఇక్కడి సంస్కృతీ సభ్యతలను కళావైభవాలను సుసంపన్నం చేశారు. మరెన్నో విధాలుగా ప్రజలకు సేవలు చేశారు. వీటన్నింటికీ నేటికీ కానవస్తున్న ప్రత్యక్ష సాక్ష్యాలు ఎన్నో ఉన్నాయి. ఎవరయినా దుర్బుద్ధితో చరిత్రనే కాదంటే వాస్తవాలనే త్రోసిరాజంటే, దానికి ఎవరేమని సమాధానమివ్వగలరు?

(7-3-86)

—: o :—

షేక్ అబ్దుల్ మజీద్ (నంద్యాల)

**పాకిస్తాన్‌లో అయ్యూబ్‌ఖాన్ హయాంలో మౌలానా మౌదూదిగార్కి ఉరిశిక్షవేసినారుఅని దాని తరువాత ఆయన (మౌదూది) క్షమాపణ కోరుకుంటే క్షమించి నారని విన్నాను. అసలు మౌలానాగార్కి మరణశిక్ష ఏ నేరం మీద విధించినారు - తెలుపగలరు.**

* మీరు విన్నది ఒక్కటీ సరయినదికాదు. ఉరిశిక్ష విధించింది అయ్యూబ్ ఖాన్ కాలంలో కాదు. మౌలానా క్షమాపణ కోరనూలేదు. ఆయన్ని విడుదల చేసింది దాని ఆధారంగానూకాదు. 1953లో పాకిస్తాన్‌లో ఇస్లాంలో ఏమాత్రంలేని కాదియానీలు తాము ముస్లిములమనడం దరిమిలా పరిపాలనారంగంలో వారి ప్రాబల్యం పెరగడం మూలాన ఆ దేశం మొత్తాన పెద్ద ఎత్తున కల్లోలాలు చెలరేగాయి. అప్పుడు కాదియానీల అసలు రూపం బయట పెడుతూ మౌలానా ఒక పుస్తకం వ్రాశారు. దాన్ని ప్రజలు లక్షలాది సంఖ్యలో ప్రచురించి పంచారు. పరిపాలనా రంగంలో ఆధిక్యత ఉన్న కాదియానీలు దేశద్రోహం నేరం మోపి కేసు బనాయించి ఉరిశిక్ష విధించేలా చేశారు. ప్రభుత్వం చెప్పుచేతల్లో ఉన్న మిలటరీ న్యాయస్థానం ఏం చేస్తుంది? ఆయన క్షమాభిక్షకై అర్థిస్తారని తలంచారు పాలకులు. ఆ సందర్భంలో క్షమాభిక్ష కోరాలని సూచించిన ఓ శ్రేయోభిలాషితో ఆయన అన్నమాటలు చారిత్రకమయినవి. "దైవం నన్ను చంపదలిస్తే ఎవరెన్ని

చేసినా అది ఆగదు. దైవమే నన్ను రక్షించదలిస్తే వీళ్ళు (పాలకులు) తల క్రిందులుగా వ్రేలాడినా నన్ను ఏమీ చెయ్యలేరు...న్యాయమంటేఏమిటో ఎరుగని దుర్మార్గులవద్ద న్యాయభిక్షకై అర్థించాలా?...ఏమని అర్థించమంటారు. షహాదత్ (అమరగతి) నన్ను వరించి వస్తుంటే, వద్దు వద్దు, నాకు షహాదత్ వద్దు అని అర్థించమంటారా?" అని చిరునవ్వు నవ్వారు మౌలానా. పాలకులపై దేశంలోనూ, విదేశాల నుండి కూడా వచ్చిన వత్తిడి మూలంగా, మౌలానా అన్నట్లే, ఒక్క చిన్న గాయం కూడా లేకుండా మౌలానా భద్రంగా విడుదలయ్యారు. 1953లో మిలటరీపాలన గులామ్ ముహమ్మద్ నాయకత్వాన సాగుతూ ఉండేదన్నది వేరుగా చెప్పనవసరం లేదనుకుంటా.

(20-2-87)

—: o :—

సయ్యద్ రఫీయుద్దీన్ (పెద్దపల్లి)

**కెంప్ డేవిడ్ ఒప్పందం గురించి వివరముగా తెల్పగలరా ?**

* 1970 సెప్టెంబర్ 28 న ఈజిప్ట్ అధ్యక్షుడు కర్నల్ నాసర్ మరణించిన తరువాత ఉపాధ్యక్షుడు అన్వర్ అస్సాదాత్ గద్దెనెక్కాడు. 1973 అక్టోబర్‌లో సాదాత్ ఇస్రాయీల్ ఆక్రమిత ప్రాంతాలపై మెరుపుదాడి జరిపి ప్రపంచ దేశాల ముందు తలెత్తుకునేలా నిలదొక్కుకున్నాడు. ఆ తరువాత గౌరవ ప్రదంగా ఇస్రాయీల్‌తో రెండు యుద్ధ విరమణ ఒప్పందాలు (1974-1975) చేసుకున్నాడు. అప్పుడే అమెరికా అధ్యక్షుడు జిమ్మికార్టర్ సలహా మేరకు మేరీ లాండ్ (అమెరికా)లోని క్యాంప్ డేవిడ్ అనే చోట సెప్టెంబర్ 1978 లో ఓ ఒప్పందం కుదుర్చుకున్నాడు. దాని ఫలితంగా ఇస్రాయీల్ - ఈజిప్టుల మధ్య 1979 మార్చి 26 న శాంతి ఒప్పందం జరిగింది. అందులో, ముఖ్యాంశాలు ఇవి: "సినాయి ప్రాంతం నుండి 3 సంవత్సరాల్లోపుగా ఇస్రాయీల్ సైన్యాల, పౌరుల ఉపసంహరణ, సినాయి-ఇస్రాయీల్ సరిహద్దులో ఐ.రా.స. అజమాయిషీ క్రింద బఫర్ జోన్ స్థాపన, దౌత్య సంబంధాల స్థాపన. వాణిజ్య, సాంస్కృతిక సంబంధాల స్థాపన. ఇస్రాయీల్ ఆక్రమిత ప్రాంతాలను గురించి, పాలస్తీనా స్వాతంత్ర్యం గురించి సంప్రతింపుల ద్వారా పరిష్కారాలను కనుగొనడం".

అయితే ఈ ఒప్పందం చేసి సాదాత్ మొత్తం ముస్లిం ప్రపంచానికి దూర మయ్యాడు. సొంత దేశంలోనూ అతనికి ప్రత్యర్థులు పెరిగారు. వ్యతిరేకత అధికమయింది. చివరికి అతను తన ప్రాణాలనే కోల్పోవలసివచ్చింది.

(15-3-87)

—: ○ :—

**డి. సంతోష్ (బెల్లంపల్లి)**

**దైవభీతిగల నాటి కొందరు ముస్లిం చక్రవర్తుల చరిత్రలను వక్రీకరించి వ్రాసిన ఆంగ్లేయులకు ఒరిగిన లాభమేమి?**

* ఆంగ్లేయులు భారతదేశాన్ని పరిపాలించడానికి వచ్చారు. వారు వచ్చే నాటికి పాలకులు ముస్లిం రాజులు. తమ పాలన బలపడాలంటే మాజీ పరిపాలకుల్లో లెక్కలేనన్ని తప్పులు ఎత్తిచూపవలసిన అవసరం ఎంతయినా ఉంది. తమకు ముస్లిముల అండదండలెలాగూ లేవు. కనీసం ఇక్కడి అధిక సంఖ్యాక వర్గం అభిమానాన్ని చూరగొనకపోతే తమ ఆట సాగదు. హిందువుల్లోనయినా పరదేశీయుల పట్ల మోజు మొలకెత్తడం అంత సులువు కాదు. మరేం చెయ్యాలి. విలోమ పద్ధతిని అవలంబించాలి. ముస్లిం రాజుల పరిపాలనలో పురుగులు వెదికి పట్టాలి. ముఖ్యంగా ఎవరయితే తమ వ్యక్తిగత సచ్చరిత మూలంగా పరిపాలనా దక్షత కారణంగా ప్రజాబాహుళ్యం హృదయాల్లో చోటుచేసుకున్నారో వారిని వారి చరిత్రను రూపుమాపడానికి కృషి చెయ్యాలి. అప్పుడు "ఆ అధ్వాన్నపు పాలకులకంటే ఈ పరదేశీ దురాక్రమణదారులే మేలు" అన్న 'సదభిప్రాయం' అధిక సంఖ్యాక వర్గంలో అంకురార్పణ చేసుకుంటుంది. ఇదీ ఆంగ్లేయుల పథకం. ఈ పథకం చాలామటుకు విజయవంతమయిందనే చెప్పాలి. దాని విష వాయువులు నేటికీ మన వాతావరణాన్ని కలుషితం చేస్తూనే ఉంటాయి. నిజం తెలుసుకున్న సోదరులు మేల్కొనేవరకు సమయం మించిపోయింది.

(15-5-87)

—: ○ :—

మహమ్మద్ నజీర్ అహ్మద్ (హిల్ కాలనీ)

**అప్పటి నిజాం నవాబు అబుల్ హసన్ తానాషాకు శ్రీరామచంద్రులవారు రామదాసు (కంచెర్ల గోపన్న, తహసీల్దార్, నిజాం సంస్థానం) కట్టవలసిన 6 లక్షల వరహాలు కట్టాడట? నిజమా? అబుల్ హసన్ తానాషా భద్రాచలం హిందూ ఆలయాల కోసం చాలా డబ్బును దానం చేశాడట, వాటి నిర్వహణ కొరకేగాక, శ్రీరామ నవమి పండుగకు ప్రతియేటా తలంబ్రాల తంతు కోసం ఎన్నో ముత్యాలు సంస్థానం తరఫున పంపబడేవట? ఈ కారణంగానే ఔరంగజేబు చక్రవర్తి అబుల్ హసన్ తానాషా అంతానికి దండెత్తాడనేది కూడా నిజమా?**

* తానాషా నిజాం నవాబు కాదు, అది నిజాం సంస్థానమూ కాదు. వాళ్ళను కుతుబ్ షాహీ రాజులంటారు, గోల్కొండ నవాబులనీ అంటారు. శ్రీరామచంద్రుడు కలలో కనిపించి ఇచ్చాడట డబ్బు. అది 'నిజామా' అని మూడున్నర దశాబ్దాల తరువాత అడుగుతారని తెలిస్తే ఆ 'కల'ను ఫిల్ముగా తీసి భద్రపరిచే వాడేమో ఆ నవాబు, (ఆ కాలంలో ఫిల్ములేదని తిరిగి ప్రశ్నించకండి దయచేసి). తానాషా భద్రాచలం దేవాలయం కోసం అనేక జాగీర్లు మంజూరు చేసిన విషయం, వార్షిక పారితోషికాలు పంపడం కూడా చారిత్రక సత్యాలు. ఈ ఒక్క దేవాలయానికే కాదు ఇంకా అనేక దేవాలయాలను తమ రాజ్యంలో పోషణ జరిపారు గోల్కొండ ప్రభువులు, నిజాం నవాబులు. అయినా వారి ప్రస్తావన నేడు కొందరికి కంటక ప్రాయమవుతుంది! ఔరంగజేబు ఈ కారణంగానే దండెత్తాడనడం సబబు కాదు. సామంతరాజుగా ఢిల్లీ ప్రభువులకు కట్టుకోవలసిన కప్పం అసలు ఎగ్గొట్టడం మొదలెట్టాడు తానాషా. ఆసక్తికరమయిన విషయం ఏమిటంటే ఔరంగజేబు ధర్మపరాయణుడు కాబట్టి ఖజానాను పునాదుల్లో పాతిపెట్టి ఓ మస్జిద్‌ని కట్టించాడట తానాషా. ఔరంగజేబు తన వేగుల వాళ్ళ ద్వారా ఈ విషయాన్ని గురించి తెలుసుకుని తన దండయాత్ర సమయంలో ఆ మస్జిద్ పడగొట్టి పునాదులు త్రవ్వించాడట - ఇస్లాం దురభిమానిగా, హిందూ విద్వేషిగా, హైందవ దేవాలయాలను పడగొట్టిన వానిగా ప్రసిద్ధిచెందిన ఔరంగజేబు! రాచరిక వ్యవస్థలో తమ సింహాసనాన్ని దక్కించుకునేందుకు చక్రవర్తులు తీసుకున్న రాజకీయ నిర్ణయాలకు, రాజకీయ చర్యలకు వారి మతానికి ముడి

పెట్టడం, మత పరమయిన దురుద్దేశాలు అంటగట్టడం ఏ మాత్రం తగదన్న సత్యం తెలిసి ఉన్నా కొందరు రకరకాలుగా చేసే దుష్ప్రచారాలను ఖాతరు చెయ్యకూడదు. చదువుకున్నవారు వాటిని త్రిప్పి కొట్టేందుకు సన్నద్ధులు కావాలి.

(25-9-87)

—: o :—

జహీర్ (మలక్ పేట్ కాలని)

**2-11-87 నాటి ఉదయంలో నలమల గిరిప్రసాద్ గారు తన ఇంటర్వ్యూలో, "హైదరాబాద్ సంస్థానంలో తెలుగు ప్రజలు (అదే విధంగా కన్నడ, మరాఠీ ప్రజలు కూడా) సాంస్కృతిక పరంగా అణచివేయబడ్డార"ని అన్నారు.**

* మాజీ హైదరాబాద్ రాజ్యంలో తెలంగాణ, మరత్వాడ, కర్ణాటక అని మూడు విభాగాలుండేవి. మీరు (శ్రీ గిరిప్రసాద్) చెప్పిన దాని ప్రకారం అన్ని వర్గాల ప్రజలనీ మాజీ ప్రభుత్వం అణచివేసింది. రాచరిక వ్యవస్థలో ఇది సర్వ సామాన్యమే. పాలకులు పాలిత ప్రజల్ని అణచివేసే సబ్బం కట్టుకుంటారు. హైదరాబాద్ నవాబు కూడా అలా చేస్తే ఆశ్చర్యం లేదు. అయితే చూడవలసింది, ఈ మాటల్లో ఎంతవరకు యదార్థముందీ అన్న విషయమే. తెలంగాణా ప్రజలు చెప్పగా నేనే స్వయంగా అనేకమార్లు విన్నాను—నేటి ప్రజా ప్రభుత్వాలనబడే పరిపాలన కన్నా ఆనాటి నవాబు పరిపాలనే సయమని. అంతమాత్రాన రాచరిక వ్యవస్థను సమర్థించడం మా ఉద్దేశ్యం కాదు. రాచరిక వ్యవస్థే ఒక జులుమ్, ఆ జులుమ్‌కు ఇంకా అనేక అత్యాచారాలు తోడయి ప్రజల జీవితాన్ని దుర్భరం చేసి ఉండవచ్చున్నది ఎవరూ కాదనలేని సత్యం. అది భాషా వైషమ్యం కాదు, మరే దురభిమానమూ కాదు, రాచరిక వవ్యస్థలోని సహజ గుణం మాత్రమే.

(5-2-88)

—: o :—

ఎన్. దేవకుమార్ (దిల్‌సుక్‌నగర్)

**"టర్కీలో" కమల్ పాషా మహోదయులు స్త్రీలకు "జనానా" పద్ధతి ఘోరమని దోష దూషితమని శాసనంచేస్తే ఈ నిర్ణయం దైవదత్తమైన మత**

**గ్రంథానికి వ్యతిరేకమని ఆ మతంలోని పండితులు సైతం మొరొత్తి నిలిచారు'' అని శ్రీ కొండవీటి వేంకటకవి వ్రాశారు. (ఈనాడు 12-4-88) అసలు జరిగిన సంగతి వివరించగలరు.**

* 19వ శతాబ్ది అంతం మొదలుగా 20 వ శతాబ్ది ప్రారంభంలో వచ్చి జాత్యహంకార జ్వాలలు ప్రపంచాన్ని మాడ్చి మసిచేసి వేస్తాయా అన్నట్లు విజృంభించాయి. ఆ వెల్లువలో కొట్టుకుపోయినవాడే ముస్తఫా కమాల్ పాషా. "అతాతుర్క్" (తురుష్కుల తండ్రి) బిరుదును స్వయంగానే పెట్టుకున్న ఇతను బ్రిటిష్ పాలనలో సైనికునిగా ప్రవేశించి పాశ్చాత్య భావాలకు దాసుడయి పోయ్యాడు. తమ భావాల కనుగుణమయిన వ్యక్తిని ఇతనిలో కనిపెట్టిన పాశ్చాత్య ప్రభువులు ప్రోత్సహించి పైకి తెచ్చారు. మొదటి ప్రపంచ యుద్ధంలో తాను సాధించిన విజయాల దృష్ట్యా యుద్ధానంతరం యుద్ధ మంత్రిత్వశాఖలో గొప్ప పదవిని చేపట్టాడు. 1919 లో మిలిటరీ ఉద్యోగానికి తిలోదకాలిచ్చి జాతీయ కాంగ్రెస్‌కు అధ్యక్షుడుగా ఎన్నికయ్యాడు. 1920 లో బ్రిటన్ సహాయంతో టర్కీ తొలి అధ్యక్షుడుగా, ప్రధానిగా అధికారాన్ని చేపట్టాడు. స్వామి భక్తికి కానుకగా క్రమేణ ఇస్లాంను దేశ బహిష్కరణ చేసే కార్యక్రమాన్ని ప్రారంభించాడు. 1924 లో ప్రపంచ ముస్లిమ్ దేశాలన్నింటినీ ఏదో ఓ విధంగా అంత మాత్రాన నయినా పట్టి ఉంచిన ఖిలాఫత్ వ్యవస్థను అంతమొందిస్తున్నట్లు ప్రకటించాడు. ఆ తరువాత టర్కీ రిపబ్లిక్‌లో ఇస్లామీయ శాసనాంగాన్ని రద్దు చేస్తూ దానిస్థానే యూరోపియన్ జీవిత విధానాన్ని, చట్టాలను ప్రవేశ పెట్టసాగాడు. యూరోపియన్ సంస్కృతికి దాసులయిన ఆనాటి ప్రజలు అతన్ని గొప్ప సంస్కర్తగా, నాయకుడుగా భావించారు. చరిత్రకారులు అలాగే చిత్రించారు కూడా. ఆ కథల్ని, గాథల్ని చదివిన, విన్నవారు, బ్రిటిష్ సంస్కృతియే మహత్తరమయిందని తలంచే పెక్కురు మన భారతీయ మేధావులు కూడా ఆయన్ని మహోన్నత సంస్కర్తగా భావిస్తారు. కాని స్వయంగా టర్కీలో అతను చచ్చి (నవంబరు 1938) ఇంకా అర్థ శతాబ్ది కూడా పూర్తికాక ముందే అతని సిద్ధాంతాలకు కాలం చెల్లిపోయింది. అతను ఏ సిద్ధాంతాలను, శాసనాలను

కాలం చెల్లినవిగా భావించాడో ఆ ఇస్లామీయ జీవన విధానం వైపుకే ప్రజలు మొగ్గు చూపుతున్నారు. అనతి కాలంలో అక్కడ ఇస్లామీయ రాజ్యస్థాపన జరిగినా ఆశ్చర్యపడవలసిన అవసరంలేదు. అతను ఒక్క పర్దా వ్యవస్థనే కాదు, అరబీ భాషను, ఖుర్‌ఆన్‌ను, నమాజ్‌ను, షరీఅత్‌లోని అన్ని అంశాలను ద్వేషించి చివరికి ముస్లిముల డ్రెస్సును సయితం మార్చి యూరోపియన్ స్టయిల్లోకి మార్చిన పెద్ద మనిషి. ప్రగతి వికాసాలన్నవి బాహ్యపరమయిన మార్పులతో ముడిపడి ఉన్నాయన్న భ్రమకు లోనయిన మేధావుల్లో అతనూ ఒకడు. మన దేశంలోనూ అలాంటి వారికి కొదువలేదు.

(10-6-88)

—:০:—

# 18. అవీ ఇవీ

వీరరాఘవులు (పెద్దకూరపాడు)

**న్యాయం అనగానేమి? మన దేశపు చట్టానికి ఇస్లాం దృష్టిలో ఉన్న విలువ ఏమిటి?**

* ప్రతి సమాజం కొన్ని నైతికపు విలువల్ని ఏర్పరచుకుంటుంది. ఆ నైతిక ప్రమాణాలను కాపాడటానికి ఏర్పడిన నియమ నిబంధనలే న్యాయ శాస్త్రం. మంచి ఏది, చెడు ఏది, ఏది చెయ్యకూడదు, ఏది చెయ్యాలి, ఎలాచేస్తే శ్రేయస్కరం, ఎలా చేస్తే హానికరం, ఒక వ్యక్తి ఏ విధంగా ఆచరించాలి, మనిషి హక్కులేవి, విధులేవి, ఒక కుటుంబం ఎలా మసలుకోవాలి, సమాజం అనుసరించవలసిన విధానమేది, దాని బాధ్యతలేవి, దాని ఆధారాలేవి, ఏ నియమాల ఉల్లంఘన నేరమవుతుంది, ఏ నేరానికి ఏ శిక్ష విధించవలసి వుంటుంది? అన్న ప్రశ్నలకు సమాధానంగా ఓ సంవిధానం ప్రతి సమాజంలో అజ్ఞాతకాలం నుంచి ఉంటూ వచ్చింది. ఆ సంవిధానం ప్రకారం సమాజాన్ని నడపడమే న్యాయం అనబడుతుంది. ఈ సమాధానాలు వేర్వేరు సామాజిక వర్గాలమధ్య వేర్వేరుగా ఉండవచ్చు. అయినప్పటికీ చాలామంది చరిత్ర కారులు, సామాజిక శాస్త్రవేత్తలు, మనోతత్వవేత్తలు, మానవ శాస్త్రవేత్తలు (ఆంత్రోపాలజిస్ట్సు) మానవ నైజంలోనే నైతికతకు సంబంధించిన విలువలు నిబిడీకృతమయి ఉన్నాయని ఒప్పుకుంటారు. ఇస్లాంకూడా న్యాయ సంబంధమయిన పై ప్రశ్నలకు, దైవదత్తమయిన సమాధానాలను జోడించి తద్వారా ఓ చట్టాన్ని ప్రతిపాదిస్తుంది. అదే మానవాళికి అత్యుత్తమమయిన శాసనాంగంగా పరిగణిస్తుంది. దాని దృష్టిలో దైవదత్తమయిన శాసనాంగం తప్ప మానవకల్పితమయిన ఏ చట్టమయినా, ఏ నియమావళి అయినా లోపభూయిష్టమే. అయితే మానవ సమాజం సజావుగా మనుగడ సాగించాలంటే ఓ చట్టం, ఓ నియమం ఉండాలి గనుక ఒకవేళ దైవదత్తమయిన శాసనం అమలులో లేకపోతే, చెలామణిలో

ఉన్న శాసనాన్ని ఉల్లంఘించరాదన్నదికూడా ఇస్లాం శాసనాంగంలోని అంతర్భాగమే. అలాగే ఇస్లామీయ శాసనాంగానికి ప్రతికూలమయిన చట్టాలేవయినా ఉంటే వాటిని అనుకూలంగా మలిచే కృషి చట్ట పరిధిలోనే చెయ్యాలన్నదికూడా షరీఅత్ నియమాల్లో ఉన్న అంశమే.

(5-10-84)

—: o :—

జహీర్ అహ్మద్ (వినుకొండ)

**ఫ్లయింగ్ సాసర్ల గురించి ఈ మధ్య పేపర్లలో మేము చదువుచున్నాము. విశ్వంలో భూమండలం కాక ప్రాణులున్న వేరొక గ్రహం ఉందంటారా?**

* ఫ్లయింగ్ సాసర్ లేక గుర్తుపట్ట వీలుకాని ఎగిరే పదార్థాలు అని చెప్ప బడే ఇవన్నీ ఉన్నట్టు చాలా కాలంగానే చెప్పుకుంటున్నా 1947 అంటే రెండో ప్రపంచయుద్ధం తరువాత అమెరికాలో వీటిని చూచినట్లు పుకార్లుపుట్టాయి. అయితే 1952లో, ప్రజలు చెప్పుకోవటమే కాక వాషింగ్టన్‌లోని విమానా శ్రయం సమీపాన చూసినట్టు చెప్పుకునే వాటిని "రాడార్" కూడా కనుగొన డంతో అమెరికా ప్రభుత్వం ఒక సంఘాన్ని నియమించింది వీటిని పసిగట్ట డానికి. ఆ పరిశోధనల్లో తేలిన విషయమేమంటే అలా చూచామని చెప్పుకునే పదార్థాల్లో 90 శాతం ప్రకాశవంతమయిన గ్రహాలకు సంబంధించినవో, వాతా వరణంలోని పదార్థాలో, విద్యుత్ ప్రేరిత మేఘమో లేక విమానాలో, పక్షులో, బెలూన్లో, సర్చ్‌లైట్లో, వేడెక్కిన వివిధ వాయువులో ఇంకా ఏదైనా వాతావరణ జనిత విషయమో అని నిర్ధారణ అయింది. 1947 నుండి దాదాపు 1970 వరకు వాటికి లభించిన ప్రచారం కారణంగా ప్రజల్లో, ఇలాంటి వాటిని చూచినట్లు అభూతకల్పనలు చెయ్యాలని కూడా మానసికంగా ప్రేరణ లభించింది. ఆ తరువాత అనేక దేశాలు ఇలాంటి పుకార్లను విచారించి పరిశోధించడానికి అనేక సంఘాలు నియమించాయి. కాని అమెరికా సంఘం పరిశోధనలకు భిన్నంగా ఏదీ ముందుకు రాలేదు. ప్రతి సందర్భంలోనూ కొన్ని సంఘటనలకు ఎలాంటి సంజాయిషీ లభించలేదన్నది యదార్థం. మొత్తం 12,618 ఉదంతాలు ఈ పరి శోధకుల నివేదికలో కెక్కాయి. 1965 ప్రాంతాల్లో కొందరు సైంటిస్టులు,

ఇంజనీర్లు, ముఖ్యంగా అరిజోనాకు చెందిన జేమ్స్ ఇ. మెక్ డొనాల్డ్ అనే వాతావరణ నిపుణుడు ఇతర ఖగోళ శాస్త్రజ్ఞులు, ఇతర గ్రహాలనుండి ఎవరో వచ్చిపోయినట్లు ఆధారాలున్నాయని అభిప్రాయం వెలిబుచ్చారు. ఇది పెద్ద వివాదంగా చెలరేగి చివరిలో అమెరికా వాయుసేనకు సంబంధించిన ఓ పరిశోధక బృందం 1969 లో సమర్పించిన నివేదికతో కథ కంచికి చేరింది. ఇంతకుమించి నిర్ధారితంగా ఈ విషయంలో చెప్పడానికి ఏమీలేదు—తతిమ్మావన్నీ కట్టుకథలు, నిరాధారమయిన గాధలే. ఏ విషయమూ నిర్ధారితంగా తెలియనంతవరకు వేరే గ్రహాల్లో ప్రాణులున్నారా లేరా అన్న విషయంలో నోరు విప్పడం అతితెలివే అనిపించుకుంటుంది. ఉండక పోవడానికి ఏ కారణమూ కనిపించడం లేదు. దివ్య ఖుర్‌ఆన్‌లో 'లోకాలు' (ఆలమీన్) అన్న బహువచనం అనేకచోట్ల ప్రయోగించడం కారణంగా, ఇతర గ్రహాల్లో ప్రాణులుండే అవకాశాలను కాదనడానికి వీల్లేదని చాలామంది ధర్మవేత్తలు కూడా అభిప్రాయపడుతున్నారు.

(15-3-85)

—: o :—

షేక్ ముహమ్మద్ అలి (నంద్యాల)

**అభ్యుదయ ముస్లింలంటే ఎవరు? సత్యశోధక్ సమాజ్ అంటే వీరెవరు?**

* ప్రతికలవాళ్ళు అభ్యుదయ ముస్లిములని అంటే తమ ధర్మానికి తిలోదకాలిచ్చి, కమ్యూనిస్టుల ప్రభావంలో పడి, అధికసంఖ్యాకుల అడుగుల్లో మడుగులొత్తే అలగా జనం అని అర్థం. ముస్లిములుగా పేరు పెట్టుకుని ముస్లిముల ప్రయోజనాలకు ఎసరు పెట్టేందుకు అమ్ముడుపోయిన క్షుద్ర శక్తులని భావం. అభ్యుదయ వాదులుగా నామధేయులయిన వీరికి నీతి బాహ్యమయిన జీవితం, దైవ భావం లేని ఆలోచనా సరళి తప్ప మరేమి తెలీదు. ఇస్లాం అంటే వడపు ఖుర్‌ఆన్ హదీసులంటే అసలే గిట్టదు. పైన పేర్కొన్న క్షుద్రశక్తుల అధినేత ఒకతను హమీద్ దల్వాయ్ అన్న పేరుతో తాను ముస్లిం అని చెప్పుకుంటూనే తన అంత్యక్రియలు హైందవ సంప్రదాయం ప్రకారం జరపాలని వీలునామ వ్రాసి మరీ పొయ్యాడు. అతను ప్రారంభించిందే సత్యశోధక్ సమాజ్ అనే "అసత్య ప్రచార సంఘం." వీరి పని ఏమిటంటే, ముస్లిముల విశ్వాసాల్లో

రుశంకలు ఉత్పన్నం చేసి వారిని ఇస్లాంకు దూరం చేసేందుకు ప్రయత్నించడం, ఇస్లామీయ షరీఅత్ పట్ల అపనమ్మకపు వాతావరణాన్ని సృజించడం, తద్వారా ముస్లిములను దైవ తిరస్కారులుగా మార్చి కొందరి ప్రయోజనాలను కాపాడటం.

(3-1-86)

—: ० :—

## యం.ఎఫ్. అహ్మద్ (రేవల్లె)

**"ప్రస్తుత విద్యా విధానము గురించి మీ అభిప్రాయము తెలియచేస్తారు అని భావిస్తున్నాను"**

* ఏదయితే అసలుసిసలయిన సంపదో, ధనమో—అదే 'విద్య' (విత్ + య). ఈ ధనమే మనిషితో నిత్యం ఉండేది. అంటే జ్ఞానసంపదకు మించినది ప్రపంచంలో మరే విత్తు లేదని అన్నారు. అలాంటి విద్య నేడు-డిగ్రీ కాలమానాల్లో అవమానాల పాలవుతోంది. అల్పమయిన, క్షణికమయిన డబ్బు సంపాదించేందుకు ఆధారభూతమవుతోంది. మనం నేడు అనుసరిస్తున్న విద్యావిధానాన్ని మర్యాదగా నిర్వచించదలిస్తే పైవిధంగా చెప్పవచ్చు. ఆచరణాత్మకంగా ఈ విద్యా విధానంవల్ల ఎలాంటి వారు తయారవుతున్నారనిచూస్తే పరిస్థితి మరీ ఘోరంగా ఉంది. నైతికతకు, మానవుని సహజ అవసరమయిన ఆధ్యాత్మికతకు తావులేని ఈ విధానం ద్వారా 'సుశిక్షితులయి' విద్యాలయాల నుండి వెలికివస్తున్న నేటి తరం, మనిషి మౌలికంగా పశువే అన్న అసత్యాన్ని పరమ సత్యంగా నమ్మి, పాశవిక వాంఛలు, రుచుల పరిపూర్తియే తన జీవితాశయంగా భావిస్తోంది. ఈ విద్యావిధానం, దాని చేదు ఫలాలను అర్థం చేసుకున్న మేధావులు, పెద్దలు దీనిలో మౌలికమయిన మార్పు రావాలని కోరుతున్నారు. మన ప్రధాని కూడా ఆ విషయమయి జాతీయ స్థాయిలో చర్చలు జరగాలని ఓ ఉన్నతమయిన, ఉత్తమమయిన విధానాన్ని రూపొందించుకోవడం మన ధ్యేయం కావాలని పదే పదే ప్రకటిస్తున్నారు, వేచి చూద్దాం.

(25-4-86)

—: ० :—

హెచ్. ఎండి. షుజా ఉద్దీన్ (మహబూబ్‌నగర్)

**ముస్లిం రాజులందరు లలితకళలను పోషించారు కదా! ఇస్లాంలో లలిత కళలు నిషేధము కాదా?**

* మీ ప్రశ్నలో రెండు అంశాలు మిళితమై ఉన్నాయి. ఒకటి, ముస్లిం రాజుల చర్య, రెండు లలితకళలు. ముస్లిం రాజులు చేసిన ప్రతిచర్య ఇస్లామీయ శాసనాంగానికి ప్రతీక అయినట్లు, ఇస్లాం బోధనల్ని ప్రతిబింబించినట్లు కొందరు భావిస్తారు. ఇది పొరపాటు, ముస్లిం రాజులు-దాదాపు అందరూ - 'రాజులు'గానే వ్యవహరించారు. ధర్మాన్నీ, ధార్మిక నిబంధనల్నీ పాటించడంలో తమకు ఇష్ట మయిన రీతినే అవలంబించారు. తమకు ఇష్టమయితే, ప్రయోజనకరంగా ఉంటే ధర్మాన్ని అనుసరించారు. కాకపోతే యధేచ్ఛగా వ్యవహరించారు. అందువల్ల వారి నడవడి ప్రామాణికం కాజాలదు. అందువల్ల- 'ముస్లిం రాజులు అలా చేశారే, అది ఇస్లాంలో విరుద్ధమే, అన్న ప్రశ్నకు అర్థమే లేదు. ఏ విషయాన్నయినా సరే ఎవరు ఎలా అనుసరించారని చూడటం కన్నా ధర్మం ఎలా బోధిస్తుంది అని తెలుసుకోవడం సరయిన పద్ధతి. పోతే లలితకళల విషయం. లలిత కళలు ఇస్లాంలో నిషిద్ధమని ఎవరు చెప్పారు? మీరు ఈ పంక్తుల్లోనే అనేక మార్లు చదివి ఉంటారే లలిత కళలకూ ఇస్లాంలో స్థానముందని. నిజానికి మనిషి సహజ ధర్మమయిన ఇస్లాంలో మనిషికి సహజమయిన ప్రతి దానికి చోటుంది. లలిత కళలకూ స్థానముంది. అయితే అవి మనిషి బుద్ధిని వికసింపజేసే విధంగా ఉండాలని, మనిషిని ప్రపంచంలో ఉన్మత్తునిగా, సోమరిగా, నిస్తబ్ధునిగా, నిస్తేజు నిగా, నిర్వీర్యునిగా కాక కార్యోన్ముఖునిగా, బాధ్యతాయుతునిగా, ధీరవంతునిగా చేసేందుకు ఉపకరించాలి అనంటుంది ఇస్లాం. సాహిత్యం, కవిత్వం, గానం, చిత్రలేఖనం, శిల్పం, అన్నీ మనిషిలోని రసభావాన్ని ఉత్తేజపరుస్తూ అతన్ని సన్మార్గగామిగా తీర్చిదిద్దాలి. అతని ఆచరణా మార్గాన్ని సుగమం చెయ్యాలి. మనస్సును ఆత్మను తేజోమయం చెయ్యాలి! ఇదే ఈ కళల లక్ష్యం అంటుంది ఇస్లాం. కళల ఈ రూపం ఇస్లాంలో అనుమతించ బడటమే కాదు ప్రోత్సహించ బడింది కూడా.

(4-7-86)

—: ౦ :—

సమద్, మన్నాన్ (నంద్యాల)

**ఈనాడు పాశ్చాత్య దేశాలలో విపరీతంగా పెరిగిపోయిన "Mercy killing" (బాధ నివారణ కోసం ప్రాణం తీయటం) ను ఇస్లాం అనుమతిస్తుందా?**

* ఏ మాత్రం అనుమతించదు. మానవ ప్రయత్నం జరగవలసింది ఓ ప్రాణాన్ని కాపాడటానికే గాని తీయడానికి కాదు. అయితే నా అభిప్రాయంలో ఓ వ్యక్తిని మందుల ద్వారా, ఇతర ఉపకరాల ద్వారా వ్యాధి నివారణకు చెయ్య గలిగిన ప్రయత్నాలన్నీ చేసి ఆపై భారం దైవంపై మోపవలసిందే. ఎం. జి. రామచంద్రన్‌కి (తమిళనాడు ముఖ్యమంత్రి) రెండేళ్ళ క్రితం Paralytic Stroke (పక్షవాతం) సోకినప్పుడు బ్రతికి బట్టకడతాడని ఎవరనుకున్నారు? అది చాలా బలమయిన స్ట్రోకు, మూత్ర పిండాలు కూడా దెబ్బతిన్నవి. కాని దైవం అతన్ని తన గుర్తుగా బ్రతకనిచ్చాడు. అమెరికాలో మూత్రపిండం మార్పిడికి పొయ్యే ముందు చూసిన జాపాన్ డాక్టర్లు ఆ దెబ్బ తరువాత కూడా అతను బ్రతికి ఉండటం అద్భుతమే అని అన్నారు. ముఖ్యమంత్రి కాబట్టి ఆనాటి దేశ ప్రధాని స్వయంగా శ్రద్ధ తీసుకున్నారు గనుక, అన్ని హంగులూ గల ప్రత్యేక విమానంలో అమెరికా తీసుకువెళ్ళారు. అక్కడ పెద్ద గండం లాంటి ఆపరేషన్ విజయవంతంగా ముగించుకుని తిరిగి వచ్చారు. అతను తిరిగి వచ్చే నాటికి తన చికిత్సకై సహాయం చేసిన ప్రధాని స్వయంగా ఈ లోకం సరి హద్దులు దాటిపొయ్యారని మాత్రం తెలుసుకోలేని స్థితిలోనే ఉన్నాడు. ఇలాంటి కేసులు దైవేచ్ఛ బలీయమని చూపటానికి తార్కాణాలు కదూ? ఇంతకు చెప్ప వచ్చిందేమంటే ఒక వైపున మెర్సీ కిల్లింగ్ గురించి వాదిస్తూనే ఆధునిక యుగం, కేవలం కృత్రిమ (యంత్రపరమయిన) గుండె, మూత్రపిండాలు, ఊపిరి తిత్తుల ఆధారంగా మనిషిలో రక్తం ప్రసరింపజేస్తూ "బ్రతికి ఉన్నాడ"ని భ్రమ కలిగింప జూస్తోంది. ఇంకో ప్రక్కన మన దేశంలో శవాలను మమ్మీలుగా చేసి మంత్రతంత్రాలతో బ్రతికించాలని కలలు గంటున్నారు. ఈ అతివాదాలన్నింటికీ మధ్యస్థ మార్గం ఇస్లాం సూచిస్తుంది. మానవ ప్రయత్నాలు సాధ్యమయినంత వరకు చెయ్యాలి. ఆపైన దైవేచ్ఛను సహనంతో, సంతోషంతో స్వీకరించాలి.

(19-6-87)

—: o :—

యన్. దేవకుమార్. (దిల్‌సుక్ నగర్)

**29-6-87 "ఈనాడు"లో "మహ్మదీయ మతాన్ని ఆమోదించని వారిని కాఫిర్లు అన్నారు. ఇలా ప్రతి మతం తమ మతం కాని వారిపై కారాలు మిరియాలు నూరారు. కయ్యాలకు కాలు దువ్వారు. ఇవి ఏ మూల మత గ్రంథాలలో ఎక్కడా లేవు వీటిని మతోన్మాదులు కలిపించారు." అని శ్రీ కొండవీటి వేంకటకవి గారు వ్రాశారు. ఈ విషయంపై మీ అభిప్రాయ మేమిటి ?**

* పాపం. ఇది మన సమకాలీన మేధావుల (!) గ్రహపాటు. తమకు తెలిసినా, తెలీకపోయినా ప్రతివిషయంలోనూ ప్రవేశమున్నట్లు ఫోజుకొట్టడం, అలా అని ప్రకటించుకోవడం, సుహా అయితే ఎవడో దారినపోయే దానయ్య చెప్పిన మాటలు, వ్రాసిన 'సూక్తులు' విని, చదివి వాటినే మూల విషయమని నమ్మేసి ఇంతకంటే మరే ఆధారం అవసరం? అన్నట్టుగా వ్యవహరించడం. శ్రీ కొండవీటి వేంకట కవులు గొప్పరచనా శక్తిగలవారే, కాని ఏం చేస్తారు? పైన పేర్కొన్న 'ఇంటలెక్చువల్ సిండ్రోమ్' (ఇది నా కల్పన)తో బాధపడుతు న్నారు. ఇస్లాం గురించి తెలీకపోయినా, 'కాఫిర్' అన్న పదానికి అర్థమేమిటో అసలు ఎరుగకపోయినా తన సిండ్రోమ్ ధాటికి తట్టుకోలేక ఏదో ఏకిపారేశారు. ఒక విషయాన్ని, సిద్ధాంతాన్ని అంగీకరించే వారు, దాన్ని అంగీకరించని వారిని తమ సిద్ధాంతం రిఫరెన్సుతో ప్రస్తావించి నప్పుడు ఏమని అంటారు? ఆ సిద్ధాం తాన్ని 'తిరస్కరించిన' వారనేగా? ఆస్తికులు, దైవాన్ని నమ్మని వారిని నాస్తి కులు అనంటారు. పాపం నాస్తికులే నయం, 'అవును మేము నాస్తికులం' అని ఒప్పేసుకుంటారు. అలాగే దైవ విశ్వాసం, ఆయనకు స్వయం సమర్పణ అనే అర్థంలో 'ఇస్లాం'ని నమ్మేవారు అలా నమ్మని వారిని 'కాఫిర్'(అంటే తిరస్కారు) లని అంటారు. అంత మాత్రాన అవును మేము మీ 'ఇస్లాం'ను తిరస్కరించిన 'కాఫిర్లము' అనగలిగేంత చిత్తశుద్ధి మనలో ఎవరికయినా లేకపోతే ఎలా? కాఫిర్ అంటే ఏదో తిట్టుగా భావించడం మహా విపరీతమే. హైందవ మతం తమ మతాన్ని స్వీకరించని వారిని మ్లేచ్ఛులు అని అనడం లేదూ? ముస్లిములందరూ, క్రైస్తవులందరూ ఆ పరిభాషలో 'మ్లేచ్ఛులు!'. మ్లేచ్ఛ పదానికి అర్థం ఏమిటి? గొప్ప గొప్ప పండితుల్ని అడగనక్కరలేదు. ఏ చిన్న డిక్షనరి వెదికినా

తెలుస్తుంది. మ్లేచ్ఛుడంటే, ఆర్యుడు కానివాడు. హిందు వేతరుడు, క్రూరుడు, అనాగరికుడు, కనుక తుచ్ఛుడు! 'కాఫిర్' అన్న పదం అలాంటిది కాదే! కాక పోవడమేకాదు ఆ దరిదాపుల్లోకి కూడా పోదు. దానికి భావం కేవలం ఇస్లాంను తిరస్కరించిన వాడు అన్నదే. ఇది ఒక్క వేంకటకవిగారి విషయమేకాదు. ఆంధ్రలో మహా మేధావిగా, పత్రికా రచయితగా, పత్రికారంగంలో కొత్త ఒరవడిని సృష్టించిన మహా మనిషిగా పేరొందిన ఓ ఇంటలెక్చువల్‌గారు (ఆయన ఇప్పుడు లేరు కాబట్టి పేరు చెప్పడం భావ్యంకాదు) నాతో అన్నారు, 'నా దగ్గర ఇస్లాంకు సంబంధించిన 150 పుస్తకాలున్నాయి తెలుసా?' అని. నేను కాస్త మొహమాటంగా బెదురుతూనే అడిగా, 'అవన్నీ మీరు చదవాలంటే ఎలా వీలుపడుతుందిలేండి' అని. దానికి ఆయనగారు ఇబ్బంది ఫీలయ్యారు. 'అవును రిఫరెన్సు కోసం చూస్తుంటాను' అన్నారు! ఇదండీ మన మేధావుల కథ.

(28-8-87)

—: o :—

ఎం. షకీల్ బేగ్ (పులివెందుల)

**అంతరిక్షములో మానవుడు సాధించిన అనంతమయిన ప్రగతి చూస్తే ప్రతి మానవునికి గర్వమేస్తుంది. కాని ఆ మానవుని అంతరిక్ష గమ్యమేమి? అంతరిక్షము గురించి దివ్య ఖుర్ఆన్‌లో ఏమని ఉంది?**

* ప్రగతి అనంతమూ కాదు అనన్యమూ కాదు. మనిషి, తన మేధా శక్తితో, మనోబలంతో అంతరిక్షాన్ని జయించటం గర్వకారణమనడంలో సందేహం లేదు. కాని మీరన్నట్లు గమ్యం నిర్ధారణ జరగడమే ముఖ్యం. ఈ అంతరిక్ష పరిశోధనలు సకల మానవ కళ్యాణానికి, సర్వ మానవ శ్రేయానికి ఉపకరిస్తాయా లేక స్వార్థపరుల అంతర్జాతీయ రాజకీయాల్లో పనిముట్లుగా మారుతాయా అన్నదే ప్రశ్న. ఈ పరిశోధనలు జరిపేవారి సమక్షంలో ఉన్నతలక్ష్యం, ఉత్తమ ధ్యేయం ఉంటే పరిశోధనలు మానవ విజ్ఞానానికి సార్థకతనిస్తాయి. లేకపోతే ఇవన్నీ వైజ్ఞానిక వ్యర్థప్రక్రియలుగానే చరిత్రలో మిగిలిపోతాయి—

చరిత్ర అంటూ ఒకటి మిగిలితే! దివ్యఖుర్‌ఆన్ అంతరిక్షంలో అసంఖ్యాక లోకాలున్నాయని అంటుంది. అక్కడ ఇతర జీవరాసులు ఉండటంకూడా సంభవమే అని ఖుర్‌ఆన్ సూచిస్తుందని కొందరు ఖుర్‌ఆన్ పరిశోధకులు అంటున్నారు. కాని వాస్తవమేమంటే, ఓ పాశ్చాత్య తత్వవేత్త అన్నట్లు మనం నీటిలో చేపల్లా ఈదటం, గాలిలో పక్షుల్లా ఎగరటం అయితే నేర్చుకున్నాము, కాని భూమిపై మనిషిలా మనగలగటం మన చేతనవడంలేదు. ఇన్ని ఔన్నత్యాలు ఎదిగిన మన విజ్ఞానం మనకు మానవీయ విలువలు నేర్పలేకపోయింది. దివ్య ఖుర్‌ఆన్ అసలు ఉద్దేశ్యం ఇదే. మనిషి భూమిపై మనిషిగా ఎలా జీవించాలి? అన్న ప్రశ్నకు విస్తృత సమాధానమే దివ్య ఖుర్‌ఆన్. అంతరిక్ష జ్ఞానం మానవ మేధకే వదిలేసింది ఖుర్‌ఆన్.

(18-7-88).

— :o: —

# 19. మార్పు

ఎస్. ఏ. కరీమ్ (విజయవాడ)

**మతం మార్చుకునే స్వేచ్ఛ భారతదేశంలో ఉందంటారా?**

* భారత రాజ్యాంగం 25 వ అధికరణ ప్రకారం అంతరాత్మ ననుసరించే స్వాతంత్ర్యం, స్వేచ్ఛగా ఇష్టమైన మతాన్ని అవలంబించడానికి గాని, ఆచరించడానికిగాని, ప్రచారం చెయ్యడానికిగాని, ఈ దేశ ప్రజలందరికీ సమానంగా హక్కు ఉంది. అలాగే రాజ్యాంగంలోని 15 వ అధికరణ, మతం, జాతి, కులం, లింగ విభేదం కారణంగా ఏ విధమయిన విచక్షణ చూపడానికి వీల్లేదని, ఈ సమానత్వాన్ని కాపాడే బాధ్యత ప్రభుత్వంపై ఉందని స్పష్టంగా చెబుతుంది. అయినప్పటికి శతాబ్దాల తరబడి అణచివేతకు, పీడనకు గురవుతూ వస్తున్న దళిత సోదరుల్ని "సమానతా హక్కు"కు దూరం చెయ్యాలని కొందరు పరోక్షంగా నినదిస్తుంటారు. మతం మార్చుకునే ఏ స్వేచ్ఛనయితే రాజ్యాంగం ఇచ్చిందో దాన్ని ఉపయోగించుకుని, ఒక బ్రాహ్మణ కుటుంబంగాని, రెడ్డి, లేక కమ్మ కుటుంబంగాని, మతం మార్చుకుంటే మాత్రం వారు అంతరాత్మను అనుసరించి మతం మార్చుకున్న వారవుతారు. అందువల్ల ఎవరికీ ఆ "మతం మార్పిడి" పై ఆక్షేపణ, అభ్యంతరం జనించదు. కాని అదే హరిజన కుటుంబాలు మతం మార్చుకుంటే వారు తమ అంతరాత్మలకు అనుగుణంగా కాక పెట్రో డాలర్లకు అమ్ముడు బోయారని హరిజన సోదరుల్ని, వారి ఆత్మగౌరవాన్ని న్యూనత పరిచే, కించ పరిచే విధంగా గగ్గోలు పెడతారు కొందరు. రాజ్యాంగంలోని ఈ రెండు అధికరణలకు భిన్నంగా ప్రవర్తించే వారిపై ప్రభుత్వం సయితమూ ఏ చర్య తీసుకోవడంలేదు. ఇది - "ఇండియా, దటీజ్ భారత్!"

(27-1-84)

—: ం :—

ముహమ్మద్ జకియుద్దీన్ (ఆలేరు)

**శత్రువుపై జాలి లేనివారే విప్లవకారులు, అని మా స్నేహితుడు అంటాడు.**

* శత్రువుపై దెబ్బతీయడం, దెబ్బకు దెబ్బకొట్టడం గొప్ప విషయంకాదు. కాని తనకు వ్యతిరేకమయిన భావాలు గల ప్రతి వ్యక్తిని శత్రువుగా భావించడం లోనే అసలు పొరపాటు జరుగుతోంది. మనిషిపై కాకుండా అతడి భావాలపై దెబ్బ తియ్యగలగాలి.అతని వాదనకు గట్టిప్రతివాదన ప్రతిపాదించగలగాలి.అంతే కాని ఎదురయ్యే ప్రతి వ్యక్తినీ శత్రువుగా పరిగణిస్తే ఇక మిత్రునిగా మిగిలే దెవరు? విప్లవం వచ్చేదెక్కడ? అందువల్ల విప్లవం అంటే ఏమిటో అర్థంచేసుకుని ముందడుగు వెయ్యాలి. బాహ్యంలో కనిపించే భయంకరమయిన వాతావరణాన్ని, భీకరమైన రక్తపుటేరుల్ని విప్లవమని భ్రమపడితే ఆ విప్లవ ఫలాలను అస్వాదించే "మనిషే" అసలు మిగలడు! విప్లవం మనస్సుల్లో రావాలి. మనసు మారితే క్షణం ముందు శత్రువుగా అగుపించిన వ్యక్తి మిత్రుడవుతాడు. విప్లవ మార్గంలో మరో మనసు, మరో మస్తిష్కం, మరో హస్తం తోడవుతాయి!!

(7-6-85)

—: o :—

ఎండి. ముష్తాఖ్ (మండపేట)

**ప్రతి దినము ఎన్నో కుటుంబాలు నాశనమవుతున్న మద్యపానము గురించి మన రాజ్యాంగములో నిషేధము లేదా?**

* లేకేం? రాజ్యాంగం 4వ భాగం ఆదేశిక సూత్రాలలో 47వ అధికరణ క్రింద ప్రభుత్వం మద్యపాన నిషేధాన్ని అమలుపరచాలన్న ఆదేశం ఉంది. జాతిపితగా చెప్పుకుని ఆయన అడుగుజాడల్లోనేతప్ప నడవమని చెప్పే ప్రతి రాజకీయవేత్తకు తెలుసు గాంధీజీకి మద్యపానమంటే ఎంతబేజారో! కాని నేడు ఆయన పేరు స్మరించనిదే మెతుకు కొరకని వారంతా మందు పడనిదే ఏ పని చెయ్యడానికి ముందుకు రావడంలేదు. పైగా ప్రభుత్వస్థాయిలో సారా డిపోలు నిర్వహించేంత మేరకు దిగజారిపొయ్యాయి మన 'సంక్షేమ రాజ్యాలు'. ప్రజల సంక్షేమం, సౌభాగ్యాలకన్నా ప్రభుత్వ ఆదాయం ముఖ్యమయింది. లక్షలాది

ప్రజల బ్రతుకులు చితికిపోయినా కొందరి బ్రతుకు తెరువు ప్రధానమైంది ప్రభుత్వానికి. ఇలాంటి నాయకుల్ని ఎన్నుకున్న ప్రజలదే తప్పు. ప్రజల్లో చైతన్యం రావాలి. వారు మారాలి. ప్రజల మెనిఫెస్టో ప్రజానాయకులనబడే వారికి తెలియాలి. ఓటర్లు తమకు ఎలాంటి అభ్యర్థులు, ఎలాంటి పార్టీలు కావాలో తెలపాలి. అప్పుడు ప్రజలకు ఇష్టమయిన ప్రభుత్వం ఏర్పడే అవకాశముంది. ప్రజల మేనిఫెస్టోలో మద్యపాన నిషేధం లాంటి అంశాలను చేర్చవచ్చు. మద్యపానాన్ని నిరసించే ముస్లింలయినా కనీసం తాము ఓటు వెయ్యాలంటే ఎలాంటి గుణగణాలుగల అభ్యర్థులు కావాలో ఎలాంటి సిద్ధాంతాల పార్టీలు కావాలో, వోటర్ల సంఘాలుగా ఏర్పడి తెలియజెప్పాలి. ప్రస్తుతానికి ఇదొక్కటే మార్గం

(3-10-86)

—: o :—

జి. అబ్దుల్ గఫూర్ (బనగానపల్లి)

**కట్నకానుకల విషయంలో యువతీ యువకులు ముందుకు రావాలని ప్రతి ఒక్కరూ చెప్తున్నారు. కాని ఒక యువకుడు ఉద్యోగము చేస్తూవుంటే ఈ పెద్దమనుషులు మేం ఇంత కట్నం ఇస్తామంటే మేం మరింత ఇస్తామని అంటున్నారు.**

* యువతీ యువకులు ముందుకు రావలసిందే కాని మన వ్యవస్థలో అసలు ముందుకు రావలసింది యువకులే. వధువు వాళ్ళు ఎలాగయినా తమ బిడ్డ పెళ్ళి కావాలని కాంక్షించేవారు కాబట్టి ఒక్కోసారి వరుని తరఫున వచ్చే వత్తిడికి లొంగిపోవడం సాధ్యమే. కాని వరునికి, అతని తరఫు వాళ్ళకి ఇలాంటి ఇబ్బంది లేదుకదా! తీసుకొమ్మని వత్తిడి తెచ్చేవారెవరు ? ఇస్తామన్నా తీసుకోమని, ససేమిరా ఒప్పుకోమని చెప్పిన వరుడు, అతని తల్లిదండ్రులూ ఉన్నారు. అలాంటి వారు అధికం కావాలి. సంస్కరణకు ప్రారంభబిందువు అదే. యువకులు వధువు తరఫున చిల్లిగవ్వ ముట్టుకోమని శపథం చేసి ఆవిధంగా నడచుకుంటే మన సమాజం ఎప్పుడో బాగుపడేది. కాని ద్వంద్వనీతికి దాసోహమన్న మన సమాజంలో మాటలకు చేతలకు నింగికీ నేలకి ఉన్నంత అంతరం ఉంది. ఇతర అంతరాల

కన్నా ఈ అంతరం దూర మయితే మనల్ని పట్టి పీడిస్తున్న రోగాల్లో సగం దూరం అవుతాయన్నది నా ప్రగాఢ నమ్మకం. ద్వంద్వనీతి మనలో వ్యక్తిగత స్థాయినుండి సామూహిక స్థాయిలో - కుటుంబం, సమాజం, వాణిజ్యం, రాజకీయ వ్యవస్థ, అంతర్జాతీయ ఒడంబడికల వరకు - సర్వ వ్యాప్తంగా అలుముకుంది. దాన్ని పార ద్రోలాలంటే మన ప్రమాణాలు, కొలబద్దలు మారాలి. జీవనదృక్పథం జీవన మార్గం మారాలి, అప్పుడే ఏదయినా సాధ్యం.

(14-8-87)

—: ం :—

భట్టుశ్రీ (గిద్దలూరు)

**చట్టాల ద్వారా నిర్మూలించలేక పోతున్న "వరకట్న" సమస్యను యే విధంగా నిర్మూలించవచ్చు?**

* ఒక వరకట్నమే కాదు, అన్ని సామాజిక దుర్మతం నివారణ మానసిక పరివర్తన ద్వారానే సాధ్యం. మానసికమయిన పరివర్తన మనిషి భావాలు భావనల ద్వారా ఏర్పడుతుంది. వాటి వెనక బలవత్తరమయిన విశ్వాసం ప్రేరక శక్తిగా ఉండాలి. ముఖ్యంగా వరకట్నం లాంటి దురాచారంపట్ల యువకుల్లో సరయిన అవగాహన కుదరాలి. అది దురాచారమని, హేయమయిన సంప్రదాయమని యువకులు నమ్మాలి. దానివల్ల సమాజంలో ప్రబలుతున్న చెడుగు మానవ జీవన వ్యవస్థను ఏ విధంగా గుల్లచేసి వేస్తుందో అనే విషయం యువకులకు ప్రబుద్ధమవ్వాలి. ఆ దుష్టత్వాన్ని నిర్మూలించాలన్న దృఢ సంకల్పం, సమాజాన్ని పరిశుభ్రంగా ఉంచాలన్న దీక్ష, చిత్తశుద్ధి జనించాలి. ఈ భావనలకు బలవత్తరమయిన ప్రేరక శక్తి కాగల విశ్వాసం — రమ చర్యలన్నింటికీ జవాబు చెప్పుకోవలసి ఉంటుందన్న నమ్మకం కుదరాలి. అప్పుడే ఏదయినా సాధ్యం. నక్సలైట్లను చూడండి తాము నమ్మిన ధ్యేయం కొరకు ప్రాణాలనయినా త్యాగం చెయ్యడానికి వెనుకాడడం లేదు. అడవుల్లో అన్ని భోగభాగ్యాలను త్యాగంచేసి వారు దేనికొరకు పరితపిస్తున్నారు? తమ లక్ష్యమయిన విప్లవాన్ని తమ పరిధిలో సాధించాలని. వారి సిద్ధాంతాలతో, విధానాలతో లక్ష్యంతో మనం విభేదించవచ్చు. కాని వారి దీక్ష, చిత్తశుద్ధిని కొనియాడవలసి ఉంటుంది. అలాగే సింహళంలోని ఎల్‌టిటిఇ కార్యకర్తల్ని చూడండి, అఫ్గన్.

యోధుల్ని పరిశీలించండి. అంత పెద్ద త్యాగాలు కాకపోయినా సాధారణ ఆర్థిక ప్రయోజనాన్ని — అదీ ధర్మబద్ధం కాని ప్రయోజనాన్ని—వదలుకోలేరా మన యువకులు? ఇదే ప్రశ్న!

(12-2-88)

—: ం :—

యస్. డి. డబ్ల్యు. (జుక్కల్)

**పుస్తకాల వ్యాపారం చేస్తాను. ఎంత వద్దనుకున్నా గిరాకి ఎక్కువ ఉండటం వలన సెక్స్ పుస్తకాలు అమ్మవలసి వస్తుంది. (బొమ్మలు కూడా వుంటాయి)**

* నైతికపు విలువలు సమాజంలో అడుగంటి పోతున్నాయంటే కారణం ఇలా సమాధాన పడటమే. నైతిక ప్రమాణాలకై నేనెంత త్యాగానికయినా సిద్ధమే అని మనలోని ప్రతివ్యక్తీ నిర్ణయించుకో నంతవరకు సమాజాన్ని తిట్టి ప్రయోజనం శూన్యం. సమాజం అంటే ఎవరు? మీరు, నేను! వస్తులున్నా సరే నేను ఏ సిద్ధాంతాలను, ఏ విలువలను నమ్ముతున్నానో వాటికై, వాటిఅభ్యున్నతికై, వాటి వ్యాప్తికై కృషి చేస్తానని మనలోని ఒక్కో వ్యక్తి తీర్మానించుకోవడం ఎంతో అవసరం. మీరు మీ ఈ వ్యాపారాన్ని ఈ క్షణాన్నే మానేస్తారనుకోంటే మీరు ఇప్పుడు ఒక్కసారిగా మానేస్తే మీ పాత పాఠకులు మిమ్మల్ని ప్రశ్నిస్తారు 'ఇలా మానుకోవడానికి కారణం ఏమిటీ'? అని. మీకు ఇది ఎంతో మంచి అవకాశం. మీరు సమాజంలో ఎలాంటి విలువలకు ప్రాధాన్యత నిస్తారో, ఇప్పటి వరకు మీరు చేసిన తప్పును తెలుసుకుని సరిదిద్దుకోవడానికి చేసే ఈ కృషి, దానిపట్ల మీరు చేసే ప్రచారంవల్ల మీ పాఠకుల్లో ఎందరో కాకపోయినా కనీసం ఓ రెండు శాతం అయినా మనసు మార్చుకుంటే మీరు ధన్యులవుతారు. సమాజంలో ఓ సత్కార్యానికి పునాది వేసిన వారిలో మీకూ స్థానం లభించి ఆ సత్ఫలితం ఇహంలో కాకపోయినా పరంలో తప్పక ప్రాప్తిస్తుంది - ఒకటే షరతు, చిత్తశుద్ధితో అందరి శ్రేయాన్ని ఆశించి కృషి జరపడం.

(5-8-88)

—: ం :—

# 20. లోకాఖి రామాయణం

డా॥ అస్మా నీలోఫర్ (తిరుచిరాపల్లి)

**అమెరికా సాధిస్తున్న వైజ్ఞానిక ప్రగతిని, అక్కడ పెరుగుతున్న నేర ప్రవృత్తిని చూస్తుంటే పొంతన కుదరక అంతా తికమకగా అగుపడు తోంది...**

* రాబిన్ కుక్ (Robin cook) అనే అమెరికన్ రచయిత 1976 లో ఓ సంచలనాత్మకమయిన, వివాదాస్పదమైన నవల "కోమా" (COMA) వ్రాశాడు. అతను తన నవల గురించి వ్రాస్తూ తన అసలు ఉద్దేశ్యాన్ని కూడా వివరించాడు. మేధావి వర్గం, వైద్య నిపుణులు, న్యాయశాస్త్రవేత్తలు, ప్రభుత్వాలు ఆ విషయాన్ని బాగా పరిశీలించడం వారంవరి సామాజిక బాధ్యత అని కూడా కోరాడు. అదేమిటంటే "చనిపోయినవారి" లేక "చనిపోబోతున్నవారి" అవయవాలను తీసి వాటి అవసరం కల వారికి అంటే ఆ అవయవాలు చెడి పోవడంచేత ప్రాణాపాయానికి గురి "కాబోతున్న" వారికి అమర్చి వారిని కాపాడటం. ఈ ప్రతిపాదన చర్చనీయాంశమే. ఎన్నో చట్టపరమైన చిక్కులు, సామాజికమయిన సమస్యలు దీనితో ముడివడి ఉన్నాయి. స్వయాన డాక్టరయిన రాబిన్ కుక్ కూడా దీన్ని కాదనడు. మనిషి భౌతికపు మనుగడను గురించి ఇంతగా చింతించే డాక్టర్ కుక్‌లో లేశమాత్రమైనా మనుషుల నైతికపు బ్రతుకుకు సంబంధించిన ఆవేదన కానరాదు. అతని నవలలో కొట్టవచ్చినట్టు కానవచ్చే ముఖ్యాంశాలు ఇవి :

1. పైన పేర్కొన్న నైతికపు మనుగడ మనిషి కళ్ళ ఎదుటే లేకపోతే "సేవ" ప్రధానమైన వ్యవస్థ అయిన వైద్యశాల లేక చికిత్సాలయం "నేర" ప్రధానమయిన వ్యవస్థగా మానవుల పాలిట నరక కూపంగా పరిణమించ గలగడంలో ఏమాత్రం అడ్డంకులుండవు.

2. విజ్ఞానశాస్త్రం ఎంత ఎత్తుకు ఎదిగినా సార్వజనీన ప్రాతిపదికలపై ఏర్పడ్డ మానవతా దృక్పథం లేకపోతే ఆ విజ్ఞానశాస్త్రం "వినాశాస్త్రం"గా తయారయ్యే ప్రమాదాన్ని ఎవరూ ఆపలేరు.

3. స్త్రీ స్వేచ్ఛను గురించి గొంతుచించుకుని ప్రచారం చేసే అమెరికాలో స్త్రీలు వైద్యశాస్త్ర అధ్యయనం చెయ్యడం అంటే నేటికీ పురుషులకు గిట్టదు! కారణం? వారి శారీరక బలహీనతలు, మానసిక దౌర్బల్యాలు, ఆవేశపరత్వ మున్నూ!! ఖుద్దుగా డాక్టర్ కుక్ కూడా ఈ భావాలు కలవాడే. అయితే తన వివరణలో (1976 లో) తన మనస్సు మార్చుకున్నట్టు సంజాయిషీ చెప్పు కుంటాడు. కాగా పై నవలలోని హీరోయిన్‌ని జేమ్స్ బాండ్‌కు కూడా తీసిపోదు అనిపించేలా చిత్రిస్తాడు. స్వయంగా మీరూ మహిళా డాక్టరేకనుక, కాస్త ఆలోచించండి!!!

19 వ శతాబ్దంలో ఉవ్వెత్తున లేచిన సైద్ధాంతిక, వైజ్ఞానిక ప్రభంజనానికి ఫలితంగా రూపొందిన పాశ్చాత్య నవ నాగరికతకు ప్రతీక అమెరికా. పాశ్చాత్య ఆలోచనాసరళిలోని ఓ ప్రత్యేకత ఏమిటంటే అది నిత్యం తలక్రిందులుగానే ఉంటుంది. ఈ వైద్య వృత్తినే తీసుకోండి. మహిళలు సహజంగా ప్రేమ మూర్తులు, దయార్ద్ర హృదయులు వారికి అచ్చినట్టుగా వైద్యవృత్తి మరెవరికీ అతకదు. అయితే ఆధునిక పాశ్చాత్య నాగరికతకు పట్టుకొమ్మయిన అమెరికాలో ఈ వృత్తిపై పురుషాధిక్యత ఇంకా సమసిపోకపోవడమే కాక అది స్త్రీలను "పారా మెడికల్" (ఉప వైద్య సిబ్బంది)గా మాత్రమే ఆమోదించగలిగింది. ఈ తలక్రిందుల ఆలోచనా సరళిని అన్ని రంగాల్లోనూ చూడవచ్చు. అందువల్లనే భౌతికతకు ప్రాధాన్యం, ప్రాముఖ్యత పెరిగిన కొద్దీ నైతికతకు అధోగతి తప్పదని అనేక మంది మొత్తుకుంటున్నారు. ప్రాచ్య దేశాల్లోనూ పాశ్చాత్య దేశాల అంధానుకరణ చేస్తున్న వారిని వారి శ్రేయోభిలాషులు శత విధాలా హెచ్చరించేది ఈ విషయాన్ని గురించే.

(25-11-83)

—: o :—

యం. డి. అస్లం (ఇల్లందు)

**నైజీరియాలోని "క్వారా" రాష్ట్రంలో కార్లు దొంగతనాలు చేశారన్న ఆరోపణతో నలభై ఎనిమిది మందిని పట్టుకొని నలభై ఎనిమిది గంటల్లోనే వారి కుటుంబ సభ్యుల సమక్షంలోనే కాల్చిచంపినారట, దోపిడి చేశారన్న ఆరోపణపై ఆరుగురిని బాహాటంగా ఉరి తీశారట:**

* ఆఫ్రికాలోనే జనాభారీత్యా పెద్దది (10,00,00,000), చమురు ఉత్పాదక దేశమయిన నైజీరియాలో ఇది అయిదవ మిలటరీ ప్రభుత్వం. అది ముస్లిం అధికసంఖ్యాక దేశమే అయినా ఇస్లాంపట్ల అక్కడి ఏ ప్రభుత్వానికి ఆసక్తి లేకపోవటం శోచనీయం. గత ఒక సంవత్సరంగా సాగుతున్న మేజర్ జనరల్ ముహమ్మదు బుహారీ ప్రభుత్వం ప్రజలకు నినాదాలుతప్ప మరేమీ ఇవ్వ లేకపోయింది. నిత్యావసర వస్తువులకోసం గంటల తరబడి క్యూలో నిలబడి వాటిని పొందలేక పౌరులు చనిపోయిన, స్పృహ కోల్పోయిన ఉదంతాలేకాక స్త్రీలు గత్యంతరం లేకా క్యూలోనే పురుడుపోసుకున్న ఉదంతాలూ ఉన్నాయట. అక్కడ ప్రభుత్వోద్యోగుల్లో అవినీతి తారస్థాయికి చేరుకుంది. గద్దెనెక్కిన ప్రతి ప్రభుత్వం దాన్ని తుదముట్టించే శపథంచేసి ఏమీ చెయ్యలేకపోతోంది. నిజ మయిన ప్రజా నాయకత్వం లేకపోవడంచేత ప్రజల కష్టాలను మిలటరీ పాలన అర్థం చేసుకోలేకపోతోంది. మరోవైపు క్రమశిక్షణ పేరుతో ఆలస్యంగా వచ్చినా ప్రభుత్వోద్యోగుల ఉద్యోగాలు ఊడుతున్నాయి. తగ్గుదల పేరుతో ఇష్టం వచ్చినట్లు సామూహికంగా ఉద్యోగుల్ని పదవీచ్యుతులు గావిస్తున్నారు. ఉద్యో గుల్ని ఉయితం మిలటరీ జవాన్లు చిన్న చిన్న పొరపాట్లకు కర్రతో నడిబజారున కొడుతున్నారు. పాలకులు, పన్నుల వసూళ్ళకోసం ప్రజల్ని నడివీధుల్లోనూ తరుముకు వస్తారట అక్కడ. ఈ వాతావరణంలో ఏది జరిగినా ఆశ్చర్య పడనవసరం లేదు. 15 శాతం అక్షరాస్యతతో అజ్ఞానంలో మగ్గే ప్రజలపై వచ్చే పాలకులు ఏది చేసినా అడిగే దిక్కేలేదు.

(8-2-85)

—: o :—

ఒక సోదరుడు (వనపర్తి)

**లిబియాపై అమెరికా దాడి చెయ్యడం గర్హించదగిన విషయమని మేము భావిస్తున్నాం. మీ అభిప్రాయం?**

* ఒక్క లిబియాపైనే కాదు, దాడి చెయ్యడం దురాక్రమణలు జరపడం ఎక్కడ ఎవరు చేసినా గర్హించదగ్గ విషయమే. అటు పెట్టుబడిదారు సామ్రాజ్యవాదులు, ఇటు స్వామ్యవాద సామ్రాజ్యవాదులు బహు రూపాల్లో ప్రపంచాన్ని తమ కైవసం చేసుకోవాలని పన్నాగాలు పన్నుతున్నారు. ప్రాంతీయ విద్వేషాలను, తాత్కాలిక రాజకీయ విభేదాలను రెచ్చగొట్టి రష్యా అయినా అమెరికా అయినా తాము జోక్యం కల్పించుకొనే సాకుకై ప్రయత్నిస్తూ ఉంటాయి. ఆ తరువాత ఎదుటి పక్షం కూడా రంగంలోకి 'భళిరా' అంటూ రంకెలువేస్తూ కాలు దువ్వుతూ చిందులు త్రొక్కుతుంది. దీనికి ఈరాన్—ఇరాక్ యుద్ధం ప్రబల నిదర్శనం. ఇలా వీలుపడకపోతే ప్రపంచంలో బలహీనమయిన పాయింటు నొకదాన్ని ఎన్నుకొని తమ తొత్తుల్ని కొందరిని అక్కడ సృష్టించుకుని, అక్కడ ఓ రణరంగాన్ని నిర్మించుకుంటాయి. పాలస్తీనా, వియత్నాం అఫ్గానిస్తాన్ ఇలాంటివే. అదే విధంగా ప్రకృతి సహజమయిన వనరులు, సాధన సంపత్తి, మానవ శక్తి మెండుగా ఉన్న భారత ఉపఖండంలోనూ నిత్యం అశాంతిని విలయతాండవం చేసేలా పురికొలిపి ఇక్కడి ప్రజల మధ్య విద్వేషాగ్నిని రగుల్గొలిపి ఈ ప్రాంతపు వృద్ధి వికాసాలు కుంటుపడేలా ఈ అగ్ర రాజ్యాలు కుట్ర పన్నుతున్నాయంటే చాలామందికి అర్థమయి చావదు. పాకిస్తాన్, భారత్, బంగ్లాదేశ్, శ్రీలంకల మధ్య విభేదాల విత్తనాలు నాటడం, వాటికి నీరు పోసి పోషించి ఆ తరువాత తగువుతీర్చే పెద్ద మనుషుల్లా మైదానంలోకి రావడం ఈ పథకంలోని భాగం. కాని దురదృష్టవశాత్తు, ఈ ప్రాంతాలకు దాపురించిన ఈ శనిని ఈ భూభాగాలకు అదృష్టవశాత్తు నేతలయి కూర్చున్నవారు, పరిష్కరించే చిత్తశుద్ధి లోపించినవారిలానే అగుపిస్తున్నారు. వీరందరూ అలీనోద్యమ సభ్యులే అయినా వాస్తవానికి వీరిలో ప్రతి ఒక్కరు ఏదో ఓ పక్షాన మ్రొగ్గుచూపే పెద్ద మనుషులే అనడంలో ఏ మాత్రం సందేహం లేదు.

(22-8 [illegible])

—: ० :—

షేక్ జహీర్ సుల్తాన్ (పెదకూరపాడు)

**"నేను ఆశ్రాధించే ఇస్లాం" పుస్తకంలో అబ్దుల్లా అడియార్‌గారు లెమూరియా ఖండం గురించి చెప్పారు. కాని ఆ ఖండం ఎక్కడుందో, ఇపుడది ఏ పేరుతో పిలువబడుతోందో కాస్త వివరంగా దాని చరిత్రను వివరించగలుగుతారా ?**

* లెమూరియా (Lemuria) ఖండం అన్నది ఊహాజనితమైంది. ఒక కాలంలో అంటే దాదాపు కోటి సంవత్సరాల క్రితం ఉత్తర దక్షిణ అమెరికాలు, ఆఫ్రికా, ఇండియా, ఆస్ట్రేలియా అంటార్కిటికా ప్రాంతం - అన్నీ ఒకే చోట ఆఫ్రికా ఖండానికి ఆనుకుని ఉండేవన్న సిద్ధాంతం ఉంది. తరువాత పెద్ద ఖండాంతర వికర్షణ (Continental Drift) కారణంగా అటు అమెరికా ఖండాలు, ఇటు ఆస్ట్రేలియా, ఇండియా ఆఫ్రికా నుండి విడిపోయి క్రమేణ దూరమయి నేడున్న స్థితికి చేరుకున్నాయి అన్నది ఆ సిద్ధాంతం. ఆఫ్రికా తూర్పున కలసి ఉన్న ఇండియా ఆస్ట్రేలియా భాగాన్ని లెమూరియా అని పేరు పెట్టుకున్నారు. లెమూర్ (Lemur) అన్నది ఓ అడవి జంతువు (పిల్లి, కోతికి పోలినది). అది భారతదేశం, మెడగాస్కర్, దక్షిణాఫ్రికా, ఆస్ట్రేలియా ప్రాంతాల్లో లభించడంతో ఆ సిద్ధాంతానికి మరింత బలం చేకూరిందని అంటారు. ఇదంతా ఊహాగానమే. అయితే భౌగోళిక స్వభావ స్వరూపాలు, ఖనిజ నిక్షేపాలు ఇతర వివరాలు అలా జరిగి ఉండవచ్చు అన్నదానికి ఆధారాలుగా నిలుస్తాయి.

(8-7-88)

—: o :—

# 21. ఆచార దురాచారాలు

షేక్ మౌలాలి (మార్కాపురం)

**పిల్లలకు ఆటలమ్మ, పోలేరమ్మ, నూగులమ్మ అని వస్తూ ఉంటుంది. దాన్ని హిందువులు మొక్కుకుంటారు. దానిని మెడికల్‌గా కూడా నూగులమ్మ ఆటలమ్మ అని అంటారు. దానికి ఆ పేర్లు ఎట్లా వచ్చింది. తెలుపగోరు చున్నాను.**

* ఇలాంటి అంటువ్యాధులన్నీ రకరకాల దేవతల ఆగ్రహంవల్ల కలుగుతాయన్న మూఢ విశ్వాసంవల్ల ప్రజలు మొక్కుకుంటారు. పేర్లు మాత్రం ఆ యా వ్యాధుల లక్షణాలను బట్టి పెట్టుకున్నవే. ఉదాహరణకు ఆటలమ్మ వ్యాధి వచ్చినప్పుడు పిల్లలు ఎలాంటి బాధలకు గురికాకుండా ఆటపాటల్లో నిమగ్నులయి ఉంటూనే స్వాస్థ్యతను పొందుతారు. నూగులమ్మ అనే వ్యాధి వచ్చినప్పుడు పిల్లల శరీరమంతా నూగునూగుగా రేణువులు ఏర్పడతాయి. మెడికల్‌గా కూడా ఆ పేర్లే ఉన్నాయనడం నిజంకాదు. సామాన్య ప్రజలకు అర్థం కావాలని వైద్య వృత్తిలో ఉన్నవారు ఆ పేర్లను వాడుతారు. వాస్తవానికి ఇంగ్లీషులో చలామణి అయ్యే పేర్లు కూడా వైద్య శాస్త్రరీత్యా సరయినవి కావు. ఉదాహరణకు మశూచి లేక Small pox (అమ్మవారు పోలేరమ్మ) అన్నదానికి శాస్త్రీయనామం Variola. అలాగే Chicken pox (ఆటలమ్మ) అనే వ్యాధి Vaicella అనబడుతుంది వైద్యశాస్త్రంలో. Measles లేక పొంగు (నూగులమ్మ) ను వైద్య శాస్త్రంలో Rubeola అంటారు.

(4-1-85)

—: ౦ :—

పి. ప్రియాంక, పి. వీరభద్రాచారి (మహబూబాబాద్)

**హిందువులు గుడిలోకి వెళ్ళేటప్పుడు చెప్పులు బయట విడిచిపెడతారు కదా! అలాగే మహమ్మదీయులు కూడా. కాని హిందువులు చెప్పులు ఇంట్లో వేసుకొని తిరగరు కాని మహమ్మదీయులు ఇంట్లోకూడా చెప్పులు వేసుకొని తిరుగుతారు?**

* ప్రార్థనా స్థలం పవిత్రంగా, పరిశుద్ధంగా, పరిశుభ్రంగా ఉండాలన్నదే మస్జిద్‌ల విషయమయినా మందిరాల విషయమయినా. ఇక్కడ ఓ విషయం మీకు వివరించడం మంచిదేమో. పాదరక్షలు పరిశుద్ధంగా ఉన్నాయన్న నమ్మకం ఉంటే మస్జిద్‌లో వాటితో తిరగడంలో, నమాజ్ చెయ్యడంలో తప్పులేదు. అందువల్లనే ప్రపంచంలో కొన్నిచోట్ల సాధారణ పాదరక్షలు బయట వదిలేసి మస్జిద్ ప్రాంగణంలో వేరొక జత (అవి అక్కడే సమకూరుస్తారు) పాదరక్షలు వేసుకు తిరిగే సంప్రదాయమూ ఉంది. స్వయంగా మక్కాలోని కాబా గృహ ఆవరణలో కూడా వేసుకు తిరిగేందుకు వేరొక జత పాదరక్షలు లేక మేజోళ్ళు వాడతారు. చెప్పవచ్చిందేమంటే పాదరక్షలు స్వతహాగా చెడు కలిగిలేవు. వాటికి అంటుకుని ఉంటుందన్న అనుమానమున్న మలినం కారణంగానే వాటిని బయటే వదిలేసి లోనికి వెడతారు ప్రార్థనాలయాల్లో నయినా, గృహాల్లో నయినా. మన దక్షిణాదిలో అసలు చెప్పులయినా బూట్లయినా లేకుండా తిరగడమే పురాతన సంప్రదాయం. అందువల్లనే మనిషి బయటినుండి రాగానే అరుగు ముందు కాళ్ళు కడుక్కొని లోనికివచ్చే సంప్రదాయం ఉంది. ఇంటికి అతిథిరాగానే కాళ్ళు కడుక్కొనేందుకు నీళ్ళ చెంబుతో ప్రత్యక్షమయ్యే సంప్రదాయం కూడా అందువల్ల వచ్చిందే. ఈ కాలంలో కార్లు ఇతర వాహనాలు ఎక్కువయినప్పటినుండి ఇప్పుడు హిందూ కుటుంబాల్లోనూ ఇంటి బయటే పాదరక్షలు వదిలేసి వెళ్ళే అలవాటు తక్కువయిపోతోంది. ఇదంతా సాంప్రదాయికమయిన విషయమే. కాని దీనికి మతంతో అంతగా గట్టి బంధం లేదు.

(18-12-87)

—: o :—

# 22. భాష, సాహిత్యం

ఎమ్. ఏ. అఫ్జల్ (చాగల్లు)

**ఇతర భాషల లిపిలా కాకుండా ఉర్దూ, అరబ్బీ, పార్సీ భాషలలో కుడి నుండి ఎడమకు వ్రాయు సంప్రదాయంలో ఏదయినా అంతర్యమున్నదా?**

* లిపి అన్నది భాష యొక్క శబ్దాలకు రూపునిచ్చే ఓ సాధనం మాత్రమే. భాషా శాస్త్రం, లిపి శాస్త్రం నేడు విస్తృతమయిన ప్రత్యేకమయిన శాస్త్రాలుగా పరిగణించబడుతున్నాయి. లోతుల్లోకి పోతే క్రీ. పూ. 1700 ప్రాంతంలో మధ్యదరా సముద్రతీరాన ఉండే దేశాల్లో అనేక లిపులు ఉద్భవించా యన్నట్టు తెలుస్తుంది. ప్రపంచ భాషలన్నింటికీ దాదాపు అక్కడ ఉద్భవించిన అనేక లిపులే ఆధారాలని భాషావేత్తలు అభిప్రాయపడుతున్నారు. యూరోపియన్ లిపులకు మాతృకలైన ఈజిప్టు, గ్రీకు, హెబ్ర్యూలిపులు కూడా ప్రారంభంలో కుడి నుండి ఎడమ వైపునే వ్రాయబడేవి. మన సంస్కృత భాష లిపి అయిన దేవనాగరి 'సిద్ధ మాతృక' ద్వారా క్రీ.శ. 7-9 మధ్యలో ఉనికిలోకి వచ్చింది. సిద్ధమాతృక బ్రహ్మీలిపి యొక్క అనేక రూపాల్లో ఒక రూపమే. స్వయంగా బ్రహ్మీలిపి ఎలా ఉద్భవించింది? అన్నది, అది మధ్యధరా తీరాల్లో పుట్టిన అనేక లిపుల్లో ఒకటయిన 'ఆరామైక్' లిపి ద్వారా ఉనికిలోకి వచ్చిందేనా? అన్నది శాస్త్రవేత్తల్లో ఇంకా వివాదాస్పదమయిన విషయాలే. ఇంతకు బ్రహ్మీ లిపికూడా మౌలికంగా కుడినుండి ఎడమకు వ్రాయబడేదే! అయితే కాలాను గుణంగా మార్పులు సంభవించాయి. బ్రహ్మీలిపి నుండి గుప్తుల కాలంనాటి లిపి, దాని ద్వారా ఉత్తర భారత భాషలకు, వాయవ్య భారత భాష దక్షిణాది భాషలకు లిపులు ఉద్భవించాయి. ఈ మార్పులన్నీ రాజకీయ ప్రభావాలవల్ల వాణిజ్యం ద్వారా, మత ప్రభావాలద్వారా సంభవించాయన్న సిద్ధాంతాలు శాస్త్రవేత్తలు ప్రవేశపెడతారు. ఏది ఏమయినా మనం నేడు పరిణతి చెందినట్లు భావిస్తున్న లిపులు రేపటికి ఇంకా ఎలా పరిణమిస్తాయో ఊహించడం కష్టం. లిపులకన్నా,

భాషలకన్నా అవి అందజేసే భావాలే ముఖ్యమయినవి. భాషల గురించి లిపుల గురించి ఎన్ని వివాదాలున్నా భావాలే మనసుల్ని ఏలగలవన్నది మాత్రం నిర్వివాదాంశం !

(29-7-83)

—: o :—

ఎం. ఎ. అఫ్జల్ (చాగల్లు)

**'భాష' అనేది ఎలా పుట్టింది ?**

* ఏనాడయితే మనిషి ఒకటికి రెండయ్యాడో ఆనాడే భాష మొదలయింది. తన భావాలను కోరికల్ని, సందేశాన్ని మనిషి ఎదుటి వానికి తెలియ చెప్ప డానికి వినియోగించిన సాధనమే భాష. ఆధునిక నిర్వచనం ఏమిటంటే, "భాష అనేది, స్వేచ్ఛాయుతమయిన ధ్వని సంకేతాలతో కూడుకున్న సమగ్ర వ్యవస్థకు పేరు. దీన్ని సాధనంగా వినియోగించుకునే ఒక సామాజిక వర్గం పరస్పరం సహకరించుకుంటుంది." (Barnard Bloch and George L. Trager-U.S.) భాష ఎలా పుట్టింది అన్న విషయంలో శాస్త్రజ్ఞుల్లో, ధార్మిక విద్వాంసుల్లో ఎన్నో దృక్పథాలు ఉన్నాయి. దివ్య ఖుర్ఆన్ ప్రకారం, ఆది మానవుడయిన ఆదమ్‌కు విషయ పరిజ్ఞానాన్ని (వస్తువుల పేర్లను) నేర్పి దేవుడు భాషకు నాంది వేశాడు. వివిధ భాషల్లో ఉన్న అనేక సమిష్టి పదాలను, లేక వాటి మూల పదాలను వెదికి దాని ఆధారంగా అన్ని భాషలకు మూలం ఒకే భాష అయి ఉండవచ్చు అనకుండా కొందరు ఆ మూల భాష తమ భాషే అని వాదోపవాదాలకు దిగుతున్నారు.

(11-11-83)

—: o :—

ఎం. ఎ. అఫ్జల్ (చాగల్లు)

**నేటి సమాజంలో రసాస్వాదనే ఆలంబనగా తీసుకొని పాఠకుడు ఆనందిస్తున్నాడే తప్ప సాహిత్య విలువలను గుర్తించి తదనుగుణంగా స్పందించే పాఠకులు చాలా తక్కువ...**

* మీరు "రసాస్వాదన" అన్నారు మీరు చెప్పిన "సాహిత్యపు విలువల" అవగాహన లేనిదే అదెలా సాధ్యం? లేకపోతే మీరు చెప్పే "రసం" మరేదయినా కావచ్చా?? ఒక కవి లేక రచయిత చేసే సృష్టినుండి "రసాస్వాదన" అన్నది ఆయా పాఠకుని సాహిత్య పరిజ్ఞానం, అవగాహనా పటిమలపై ఆధారపడి ఉంటుంది. ఇది నిత్యం సాపేక్షికమయిందే. ఓ పాఠకుడు ఓ రచన ద్వారా రసాస్వాదన పొందుతున్నాడంటే అతనికి సాహిత్యపు విలువల అవగాహన ఉందన్నమాటే! అది ఏపాటిది? ఎలాంటిది? అవన్నీ వేరే విషయాలు. అలాగే ప్రతి రసాస్వాదన పొందిన పాఠకుడు రచనల కనుగుణంగా స్పందించాలన్న రూలుకూడా లేదు. స్పందించడమన్నది పాఠకుని మనోస్థితి, మనో ప్రవృత్తులపై ఆధారభూతమై ఉంటుంది. నేటి సగటు పాఠకుడు తాను చదివేదాని కనుగుణంగా స్పందించడంలేదంటే దానికీ భావ దారిద్ర్యానికీ ఎలాంటి సంబంధంలేదు. భావ దారిద్ర్యం అన్నది నిజానికి మన రచయిత(త్రు)లు అందించే రచనల్లోనే ఉంది. మన రచయితలు అత్యధికంగా ఏ జీవితపు విలువల్ని తమ పాఠకులకు అందజేస్తున్నారో, వారిని ఏ మార్గాన్ని అనుసరించేలా చేస్తున్నారో ఆ అంశాలేవో పరిశీలించేందుకు ఇది వేదిక కాదు. సమకాలీన రచనల పూర్వరంగంలో సమాజాన్ని సింహావలోకనం చేస్తే నేటి రచనల్ని చదివినంతవరకు పాఠకులు దాదాపు వాటి కనుగుణంగానే ప్రతిస్పందిస్తున్నారని చెప్పవచ్చు. మారవలసిందల్లా పాఠకులు కాదు రచయితలు.

(13-1-84)

—: o :—

సమద్ (నంద్యాల)

**ఉలామాయే దీన్ డాక్టర్ అల్లామా ఎక్బాల్ గారిని "కాఫిర్" అని ఫత్వా ఇచ్చినారు అని విన్నాను. ఇది నిజమా! ఎక్బాల్‌గారి రెండు మంచి "షేర్"లు ఉర్దూలో పేర్కొనండి.**

* 'షిక్వా' అనే కావ్యంలో ఆయనగారు దైవంతో షికాయత్ చేశారు. "నీవు అత్యున్నత సమాజం (ఉమ్మత్) అని పేర్కొనే ముస్లిములు నేడు నీచాతి నీచస్థాయిలోఉన్నారు - నీ వాగ్దానమేమయింది?" అని నిలదీశారు. నిజానికి

ఆ కవితలో పరోక్షంగా ముస్లిం సమాజాన్ని మేల్కొలపడానికి ఆయన కృషి చేశారు. అది అపార్థం పాలయి దైవాన్ని అలా నిలదీయవచ్చా-అని మీరన్నఫత్వా జారీచేశారు ఆనాటి ఉలమా. వెంటనే ఇక్బాల్ 'జవాబె షిక్వా' వ్రాశారు. అందులో దైవం తరపున బదులుంది. ఆ తరువాత ఉలమా ఫత్వాను ఉపసంహరించుకు న్నారు. ఎట్టొచ్చి ఇలాంటి విషయాల్లో దుందుడుకు తనం పనికిరాదని ఉలమా గ్రహించారు. అయినా అలాంటి ఫత్వాలు జారీ చెయ్యడం మాత్రం అప్పు డప్పుడు జరుగుతూనేఉంది.

1. ఆగ్ హై ఔలాదె ఇబ్రహీమ్ హై నమ్రూద్ హై.
క్యా? కిసీకో ఫిర్ కిసీకా ఇమ్తెహాఁ మక్సూద్ హై?

1. అగ్నిఉంది ఇబ్రాహీం సంతానమూ ఉంది. నమ్రూద్ కూడా ఉన్నాడు -ఏమిటిదంతా? ఎవరయినా ఎవరినయినా పరీక్షించదలిచారా? (సత్య ప్రియులూ, అసత్యవాదుల ఘర్షణామయమయిన ఈ వాతావరణం మరో పరీక్షకు పిలుపునివ్వడంలేదా?)

2. ఎకీఁ ముహ్‌కమ్, అమల్ పైహమ్, మహబ్బత్ ఫాతెహే ఆలమ్,
జిహాదే జిందగానీమేఁ ఎహైఁ మర్దోంకి షమ్షీరేఁ

2. సుస్థిరమయిన విశ్వాసం, నిరంతర సదాచరణ, జగత్తునే జయించే ప్రేమ - ఇవి గనక ఉంటే, జీవన సమరంలో పురుషుంసదగ్గ వారికి ఇవే కరవాలాలు, ఖడ్గాలున్నూ (జీవితాన్ని పురుషునిలా గడపాలంటే తన లక్ష్యంపట్ల అచంచల విశ్వాసం, దానికై నిరంతరకృషి, దానికి తోడుగా ప్రేమైక హృదయం కావాలి, జగమే దాసోహమంటుంది.)

(3-1-86)

—: o :—

ఖాలిద్ ఖాన్, జియాఉల్లా, అబ్దుల్ కరీం, నయీం పాషా (గోదావరి ఖని)

**"దివ్యగ్రంథమైన" "ఖురాన్ షరీఫ్" పద్యభాగమునకు చెందుతుందా? గద్యభాగమునకు చెందుతుందా?**

* దివ్య ఖుర్ఆన్ శైలి అద్భుతమైంది, అద్వితీయమయింది. ఈ అనుపమ శైలిని నిర్దిష్టంగా ఫలానా అని పేర్కొనడం కష్టం. అది అవతరించిన నాటికి ఎందరో అత్యుత్తమ కవులు ఉన్నారు. వారంతా దాన్ని అనుకరించాలని కృషి చేశారు. దివ్య ఖుర్ఆన్ స్వయంగా పలుచోట్ల ఇలాంటి ఓ సూరాను, కొన్ని ఆయత్‌లను, కనీసం ఒక్క ఆయత్‌ను రచించి తీసుకురండని

ఆనాడే ఛాలెంజి చేసింది. ఆ ఛాలెంజిని ఎదుర్కోగల ధీశాలురు ఎవరూ నేటి వరకు ముందుకు రాలేదు. ఖురైష్ కాఫిర్‌లు అనేకసార్లు "అబ్బో ఈయన (ముహమ్మద్ సఅసం) గొప్ప కవియే, తన కవితా ఉధృతితో మనల్ని జయించాలని చూస్తున్నారు" అని అనుకున్నారు. గొప్ప గొప్ప కవుల్ని రప్పించారు. ఖుర్‌ఆన్ ఉరవడిని, వాడిమిని, వేడిమిని గ్రహించిన ఆ కవులు దాని ఎదుట తమ కవితా ఖండాలను ఇట్టే వదులుకున్నారు. అంతేకాక ఇది మానవ మాత్రుని శైలి కాదు అని దాన్ని దైవవాక్కుగా అంగీకరించి ఇస్లాం స్వీకరించారు. ఇలాంటి ఓ ఛాలెంజి మనకు చరిత్ర తెలుపుతుంది. "ఇన్నా ఆతైనా" సూరాలోని తొలి ఆయత్ ఓ చర్మపు పొరపై వ్రాసి కాబా గోడకు వ్రేలాడదీశారు - కావ్యపూర్ణం కొరకు. ఎందరెందరో ప్రయత్నించారు. ఒక్కరూ కావ్యపూర్ణం చెయ్యలేకపొయ్యారు. అప్పుడు ఆ సూరా పూర్తిగా అవతరించింది. ప్రాసయుక్తమయిన గద్యమని, గద్య రూపంలో నున్న పద్యమని చెప్పుకుంటారు. పద్యానికి ఉండవలసిన లాక్షణిక నియతి ఏదీ లేకపోయినా భావ స్ఫూర్తిమయిన పదబంధాలు, కవితా సృష్టిలోని నుడికారపు ఒంపు సొంపులు, పదాలంకరణ ఒకవైపున ఉంటే మరోవైపున గద్యానికి ఉండవలసిన భావ గాంభీర్యం భావ సమగ్రత, విషయానుశీలనం, వాక్యాల పటుత్వం కొట్టవచ్చినట్లు కానవస్తుంటాయి. ఇంత చేసి అది రచనాక్రమంలో ఉండదు. ప్రసంగ ధోరణియేదానిది. ఓ నిరంతర ప్రసంగం! అనర్గళంగా సాగే వచనామృత ధార !!

(10-1-86)

—:o:—

ఎం. గంటయ్య ఎ. సాంబశివరావు (తిరువూరు)

**డిటెక్టివ్ పుస్తకములు** (Detective Books) **నవలలు** (Novels) **చదవకూడదు అని అంటారు కొంతమంది పెద్దలు.**

* ఆ మాట ఆ వద్దన్న వారినే అడక్కపోయారా? డిటెక్టివ్ సాహిత్యం, దాని ప్రచురణాలయాలు పుట్టగొడుగుల్లా పుట్టుకొచ్చిన మాట వాస్తవమే. సాంప్రదాయిక సాహిత్యాన్ని కాదని డిటెక్టివ్ నవలా ప్రక్రియను ప్రచారంలోకి తెచ్చా

రంచే దానికి తగిన ఆదరణ లభించడం మూలంగానే కదా! ఆదరణ ఎందుకు లభించింది? సులభమైన శైలి, ఉరకలు పరుగులువేసే సన్నివేశాలు, పాఠకుల హృదయాల్లో ఉత్పన్నమయ్యే ఉత్కంఠ ఉద్విగ్నత—ఇవన్నీ మనిషిని ఇట్టే ఆకట్టుకుంటాయి. భాష, భావం, ఇతివృత్తం, వర్ణనలు ఇవి ఏవీ పట్టించుకోడు పాఠకుడు. ఇంగ్లీషులో వచ్చిన నవలల్ని స్థానిక రంగుపులిమి వ్రాయగల ప్రతి కలం గలవాడు రచయితగా విరాజిల్లాడు. సాహిత్య స్థాయి పడిపోయింది. సాహిత్యపు విలువలూ పడిపోయ్యాయి. ఇంగ్లీషు నవలలద్వారా యూరపు సభ్యతా సంస్కృతులు, తెలుగు వానికి పూర్తిగా అపరిచితమయిన సాంఘిక వాతావరణం తెలుగు రంగులో సాక్షాత్కరించాయి. ఈ ధాటికి తట్టుకోగల, గట్టి పునాదులపై నిలబడ్డ సామాజిక వ్యవస్థ లేకపోవడంచేత మనవారు ఆ డిటెక్టివ్ సాహిత్యంవల్ల ప్రవేశిస్తున్న సంస్కృతీ పరమైన వెల్లువను మరోవైపుకు మరల్చడమో లేక దాన్ని త్రిప్పికొట్టడమో చేతకాక తమవారు ఆ వెల్లువలో కొట్టుకు పోతారన్న భయం చేత, మీరన్నట్టు వాటిని చదువరాదని వారించారు, వారిస్తున్నారు. అయితే తమ సిద్ధాంతాలపై, దృక్పథాలపై, తమ ఆలోచనా సరళిపై ఆచరణా విధానంపై గట్టి నమ్మకమున్నవారు ఏది చదివినా అంత సునాయాసంగా ప్రభావితులవుతారని నేననుకోను. కాని, కేవలం కాలయాపనకై దేన్ని చదివినా అది వృథా అని, నష్ట దాయకమని చెప్పగలను. విజ్ఞాన సముపార్జన, విషయ అవగాహన చదువరుల లక్ష్యమయి ఉండాలి.

(21-3-86)

—: ০ :—

షేక్ వహాబ్ (పాత గుంటూరు)

**దూదేకుల సాయిబుకి ఉర్దు రాకపోవటానికి కారణం ఏమిటి ?**

* 'దూదేకుల సాయిబులు' అని పేరు పెట్టి, ఉర్దూ మాట్లాడే 'సాయిబులు' వారిని దూరం చెయ్యడం మూలాన! అన్నిరకాల తారతమ్యాలను, నిమ్నోన్నతా భావాలను, హెచ్చు-తగ్గుల్ని దూరం చెయ్యడానికి కంకణం కట్టుకున్న ఇస్లాంను స్వీకరించినప్పటికీ ముస్లిములు తమలోతాము ఈవిధంగా విభేదాలు సృష్టించుకుని ఇలాంటి ప్రశ్నలకు తావివ్వడం ఎంత శోచనీయం?! మరో విషయం ఏమిటంటే

ఉర్దూ ముస్లిముల భాష కాదు. ఆ మాటకు వస్తే ముస్లిముల భాష అంటూ ప్రపంచంలో ఏదీ లేదు. అన్ని భాషలూ దైవం సృష్టించినవే కనుక అన్ని భాషలూ ముస్లిములవే. ముస్లిములు ఏ భాష మాట్లాడినా, ఏ దేశంలో ఉన్నా, ఏ దుస్తులు ధరించినా వారు మౌలికంగా ఇస్లామీయ సిద్ధాంతాలను, విశ్వాసాలను విధానాలను అవలంబించి నంతవరకు వారు ముస్లిములే. ఇస్లాం ఓ జీవన విధానం. ఒక సంతతికీ, ఒక 'జాతి'కి చెందిన మతం కాదు. దాన్ని ఎవరు ఆచరిస్తే అది వారిదే అవుతుంది. భారతదేశంలోని ముస్లిములు ఏ ప్రాంతంలో ఉండేవారు ఆ భాష మాట్లాడతారని తెలుసుకోండి. కేరళలో ఉండే ముస్లిములు మలయాళం, తమిళనాడులో ఉండే ముస్లిములు తమిళం, కర్ణాటక కెనరా జిల్లాల్లో ఉండే ముస్లిములు కన్నడ భాషలే మాట్లాడతారు. అలాగే గుజరాతీ, సింధీ, బెంగాలీ, అస్సామీ భాషలు మాట్లాడే ముస్లిములున్నారు. అలాంటప్పుడు తెలుగు మాట్లాడే ముస్లిములు ఆశ్చర్యం గొలుపుతున్నారా? విద్యా విజ్ఞానాలు ఇంతగా పెంపొందిన ఈ రోజుల్లోనూ ఇలాంటి ప్రశ్నలడిగే వారున్నారంటే ఆశ్చర్యం వెయ్యదూ ?

(21-8-87)

—: o :—